# స్మృత్యంజలి



జననం :
17-6-1925

నిర్యాణం :
4-2-1998

భార్య
కుటుంబ సభ్యులు

# నా అంతరంగ తరంగాలు

బిట్ల నారాయణ

తేది : 22.1.1999





కూర్పు :

వంగ నర్సయ్య M.A



H. No. 8.10.65.
గిర్మాజిపేట
వరంగల్ - 506 002

# సందేశం

మిత్రుడు బిట్ల నారాయణ కాళోజి సోదరులకు తమ్ముడు. నా అంతరంగ తరంగాల పేర తన కథ (జీవిత చరిత్ర) రాసుకున్నారు. ఆ విషయం తన పుత్రులకు (మధుసూదన్, రవివర్మ) లకు చెప్పినాడు. బిట్ల నారాయణ నందరిని వదలిపోయి యీ జనవరి 22కు సంవత్సరం అవుతుంది. ఆనాటికి 'నా అంతరంగ తరంగాలు' అచ్చయి మన ముందుకువస్తున్నాయి. బిట్ల నారాయణ జ్ఞాపకాలు వారి స్నేహితులుకందరికి మళ్లీ బిట్ల నారాయణతో ములాఖాత్ చేయిస్తాయి.

తమ్ముడు బిట్ల నారాయణ అంతరంగ తరంగాల చివరన అన్నగారైన కాళోజి రామేశ్వర్‌రావు కవితతో ముగించినారు. సదాశివుడు, M.S. ఆచార్య, నల్ల నర్సింహులు మొదలగు మిత్రులు లేరు, అన్నగారు కూడా లేరు, చివరి కోరిక ప్రకారం (అన్నగారు చెప్పినట్లు కాలం యాచన లేకుండా) తమ్ముడు నారాయణ కాలమాసన్నమయిందనే చెప్పవచ్చు. స్నేహం గలిగి స్నేహితులతో మెలిగిన తమ్ముడు జీవించిన బిట్ల నారాయణ 'నా అంతరంగ తరంగాలు' కుటుంబ సభ్యులకే కాక మనందరికి లభ్యం కావాలనే కోరికతో ముగింపు కవిత వల్లిస్తూ వుంటాను.

వరంగల్
ది. 2-1-99

—కాళోజి

# కుందారం గ్రామంలో వెలిగిన చిరుదీపం

ప్రతి వృత్తికి అనుబంధ వృత్తులుంటాయి. ప్రతి పరిశ్రమకు అనుబంధ పరిశ్రమలుంటాయి. అందువల్ల ఒకడికి ఉద్యోగ కల్పన కోసం లేదా ఉపాధికల్పన కోసం ప్రారంభించేది వృత్తయినా, పరిశ్రమ అయినా, దుకాణం అయినా అనుసరించి మరొకడికి లేదా మరి కొందరికి ఉద్యోగమో, ఉపాధో కలగడానికి కారణం అవుతుంది. ఇది ఒక గొలుసు.

అభిరుచులు మారాయి. తదనుగుణంగా అవసరాలు మారాయి. అవసరాలకనుగుణమైన వనరులకు, ఉత్పత్తులకు రూపకల్పన చేస్తూనే జరుగుతూనే వుంటుంది.

జీవితం కోసం, అవసరాల కోసం, వాటి వనరులు-ఉత్పత్తుల కోసం నిరంతరాన్వేషణలో ప్రభుత్వపరంగా సామాజిక పరంగానే కాక వైయక్తికంగా కూడా కృషి అవసరం. వైయక్తికంగా జరిగే కృషి స్వావలంబనే లక్ష్యం అయినా అందుకు అనుబంధాలేర్పడతాయి.

ఒక పరిశ్రమ నెలకొంటే, నెలకొనటానికి పథకం రూపించినది. మొదలు ఉత్పత్తి - వినిమయం దాకా మరెందరికో కలుగుతుంది. స్థాపన తర్వాత అనుబంధ జీవనావకాశాలు ఇంకెందరికో కలుగుతాయి.

గ్రామాలలో పట్టణాలలో మారిన ఆలోచనలు, అవసరాలు వనరులననుసరించి వృత్తి - ఉద్యోగ ఉపాధుల కల్పనకు ప్రభుత్వం చేయగల, చేస్తున్నకృషి ఒక్కటే చాలటం లేదు. వైయక్తిక కృషి కూడా అవసరమవుతున్నది, స్వావలంబన ధృఢ నిశ్చయం గల కార్యసాధకులు కనుక తాము వృత్తి కల్పించుకొనటముతో అనివార్యంగా అనుబంధ ఉద్యోగ ఉపాధులు మరొకొందరికి కలుగుతాయి.

ఇటువంటి కృషిచేసే వారికి ప్రభుత్వము, సమాజము కూడా తోడ్పడితే సమాజానికి, వ్యక్తులకు కూడా ప్రోత్సాహం, ప్రయోజనము కలుగుతుంది.

వైయక్తిక కృషి ఎంతపెద్దది అనే అంశము ప్రధానము కాదు. ఎంతచిన్నదైనా దీపము వెలుగే యిస్తుంది. వెలుగు ప్రధానము కాని అది ప్రసరించే పరిధికాదు. చిన్న దీపము. అటువంటి యితర చిన్నదీపము వెలిగించటానికి దోహదం చేస్తుంది.

నేటి గ్రామాలకు ఇటువంటి చిన్నదీపాలు అవసరము. జనగామ సమీప గ్రామము కుందారంలో శ్రీ బిట్ల వెంకటనారాయణ ఇప్పుడు చిన్నదీపాలు రెండింటిని వెలిగించాడు. ఆయన ఆ ఊళ్ళో ఒక సినిమా హాలు, ఒక కర్రకోత మిషన్ నెలకొల్పారు.

శ్రీ వెంకటనారాయణ బాల్యంలో కుందారం గ్రామానికి చెందినవాడే. అక్కడే పుట్టిపెరిగి బ్రతుకుదెరువు వెతుక్కుంటూ సోలాపురంనకు 42 సంవత్సరాల క్రితము వెళ్ళిపోయారు. 1956లో తిరిగివచ్చి వరంగల్‌లో రవివర్మ ఫోటో స్టూడియో స్థాపించారు. అంతకుముందు ఒకటి రెండుగా వుండే ఫోటో స్టూడియోల సంఖ్య రవివర్మ ఫోటో స్టూడియో స్థాపనతో ఆ వృత్తికి ఆదరణ అపారంగా పెరిగి, ఫోటోగ్రఫీలో ప్రతిభకు రాణింపు మొదలై నేడు అనేక ఫోటో స్టూడియోలు నెలకొని ఫోటోగ్రఫీలో ఎందరో ప్రతిభావంతుల నిర్వహణలో గణనీయ స్థానాన్ని సంతరించుకున్నది.

నిరంతరం శ్రమతో ప్రజాదరణ ధనార్జన పొందిన శ్రీ బిట్ల వెంకటనారాయణ ఫోటో స్టూడియోల నిర్వహణ బాధ్యతల్ని తన పుత్రులిరువురి సామర్థ్య నిర్వహణకు అప్పగించి తనను కనిపెంచిన కుందారం గ్రామమునకు వెళ్లాడు. కుందారం గ్రామములో కర్రకోత యంత్రం స్థాపించారు. ఒక సినిమా హాలు నిర్మించారు, శాంతా ఫోటో స్టూడియో పెట్టినారు కూడా. వీటి స్థాపనలో మొదట్లో ఎదురైన రకరకాల అవరోధాలను, అవహేళనలను, ఈర్ష్యాసూయలను స్థానికుల నుండి స్థానికేతరుల నుండి కూడా ఆయన ఎదుర్కొన్నారు. ఆయన సహజంగా మిత.భాషి. స్నేహశీలి, ధృఢ సంకల్పం, కార్యసాధనలో దీక్ష ఉన్న వ్యక్తి కావటం వల్ల వీటన్నింటిని అధిగమించగలిగారు. ఈ మంచిగుణాలే ఆయనకు ఆదిలో ఎదురైన పక్కచూపులు క్రమంగా మధుర స్వాగతాలైనాయనటానికి కుందారం గ్రామ మాజీ సర్పంచ్ ప్రస్తుత సర్పంచ్ శ్రీ జి. నరేంద్రరెడ్డి, శ్రీ అల్లం దాసిరెడ్డిగార్లు ప్రచురించిన కరపత్రం నిదర్శనం.

యితర దేశస్తులెందరో మన దేశముతో పరిశ్రమలు స్థాపించి బోలెడు లాభాలు ఆర్జించుకున్నారు. మనవారికి మనమే ఎందుకు సేవచేయకూడదు అనేది బిట్ల నారాయణగారి పంథా. పుట్టి పెరిగిన జన్మస్థల మమకారంతో ఒక సినిమా హాలు, కర్రకోత మిషన్ స్థాపించి, గ్రామాభివృద్ధికై తోడ్పడుచున్నందుకు మనమెంతో సంతోషించవలయును. గ్రామములో యింకా పరిశ్రమలు స్థాపించుటకు తన మిత్రులెందరినో ప్రోత్సహిస్తూ గ్రామానికి తీసుకువచ్చి

చూపిస్తున్నారు. ముఖ్యముగా రైస్‌మిల్, వెల్డింగ్, డ్రిల్లింగ్ మిషన్లు, కుటీర పరిశ్రమలు అనగా తోళ్ళ పరిశ్రమ, రొట్టె తయారీ స్థాపించుటకు మిత్రులనెందరినో కోరుచున్నారు. ''రైతులు తమ అవసరాలకై, కూలీలు తమ ఉదర పోషణకై బస్తీలకు పరుగెత్తకుండా ఉండాలి. అప్పుడే మన గ్రామం అభివృద్ధి సాధించినట్లు'' అంటారు వెంకటనారాయణగారు.

గ్రామములో సినిమా హాలు వల్ల గ్రామ పంచాయతికి వినోదం పన్ను, లైసెన్సు ఫీజు రూపంలో ఏటా రూ. 5,500/-లు దాకా ఆదాయం రాగల వాస్తవాన్ని ఈ సర్పంచులు గుర్తించారు. అంతేకాదు కావలసినంత విద్యుత్తు లభ్యపడుతుంది. శ్రీ బిట్ల వెంకటనారాయణగారి అనుభవపూర్వక మార్గదర్శనం ఉంది. కుటీర పరిశ్రమలు స్థాపించటము వల్ల ఉద్యోగ ఉపాధులు పెరగటమే కాక గ్రామపంచాయతీ ఆదాయం వృద్ధి అవుతుంది. ఆదాయాన్ని సద్వినియోగించి గ్రామాభివృద్ధి పనులు కూడా చేపట్టవచ్చునన్న వాస్తవాన్ని కూడా ఈ పెద్దలు గమనించటం వల్ల కుటీర పరిశ్రమలు స్థాపించవలసిందిగా ఆసక్తిగల వారిని, అర్హులను వారే ఆహ్వానిస్తున్నారు.

ఎన్నో కృత్యాద్యవస్థల్ని దాటుకొని వ్యయప్రయాసలకోర్చి '' నా ఊరు'' అనే మమకారంతో నెలకొల్పిన సినిమా హాల్, కర్రకోత మిషన్‌లు గ్రామానికి కలిగిస్తున్న ప్రయోజనాన్ని గమనించిన సర్పంచ్ పెద్దలు సమన్వయ దృష్టితో తాత్కాలిక లోపాల్ని దిద్దుకుంటూ సహకరించవలసిందిగా గ్రామ ప్రజల్ని కోరుతూ విజ్ఞప్తి చేయటం గమనార్హం.

సినిమా ప్రదర్శన నిర్వహణ ప్రథమ దశలో తప్పనిసరిగా ఎదురయ్యే లోపాలను ఆసరాచేసుకొని అపఖ్యాతి పాల్జేసి తలనొప్పితెచ్చుకొంటున్న వారికి ఈ పెద్దల వినతి అర్థం అవుతుందని ఆశించవచ్చు.

ఏదిఏమైనా శ్రీ బిట్ల నారాయణగారి ధృఢసంకల్ప దీక్షల వల్ల కుందారం గ్రామంలో వెలిగిన కొత్తదీపం కొంతమేర చీకటిని దూరం చేస్తుండటము ఖాయం. అంతేకాదు అర్హత వుండి సాహసంలేని వారిలో కుటీర పరిశ్రమలు నెలకొల్పటానికి శ్రీ వెంకటనారాయణగారు అగ్రగామి అయ్యారనుకోవచ్చు.

వరంగల్‌వాణి
డిసెంబర్ 4, 1982

M.S. ఆచార్య
ఎడిటర్: వరంగల్‌వాణి

# కళా తపస్వి శ్రీ బిట్ల వెంకటనారాయణ

లోకము నందు కొందరు జన్మతః కళాకారులు, మరికొంతమంది ప్రయత్నించి కళాకారులుగా ప్రసిద్ధి పొందుదురు. జన్మతః కళాకారుడై గురువుల వద్ద శుశ్రూష యొనర్చి తన కళకు మెరుగులు దిద్దుకొనెడి వ్యక్తియొక్క కళ అపురూపముగా భాసిల్లును. అట్టి వారిలో ముఖ్యముగా పేర్కొనదగిన వ్యక్తి శ్రీ బిట్ల వెంకటనారాయణగారు. వెంకటనారాయణ పేరు తన మిత్రులైన వారికి తప్ప మిగతా అందరికి ''రవివర్మ''యని పిలుచుటకద్దు. ఇదే పేరున ప్రసిద్ధినొందిన వ్యక్తి తాను.

ఈయన ( ప్రస్తుతము వరంగల్ జిల్లా) పూర్వం నల్గొండ జిల్లాయందున్న జనగామ తాలూకాయందలి కుందారము అను గ్రామమున ఒక పేద పద్మశాలి కుటుంబమందు 15-6-1925 బుధవారం శాంతమ్మ, లచ్చయ్యగారల నాలుగవ సంతానముగా జన్మించిన అపూర్వ కళాకారుడు. అదృష్టమేమన తెలంగాణా యందలి గ్రామములయందు ప్రభుత్వ పాఠశాలలు ఉండెడివికావు. కానీ కొన్ని ''ఖల్సా'' గ్రామములయందు మాత్రము ఇందాదియను ప్రాథమిక పాఠశాలలుండెడివి. కుందారము గ్రామమున అట్టి పాఠశాల ఉండెడిది. అతను ఆ పాఠశాలయందు చదివెడి దినములలో ఒక సంఘటన ఆయన ప్రతిభను చాటిచెప్పినది. అపుడాయన 4వ తరగతి చదువుచుండెను. 11వ సం॥ వయసులో ఆయనగారి చెల్లి సత్యయనునామె తన అక్షరాభ్యాసము పూర్తిచేసి బాలశిక్ష కావలసి వచ్చినది. తన తోటివారందరు పుస్తకము కలిగియున్నారని తనకది కావలయునని పేచీపెట్టినది. తండ్రి మాత్రము పుస్తకము కొని ఇవ్వలేని తన స్థితిని స్పష్టముగా చెప్పుటచే చెల్లి బాధచూడలేక అట్టి పుస్తకమును తను తెచ్చియిచ్చెదనని తనచెల్లిని ఓదార్చి మూడు రోజులలో వివిధ రంగులు సేకరించి తెల్లకాగితములు కొని తెలుగు అచ్చువేసిన బాలశిక్షను ముందుంచుకొని అచ్చము అచ్చువేసిన బాలశిక్షను తయారుచేసి యిచ్చినాడు. అది మరుసటి దినము బడిలో చూచినప్పుడు ఉపాధ్యాయుడే కాదు ఎందరో గ్రామస్తులు అట్టి పుస్తకమును చూచి తమ ఆశ్చర్యమును అతని చిత్రకళాభిరుచిని పొగడినారు. ఉపాధ్యాయులతని వీపుతట్టి గొప్ప కళాకారుడివి కాగలవని చెప్పినారు. వారి భవిష్యధ్వాణి నిజమైనది.

దీపావళి పండుగకు ప్రతి ఇంటికి సున్నములేయుట హిందువుల యిండ్లయందు ఆచారము ఈ పండుగ సందర్భముగా నారాయణగారికి

చేతినిండుగా పని ఏవేవో ఆకుల పసరుతో బచ్చలిపండ్ల రసముతో ఇత్యాదులతో రంగులు సిద్ధము చేసుకొని గోడలపై రకరకాల దేవతా రూపములను చిత్రించేవాడు. అలా చిత్రింపబడుట ఆ ఇంటివారు ఒక గౌరవముగా భావించెడివారు. అయితే ఆ సంతోషమెన్నాళ్లో సాగలేదు. ఒకతడవ ఒకవైష్ణవుల ఇంట్లో పెండ్లి సందర్భముగా ఇంటికి సున్నం వేయించినారు. తెల్లవారు వరకు వారి యింటిముందు గోడపై ఆనాటి పరిపాలకుడగు నిజామును చిత్రించినాడు. ఉదయమే ఆ చిత్రమును చూసిన ఆ ఇంటివారు ఈ పని చేసినది బొమ్మల నారాయణేయని వెంటనే అతనిని పిలిపించి సున్నమిచ్చి అతనిచేతనే చిత్రమును చెరిపించినారు. ఆ సంఘటన పిదప ఆయన తిరిగి అట్టి పని చేయలేదు.

ఆ పిదప కొన్నాళ్ళు కుందారము దగ్గరగాయున్న ''నవాబుపేట''లో ఇంగ్లీషు నేర్చుకొనుటకై వెళ్ళినాడు. వారెంత యిబ్బందులలో యున్నను తెలివిగలవాడైన తన కుమారుని చదివించి ప్రభుత్వ ఉద్యోగిని చేయవలయునని ఆయన తండ్రిగారి కోరిక. స్వేచ్ఛా ప్రియుడైన కళాకారుడట్టి అభిప్రాయమును పాటించలేదు. నవాబుపేటలో చదువుచున్నప్పుడే ఆర్థిక యిబ్బందులకు తట్టుకోలేని వారి తండ్రి కుటుంబ సభ్యులతో పాటు బ్రతుకుదెరువు కొరకు సోలాపురం వెళ్ళిపోయినారు. అచట తమ వృత్తి ధర్మము పాటిస్తూనే అచటి ప్రసిద్ధిపొందిన ''శరణప్ప''యను గురువుకడ ఫోటోగ్రఫీతో పాటు చిత్రలేఖనమునకు వన్నె చేకూర్చుకొనినాడు. అట్లు ఒకటిన్నర సంవత్సరములు అభ్యాసమొనర్చిన పిదప స్వతంత్ర్యముగా 1947వ సం॥లో ''బిట్ల ఫోటో స్టూడియో'' అను దానిని స్థాపించినాడు. అది ప్రారంభించుటకు మొదలు తన జన్మస్థలమగు కుందారము చుట్టుప్రక్కల గ్రామములందు ఒక డబ్బా కెమెరాతో తిరిగి తన ప్రతిభను 1947లోనే చాటుకున్నాడు.

సోలాపురంలో స్టూడియో స్థాపించిన పిదప ఆయిల్ పేయింటింగ్ ప్రారంభించినాడు. దానిలో ఎన్నో మెళకువలు తెలుసుకొని చిత్రించిన సజీవ శిల్పముల వంటి చిత్రలేఖనములెన్నో దర్శనమిచ్చును. ఆ కాలములో వరంగల్‌లో ఒక చిత్రకళా ప్రదర్శన పోటీకి తన కుడిచేతి బొటనవ్రేలుతో చిత్రించిన గాంధీ చిత్రమునకు బహుమతి లభించుటయే గాక ఎందరో ఉత్తమ చిత్రకారులచే ప్రశంసింపబడినాడు. అది 1958లో జరిగినది. అంతకుపూర్వమే 1950లో సోలాపురంలో స్టాలిన్ చిత్రమునకు బహుమతి లభించినది. ఆ పిదప తన జన్మస్థానమైన తెలంగాణాయందు స్టూడియో స్థాపించి తన కళా ప్రతిభను చాటవలయునని నిశ్చయించుకొని తండ్రి అనుమతితో వచ్చి మొదట జనగామ

తాలుకాను పరిశీలించినాడు. అది తన స్థాయికి సరిపోదని నిశ్చయమునకు వచ్చి జిల్లాయగు వరంగల్‌లో స్థాపించినాడు. ఆయనకు చిత్రలేఖనమందు గురువు ''రాజా రవివర్మ'' అతని చిత్రములు పరిశీలించి స్ఫూర్తినిపొంది ఏకలవ్యుడై సేవించినాడు. తన ప్రతిభను పదుగురు మెచ్చుకొనిన పిదప ఆత్మవిశ్వాస మేర్పడినది. తన అజ్ఞాత గురువగు ''రవివర్మ''గారి స్మృత్యర్థముగా తన చిన్న కుమారునికి ''రవివర్మ''యను పేరిది అతని పేరిటనే స్టూడియోకు ''రవివర్మ ఫోటో స్టూడియో''యను నామకరణ మొనర్చినాడు. వరంగల్ చుట్టుప్రక్కల అధికారుల మరి ఎందరో యింట్లో ఫోటో లేదా చిత్రములు వీరిద్వారా తీయబడి, చిత్రించబడినవే.

మొదట మనము స్టూడియోలోనికి ప్రవేశించే ముఖద్వారము దాటగానే వీరి నాన్నగారి చిత్రపటము ప్రతివ్యక్తిని ఆపివేస్తుంది. సజీవ చిత్రకళ ఉట్టిపడుచున్న గొంతు కూర్చుని చుట్టకాలుస్తున్నట్లుగాయున్న ఆ చిత్రలేఖనమొక అపూర్వ కళాఖండము. అట్లే ఆ స్టూడియో యందెన్నో భంగిమలలో తీయబడిన, చిత్రింపబడిన చిత్రములు ఆయన ప్రతిభకు దర్పణాలు.

చిన్ననాటి నుండి ఆర్థిక యిబ్బందులలో పెరిగిన వ్యక్తిలో సంపాదించిన పిదప మార్పులు కన్పిస్తుంది. కానీ ఆయనలో వినయంతో పాటు సామాన్యతను పెంపొందించుకున్నాడు. చిన్ననాడెట్టి డ్రెస్సులో కన్పించెడివాడో యిప్పుడలానే అదే ధోవతి, నెహ్రూ చొక్కా తనకు కష్టాలంటే ఏమిటో ఎరిగినవాడు కావున ఎదుటివారి కష్టాలుచూసి కదిలిపోతాడు. పాత్రయెరిగి దానము చేయుటలో అతనిది అందెవేసిన చేయి. అతనితో సహాయం పొందిన వ్యక్తులెందరో కలరు. వ్యక్తి ఎంత సింపుల్‌గా వుంటాడో ఎదుటివ్యక్తిని ఎంత గౌరవిస్తాడో పట్టుదలవస్తే మాత్రము ఎంతకయినా వెనుకాడడు.

తన అర్ధాంగి అనసూయాదేవి అనుగుణవతియై అతని ఉన్నతికి తోడ్పడిన వ్యక్తి. వారికి ఇద్దరు మొగ సంతానం, ముగ్గురు ఆడవాళ్ళు. అందరి పెళ్ళిళయి ఎవరివరకువారు ప్రశాంత జీవితమును వెళ్ళబుచ్చుచున్నారు. చిన్న కుమారుడు ''రవివర్మ'' తండ్రివలె చిత్రకళయందు ఉన్నత శిఖరాలు అందుకునే యత్నములో కొంతవరకు సఫలీకృతుడైనాడు. ఇప్పటికి విశ్రాంతి తీసుకోవలసిన వయస్సునందు సయితము ఎవరిదోయొక చిత్రమును చిత్రించుచూ ఉంటాడు. ''నారాయణగారు ఇంకా మీకెందుకు శ్రమ విశ్రాంతి తీసుకొనక'' యన్నప్పుడు

నవ్వుతూ వారికిచ్చే సమాధానమొక్కటే. ''నా చేతనైనంతవరకు ఇతరులపై ఆధారపడను. నేను స్వయంకృషిపై ఆధారపడి వృద్ధిలోనికి వచ్చినట్టి వానిని. అట్టి కృషియే నాకు సంతృప్తి నిస్తుంది.''

వీరికి సంగీతము, సాహిత్యమన్నా చాలా ఇష్టము. సాహిత్యకారులతో విషయచర్చ చేయుచున్నప్పుడు సాహిత్యమందు అతని ప్రతిభకు ఆశ్చర్యం కలుగకమానదు. ఆయన ఎందరో కళాకారుల సన్మానించి, సన్మానించుటకు ప్రోత్సహించిన ధన్యజీవి. వరంగల్‌లో గిర్మాజిపేట యందొక భవనము నిర్మించుకొని నివసిస్తున్నారు. ఆ యింటియందేమూలచూచినా చిత్రలేఖన సంబంధమైన కళాఖండములు కన్పించును. కొన్ని పూర్తిఅయి కొన్ని ప్రారంభించబడి కొన్ని సగం చిత్రించి వదలినట్టివి. ''ఇది ఎప్పుడు పూర్తిచేస్తారని'' ప్రశ్నించినప్పుడు ''నాకు మూడ్ వచ్చినప్పుడు'' అని చిరునవ్వుతో సమాధానమిస్తారు. ఆయన చిత్రకళకు స్పందించి తమ చిత్రము వ్రాసి యిమ్మని అడిగిన తీరిక ఉన్నప్పుడు చిత్రించి ఇస్తానంటారు. కానీ నిరాశపడనివ్వరు.

ఇంతటి మంచివ్యక్తి నిండుగా నూరేళ్ళు జీవించి ఇంకా ఎన్నో అపూర్వ కళాఖండములను సృష్టించి హితాభిలాషుల కోర్కెల తీరుస్తాడని ఆశిద్దాం''

వరంగల్‌వాణి

మార్చి 18, 1987

వంగ నర్సయ్య

తెలుగు లెక్చరర్



భార్య అనసూయతో



మా సోదరులు వారి భార్యలతో

ఎడుమనుండి: నేను, రంగయ్య, నరహరి, వైకుంఠం, విష్ణు



చిన్నకూతురు సుజాత, అంబదాస్ వివాహ సంధర్భంగా షోలాపురంలో తీసిన చిత్రం.

నిల్చున్నవారు : అల్లుళ్లు : చింతకింది శ్యామ్‌కుమార్, గుండేటి విజయ్ కుమార్, గెంట్యాల అంబదాస్,

మనుమలు : రఘునందన్, రవీందర్, రాజేంద్ర కుమార్; కుమారులు: మధుసూధన్, రవివర్మ

కూర్చున్నవారు : కూతుర్లు : విమల, సరోజ, సుజాత, నారాయణ, అనసూయ; కోడళ్ళు: సుగుణ, రత్నమణి

మనుమలు, మనుమరాళ్ళు : అనుపమ, దీప్తి, అంజు, నరేష్ కుమార్, విజయలక్ష్మి, అరుణ్ వర్మ, రజని, ఉషాకిరణ్, ఆశాకిరణ్



గురువుగారు

కీ॥ శే॥ శరణప్ప (షోలాపూర్)

# నా అంతరంగ తరంగాలు

## — ప్రేరణ

అది వేసవి కాలం. ఏప్రిల్ నెల 1984. గత సంవత్సరం వర్షాలు విపరీతంగా కొట్టినప్పటికీ వేసవి ఎండలు బాగా ఉన్నాయి.

సాయంకాలం చీకట్లు వ్యాపిస్తున్నాయి. సూర్యుడు అస్తమించి గంట దాటిపోయినా ఇంకా గాలి చల్లబడలేదు. పగలు మూడు గంటల నుండి స్టూడియోను సర్దించడంలో నిమగ్నమై అలసిపోయినాను. పైన పంఖా తిరుగుచున్నప్పటికీ చెమటలో తడిచిపోయినాను. నాల్గు సంవత్సరముల నుండి కొన్ని వస్తువులను కదలించినవారే లేరు. నేను 1980లో కుందారం వెళుతూ అప్పగించిపోయిన స్టూడియోను, కూలి వాళ్ళను అట్లే స్టూడియోయందలి వర్కర్లను ఉపయోగించి పని సాగిస్తున్నాను. ఇంకా నాలుగు అయిదు రోజులలో పూర్వ రూపం వచ్చేటట్లు చేయాలని దీక్షగా పని చేయిస్తున్నాను. రంగులు వేసెడివారు, సున్నం వేసెడివారు, సామానులు దుమ్ము దులిపి సరియైన చోట అమర్చువారందరిని ఆజమాయిషి చేయుచున్నాను.

అప్పటికి అరగంట క్రితం కూలీలను పంపించివేసి గుమాస్తాలను తమ తమ పనులు చూసుకోవలసినదిగా తెలిపి రేపు ఏ పని చేయించాలి, ఏ ఏ మార్పులు చేయాలో పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చి కాసేపు విశ్రాంతి తీసుకొని ఇంటికి వెళుదామని నిర్ణయించుకొని స్టూడియో వరండాలో కుర్చీ వేయించుకొని గాలికి అనువుగా కూర్చున్నాను.

ఇంతలో మా మనుమడు రఘు వచ్చి ''తాతయ్యా! మీ కొరకు జనధర్మ ఆచారిగారు, పాములపర్తి సదాశివరావుగారు వచ్చినారు. మీరు లోనికి వస్తారా లేక వారిని ఇక్కడికి రమ్మంటారా''? అని అడిగినాడు నేను వెంటనే లోన ఇంకా సర్దడం కాలేదు పైగా వేడిగా వుంది ఉక్కపోస్తుంది. రెండు కుర్చీలు ఇక్కడే వేయించి వారిని ఇక్కడికి పంపించుము. అట్లే మూడు కూల్‌డ్రింక్స్ పంపించమని పురమాయించి వేయించిన కుర్చీలను నాకు ఎదురుగా సర్దించి వచ్చిన పెద్దలను ఆహ్వానించి కూర్చోబెట్టినాను.

నేను కుందారం నుండి తిరిగి వచ్చిన పిదప సదాశివరావుగారు కలిసినారు కానీ ఆచారిగారు కలువలేదు. కూర్చుని పరస్పరం క్షేమ సమాచారం తెల్సుకున్నాము. ''మీరు బాగా చిక్కిపోయినారు. మీరు ఏ ఉత్సాహముతో వెళ్లినారో అది నెరవేరలేదు. పైగా ఆరోగ్యం కూడా దెబ్బతిన్నట్లు ఉన్నది.'' అని ఆచారిగారు పరామర్శించినారు. ఇంతలో కూల్‌డ్రింక్స్ వస్తే వారికి ఇచ్చి నేను ఒకటి తీసుకొని నెమ్మదిగా త్రాగినాము. పిదప నేనే సంభాషణ ప్రారంభించి ''మీరుభయులు తీరికగా వచ్చినారు. ఏదేని విశేషము గలదా?'' యని ప్రశ్నించినాను. అంత సదాశివరావు గారు ''ప్రత్యేక ఆలోచనతొనే వచ్చినాము.'' అని బయటపడినారు. ఏదేని ప్రత్యేకమైన మీటింగు ఉంటేనో లేదా మీటింగు పెట్టాలని నిర్ణయించుటకో లేదా విషయ నిర్ధారణకో మా స్టూడియోలో సమావేశము అగుట కద్దు. అయితే ఇప్పుడు కూడా అలాంటి ఆలోచనతోనే వచ్చినారనుకున్నాను. అప్పుడా చారిగారు ఇప్పుడు మీ వయసెంత? అని ప్రశ్నించినారు. నాకర్థం కాలేదు. వీరికి నా వయస్సుతో అవసరమేమి ప్రశ్నించినపుడు ఎందుకు చెప్పకూడదని ''ప్రస్తుతము 59 సంవత్సరాలు పూర్తిఅయి 60లో ప్రవేశిస్తున్నాను.'' అని తెలిపినాను.

నా మాటలు విన్న పిదప మేము ఒక ఆలోచనతో వచ్చినాము. మీరు 1956 నుండి వరంగల్‌లో ఉంటున్నారు కదా, వివిధ విషయాలతో మీకు అనుబంధము ఉన్నది. మీ స్నేహితులు దాదాపు అన్ని రంగాల వాళ్లు ఉన్నారు. మీరు షష్ఠిపూర్తి చేసుకోవటం బాగుంటుంది. మీకున్న అనుబంధముతో వివిధ విషయాలపై ప్రముఖుల సందేశాలు వారివారి ఆలోచనలు మీ కార్యక్రమాల వివరములు ఒక షష్ఠిపూర్తి సంచిక తీసినచో వివరాలు తెలిసివస్తాయి. పైగా మీరు చేస్తున్న మరియు చేసిన కృషి పదుగురికి తెలిసినట్లు ఉంటుంది. ఇదే విషయము తెలుసుకుందామని వారం రోజులుగా అనుకుంటున్నాము. ఈరోజు వీలు చిక్కింది.'' అని తమ రాక ఉద్దేశ్యాన్ని వివరించినారు. ఆచారిగారు కార్యశూరుడు తాననుకున్నది సాధించే సమర్థుడు. సాహిత్యపరంగా, పత్రిక మూలంగా బాగా కృషిచేసిన వ్యక్తి. వారికి తోడు సదాశివరావు గారొక సాహిత్యమూర్తి. ఆయన సర్వతోముఖ ప్రజ్ఞ కలిగిన వ్యక్తి. వీరుభయులు చేసిన అది కార్యరూపము ధరించినట్లే.

నేను వారి మాటలు విన్న పిదప కొంతసేపు మాట్లాడకుండా ఆలోచిస్తూ కూర్చున్నాను. నాలో ఎన్నో ఆలోచనలు సుడులు తిరిగినవి. నేనిక్కడికి వచ్చిన పిదప సాధించిన అభివృద్ధి అది ఎట్లా వృద్ధి పొందినది. అది ఏఏ దశలలో ప్రస్తుత పరిస్థితి, నేను కుందారం వెళ్ళుటకు కారణం తిరిగివచ్చిన హేతువు ఇవన్ని కండ్లకు కట్టినట్లుగా ఒక తడవ కనిపించినట్లయింది. నేను నెమ్మదిగా వారి మాటలకు జవాబులు ఇవ్వాలి. కనుక ఇట్లన్నాను.'' అయ్యా! మీరు చెప్పింది వాస్తవమయిన నాకు మొదటినుండి వ్యక్తిగత ప్రచారమన్న గిట్టని విషయం మీకు తెలుసు కదా. ఇది లోకుల దృష్టిలో సొంత డబ్బా. కొట్టుకున్నట్టు కదా బాగుండదేమో అని అన్నాను. నా మాటలు విని సదాశివరావు గారు కలుగజేసికొని ప్రచారము చేయకుండా ఏ వస్తువు యొక్క ప్రత్యేకత ఎలా తెలుస్తుంది. పైగా లేని విషయాలు ప్రచారం చేయటంకాదు గదా. ఉన్నదే జరిగిన అంశాన్నే ఒక (సంచిక) పుస్తకరూపములో వేయటం జరుగుతుంది. ''దీనిలో మీరుగా వ్రాసేది వుండదు. అంత మీ స్నేహితులు, పరిచయస్తులు అభిమానులు, వారివారి అభిప్రాయాలను అక్షర రూపములో ఇస్తారు. వాటినన్నింటిని సమన్వయ పరధి పుస్తక రూపములో తయారుచేయటం'' అని తమ అభిప్రాయం తెలిపినారు.

వారి మాటలు విన్నపిదప ''షష్టిపూర్తికి ఇంకా సంవత్సర కాలముంది. అప్పుడే తొందరేమి నన్ను మంచిగా ఆలోచించుకోనివ్వండి'' అని కోరినాను. దానిపై ఆచారిగారు కలుగజేసుకొని సంవత్సర కాలమంటె ఇట్లే తిరిగి వస్తుంది. పైగా దీని గురించి మొదట ఒక కమిటి వేసి దానిలో తగిన వారిని ఎన్నుకొని కార్యక్రమము ప్రారంభిస్తే అది పూర్తి అగుటకు సమయం తీసుకొంటుంది. కావున మీ నిర్ణయం వీలైనంత తొందరలో తెల్పమన్నారు. నేను నిర్ణయాత్మకమైన భావంతో కాకుండా ''అట్లే చూద్దాం లెండని '' అన్న పిదప వారు ఇతర విషయాలు మాట్లాడి నేను స్టూడియోలో చేస్తున్న మార్పులను అడిగి తెలుసుకున్నారు. అట్లే కొన్ని సూచనలు యిచ్చినారు. ఒక గంట గడిపి సెలవు తీసుకొని వెళ్ళిపోయినారు. నేను గూడ రఘూతో స్టూడియో కట్టివేసి రమ్మని ఇంటికి వెళ్ళిపోయినాను.

ఆర్థికంగా కొంత దెబ్బతిని వుండి జీవనాధారమైన స్టూడియో అస్తవ్యస్త పరిస్థితితో సతమతమవుతు మిత్రులు చెప్పిన సలహాను పాటించలేదు. అందుకు పరిస్థితులు గూడ తోడ్పడలేదు. మధ్య ఒకటి రెండు తడవలు గుర్తుచేసినారు. కాని నేనే ఉత్సాహం చూపలేదు. ఇంతలో మధుసూదన్ తిరిగి రావటం స్టూడియో బాధ్యత తీసికోవటం జరిగింది. స్టూడియోలో తండ్రి కుమారులు అనగా మధు మరియు రఘు ఉభయులు చూచుకోవటం వలన నా అవసరము కన్పించలేదు. నాకు గోళ్ళు గిల్లుకుంటు కూర్చునే అలవాటు చిన్ననాటి నుండి లేదు. అందువలన ఇంటివద్ద పేయింటింగ్ పని ప్రారంభించినాను. ఎందరో మిత్రులు పరిచయస్తులు మా ఫోటోలు పేయింట్‌చేసి ఇవ్వమని అడిగెడివారు. నాకు తీరిక లేక వానిపై శ్రద్ధచూపకపోవుట జరిగింది. ప్రస్తుతం ఆ పని ప్రారంభించి అదివరకే పేయింట్‌చేయించుటకు ఇచ్చిన ఫోటోలను ముందు వేసుకొని ఇంటివద్ద పని ప్రారంభించినాను. దానికి అనువుగా ఇంటిముందున్న రెండు గదులను అనువగు విధముగా మార్పులు చేయించి ముందుగదిలో ఒక చిన్న స్టూడియో అందు పాస్‌పోర్టు సైజు ఫోటోలు మాత్రమే తీసే హానోగ్రాఫ్ అను మిషను ఏర్పాటుచేసి వెనుక గదిలో పేయింటింగ్‌కు అనువుగా చేసుకున్నాను. పని ఇంటియందే కనుక ఎటువెళ్ళాల్సిన అవసరం లేకపోయెడిది. అవసరమైన వస్తువులు కావల్సి వుంటే గుమస్తాలతో లేక మనుమనితో తెప్పించుకునే వాడిని. లేదా మెల్లగా వెళ్ళి పనిచూచుకుని వచ్చెడివాడిని.

దెబ్బతిన్న ఆరోగ్యం కుదుటపడలేదు. దినదినం క్షీణిస్తూ వచ్చినది. పైగా వయసు పైబడుట తోడైనది. నేను ఇతరులపై ఆధారపడక స్వతంత్రంగా గడుపాలి అను సిద్ధాంతంతో జీవించినాను. దాన్ని అలాగే కొనసాగించాలి అని వుండెడిది. స్నేహితులు ఇంటికి వచ్చి కలిసి వెళ్ళెడివారు. నేను కూడ సదాశివరావుగారి ఇంటికి వెళ్ళి కొంత సమయం గడిపి వచ్చెడి వాడిని. అట్లే ఆయనగారు కూడా వస్తుండెడివారు. అట్లే జనగాం నుండి ''నల్లా నర్సింహులు'' తరుచు వచ్చి కలిసి ఒకటి రెండురోజులు నాతో గడిపి వెళ్ళెడివాడు. ఈ మధ్య ఒకసారి తను తన అనుభవాలను పుస్తకరూపంగా వ్రాయించాలని ప్రయత్నం చేయుచున్నానని అందుకు వంగ నర్సింహులు వద్దకు ఒకటి రెండు తడవలు వెళ్ళి వచ్చినానని తెలిపినాడు. ఆయనగారు నా జీవిత చరిత్ర అనుభవాలు బయట పరుచుటకు అనువైన ప్రశ్నలు యిచ్చినాడని వాటి జవాబులు సమన్వయపరచి వ్రాసిన పుస్తకము

కాగలదని తెలిపినాడు. అంతేకాదు వంగ నర్సింహులు నిజాం కాలం నాటి రజాకార్ల ఉధృతమును అణచివేయుటకు మరియు దొరల ఆగడాలు అరికట్టుటకు చేసిన సాయుధ పోరాట సమయమున మన తాలూకాలో జరిగిన ముఖ్యమైన సంఘటనలను సేకరించి ప్రకటిస్తానని అందుకు అనువుగా పర్యటించుటకై మధిర నుండి ఇద్దరు మిత్రులను వెంటబెట్టుకుని వస్తానన్నాడని చెప్పినాడు.

నల్లా నర్సింహులు చెప్పినట్లుగానే అక్టోబర్ 8వ తేదీ 1984 నాడు వంగా నర్సింహులు మా యింటికి ఇద్దరు మిత్రులను వెంటబెట్టుకుని వచ్చినాడు. తాను జనగాం తాలూకాలో సాయుధ పోరాటం నాటి కొన్ని సంఘటనలు వ్రాసి ప్రకటించుటకై పర్యటన జరుపుటకై వెళ్ళుచున్నానని నా సలహా అడిగి ఆశీర్వదించి పంపుమన్నాడు. అపుడు నేను నా అభిప్రాయమును తెలిపినపుడు ఆయన నా మాటలను టేపు చేసుకున్నాడు. ఆ రోజే నాకు నా జీవితం మరియు అనుభవాలు ప్రకటించుటకు అనువగు విధముగా 4 విభాగములుగా 33 ప్రశ్నలు యిచ్చినాడు. ఆ ప్రశ్నలకు జవాబులు వ్రాసి యిచ్చిన అది నా జీవిత చరిత్ర కాగలదని మీకు వ్రాసే ఓపిక లేనిచో కుమార్తెల చేత వ్రాయించమని యిచ్చి మరుసటి దినం జనగాం వెళ్ళిపోయినాడు. నల్లా నర్సింహులు ప్రయత్నం విన్న పిదప నాకు ఆలోచన కలిగినది. పిదప కొన్ని ప్రశ్నలను వంగ నర్సింహులు తెచ్చియిచ్చిన పిదప వ్రాయించాలను భావము ఏర్పడినది. అతడిచ్చిన ప్రశ్నలను మననం చేసుకుని ఒకసారి జీవితమును పర్యావలోకనం చేసి జవాబులు సిద్ధపరుచుకుని మా అమ్మాయిల చేత ఆ ప్రశ్నలకు అప్పుడప్పుడు జవాబులు చెప్పి వ్రాయించినాను. కాని అవి అసమగ్రంగా కనిపించినవి. నా జీవితపు లోతులు అవి బయట పరచలేకపోయినవి.

నేను స్వయంగా నా చిన్ననాటి నుండి నేటివరకు జరిగిన సంఘటనలను వ్రాయాలను ఆలోచన కలిగినది. కాని ఏదో పని లేదా ఆలోచన నన్ను రచనా కార్యక్రమమునకు అవకాశం లేకుండా చేసినవి. అయితే ఆలోచన మాత్రం ఉండి పోయినది. మొదట నల్లా నర్సింహులు, వంగా నర్సింహులు ద్వారా వ్రాయించాలని మధిరలో ఉండి తన జీవిత చరిత్రను ఆమూలాగ్రంగా వినిపించినాడు. అవి నోటు చేసుకోవటం కూడా జరిగినది. పిదప అతను

పర్యటనకై వచ్చినపుడు తిరిగి తన తెలంగాణా పోరాట మందలి తన అనుభవాలతో పాటు జీవిత చరిత్రను కూడా వినిపించినపుడు వంగ నర్సింహులు నాలుగు టేపులలో రికార్డు చేయుటం జరిగినది. ఐతే అది వ్రాతరూపవములో వెలువడుటకు ఆలస్యం జరుగుతూ వస్తున్నందున నల్లా నర్సింహులు స్వయంగా తానిదివరకు చెప్పిన అంశాలు అట్లే టేపుచేయబడిన అంశాలు గుర్తు చేసుకొని వ్రాత ప్రారంభించినాడు. అట్టి విషయం తాను నా కడకు వచ్చినప్పుడల్లా ఆ విషయాన్ని తెలిపి ఎంతవరకు పూర్తి అయినది వివరించెడివాడు. ఇది నాకొక స్ఫూర్తిని ఇచ్చెడిది. నల్లా నర్సింహులు వ్రాసిన వ్రాత ప్రతిని పార్టీ నాయకులకు చూపించి అట్టి పుస్తకమును విశాలాంధ్ర పబ్లిషింగ్-హైదరాబాద్ ద్వారా అచ్చు వేయించనైనది. ఆ పుస్తకం తెలంగాణా సాయుధ పోరాటం నా అనుభవాలు అను పేరిట వెలువరించనైనది. దాని మొదటి ముద్రణ 1989 ఆగస్టులో జరిగినది. దాని కాపినొకదానిని నాకు బహుకరించినాడు. దానిని చదివిన పిదప ఇక తప్పక వ్రాయాలి అను భావం స్థిరపరచుకున్నాను.

ఆ మధ్య మార్చి 1987లో వంగ నర్సింహులు ''కళాతపస్వి శ్రీ బిట్ల నారాయణ'' అను పేరిట సంక్షిప్తంగా నా జీవితమును గురించి ''జనధర్మ'' పత్రికకు పంపినాడు. అది ప్రింటు అయిన పిదప దాని కాపీనొకదానిని జనధర్మ ఆచారిగారు స్వయంగా తెచ్చి యిచ్చి అందలి అంశమును చూపించినాడు. మరుసటి సంవత్సరం జనధర్మ ఆచారిగారి ''అభినందన సంచిక'' ఒకటి వెలువడినది. దానియందొక చిన్న అంశము ''జనధర్మ-రవివర్మ'' అను పేరిట నేను వ్రాసి యిచ్చినాను. అది సంచిక యందు చోటుచేసుకున్నది. ఇవన్ని నాకు ఒక విధమైన ప్రేరణ కలిగిస్తూ వచ్చినవి. అయినా ఎలా వ్రాయాలి ఎటునుండి ప్రారంభించాలి అను ఆలోచన చోటుచేసుకునెడిది. అట్లు కొంత సమయం ఆలోచనలతోనే గడిచిపోయినది. ఈ మధ్య ఆరోగ్యం బాగా దెబ్బతిని అస్వస్తుడుగానే వుండిపోయినాను. కుటుంబ సమస్యలు తరచుగా నన్ను వేధించేవి. ఏదేని విషయం వస్తే దాన్ని గురించి కూలంకషంగా ఆలోచించడము దాని పరిష్కారమునకై సతమతమయ్యేడివాడిని.

ఆ మధ్య నేను సికింద్రాబాద్‌లో కొనివుంచినట్టి ఇండ్ల ప్లాట్లను ఒకగుండా ఆక్రమించి దానిచుట్టు కాంపౌండు నిర్మించి గదులు కట్టి గ్యాస్ ఏజన్సీ ఏర్పాటుచేసి మమ్మల్ని ప్లాటు వద్దకు రానివ్వలేదు. ఇందుకుగాను మా చేతనైన

ప్రయత్నం చేసినా ఫలితం లేకపోయినది. అతడు స్థానికుడు. పైగా మంది మార్బలం ఆర్థికంగా నిలదొక్కుకున్న వ్యక్తి అగుటచే సాధించుటకు వీలుపడక కోర్టుకు వెళ్ళటం జరిగింది. ఆ కేసు యిప్పటికీ నడుస్తూనే వున్నది. ఇటు ఆర్థికంగా శారీరకంగా నష్టపోవుట మా వంతు అయినది. తత్సంబంధంగా మరియు కుటుంబ విషయంగా కుమారులతో వచ్చిన పేచీలతో నా మనసు వికలమై మానసికమైన ఒత్తిడికి లోనయ్యాను. ఆ ఒత్తిడి నన్ను శారీరకంగా పెద్దదెబ్బ తీసినది. అనగా పక్షవాతం 20-6-90లో వచ్చి నన్ను అవిటివాణ్ణి చేసినది. దానితో నాలో వున్న ఉత్సాహం పూర్తిగా నశించి కృంగదీసినది. వెంటనే తగు వైద్యం చేయించుటచే కొంతవరకు నయమైనప్పటికి ఎడమ పార్శ్వము స్పర్శ పూర్తిగా రాలేదు. కఱ్ఱ సహాయంతో మెల్లిగా నడువగలిగాను. కాని మాట మునుపటి వలె ధారాళంగా రాలేదు. దీంతో నేను పూర్తిగా మంచము, కుర్చి నాశ్రయించి వడువవలసిన గతి ఏర్పడినది.

నా శారీరక వివశత్వం ఎంతసేపు మంచమునో, కుర్చినో అంటిపెట్టుకుని వుండుట కష్టమే అయినా తప్పనిసరి. ఇట్టి పరిస్థితుల్లో ఎంతో కాలంగా నాలో గూడు కట్టుకుని వున్న భావజాలాన్ని అక్షరరూపంలో వుంచాలని ప్రయత్నం ప్రారంభించాను. ఐతే నాకు ఎలా వ్రాయాలను నది ఎచటి నుండి ప్రారంభించాలనునది తెలియ నందున ఎవరినన్నా అడగాలని వున్నా వెళ్ళలేని అసహాయస్థితిలో ఒక విధంగా ప్రారంభించాను. అది బాల్యం నుండి ప్రారంభం చేసినప్పటికి ఒక క్రమంలో వ్రాయలేక పోయినాను. నాకెప్పుడేది గుర్తుకు వస్తే దానిని వ్రాస్తూ వెళ్ళినాను. కొన్ని సంవత్సరములు వ్రాస్తూ వెళ్ళినాను. వ్రాయటమే పనిగా పెట్టుకున్నాను. కాని వెనక్కిమళ్ళి వానిని చూడటం చేయలేదు. 1991 నుండి 95 వరకు అనగా 4 సం॥లు వ్రాస్తూ వచ్చినాను. అట్లువ్రాసిన అంశాలు దాదాపు 11 వందల పేజీలు అయినది. దానియందు ఒక్కొక్క అంశము 3,4 తడవలు వచ్చిన చోట్లున్నవి. నాకు బాగా నచ్చిన అంశములో లేక బాధాకరమైన అంశములో మరిమరీ చోటుచేసుకున్నాయి. వీనినన్నింటిని ఒక క్రమంగా వ్రాయించి పుస్తక రూపములో తేవాలని నిర్ణయించుకున్నాను.

పిదప మా గ్రామస్తుడు, బంధువు తెలుగు జూనియర్ లెక్చరర్ చిన్ననాటి నుండి నన్ను అనుసరించి నడుచుకున్న వ్యక్తి ఇదివరలో నా జీవిత చరిత్రకు ఆధారమగు ప్రశ్నలు యిచ్చి వాటి జవాబులు వ్రాయించి పురమాయించినవాడు మరియు నన్ను గురించి జనధర్మలో వ్రాసిన వ్యక్తి వంగ నర్సింహులు. అతను ప్రస్తుతం ఉద్యోగ విరమణచేసి హన్మకొండలో ఇల్లు కట్టుకుని నివసిస్తున్నాడు. అతనిని పిలిపించి నా ఉద్దేశ్యం తెలిపినాను. అతను అంగీకరించి నాచే వ్రాయబడిన డైరీలలోని విషయాలు పరిశీలించుటకు తీసుకువెళ్ళినాడు. వానిని తీరిక వేళలలో చదివి చర్విత చర్వణమైన అంశములను గుర్తుపెట్టుకొని వ్రాత ప్రారంభించినాడు. ఇంత పెద్దగా వుండటం బాగోదు . సంక్షిప్తీకరిస్తానని మొదటనే నాతో అంటే నేను సరేనన్నాను. అతను 1997లో వ్రాత ప్రారంభించి కొంత వ్రాసి తెచ్చి నన్ను పరిశీలించుమని యిచ్చినాడు. నేనట్టి దానిని నెమ్మదిగా చదివి చూచి అవసరమగు మార్పులు చేర్పులు సూచించాను. పిదప 97 సంవత్సరాంతమునకు తన పద్ధతిగా పూర్తిచేసి నాకు చదువుటకై ఇచ్చినాడు. నేను మళ్ళీ మొదటి నుండి చదివి అవసరమగు అంశములను నోటు చేసినాను. అట్లే వీలుచేసుకొని అతని ఇంటికి వెళ్ళి రెండురోజులు వుండి విషయాలపై చర్చించినాము. ఉభయులము చర్చించిన పిదప దానిని ప్రింటు చేయించాలని నిర్ణయించుకున్నాము.

ప్రింటు చేయించుటకు ప్రెస్ వారితో కల్సి మాటలాడుటకై అతనిని రమ్మని తెలిపినాను. అతని అనారోగ్య కారణము వలన ఒక నెల ఆలస్యము అయినది. తర్వాత 6-2-1998 రోజు వస్తానని కబురు పెట్టినాడు.

# నేను - నా బాల్యం

నేను అప్పటి నిజాం రాష్ట్రమందలి నలగొండ జిల్లాలోని కుందారం గ్రామంలో బిట్ల లచ్చయ్య - శాంతమ్మ పుణ్య దంపతుల అయిదవ సంతానం. ది. 17-6-1925న బుధవారము నాడు జన్మించినాను. పేద కుటుంబం అయినందున జాత కర్మాదులు వారి అచార ప్రకారంగా నిర్వహించినారు. పేరు వేంకటనారాయణ. మా తండ్రి నేత కార్మికుడు. కుటుంబమునంత ఒక చేతి మీదుగా మొగ్గముపై గుడ్డలు నేసి తద్వారా వచ్చెడి ఆదాయంపై గడపవలసి యుండెడిది. స్వంత కష్టముపై ఇల్లు నిర్మించుకున్నాడు. దాదాపు గ్రామమందలి పద్మశాలి కుటుంబముల పరిస్థితి అంతే. కొందరిచ్చట బ్రతుకుతెరువు కష్టమై సోలాపురం, బొంబాయి, సూరత్, మున్నగు చోట్లకు వెళ్ళి కుటుంబమును ఇచట వుంచి వచ్చిపోయెడివారు. కొంతమంది నాటి నైజాం కాలమందలి వల్లెలు అచటి పెత్తందార్ల అదుపు ఆజ్ఞలలో యుండెడిది. ఆనాటి పరిపాలన ఖాల్సా, సర్ఫెఖాస్, పాయెగా, జాగీరు, మక్తా, అగ్రహారం అను విభజన కల్గియుండెడివి. వానిలో కుందారం ఖాల్సా విభజనయందలిది. రైత్వారి ప్రాంతం. దీని రెవెన్యూ ఆదాయం ప్రభుత్వ వ్యయమునకు ఉపయోగించెడివారు. ఈ గ్రామమున దాదాపు 40 ముస్లిముల కుటుంబములు యుండినవి. అందువలన వారి ప్రాధాన్యత వుండెడిది. గ్రామము నందు అన్ని కులాల వృత్తుల వాండ్లు వుండిరి. పద్మశాలి కుటుంబాలు దాదాపు 50 వరకు ఉండెడివి.

నా తలిదండ్రులకు ఆడపిల్ల కావలయునని కోరికగా యుండెడిది. వారి మొదటి సంతానం అమ్మాయి. ఆ తర్వాత అందరూ మగ సంతానమే. చిన్నతనమున పుట్టువెంట్రుకలు తీయకుండా వానిని చక్కగా దువ్వి జడవేసి పూలుపెట్టి నాలో కూతురుని చూచుకునేది మా తల్లి. గుండ్రని ముఖం చక్కని ఛాయ కల్గియుండుటచే చూచేవారికి ముద్దుగొలిపెడివాడిని. చేతులకు కడియాలు, మెడకు కంటీ పెట్టినారు. అప్పుడు మగ పిల్లలకు వెండి కడియాలు చేతులకు కాళ్ళకు చెవులకు పోగులు మెడకు కంటీ పెట్టేవారు. అప్పుడదే సింగారము. ప్రతివాళ్ళు ఎత్తుకొని ముద్దాడెడివారు. మా ఇల్లు మూడుబాటలకు మధ్యగా వుండుటచే తలదువ్వి ఇంటిముందు అరుగుపై కూర్చోబెట్టిన వచ్చిపోయెడివారు ముద్దాడి వెళ్ళెడివారట. అట్లు చిన్నతనము అల్లారుముద్దుగా

తలిదండ్రుల లాలనలో గడిచినది. మా ఇంటి ప్రక్కగా మా పెదనాన్న గారి ఇల్లు వుండేడిది. అందు పెదనాన్నగారి అక్క కూతురు సిద్దమ్మ యనునది నాకంటే మూడెండ్లు వయసులో పెద్ద. ఆమెతో తరచుగా ఆడుకొనుచు పెదనాన్నగారి ఇంట్లో గడిపెడివాడిని.

## స్వగ్రామంలో నా అక్షరాభ్యాసం

నా నాల్గవ ఏట తన అక్క కూతురు వీధిబడికి వెళ్ళుతుంటే నేనుగూడ ఆమెతో కల్సి వెళ్ళెడివాడిని. అచట ఉపాధ్యాయునిచే బోధింపబడెడి విధానమును పరిశీలిస్తూ నిశ్శబ్దంగా యుండి తిరిగి ఆమెతో ఇంటికి వచ్చెడివాడిని. అట్లు అలవాటైన పిదప నేను స్వయముగా ఒక పలక అట్టతో ఏర్పరచినది తీసుకుని వెళ్ళుటకారంభించినాను. అట్లు వరుసగా బడికి వెళ్ళుటచే అక్షరాభ్యాసము జరిగి చదువు ప్రారంభమైనది. అక్షరములు నేర్చుకొనిన పిదప గుణితాలు పలకలపై సన్నని ఇసుకపోసి పలకపై దానిని పలచగా పరచి ఒక చిన్న పుల్లతో వ్రాస్తూ చెరుపుతూ నేర్చుకొనెడివారం. మొదట ఒక వీధిబడిలో బుచ్చయ్యపంతులు అనే పంతులుగారు చదువు చెప్పెడివారు. అ కాలపు విషయాలు జ్ఞప్తికి తెచ్చుకున్నపుడు విద్యార్థులను శిక్షించే విధానం చాలా కఠినంగా వుండెడిది. దెబ్బలే కాకుండా కోదండం ఎక్కించి దుముకకుండ క్రింద కంప పెట్టెడివారు. లోకమును అపుడపుడే గుర్తిస్తున్న నాకు ఆ కఠినమైన శిక్షలు నన్నెంతో భయపెట్టెడివి. బాధ కలిగించెడివి. వారియందు వారాల నర్సయ్యయను ఒక విద్యార్థి వుండెనని, అతడు పంతులుగారిని చూడగానే గజగజ వణుకతూ పాఠం అప్పగించలేక భయంతో మాటరాక అన్ని తప్పులుగా చదివెడివాడని సరిగా చదువలేదని కంఠతా చేయలేదని దెబ్బలు ఆ పిదప కోదండం ఎక్కించుట సామాన్యమైన స్థితి పంతులుగారి దెబ్బలకే భయపడి చదువలేకపోయేవాడని ఎందుకనగా బడి విడిచిన పిదప తన ఇంటికి వచ్చి చక్కగా అప్పగించెడివాడట. అట్లు ఆ స్కూలులో కొంతకాలము చదివినాను. నేనప్పుడు అక్షరాభ్యాసములో యున్నాను. తనకు పెట్టిచ్చిన అక్షరాలు మరుసటి దినం చక్కగా వ్రాసి చూపించేవాడిని. ఆ బడిలో నేనెన్నడు దెబ్బలు తినలేదని పైగా చిన్నపిల్లవాడని వినయంగా వుంటాడని అంటూ వుండేవారు. అప్పట్లో చదువుకు నెలకు బేడా లేక పావలా శుల్కముండెడిది. అదైనా యివ్వలేని వారు కొందరు

ముఖ్యముగా కోమటివారి పిల్లలు పంచవాయిల వాండ్ల పిల్లలు, రెడ్ల పిల్లలు అప్పుడప్పుడే బాలికలను కూడా బడికి పంపవలెనను ఆలోచనలు కలుగుచున్న కాలం. అందువలననే మా పెదనాన్న తన మనుమరాలు సిద్ధమ్మను పంపుతూ ఆమెతోపాటు నేను గూడా వెళ్ళుటకు అలవాటుపడినాను.

ఇంతల్లో కుందారం కాల్సా గ్రామమగుటచే ''ఇందాది'' యని (Aided) ప్రభుత్వ పాఠశాల ఏర్పరచి ఒక ఉపాధ్యాయుని నియమించినారు. ఆ కాలమున పాఠశాలలు అరుదు. ముఖ్యముగా గ్రామమందలి భూస్వాములు బడిని పెట్టనీయకుండా ఆపివేసెడివారు. ఎందుకనగా ప్రజలు విద్యావంతులైతే తమకు సేవకులు, కూలినాలివారు, వెట్టివారు దొరుకరని, తెలివిమీరి ప్రశ్నింతురని పాఠశాలలను వ్యతిరేకించెడివారు. కానీ తమ పిల్లలను మాత్రం పట్టణాలకు పంపించి విద్యాబుద్ధులు చెప్పించెడివారు. కానీ కుందారంలో ముస్లింల కుటుంబాలు 40 వరకు వుండి భూస్వాముల పెత్తనాలకు అడ్డువచ్చెడివారు. ప్రభుత్వము ముస్లింలదగుట వలన వారిమాట చెల్లుబడి జరిగెడిది. వారి ప్రయత్నం వలన ఎవరెన్ని ఆటంకములు కల్పించినప్పటికి పాఠశాల ఏర్పాటు జరిగినది. అది మా ఇంటికి దగ్గరగా యుండెడిది. పైగా ఉపాధ్యాయుడు జోగు రాజుగారు వీరు మా పిన్నమ్మ ఇంటిలో అద్దెకు వుండెడివారు. ఆ కారణముగా పంతులు గారికి సన్నిహితుడైనాను. నేను చిన్ననాటి నుండే విషయ పరిగ్రహణం చాలా చక్కగా చేసుకొనెడివాడిని. నేను విన్నది లేదా నేర్చుకొనినది ఒక తడవ చెప్పించుకొని శ్రద్ధగా చదివి అప్పగించెడివాడిని. నా యందలి వినయం, ఒద్దిక, గ్రహణశక్తిని గుర్తించిన పంతులుగారు భవిష్యత్‌లో తెలివిగలవాడవై వృద్ధిలోకి వస్తాడని అపుడపుడు ఇతరులతో అనెడివాడు. పైగా ఆయనగారు మా పిన్నమ్మగారి ఇంట్లో (విడో) అద్దెకు వుండుట వలన బడి విడిచిన పిదప రాత్రి నిద్రించే సమయం వరకు పంతులుగారిని అంటిపెట్టుకుని వుండెడివాడిని. ఆయనగారు నాతో భారతం భాగవత మందలి కథలను నా స్థాయికి తగినట్లుగా చెప్పెడివాడు. పంతులు ఒకరోజు బడిలో తన పలకపై ఆంజనేయులు బొమ్మను వేసి చేతికి ఇచ్చినాడు. అది చూసి అదే పలకకు రెండవవైపు ఏ మాత్రం తేడాలేకుండా నేను కూడా వేసి పంతులుగారికి చూపించినాను. ఆయనగారు నా పనితనమునకు మెచ్చుకొని అట్లే ఇతర దేవతల బొమ్మలను వ్రాసి చూపించుటకు ప్రోత్సహించినాడు. ఆ కాలమున కూడా పిల్లలకు బొమ్మలు

చూపి కథలు చెప్పుట జరిగెడిది. ఉదా॥ రెండు ఎలుకలు రొట్టె, త్రాచు, పిల్లి, కుందేలు, తాబేలు పరుగుపందెము మున్నగునవి వాని బొమ్మలు అచ్చువేయబడినట్టివి పంతులుగారి నడిగి తీసుకుని వానిని ఉన్నది ఉన్నట్లుగా వ్రాసియిచ్చి మెప్పు పొందెడివాడిని. అంతేకాదు నీతివాక్యాలు కాగితములపైన వ్రాసి ప్రదర్శిస్తు పిల్లలచే చదివించెడివారు అవి అచ్చువేసినట్లుగా తయారుచేసి యిచ్చెడివాడిని. ఇదంతా నేను రెండవ తరగతి చదువుచున్న కాలమందలి స్థితి. ఆ పిదప ఒక ముస్లిం టీచరును పంపించినది ప్రభుత్వము. ఎందుకనగా నాటి పరిపాలన అంతయు ఉర్దూలో జరిగెడిది కదా. క్రొత్తగా వచ్చిన అతనిని సదర్‌ముదరిస్ (Head Master) అనెడివారు. ఆయనగారు ఉర్దూ క్లాసులు మాత్రమే తీసుకొనెడివారు. జోగు రాజుగారు కూడా ఉర్దూ బోధించెడివారు కానీ అందే విధమైన సర్టిఫికెట్ ఉన్నట్టి వ్యక్తి కాదు. తెలుగు బోధించు బాధ్యత జోగు రాజుగారిది. ఆయనగారు తెలుగులో అక్షరాలు కుదిరిగ్గా వ్రాసెడివారు. అదే వరవడి నాకు అబ్బినది. పైగా కళాత్మకమైన స్వభావమగుటచే ఇంకా అందంగా వ్రాసెడివాడిని.

ఇట్లు ఉర్దూ, తెలుగు నేర్చుకొనుచు బడియందు పెబ్బ (మానేటర్)గా పిలువబడెడివాడిని. ఆ కాలమందు బడిలో ''అటెండర్'' వుండక పోయెడిది. బడి వూడ్చుట, మొక్కలకు నీళ్ళుపోయుట, బడి పరిశుభ్రతకై పిల్లలచే చేయించెడివారు. అట్టి పనులు నా ఆధ్వర్యములో జరుగుచుండెడివి. ఏ పనిపడినను మోల్వీసాహెబ్‌గారు కానీ, పంతులుగారు కానీ నన్ను పిలిచి పురమాయించెడివారు. నేను శ్రద్ధగా నిర్వహించెడివాడిని. ఆ కాలమున పాఠశాల ప్రారంభించుటకు ఒకగంట ముందుగా పంతులుగారు చేత ఒక బరిగె తీసుకుని నును వెంటబెట్టుకుని నిన్న బడికి తప్పించిన పిల్లల ఇండ్లకు, అట్లే వరసగా తప్పిస్తున్న పిల్లల ఇండ్లకువెళ్ళి కారణం తెలుసుకుని పంపమని తలిదండ్రులకు తెలిపెడివాడు. తప్పించెడి పిల్లలను వెంటబెట్టుకుని వచ్చెడివారు.

## బొమ్మలు - బాలశిక్ష

నేను నాల్గవ తరగతి చదువుచున్నప్పుడొక సంఘటన బహుశా జీవితమందు మరువరానిది. నా తరువాత ఒక తమ్ముడు ఒక చెల్లెలు కలిగినారు. నాకన్న పెద్దవారు ఒక అక్క ముగ్గురు అన్నలు. వారు చదువుపై శ్రద్ధ పూనలేదు.

పైగా తండ్రిగారు చదివించలేదు. నా తెలివితేటలు, చురుకుదనము, చదువుపై ఆసక్తి కనిపెట్టిన తండ్రిగారు నన్ను మంచిగా (బాగా) చదివించి ప్రభుత్వ ఉద్యోగిని చేయాలని సంకల్పించుకుని యుండి బడికి పంపుట జరిగినది. అయితే నా తర్వాతి వారైన తమ్ముళ్లని, చెల్లెళ్ళి తనతో పాటు బడికి తీసుకుని వచ్చుట మరియు ఇంటివద్ద వారికి తిరిగి చెప్పుట చేసెడివాడిని. చెల్లెలు సత్యవతి అక్షరాలు గుణితం నేర్చుకున్న పిదప బాలశిక్ష కావలసి వచ్చినది. ఆ కాలమున ఆ పుస్తకం వెల రెండణాలు మాత్రమే. అనగా నేటి 12 పైసలు. మా ఆర్థిక యిబ్బందుల కారణంగా మరియు ఆడపిల్లకు ఎందుకు అను భావముచే తండ్రిగారు బాలశిక్షను తెప్పించలేదు. చెల్లి చదువుకునే తరగతిలోని విద్యార్థులు బాలశిక్ష పుస్తకమును కలిగివుండి ఆమెకు లేకపోవుటచే ఆమె పుస్తకము కావాలని ఏడ్చెడిది. దాని విషయమై నేను ఒక నిర్ణయానికి వచ్చి రెండుపైసలు సంపాదించుకుని అనగా నాకవసరమని తండ్రిగారి నడిగి తీసుకుని రెండు తెల్ల తావులు కొనితెచ్చినాను. నాడు దస్తా పావలాకు వచ్చెడివి. అనగా పైసకు ఒకటి అన్నమాట. అచ్చైన బాలశిక్షను ముందుంచుకుని దానికి సరిపోవు సైజులో అన్ని పేజీలు గలదిగా కుట్టి, దానిలో యున్నట్లుగా బొమ్మలను మొదట పెన్సిల్‌తో పిదప తదనుగుణమైన రంగులు వేసినాను. అట్లే అందున్న అక్షరములను పదములను ఉన్నదున్నట్లుగా వ్రాసినాను. పిదప దానిని బైండుచేసి చెల్లెలికి అందించినాను. నాడు రంగులు చాలావరకు యింటియందే వుండెడివి. ఎందుకనగా తండ్రిగారు బట్టలు నేయుటకొరకు దారమును రంగులో అద్ది నేసెడివారు. మరుసటి దినము సత్య తన బాలశిక్షను అపురూపముగా బడికి తెచ్చినది. ఆ పుస్తకమును మొదట విద్యార్థులు చూసి పంతులుగారితో తెల్పగా ఆయనగారు దానిని చూచి చాలా ఆశ్చర్యపడినారు. తర్వాత హెడ్మాస్టరు గారికి చూపించగా వారు నన్ను తనవద్దకు పిలుచుకుని వీపుతట్టి ''షహబాష్'' అని మెచ్చుకుని నాకేదో బహుమతి ఇచ్చినారు. ఇట్టి విషయము కొంతమంది గ్రామస్థులకు తెలిసినపుడు ఆ పుస్తకమును వారి బడికి వచ్చి (పుస్తకమును) చూచి నన్ను అభినందించినారు. ఈ సంఘటన నేను నాల్గవ తరగతి చదువుచున్నప్పటిది. అప్పటికి నా వయస్సు 9-10 సంవత్సరములు వుండవచ్చును. దీనితో నేను వేసెడి బొమ్మలను చూచి బొమ్మల నారాయణ అని ముద్దుగా పిలిచెడివారు.

## గ్రామం గోడలు - నా మొదటి క్యాన్వాస్

ఇదే సందర్భమున గ్రామమందలి ఒక వైష్ణవుల ఇంటిలో పెండ్లి కొరకు ఇంటికి సున్నాలు వేయించినారు. బజారు గోడ సున్నముతో గిలాబు చేసినట్టిది. దానిపై సున్నము వేసిన పిదప అది తెల్లకాగితము వలె కనిపించినది. దానిని సాయంకాలము చూసిన పిదప ఒక నిర్ణయమునకు వచ్చి మరుసటి దినము తెల్లవారకముందే రంగులు సేకరించుకొని వైష్ణవుల ఇంటిముందు గోడపై నాటి నిజాం ప్రభువు ఆకారమును ముదురు రంగులలో మూడడుగుల ఎత్తులో చిత్రించినాను. ఎందుకనగా నాటి ప్రభువు ఆయనే కావున ఆయన చిత్రపటము చూచి సంతసించి అభినందిస్తారనుకున్నాను. కాని తెల్లవారి ఇంటివారు ఆ బొమ్మను చూచి ఆగ్రహించి ఇది బొమ్మల నారాయణ పనియని నిర్ణయించుకుని మస్కూరుని పంపి పిలిపించినారు. అతను వచ్చి నన్ను అయ్యగారు అనగా ఆచార్లుగారు పిలుస్తున్నారు రమ్మని పిలువగా తనకు పిలుపు వస్తుందని ఎదురుచూస్తున్న వాడిని కావున సంతోషంగా వెళ్ళినాను. కాని అచట చాలామంది కూడియున్నారు. పెళ్ళికి వచ్చిన చుట్టాలు గ్రామస్థులు ఉన్నారు. నేను అక్కడకు వెళ్ళిన వెంటనే కోపించి నీవు ఏ రామునిదో, కృష్ణుని బొమ్మవేస్తే సంతోషించే వాళ్ళము. కాని ఒక ముస్లిం బొమ్మను శ్రీ వైష్ణవుల ఇంటికి అది పెళ్లి శుభ సందర్భాన వేస్తువాయని తూలనాడినారు. అంతేకాదు ఏ చేత ఆ బొమ్మ వేసినావో అదేచేత దానిని తుడిచి వేయమని ఇంటినుండి సున్నం తెప్పించి నాచేతనే చెరిపించినారు. ఆనాటి అవమానము నా జీవితమునందు ఒక పెద్ద విచారకరమైనదే. ఆ పిదప నేను ఇంకెవరి ఇంటిలోనైనా గోడలపై చిత్రములు వేయలేదు. ఎందుకనగా దీపావళి పండుగ సందర్భమున గ్రామమందలి హిందువుల ఇండ్లకు సున్నాలు వేసుకుని నాతో తమ ఇంటిముందేదో దేవుని బొమ్మను వేయమని కోరి వేయించుకునెడివారు. ఈ సంఘటన జరిగిన పిదప ఎవరు పిలిచినా వెళ్లలేదు. తిరిగి గోడలపై బొమ్మలను చిత్రించలేదు.

మా తండ్రిగారు నన్ను బాగా అనగా తమ పరిధిలోయున్నంతవరకు చదివించి ఒక ప్రభుత్వ ఉద్యోగిగా చూడాలని చాలా కోర్కెకలిగి యుండెడివాడు. అందువలన కుందారంలో నా చదువు పూర్తి అయ్యిన పిదప మా గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున గల నవాబుపేట యను జాగీరు గ్రామము నందొక

ఉపాధ్యాయుడు ప్రైవేటుగా బడిపెట్టి ఇంగ్లీషు నేర్పుచున్నాడని తెల్సుకుని నన్ను వెంటతీసుకుని వెళ్ళి ఉపాధ్యాయుని సంప్రదించి నా కుమారునకు ఇంగ్లీషు నేర్పుమని కోరినాడు. అప్పటికే మా గ్రామము నుండి ఒక వైశ్య బాలుడు మరియొక రెడ్డి బాలుడు వెళ్ళి చదువుచున్నాడు. వారిద్దరు కలిగిన కుటుంబీకులు. వారు నవాబుపేటలోనే యుండి అచట వంట ఏర్పాటు చేయించుకుని చదువుకొనుచుండిరి. కాని నాకు నెలకు ఒక రూపాయి పంతులుగారి ఫీజు చెల్లించుట కష్టముగా యుండెడిది. అందువలన నన్ను అచట వుంచి చదివించుట సాధ్యపడదని ప్రతిదినం ఇంటినుండి అన్నము తీసుకుని వెళ్ళి దినమంత చదువుకుని రాత్రి తన తోటివారితో యుండి నేను తీసుకువెళ్ళిన సద్దితిని మరుసటి మధ్యాహ్యం పగలు 11-00 గంటలకు నడిచి కుందారం వెళ్ళివచ్చేవాడిని. అట్లు వచ్చి స్నానాదులు ముగించుకొని పదకొండు వరకు భోజనం చేసి సద్ది కట్టుకుని 12 గంటలకు బడికి అందెడివాడిని. అట్లాక ఆరు నెలలు గడిచిన పిదప కొంత ఇంగ్లీషులో పరిజ్ఞానము ఏర్పడినది. కాని కొద్దికాలములో ఏమి నేర్వగలరు. ఆరు నెలలలోనే అచట నా చదువును ఆపివేయవలసి వచ్చినది. అంతటితో ఇంగ్లీషు చదువు పూర్తి అయినది. అపుడు నా వయసు 12 సంవత్సరములు. కాని కొలది రోజులలోనే మా గ్రామమునకు క్రొత్త ప్రధానోపాధ్యాయుడు వచ్చినాడు. ఆయనగారు ఇంగ్లీషులో మరియు ఉర్దూలో దిట్టయని కాని తెలుగు మాత్రం రాదని తెలిసినది. ఇంగ్లీషు నేర్వాలని పట్టుదల కలిగిన నేను ఆతనిని కలుసుకుని నా అభిప్రాయాన్ని చెప్పుకున్నాను. అందుకు మాస్టరుగారు వప్పుకుని బడికి రమ్మని నాకు ఉర్దూ, ఇంగ్లీషు బోధించెడివారు. ప్రతిగా నాచేత హెడ్మాష్టరుగారు చెప్పాల్సిన తెలుగు పాఠములను చెప్పించుకొనుట ప్రారంభించి పరస్పర సహకారము పొందినాము. అందు తెలుగు బోధనయందు జోగు రాజుగారి ఆశీస్సులు ఎపుడూ వుండేవే. జోగు రాజుగారితో ఎంత సన్నిహితంగా మసలేవాడిని. మా పిన్నమ్మగారి ఇంట్లో అద్దెకు వచ్చిన నాటినుండి నేను పంతులుగారిని అంటిపెట్టుకొని ఉన్నాను. ఆయన గారికి భార్యాపిల్లలు లేరు. ఆచారమును ఎక్కువగా పాటించెడివారు. భట్రాజులు అయినప్పటికి బ్రాహ్మణులకన్నా మిన్నగా శుచిని పాటించేవారు. స్నానం చేసి మడికట్టుకుని మంచినీళ్ళు తెచ్చుకుని మడితో వంటచేసెడివారు. మడితోనే భోజనం చేసిన పిదప ఇతరులను అంటుకొనెడివారు. నన్ను వంట ఇంటిలోనికి

రానిచ్చెడివారు కాదు. వంటనీళ్ళు తెచ్చుట తప్పించి అన్ని పనులు చేసిపెట్టెడివాడిని. ఒక్కొక్కప్పుడు ఆయన భోజనం కూడా పెట్టెడివారు. రాత్రులు ఆయన మంచము ప్రక్క క్రింద పడుకునేవాడిని. ఆయన తన జీవితమందు ఎన్నో సంఘటనలు చెప్పెడివారు. పురాణగాథలు భారత భాగవతముల నుండి ఎన్నో పద్యములు ఆయనకు కంఠతా వచ్చెడివి. నాకు గూడా చాలా పద్యములు నేర్పినారు. ముఖ్యముగా శతకములు మరియు భాగవతమందలి గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్ర, రుక్మిణీ కళ్యాణములోని పద్యములు ఆయనకు కంఠోపాఠం. నాకు తెలుగునందు కొంత సామర్థ్యము కల్గినదంటే ఆయనగారి ఆశీర్వాదమే.

ముస్లిం హెడ్మాస్టర్ వచ్చిన పిదప మళ్ళీ బడికి వెళ్ళుట ప్రారంభించినాను. ఆయనవద్ద ఉర్దూ ఆరవ తరగతి మరియు ఇంగ్లీషు మూడవ వాచకము చదివినాను. ఆయనగారు నాతో తెలుగు నేర్చుకొనెడివాడు. అదైనా తన ఇంటికి పిలిపించుకుని ఇతర విద్యార్థులెవరు లేకుండా పంపించి పాఠం చెప్పించునేవాడు. తెలుగు జోగు రాజుగారితో నేర్చుకోవలదా యనునపుడు ఆయన నాకు మదర్గారు (Asst.) అతని వద్ద నేర్చుకొనుట బాగోదనువాడు. ఆయనతో అట్లు కలిసివున్నప్పటికి జోగు రాజుగారికి తన సేవ అమలులో వుంచినాడు. అట్లు కొలదికాలము గడిచిన పిదప హెడ్మాస్టర్ గారికి తబాదిలా (Transfer) అయివెళ్ళిపోయినాడు. నా చదువు తిరిగి ఆగిపోయినది. ఆ పిమ్మట కొన్నిరోజులో మా పెద్దన్న నరహరి తన అత్తగారి ఊరగు కలువలపల్లిలో చిన్నపాటి కిరాణాకొట్టు పెట్టినాడు. అది కుందారమునకు రెండుమైళ్ల దూరమున యుండెడిది. అది బానాజిపేట మజిరా (హంలెట్) చిన్నపల్లెటూరు. దాదాపు 25, 30 ఇండ్లు వుండెడివి. నేను కొట్లోవున్నప్పటికి ఉదయం, సాయంకాలం మాత్రమే పనిచేసి ఉదయం 10-00 గంటల నుండి సాయంత్రం 4-00 గంటల వరకు బానాజిపేటలో ఒక నల్లపూసలు అమ్మే పంతులుచే నడుపబడిన వీధిబడికి వెళ్ళెడివాడిని. అప్పటికే తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషుతో పరిచయమున్న విద్యార్థిని కావున పంతులుగారు నన్ను ప్రత్యేకముగా చూచెడివాడు. ఆయనగారితో ముఖ్యముగా నాడు వాడుకలోయున్న ఖండిలెక్కలు, మిత్తి లెక్కలు, భూమి కొలత లెక్కలు కొన్ని శతకములు నేర్చుకున్నాను. అక్కడ చదువునపుడొక సంఘటన ప్రత్యేకత చాటి చెప్పినది.

ఒకరోజు ఒక పాములవాడు పామును తెచ్చి కచేరిముందు ప్రదర్శన ఏర్పాటుచేసి పాముల ఆట చూపించినాడు. ప్రేక్షకులందరూ పాములను చూస్తుంటే నేను ఒక పెన్సిల్‌తో కాగితముపై పాములవాడిని చేతిలోని నాగస్వరమును దించినాను. నేను చేయుచున్న పనిని చూచిన కొందరు నా చుట్టుమూగి వేయబడిన బొమ్మను చూచి ఆశ్చర్యపడినారు. అచటనే వున్న గ్రామాధికారి దగ్గరకు పిలిపించుకుని నాచే వేయబడిన బొమ్మ గల కాగితమును ఆ పాముల వానిని పరిశీలించి వాని ముఖకవళికలు చిత్రమునందు చూచి ఇంత తొందరగా ఎలా వ్రాయగలిగావని అడిగి నాచే దించబడి జేబుయందలి నోటుబుక్కున గల ఇతర చిత్రములను చూచి చాలామెచ్చుకున్నారు. ఇతడు భవిష్యత్తులో గొప్ప కళాకారుడు కాగలడని ఊరివారితో చెప్పి నన్ను అభినందించినారు. అప్పట్లో నాకు చదువు చెప్పుచున్న పూసల పంతులుగారు గర్వముగా ఇతను నా శిష్యుడు అని గొప్పగా చెప్పుకున్నారు. అచట కూడా ఎక్కువ కాలము ఉండలేదు. ఎందుకనగా అన్నగారిచే పెట్టబడిన కిరాణాకొట్టు నందు అమ్మకము లేక ఎత్తివేసినాడు. తిరిగి తన అన్నగారితో పాటు కుందారం వచ్చినాను.

## వీధి భాగవతులు – కోలాటం

నా చిన్నతనమున పల్లెటూళ్లయందు ప్రజల వినోదార్థంగా చాలా రకములైన ప్రదర్శనలు జరిగెడివి. వానిలో వీధిభాగవతులు, హరికథలు, తోలుబొమ్మలాటలు, చెక్కబొమ్మలాటలు, పాండవుల కథకులు, భీర్లవారు, ఇంకా ఇతరములైన వినోదములు చూపించెడివారు. వీరేకాక భోగం మేళం అని వచ్చి స్త్రీలు నాట్యం చేసేవారు. వీరిలో స్త్రీలు పురుషులుండెడివారు. ఇంకా కూచిపూడి, బ్రాహ్మణులు వచ్చి దినమునకొక విధమైన వేషాలతో గ్రామస్తుల నలరించే వారలు. వీరందరు ప్రజలపై ఆధారపడి జీవించేడివారు. కల్గిన కుటుంబాలవారు, రైతులు ఇతర కుటుంబాల వారు వారికి తమతమ శక్త్యానుసారము డబ్బులు ఇచ్చేడివారు. నేను ఈ ప్రదర్శనలను వేనిని వదలకుండా చూచెడివాడిని. ఆనాడు అదొక ప్రజానందకరమైన ప్రక్రియ. నేను చూడటంలో చాలా శ్రద్ధగా పరిశీలించి వారెట్లు చేయుచున్నది కనుక్కునే యత్నం చేసేవాడిని. ప్రతిదాన్ని అనుకరించాలను భావం కల్గెడిది. కాని నాకెలా సాధ్యం. అయితే ఒక అంశం నన్ను ఎంతగా ఆకర్షించిందనగా దానిని సాధించాలని పట్టుదల కల్గింది.

ఒక తడవ చెక్కబొమ్మలాట వాండ్రువచ్చి చెక్కబొమ్మలతో రామాయణమందలి కథలు, భాగవత మందలి కథలను, మహాభారతమందలి కథలను ప్రదర్శించినారు. వారు ప్రదర్శనకు ఏర్పాటుచేసే స్టేజికి పరదాలు కట్టి పరదా వెనుక బొమ్మలనాడించే వారు పాత్రానుగుణ్యమైన మాటలు పాటలు పాడి కథను రక్తి కట్టించేవారు. అందు హాస్యము మాత్రం మొగటుగా వుండెడిది. పామర జనం బాగా ఆనందించెడివారు. వారు కొన్నిరోజులు ప్రదర్శనలిచ్చినారు. ప్రతి ఆట ఆంత్యమున బొమ్మలచే కోలాటం వేయించుట అది పతాక సన్నివేశంగా వుండెడిది. ఆ బొమ్మలు ఎలా ఆడుచున్నది అను విషయాన్ని నేను ప్రదర్శించువారికి దగ్గరగా నిలబడి పరిశీలనచేస్తూ వచ్చినాను. ప్రతి చెక్కబొమ్మకు తలపై ఒక దారం అట్లే రెండు చేతులకు దారాలు వుంటవి. ఆ బొమ్మనాడించు వ్యక్తి ఆ దారాలను తను పట్టుకొని మాట లేదా పాటకు అనుగుణ్యమగు రీతిగా పట్టుకొనిన దారాలతో బొమ్మచేతులు కదిలించేడివాడు. బొమ్మ ఒక అడుగు పొడవు వుండి నడుము వరకే వుంటుంది. క్రిందిభాగం బట్టకడుతారు. అనగా చీరె మాదిరిగా లంగాలు గుణ్యంగా వ్రేలాడునట్లు నడుముకు కట్టెడివారు. తలభాగం పాత్రానుగుణ్యంగా కిరీటాదులు, ఆభరణాలు ఏర్పరచెడివారు. తల చేతి దారాలతో బొమ్మలను కదుల్చుచు కథ నడిపెడివారు. తుదకు బొమ్మల కోలాటం చాలా గమ్మత్తుగా వుండెడిది. ఒక కర్ర చక్రానికి 3 బొమ్మలను వ్రేలాడదీసెడివారు. వాటి చేతులకు కట్టబడిన దారాలు ఒక వెదురు గొట్టం నుండి తీసి వానినాడిపించు వ్యక్తి పట్టుకొనేడివాడు. ఆ బొమ్మల చేతులకు సన్నని కర్రలు కోలలవలె వుండెడివి ఆడించెడి వ్యక్తి చక్రాన్ని త్రిప్పుతు బొమ్మల చేతులకు కట్టబడిన దారాలను క్రిందికి పైకి వదలుచు లాగెడివాడు. అట్లు చేయునపుడు ఆ కర్రలు ఒకదానికొకటి తగిలి చప్పుడు అయ్యేది. అది కోలాటమాడుచున్నట్లు అనుభూతి కలిగెడిది. ఈ ప్రక్రియను నేను కొన్ని దినములు పరిశీలించి అర్థం చేసుకున్నాను.

నా ఉద్దేశ్యము ఏమనగా నేను కూడా బొమ్మలతో కోలాటం ఆడించగలనాయని మిగతా బొమ్మలను ఆడించుట విశేషము కాదు. కాని ఈ చక్రమందలి బొమ్మలతో ఆడించాలని పట్టుదల కలిగినది. ఐతే ఈ బొమ్మలను ఎక్కడ తేవాలి అది ఎలా సాధ్యం. ఈ విషయాన్ని నా మనస్సునందుంచుకొని సాధ్యాసాధ్యాలను బేరీజు వేసుకునెడి వాడిని. ప్రతి సంవత్సరం వేసవిలో మా

ఊరు ప్రక్కకు వున్న చెరువు ఎండిపోయిన పిదప గ్రామస్థులు చెరువు కట్టకు వున్న చెట్లను నరికి పొయ్యిల పుల్లల కొరకు తీసుకువెళ్ళేడివారు. వానిలో ముఖ్యముగా మోదుగు, తుమ్మ, పూడగు పులిశె పాదలు వుండెడివి. మేము గూడా వానిని నరికి తెచ్చుకొనెడివారం. నేను చెక్కబొమ్మలాట చూచిన పిదప బొమ్మలకుపయోగపడు కర్ర ఎలా సంపాదించాలి ఎలా తయారు చేయాలను ప్రశ్నవుండిపోయినది. నాకు ప్రతిదినం సాయంకాలం వేళ చెరువుకట్ట వెంబడి వాహ్యాళిగా వెళ్ళివచ్చే అలవాటు చిన్నతనం నుండే ఏర్పడినది. అట్లు వెళ్ళినప్పుడు నరికిన చెట్ల మొదళ్లను పరిశీలిస్తూ వచ్చినాను. ఒకరోజు ఊడుగువేరు పరిశీలించిన వూడది మెత్తగా వుండి తెల్లగా వున్నందున దానిని ఉపయోగించవచ్చునను ఆలోచన కలిగి గొడ్డలి తీసుకువెళ్ళి ఒక ఏరు దొడ్డుగా వున్నట్టిది నరికి తెచ్చి ఎండబెట్టినాను. అది పూర్తిగా ఎండిన పిదప దానిని చీల్చి నేను చూచిన ఆకారము వచ్చేటట్లుగా బాకుతో చెక్కి దానికి ముక్కు ముఖం వచ్చేట్లు చేసి రంగులు వేసినాను. రెండుచేతులు వేరువేరుగా చేసి దారముతో బొమ్మకు కలిపినాను. దాని తలకు మరియు చేతులకు దారం కట్టి ఆడించి చూచినాను. పిదప ఇంకా కొన్ని ఊడుగు వ్రేళ్లను నరికితెచ్చి మొత్తం ఎనిమిది బొమ్మలను తయారుచేసి అదే కర్రతో ఒక చట్రం తయారుచేసి బొమ్మలకు కట్టిన దారాలను వెదురుగొట్టం నుండి తీసి బొమ్మలాట కాండ్రు ఆడించిన విధంగా ప్రయత్నించినాను. సాధ్యపడలేదు. నిరాశచెందక అయిదారు రోజులు ప్రయత్నించి వాటిని ఆడించగలిగినాను. నాకు తృప్తి అయిన పిదప మా ఇంటిలో ప్రదర్శించి చూపినాను. మా నాన్నగారు బాగుందని అచ్చం బొమ్మలాట వారి మాదిరిగా వుందన్నాడు. ఇది సాధించువరకు నాల్గునెలల సమయం తీసుకున్నది. పిదప జోగు రాజుపంతులు గారికి చూపించినాను. ''షెహబాష్'' అని మెచ్చుకున్నారు. దీనిని బడిలోకి తెస్తే పిల్లలముందు ప్రదర్శించవచ్చు తీసుకురమ్మన్నారు. నేను ఆ విధంగానే బడికి తీసుకువెళ్ళి పిల్లలముందు ప్రదర్శించినాను. పిల్లలందరు బాగా సంతోషించినారు. హెడ్మాష్టర్‌గారు వీపుతట్టి మెచ్చుకున్నాడు. దానిని భద్రపరచి బడిని సందర్శించుటకు వచ్చే పై వుద్యోగులకు దానిని ప్రదర్శించి చూపించినాను. నాకు అప్పుడు దాదాపు 12 సంవత్సరములు వయసు. నాలో ఏదేని ఆలోచన కల్గినపుడు దానిని సాధించు వరకు యత్నించెడివాడిని.

నేను నవాబుపేటలో చదువు ముగించుకుని ఇంటియందున్న సమయమున ఒకరోజు మా తండ్రిగారగు బిట్ల లచ్చయ్య నన్ను వెంటబెట్టుకుని గ్రామకరణమగు నెల్లుట్ల నర్సింహారావుగారి వద్దకు వెళ్ళినాడు. నర్సింహారావుగారు గొప్ప తెలివిగలవాడని మంచి ఆలోచనాపరుడని ఆ కాలమున బాగా చెప్పుకొనెడివారు. మేము కరణంగారి ఇంటికి వెళ్ళి నమస్కరించి నిలబడి వుండిపోయినాము. అచట వున్న ఇతరులందరు వెళ్ళిపోయిన పిదప కూర్చోమని చెప్పి కూర్చున్న పిదప ''అబ్బాయిని వెంటబెట్టుకొని వచ్చినావు ఏమి కావాలని'' అడిగినారు. దానిపై మా తండ్రిగారు ''మా అబ్బాయిని మీ చేతిక్రింద వుంచుకుని పనినేర్పిన మునుముందు ప్రభుత్వ ఉద్యోగమునకు దారి కాగలదు. దయతో మా అబ్బాయిని మీవద్ద నేర్చుకొనుటకు అనుమతి ఇవ్వమని'' కోరినాడు. ఆయనగారు ఇతని మాటలు విన్న పిదప చిరునవ్వుతో లచ్చయ్యా! నీ కుమారుడు తెలివి కలవాడే కాదు. మంచి భవిష్యత్ వున్నవాడు. చిన్ననాటి నుండి వాని నడవడిని చూస్తున్నాను కదా నీవు సర్కారి వుద్యోగం చేయించాలని కలలు కంటున్నావు. మాది ఒక ఉద్యోగమేనా ప్రభుత్వము ముస్లింలది. ప్రతి నిత్యం ఆత్మాభిమానం చంపుకుని వంగి సలాములు కొడుతూ జీవించాలి. మామూలి చప్రాసి (అటెండర్) కూడా మమ్మల్ని తూలనాడి మాట్లాడుతాడు. పడివుంటున్నాము. కనుక తప్పదు. మీ వాణ్ణి ఇటువంటి నీచమైన పనిలో పెట్టటం నాకిష్టంలేదు. వానిని ఇంకా గొప్పవాణ్ణి చేయుమని'' సలహా ఇచ్చి పంపించినాడు. నేను బొమ్మలు వేస్తూ మంచి చిత్రకారుడు కావచ్చు. వానిని రాజమండ్రిలో చిత్రాలు నేర్పు బడి ఉంది. అక్కడికి తోలించి ఆ విద్యచెప్పించు అని చెప్పినాడు. నాకు ఆ సలహా నచ్చింది కాని మా నాన్నగారికి రాజమండ్రి తోలించే స్థోమత లేదు. అట్లా జరిగింది నా చదువు. కరణం గారి ఇంటినుండి మా నాన్న ముఖం మాడ్చుకొని బయటకు వచ్చి దారిపొడుగునా అతన్ని తిడుతూ ఇంటికి వచ్చినాడు. కనిపించిన ప్రతివారికి కరణం పంతులు ఎంత స్వార్ధపరుడో ఎందుకనగా మాఅబ్బాయి నారాయణను అతని వద్ద పనినేర్చుకొనుటకు ఉంచుకోమని బ్రతిమిలాడితే వద్దని వెళ్ళగొట్టినాడు. అతనా బట్టలు వేసుకొని బ్రతికేవాడు కరుణీకం నేర్చుకుంటాడా. వీడు రేపు తెలివిగలవాడైతే వారికి పుట్టగతులుండవని రెండు మూడు రోజులు తిట్టినాడు. కాని నాకు మాత్రం కరణం పంతులుగారు చెప్పిన దాంట్లో అసత్యమేమి

కన్పించలేదు. అందుకు నా చిన్ననాడు కచేరి (చావడి) వద్ద చూచిన ఒక సంఘటన అది ప్రభుత్వం అమరకాలు (రెవెన్యూ) వసూళ్ళు చేసే రోజులు కొంత మంది రైతులను వంగబెట్టి వాళ్ల వీపులపై రాళ్ళుపెట్టి యుంచారు. అదేదో వింతగా పిల్లలందరు చూస్తుంటే నేనుగూడా వెళ్ళినాను. రెవెన్యూ బకాయిపడి చెల్లించని రైతులను ఆ విధముగా వంగబెట్టి వీపులపై రాళ్ళుపెట్టి శిక్షించెడివారు. గిర్దావరు (R.I.) పెద్దగా అరుస్తూ తిడుతున్నాడు. ఇంతలో మాలీపటేలు అక్కడికి పిలిపించబడినాడు. R.I. ఏవో లెక్కలు అడుగుతు భయంతో సమాధానము చెప్పలేని మాలీపటేలును తనకన్న వయసులో పెద్దఅయిన వ్యక్తిని నోటికివచ్చిన మాటలు వ్రాయుటకు వీలుగానివి తిడుతూ కాలిబూటు తీసుకొని అతనిపైకి విసరివేసినాడు. ఆయనగారు అందకుండా దూరం జరిగి తలవంచుకొని మాటలన్ని భరించినాడు. అది చూచిన గ్రామస్తులందరూ ఎంతో భాదపడినారు. కరణంగారు అన్నట్లు ఉద్యోగం అంటే బానిసబ్రతుకుఅని ఆత్మాబిమానం చంపుకొని బ్రతకాలని తను జీవితంలో ఎప్పుడూ ఉద్యోగం చేయగూడదని నిర్ణయించుకొన్నాను. జీవితమున తనకెన్ని అవకాశములు కలిగి వచ్చినప్పట్టికి ఉద్యోగం మాత్రం చేయలేదు.

## నాటి ఆర్థిక సాంఘిక పరిస్థితులు

నా చిన్ననాటి ఆర్థిక పరిస్థితులు చాలా ఘోరంగా ఉండేవి. 85 శాతము ప్రజలు కూలీనాలి చేసి జీవించెడివారు. గ్రామమందు పది కుటుంబాలు మాత్రం కలిగిన కుటుంబాలు, మిగతా మధ్యతరగతి అంతా రైత్వారీ పద్దతి. కూలీచేసి జీవించెడి వారికి సంవత్సరములో ఐదారు నెలలు మాత్రం పని దొరికెది. ఐదు పది ఎకరాల రైతులు తమ భూమిలో పనిచేస్తు ఇతరులకు కూలికి వెళ్ళెడివారు. నాడు స్త్రీకి కూలి దినమంత పనిచేస్తే నాల్గు హోలీ పైసలు ఇచ్చేడివారు. పురుషునికి అయితే ఒక అణా, అనగా ఆరుపైసలు. భూమిలేనివారు భూస్వాములు వద్ద పాలేర్లుగా పనిచేసెడివారు. వారికి నెలకు 20 నుండి 25 కిలోల (అప్పటి శేర్లు) జొన్నలు ఇచ్చెడివారు. అందుకువారు రేయిపగలు పనిచేయాలి. అరవై శాతం ప్రజలు ఒకపూట తింటే ఇంకొక పూట సమస్యగా వుండేది. తమ మగపిల్లల్ని ఆరేడు సంవత్సరములు వచ్చిన వెంటనే పశువుల కాపరులుగా లేదా కలిగిన ఇండ్లలో పనికి నియమించెడి వారు. నాడు కుటుంబ

నియంత్రణ లేని కారణంగా సంతానం కూడా పరిమితమయ్యేడిది కాదు. ఆడపిల్లలను కూలినాలికి పంపించి వారి జీవనవమునకు కొంత సంపాదించుకొనుటకు ప్రయత్నించెడివారు. కుటుంబమందలి సభ్యులందరు పనిచేసినా పస్తులు తప్పెడివి కావు. ఒంటినిండ గుడ్డలు వుండేవి కావు. మరి ఆడపిల్లల పరిస్థితి ఘోరంగా వుండెడిది. ఇక చేతివృత్తుల వాళ్ళు తమతమ వృత్తిలో జీవించుట దుర్భరమే. అందువలన వారుకూడా వ్యవసాయ కూలీలుగా వెళ్ళెడివారు. వీరు ముఖ్యంగా చాకలి, మంగలి, కమ్మరి, వడ్డెర, ఎరుకల, గొల్ల, కురుమ మరియు తెనుగు, ముత్రాసీలు ఇతర వృత్తులలో సాలె, అగసాలె, కమ్మరి, వడ్రంగి వీరు పేదరికము అనుభవించిన వ్యవసాయ కూలీలుగా వెళ్ళుట అరుదు. వృత్తిపనుల వారికి కొలదిగా వ్యవసాయము ఉండి కుటుంబ పోషణకు సరిపోని స్థితిలో కూలినాలి చేయుట తప్పనిసరి. ఇక హరిజనుల విషయం మహాఘోరం. వారు వంతులవారిగా ప్రతిరోజు ఎనమండుగురు వెట్టిచాకిరి కొరకు చావడి వద్ద, గ్రామాధికారుల ఇండ్లలో పెద్దభూస్వాముల ఇండ్లలో ప్రభుత్వ ఉద్యోగులెవరు వచ్చిన పైసా ప్రతిఫలం లేకుండా వెట్టిచేయాలి. వెట్టికి వచ్చినవారిని అన్నం తిన్నావా అని ప్రశ్నించెడి నాధుడే లేడు. పని పురమాయించటములో మాత్రం పోటీలు. మా ఇంటికి రాలేదంటే మా ఇంటికి రావాలని వీరితో పాటు చాకలి, మంగలి, కమ్మరి వాండ్లు పైన పేర్కొనబడిన వారి ఇండ్లలో ఊడ్చిచల్లుట, బట్టలు ఉతుకుట, స్నానాలు చేయించుట పక్కలు వేయుట, తీయుట, దీపాలు ముట్టించుట, ఇంటివారు నిద్రకుపక్రమించు వరకు వుండి అనుమతిపొంది వెళ్ళుట జరిగెడిది. వారి మంచిచెడ్డలు ఆలోచించే నాధుడే లేడు. వెట్టికి వంతు వచ్చిన వ్యక్తికి అనారోగ్యం ఏర్పడి ఏదేని గ్రామము వెళ్ళిన లేదా ఇతర కారణాలపై రాలేకపోయిన తనవంతు ఇంకొక మనిషిని కూలి ఇచ్చి నియమించవలసి యుండెడిది. వారు 24 గంటలు అందుబాటులో వుండవలసి వచ్చెడిది. పైన పేర్కొనిన కుటుంబములువారు ఇతర గ్రామములు వెళ్ళవలసి వస్తే ఎడ్లబండితో పాటు వెళ్ళెడివారు. పరిగెత్తుకొని వెళ్ళవలసి వచ్చెడిది. ఇట్టి వెట్టిపనిని చేసెడివారిలో ఎవరేని సకాలమునకు రాలేకపోయిన చెప్పిన సకాలమునకు నిర్వహించకపోయిన నిర్దాక్షిణ్యంగా దెబ్బలు కొట్టెడివారు. వారు ఎవరికి చెప్పుకోలేదు. ఎందుకనగా గ్రామమును తన గుప్పిట్లో వుంచుకొని అధికారము నడుపువారు వారే అయినందున వెట్టివాళ్ళు దిక్కులేని పక్షులవలె అల్లాడిపోయెడివారు.

హరిజన స్త్రీలకు బట్టలు కూడా సరిగా ఉండెడివి కావు. రెండు మాస్కుల చీరెలు ధరించేవారు. అంటే సగం ఎర్రరంగు వుంటే సగం బ్లూది. ఒక చీరెతో వెళ్ళే స్త్రీలు నాకు తెలుసు. చెరువుకుపోయి సగం ఉతికి ఆరిపోయిన తరువాత తిప్పికట్టుకొనేది. సగం ఉతికి తరువాత స్నానం చేసి కట్టుకొని మా ఇంటిముందు నుండే పోయెడివారు. పెద్దగా బాధపడెడివారు కాదు. సిగ్గు కూడా పడెడివారు కాదు. సగం బట్ట కట్టుకొనే వుండెడివారు. బట్టలపైన అంటే పైసలు వుండేవిగావు. ఒక చీరెకు రూపాయిన్నర. ఒక ముదురురంగు వుండేవి. మా ఊరిలో వున్న పద్మశాలిలు పట్టుచీరెలు నేసెడివారు. ముతక బట్ఠలు నేసెడివారు కాదు.

గ్రామాధికారులు గాని దొరలు పెద్ద భూస్వాములు తమకంటే పెద్దవయసులో వున్న ఇతర కులస్థులను అరే తురే అని సంభోదించెడివారు. వారిముందు కాలిచెప్పులు కలిగి వుండి నడవటం అనేది నేరము. వారు కనిపించిన వెంటనే కాలిచెప్పులు చేతపట్టుకొని వంగి సలాముచేస్తూ వినయంగా వెళ్ళవలసి యుండెడిది. అట్లాకాక నిర్లక్ష్యంగా ఎవరేని వెళ్ళిన తమ వెంటవుండే సుంకరినో, సేవకున్నో అడిగి వాడెవడో తెలుసుకుని తమ ఇంటికి పిలిపించి బాగా హింసించి పంపెడివాళ్ళు. వారి ముందునుండి స్త్రీలు వెళ్లకపోయెడివారు. ఒకవేళ వెళ్ళవలసి వచ్చిన దూరంగా వినయవిధేయతలతో తలవంచుకొని వెళ్ళవలసి యుండెడిది. హరిజనాన్ని తిట్టే తిట్లకు అంతువుండెడిది కాదు. వారి మాటలు వ్రాయుట కష్టం. కొందరైతే మొదలు తిట్టుతోనే ప్రారంభించి మాట్లాడేవారు. అయితే ఇది అన్ని కులాల వారిపై కాకుండా కొందరికి మాత్రం మర్యాద చూపకపోయినా నీచముగా మాట్లాడేవారు కాదు. ముఖ్యంగా బ్రాహ్మణ, వైష్ణవ, వైశ్య, కమ్మరి, కంసాలి, కంచరి, గౌడ మున్నగువారికి మినహాయింపు వుండెడిది. కొన్నిచోట్ల ముస్లింలను మాత్రం మర్యాదగా మందలించుట వ్యవహరించుట చేసెడివారు. నాటి ప్రభుత్వము ముస్లింలదే. కావున నాటి ప్రభుత్వ ఉద్యోగులు వారే అయినందున వారితో మంచిగా వ్యవహరించెడివారు. అయినా తమ అధికారమునకు లోటులేని విధంగా వ్యవహరించుట ముఖ్యంగా చూచుకొనేడివారు. ఈ పెద్దకుటుంబములవారు ముస్లింల సంప్రదాయాను సారమైన బట్టలు ధరించుట రూమిటోపి (బొచ్చుకుల్ల) ధరించి ఉర్దూలో మాట్లాడుట నాడు గౌరవంగా తలిచెడివారు. ప్రభుత్వ ఉద్యోగులు నెత్తికి టోపి

కాసి రుమాలు కానీ లేకుండా పని చేసెడివారు. అలా ఎవరేని వ్యవహరించిన అట్టి వ్యక్తిని తమ ఎదురుగుండా లేకుండా పంపించెడివారు.

ఇక చదువు విషయానికివస్తే మహాఘోరం. హరిజనులను బడికి రానిచ్చెడివారు కాదు. హరిజనులు చదువుకొనుట మహా పాపమని ప్రచారము చేసెడివారు. అంటుముట్లు అనునది నాడు అధికము. ఒకొక్కప్పుడు హరిజనుడి నీడ పారితేనె స్నానం చేయాలనే మనస్తత్వం కలిగియుండెడివారు. కానీ వారు పండించే ధాన్యానికి అంటులేదు. వారిచే మోయించి తేబడిన కల్లు త్రాగుట తప్పుకాదు. హరిజనులు నూటికినూరుపాళ్ళు నిరక్షరాస్యులు వారిలో కృష్ణయను సంధి మాదిగలను వారు మాత్రం కొంత చదువు కలిగియుండెడివారు. ఎందుకనగా వారు వీధి భాగవతములను ఆడెడివారు. వారు ముఖ్యంగా హరిజనులనంటిపెట్టుకొని యుండెడివారు. ఇక మాలలు మాదిగలను అంటుకొనెడివారు కాదు. ఊరిబయట ఒకవైపు మాదిగల ఇండ్లు వుండే మరియొక వైపు మాలల ఇండ్లు వుండేవి. ఊరిచెరువు అందరూ వాడుకొనేవారు. కానీ మంచినీళ్ల బావులు మాత్రం వేరువేరుగా వుండేవి. సవర్ణ హిందువులందరూ ఒక బాయినుండి తెచ్చుకొనెడివారు. కాని మాల మాదిగలు మాత్రం ఒక బావినుండి కాక తమ తమ బావులనుండే తెచ్చుకొనెడివారు. నాడు కల్లు త్రాగుట సర్వసామాన్యము. బ్రాహ్మణ, వైశ్య, వైష్ణవ కుటుంబాలలో కొన్ని త్రాగకపోయెడివారు. మిగతా అన్ని కులములవారు త్రాగెడివారు. దొరలకు, పెద్దభూస్వాములకు ప్రత్యేకంగా తాడిచెట్లు వుండెడివి. తెల్లవారు వరకు గౌడులు ఆ తాళ్ళునెక్కి కల్లు కుండలతో తెచ్చి వారివారి ఇండ్లయందుంచెడివారు. ఎందుకనగా ఆ తాళ్ళు తమంతమం భూములలో వుండుట వలన గ్రామపెత్తందార్లగుట వలన అలా తెచ్చిపెట్టెడివారు. విపరీతంగా త్రాగి అల్లరిచేసెడి వారుకొందరు. నాడు పగలు 4-00 గంటల వేలకు తాళ్లలోనికి వెళ్లి తమముందు గౌడుతో చెట్టెక్కించి తీసిన కల్లును త్రాగుట ఒక అలవాటుగా వుండెడిది. అట్లు వెళ్ళి త్రాగుట గౌరవంగా భావించెడివారు. ఇతర మధ్యతరగతి కుటుంబముల వారు నెలవాడుక లేదా సంవత్సరపు వాడుక లేర్పరచుకొని త్రాగి వచ్చెడివారు. లేదా ఇంటికి తెప్పించుకొని త్రాగెడివారు. స్త్రీలు గూడా త్రాగెడివారు. పిల్లలచే త్రాగించుట సామాన్యము.

ఆ కాలమున పేదవారు తమ వంటచెరుకు తెచ్చుకోవాలన్న, పేడ లేదా పిడుకలు తెచ్చుకోవాలన్న వెల్లవలసినది భూస్వాములు భూములలోనే. అందువలన వారు పెట్టె ఆంక్షలను పాటించుట వారి వేసెడి (జుర్మానా) దండగ చెల్లించెడివారు. అంతేకాదు దొరలు తమ పొలములో పండిన పంటదాన్యము, మిర్చి, పొగాకు మరియు పప్పుదినుసులు నాడు మార్కెటు సౌకర్యము లేక రహదారి సరిగా లేని కారణంగా ఊరి ప్రజలకు గడ్డం అని పోసెడివారు. అనగా తమ పంటను మార్కెట్టుకు అమ్మకుండా వుంచి పెద్దరైతులకు మరియు హరిజనులకు తప్ప మిగతా అన్నికులాల వారిని పిలిపించి తమకు ఇష్టం వచ్చిన రేటుకు కుటుంబ సభ్యుల సంఖ్యను బట్టి యిచ్చెడివారు. సామాన్యంగా చైత్ర, వైశాఖ మాసములో పోసి తిరిగి దీపావళి వెళ్ళినంక అనగా డిసెంబర్ ప్రాంతములో వసూలు చేసెడివారు. చాటింపు వేయించిన వెంటనే కులాల వారిగా గడి అనగా దొరవారి ఇంటికివెళ్ళి వారుపోసే దాన్యం తెచ్చుకొవాలి. ఎవరేని రాక తప్పిన దొరవారు స్వయంగా అతని ఇంటికి పంపించి ఇంటివారు లేకున్న వారి ఇంటిముందు పెట్టి వచ్చి ఆతని పేర ఖర్చు వ్రాసెడివారు. ఆ కుటుంబం దానిని వాడకున్నా అది ఏమైనా వీరికి సంబంధం లేదు. కాని వసూలు మాత్రం చేసెడివారు. సహజంగా నాటి మార్కెటు రేటుకు 50 శాతం అధికంగా ధర నిర్ణయించి తక్కువ కొలతల కుంచముతో తక్కువ తూకం ఇచ్చెడివారు. ఇదేమని అడిగే నాధుడేలేడు. మాట్లాడినవాడు మరసటిరోజు కన్పించడు. వసూలు చేయటములో నిర్దాక్షిణ్యంగా చేసెడివారు. డబ్బులు సకాలమునకు చెల్లించవలెనని ఫలానా తేదీకి చెల్లించాలని చాటింపు వేయించెడివారు. వెళ్ళి చెల్లించని వారి ఇంటికి మనుషిని పంపి యజమానిని పిలిపించి కారణమడిగి అతని ఇంటి నుండి బిందె, చెంబు, తప్పెలా తెప్పించి డబ్బు చెల్లించిన పిదప యిస్తామని పంపెడివారు. అవి లేక మొండికేసిన వారి ఇల్లును స్వాధీనం చేసుకొనెడివారు. లేదా దెబ్బలు కొట్టెడివారు. అట్లు హింసించినా భరించెడివారు. ఎందుకనగా తెల్లవారి లేచింది మొదలు ఎటువెళ్ళాలన్నా, ఏమి తెచ్చుకోవాలన్నా, వాళ్ళ భూములగుండా జరగాలి. బట్టలు పిండుకోవటం వారి బావులే. ఇట్లన్ని విధముల వారిపై ఆధారపడవలసి వచ్చి ప్రజలు ప్రతి సంవత్సరం ఇదొక విధమైన పన్నువలె చెల్లించెడివారు.

ఇక ఆ కాలమునందు ప్రతి వస్తువు చవుకే. కాని డబ్బె దొరకదు. తన కుటుంబ పరిస్థితి తెలుపుతు కుటుంబ సభ్యులందరు కలసి పనిచేస్తే మూడు రోజులకు ఒక చీరె మొగ్గముపై తయారు అయ్యేడిది. ఆనాడు చేతి మొగ్గమె. అది ఇద్దరు కలిసి నేయవలసి వుంటుంది. ఒకరు ముఖ్యనేతవాడు అయితే ఇంకొకరు అంచఫట్టెడి వారు కావాలి. ఇంతచేస్తే చీరకు అర్థరూపాయి కూలి గిట్టుబాటు అయ్యేడిది. చీరె ఖరీదు రెండున్నర రూపాయలు వుండెడిది. ధాన్యం రెండు రూపాయలు బస్తా వడ్లు. అట్లే జొన్నలు. ఉప్పు పైసా శేరు. నూనె వీశె పావలా. ఒక రూపాయకి 76 పైసలు. నాటి నైజాం సిక్కా 16 అణాలు అణా ఆరు పైసలు. రెండు పైసలను సస్కాని అని, నాల్గు పైసలను కుచ్చమని, 12 పైసలను బేడా అని, 24 పైసలను పావలా అని, 48 పైసలను అర్ధరూపాయిగా, రెండర్ధలు రూపాయి లెక్కగా ఉండేడిది. పల్లెటూరి కొట్లలో పప్పులు, ఉప్పులు, నూనె, బెల్లం, పంచదార కొన్ని వస్తువులు మాత్రమే దొరికెడివి. పిల్లలు తినుటకు కొబ్బరి లేదా బెల్లం. నాడు చుట్టాలింటికి వెళ్ళునపుడు రెండు కుడుకలు కండువా కొంగున ముడివేసుకొని వెళ్ళెడివారు. కొట్లో పిల్లలకేదేని కొని ఇవ్వాలన్నా కొబ్బరి కుడుకలు బెల్లం మాత్రం దొరికెడిది. కొట్లలో సరుకులు కొనుటకు వచ్చే పేదలు ఒక పైసాకీ నాల్గు రకముల సామాను తీసుకువెల్లెడివారు. పైసాలో సగభాగమును ''ముడిక్యాల'' అని నాల్గువ వంతును ''దమ్మిడీ'' అని పిలిచెడివారు. నాడూ దినమంతా కూలీచేసిన ఆడకూలీకి నాల్గుపైసలు ఇచ్చేడివారు. పురుషునకు అణా లేక అణాన్నర గొప్ప. అయితే నాల్గుపైసలకు అర్ధశేరు బియ్యం లేదా ఒకశేరు జొన్నలు దొరికెడివి. ఆ కాలమున రైతులు, రైత్వారీ కూలీల వద్ద డబ్బులు ఉండకపోవుటచే తమవద్ద ఉన్న దాన్యమును కొట్లో అవసరమైనంతపోసి దానికి సరిపోవుపైసలతో సరుకులుకొని తెచ్చుకొనెడివారు. వస్తుమార్పిడి నాడు వ్యాపారమునకు పల్లెటూళ్ళలో ప్రముఖ పాత్ర. కూరగాయలు చాలావరకు తమతమ పెరళ్ళల్లో పండినవి మాత్రమే తినెడివారు. ఎక్కువ కూరగాయలు కోసినచో తమ బంధులకో, స్నేహితులకో, పాలివారికో, ఇరుగుపొరుగులకో పంపెడివారు. మాంసం చాలా చౌక, మేక ఖరీదు రెండు నుండి మూడు రూపాయలు ఉండెడిది. కోడి పావలా, గ్రుడ్డు ఒకపైసా కాని ఆపైసా దొరకటం కష్టం నాడు పేదవారు చొక్కాలు దినమంతా తొడగకపోయెడివారు. ఎటో ఊరికి వెళ్ళినా లేదా ఏ పండుగకో అద్దైనా ఒకచొక్కా ఉంటేగొప్ప. స్త్రీలకు మాత్రము

రవికెలు తప్పనిసరి. వానిని చేతికుట్టుతో కుట్టించుకొని తొడిగెడివారు. జత చిన్నపంచెలు అయిదు అణాలు, కండవ పావలా, దోవతుల జోడ సాదా 2 రూపాయలు. వడ్డెర స్త్రీలు అసలు రవికెలు ధరించకపోయెడివారు.

## మూఢాచారం - విశ్వాసం

నాకు చిన్ననాటి నుండి ప్రతి విషయాన్ని చూసి నమ్మాలని, మూఢాచారాలను నమ్మరాదనే భావన వుండెడిది. నేను కుందారం బడిలో చదువుచున్న కాలమున జోగురాజు పంతులుగారితో బాగా మిళితమై ఆయన వద్ద ఎన్నో విషయాలు తెలుసుకొనేవాడిని. పంతులుగారు తన జీవితమును గురించి తెలుపుతూ ఒక తడవ దయ్యంతో తానుపడిన ఇబ్బంది తెలిపినాడు. అదిట్లు సాగినది. ఒకరోజు పంతులుగారు మంచి వయసులో వున్నప్పుడు తెల్లవారు వరకు పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. దూరప్రయాణం కనుక మధ్యరాత్రి ఒంటరిగా పయనమైనాడు. తాను పై కండువ కాళ్ళకుచెప్పులు ధరించి వెళ్ళినాడట. అది నిండు పౌర్ణిమ. తెల్లని వెన్నెల భూమిపై పరచుకున్నట్లుగా ఉంది. వేసవికాలం నిశ్శబ్ద వాతావరణం ఒకగంట పయనం సాగించిన పిదప ( ఒక స్త్రీ తెల్లని చీర, రవికె కట్టుకున్నది) తనవెనుక ఎవరో వస్తున్న అనుభూతి కలిగి ఆగిచూసినాడు. అదికూడా కొంతదూరమున ఆగిపోయినది. పంతులుగారు దానిని మాటలోనికి దింపి ఏవేవో ప్రశ్నలు వేస్తాంటే ఏవేవో సమాధానాలు చెబుతూవస్తోంది. అయితే దానిని దగ్గరగా రానిచ్చి పరిశీలించి చూడాలియని ఉబలాటంతో ఆగుతూ ఆగుతూ నడుస్తున్నాడట. ఈయన గారు ఆగిన వెంటనే అదిగూడా ఆగుతోంది. నడక ప్రారంభించగానే అది కూడా నడుస్తోంది. అట్లొక గంట పయనం సాగించిన పిదప పెద్దగా గాలి వీచినదట. పంతులుగారు ఆగి వెనుకకు తిరిగి చూచినాడట. గాలికి కుచ్చెళ్ళు పైకి లేచినపుడు దాని పాదాలు వెనుకకు వున్నావట. పాదాలు దయ్యాలకు మాత్రమే వెనుకకు వుంటావని పెద్దలు చెప్పిన విషయం జ్ఞప్తికి వచ్చి ఇది దయ్యమని నిర్ణయించుకుని భయపడి ఆంజనేయ దండకం చదవడం ప్రారంభించినాడట. అపుడా దయ్యం రాజుగారిని తిట్టుతు నీ కండవా అంచున కట్టివున్న బొట్టుపెట్టెను క్రింద పడవేయమని నీ అంతు చూస్తానని గట్టిగా అరిచినదట. ఈయనగారు భయంతో ఆంజనేయ దండకమును గట్టిగా

చదువుతు పరుగులాంటి నడకతో పయనం సాగించినాడట. అట్లు కొంతదూరం నడిచిన పిదప గ్రామ పొలిమేర చేరుకున్న వెంటనే ఆ దయ్యం ఆగిపోయి నీవు మళ్ళీ రాత్రిపూట ఈ దారికి వచ్చినపుడు నీ సంగతి చూస్తానని మాయమైనదట. ఈ కథచెప్పి నా కండువ కొంగులో కట్టుకున్న బొట్టుపెట్టెయందు తిరుమణి చూర్ణం వున్నందున దయ్యం తనను అంటుకోలేక పోయినదని తను ఆంజనేయ దండకం చదివిన పిదప అది భయపడిపోయినదని చెప్పినాడు. అయితే ఇందెంత వరకు వాస్తవమున్నదో పరిశీలించాలని నాడె భావించి అవకాశం కొరకు కాచుకున్నాను. 13వ వయసులో ఒక అవకాశం కలిసివచ్చింది. కుందారం గ్రామ పడమరవేపు ఒక చింతలతోపు వున్నది. దానియందు రెండువందల చింతచెట్లు వున్నవి. అవి ఏనాట పెట్టబడినవో కాని బాగా పెరిగి గుబురుగా వుండెడివి. మొదట అవి అయిదారు వందలు వుండిడెవి. రానురాను కొన్ని చెట్లు నరికివేసి కొంత భూమి సాగుకు తెచ్చి ఆ తోపుమధ్య బొందలగడ్డ అనగా పూర్వులు వాడిన స్మశానవాటిక వుండెడిది.

ఆ స్మశానవాటిక ఎత్తైన స్థలమునందు చింతచెట్లలో వుండెడిది. మా పెద్దన్న నరహరిగారు బట్టల బేరం చేస్తు ఒక వ్యక్తివద్దకు తనకు రావలసిన బాకీక్రింద ఆ వ్యక్తివేసిన వేరుశెనగ చేలును గుత్తకు తీసుకున్నాడు. అది కోతకు వచ్చిన పిదప తీసుకున్నందున నక్కలు ఇతర జంతువులు వచ్చి త్రవ్వి తినకుండా రేత్రిళ్ళు కాపలా యుండెడివాడు. అయితే అచట ఇంకా ముగ్గురు నలుగురు తమ చేను కాపలగా వచ్చెడివారు. నాకు మా మూడవ అన్న అయిన వైకుంఠంగారితో కల్సివెళ్ళి రాత్రి కాపలాకాసి తెల్లవారి తిరిగి వచ్చెడివాడిని. అయితే తన చిన్ననాట జోగురాజు పంతులుగారు చెప్పిన దయ్యం గురించి బాగా పరిశీలించి దాని అంతు చూడాలని రేత్రి ఒంటిగంట ప్రాంతంలో మెల్కొని అటు దయ్యాల గడ్డ దిక్కు చూస్తు కూర్చునేవాడిని. ఎందుకనగా ఆ గడ్డపై వున్న చింతచెట్లను దయ్యాల చింతచెట్లని ఎవరు వాటి వద్దకు వెళ్ళుటకు భయపడేవారు. ఈ చెట్లపై దయ్యాలు తప్పకుండా వుంటావని వానిని చూడాలని కాపువేసి ఒక నెలరోజులు వున్నాను. ఒక్కొక్కరొజు మా అన్న ఎవరురాకున్నా చేతియందొక కర్ర తీసుకొని వంటరిగా వెళ్ళి కాపలా వుండెడివాడిని. కాని నాకు ఎన్నడు ఏ విధమైన దయ్యాలు కన్పించలేదు. జోగురాజుగారు చెప్పినది కట్టుకథయని నిర్ధారించుకున్నాను. గ్రామంలోని

కొందరు వృద్ధులు ఇలాంటి కథలు చెపుతారని అది యెవరో మొదట కల్పించిచెపితే అది తనకే జరిగినట్లుగా చెపుతారని తెలిపోయినది. నాకు గుడ్డిగా నమ్మటయనునది గిట్టకపోయెడిది. ఇవన్ని అభూతకల్పనలని అమాయకులైన పల్లె ప్రజలను తమ స్వార్థప్రయోజనాలకు వినియోగించుకొనుటకు ఏర్పరచిన విషయాలు మంత్రాలు, తాయెత్తుల గట్టించుకొనుట నాడు అధికము. జ్వరము వస్తే మంత్రించి విభూతి పెట్టెడివారు. ఎంత పెద్దజబ్బువచ్చినా తాయెత్తుకట్టిస్తే తగ్గిపోతుందని, పోశమ్మ, మైసమ్మ, మారెమ్మ మున్నగు గ్రామ దేవతలకు మొక్కుకుని ముడుపులు కట్టుట, కోళ్ళు, గొర్లనుకోసి బలియిచ్చుట చేసెడివారు. ఇది హేయమైనదని అట్లు చేయరాదు అను భావన నాకు చిన్ననాడె వున్నది. అయితే అది కానిపని అని చెబితె నా మాటలను కాతరుచేయక గేళిచెసెడివారు. అందువలన నాలోనే బాధపడేవాడిని.

## సోలాపూర్ - బ్రతుకుదెరువు

నా 15వ యేట 1940వ సంవత్సరములో సోలాపురం కుటుంబంతో పాటు (సోలాపురం) వెళ్ళిపోయినాను. మా తండ్రి లచ్చయ్యగారు ఇచట కుటుంబపోషణ భారమై మొత్తం కుటుంబాన్ని సోలాపురం రప్పించుకున్నాడు. ఆయనగారు తఱచుగా సోలాపురం వెళ్ళి అక్కడ మొగ్గముపై గుడ్డలు నేసి సంపాదించుకుని వచ్చుచు పోవుచు వుండెడివారు. కాని కుటుంబం పెరిగి ఖర్చులు పెరిగి ఖర్చులకు తగిన పని దొకకక దొరికిన పనికి సరియైన ఆదాయము లేక వెళ్లిపోయినారు.

మొదటి సంతానం కుమార్తె రంగమ్మ పెళ్లయి అత్తగారింట్లో వుంది.
రెండవ సంతానం కుమారుడు నరహరి
మూడవ సంతానం కుమారుడు రంగయ్య
నాల్గవ సంతానం కుమారుడు వైకుంఠం
ఐదవ సంతానం కుమారుడు వేంకటనారాయణ
(తర్వాత సోలాపురంలో షార్టుగా నారాయణయని పిలిచినారు.)
ఆరవ సంతానం కుమారుడు విష్ణు
ఏడవ సంతానం కుమార్తె సత్యవతి

వీళ్ళు ఆనాటికి కలిగియున్న సంతానం. ఇద్దరో ముగ్గురో సంతానం చిన్నతనములోనే మరణించినారు. వున్నవారిలో రంగమ్మకు, నరహరికి రంగయ్యకు అప్పటికే పెళ్లిళ్లయినవి. రంగమ్మకు సంతానం లేదు. నరహరికి ఒక కుమారుడు. వీరంతా సోలాపురం వెళ్ళిపోయినపుడు నరహరిగారు కుందారంలోనే వుండిపోయినాడు. ఆయనగారు అప్పటివరకె ఏవో బట్టల బేరం చేసెడివాడు. స్వతంత్రంగా జీవించగలను అను ధీమా కలిగియున్న వ్యక్తి. అందువలన అతడు వెళ్లలేదు. తండ్రిగారు మొదట మూడవ నాల్గవ కుమారులగు రంయ్యను, వైకుంఠమును, రంగయ్య భార్యను వెంటబెట్టుకుని సోలాపురం వెళ్లిపోయినారు. అచట కూలికి నేయుట కన్న స్వంతంగా మొగ్గాలు ఏర్పరచుకుని చీరెలు నేసి అమ్ముకొనిన చీరెకు అర్ధరూపాయి ఎక్కువగా గిట్టుబాటు అవుతుందని ఇచటి నుండి వెళ్ళినవారు కొందరు ఇండ్లు అద్దెకు తీసుకుని స్వంతంగా మొగ్గాలుపెట్టి కూలీలచేత నేయించి అమ్ముకునెడి వారు. నాన్నగారు కూడా సంవత్సరమునకు 120/- రూపాయల అద్దెకు నాల్గు మొగ్గాలు పెట్టుకొనుటకు వీలగు ఇల్లును అద్దెకు తీసుకుని మొగ్గాలు ఏర్పరచి అవసరమగు నూలు ఇత్యాదులు తెచ్చి తను మరియు తన ఇద్దరు కుమారులు ఇంకొక కూలి అతనిని ఏర్పరచుకొని నడిపిస్తు వుండినాడు. అచట మొగ్గాలు పెట్టిన వారికి అవసరమగు నూలు డబ్బు పెట్టుబడిపెట్టి మొగ్గాలపై తయారైన చీరెలను మార్కెటు ధరకు తీసుకునే వ్యాపారస్తులు చీరెల షాపులు పెట్టుకుని నడిపించెడివారు.

నాన్నగారట్లు ఒక స్థిరత్వమునకు వచ్చి అమ్మను, ముగ్గురు పిల్లలను దేశమునుండి (కుందారం) సోలాపురం పిలిపించుకున్నాడు. నాడు (Train) ట్రెయిన్ ప్రయాణం ఒకటిన్నర దినము పట్టెడిది. నిజాం సరిహద్దు వరకు నిజాం రైలు పిదప బ్రిటీష్ ప్రభుత్వపు రైలు. నాడన్ని బొగ్గుతో నడిచే రైళ్ళే. నేను మార్చి 1940లో మొట్టమొదట సోలాపురంలో అడుగు పెట్టినాను. అచటికి వెళ్ళిన పిదప గ్రామ వాతావరణమునకు మరియు సోలాపురం టౌను వాతావరణముకు గల వ్యత్యాసము ఆసక్తికరముగా వుండెడివి. నాడు అచట ప్రతి వస్తువు చాల చౌక. గ్రామములో లభించని ఎన్నో వస్తువులు అచట ధర తక్కువకే లభించెడివి. హోటల్‌లో ఒక పైసకు ప్లేటు బజ్జీలు, ఒక పైసకు కప్పు చాయ నాడు భార్యభర్త ఇద్దరు వున్న నేతకాడు ఇతర వసతిలేని నేతగాళ్లకు భోజనం

వండిపెట్టేడివారు. అట్లు పెట్టె భోజనమునకు వారమునకు అనగా 7 రోజులకు 6 అణాలు తీసుకునేడివారు. ఇంట్లొక ముగ్గురు నల్గురికి భోజనముపెట్టిన దంపతులకు తమ భోజనం ఖర్చు కలిసి వచ్చెడిదట. అనగా నాడు ఎంత చౌకో వూహించవచ్చు. మహారాష్ట్రలో రొట్టెలు ఎక్కువగా తింటారు. పెదవారెక్కువగా జొన్నరొట్టెలు తినెడివారు. నాడు ఒక రూపాయికి 16 సోళ్ళ జొన్నలు వచ్చెడివి. సోల అన్న ఇప్పటి ఒకటిన్నర కిలోలకు సమానము. బియ్యం ఒక రూపాయికి 6 సోళ్ళు అనగా 9 కిలొలకు సమానము. కూరగాయలు పైసకు సవ్వాశేరు. అంటే ఇప్పటి 370 గ్రాములకు సమానము. ఈ విధముగా ప్రతి వస్తువు అగ్గువ వున్నప్పటికి కూలివారమంత పనిచేస్తె రెండు లేక రెండున్నర రూపాయలు వచ్చెడివి. దీనితో అతడు బ్రతకాలి భార్యపిల్లలు దేశంలో వున్నట్లు అవుతె వారికి పంపాలి. లేదా అప్పుచేసి పంపిన ప్రతివారం బాకీ కొంత మినహాయించుకునేవారు. నాడు మొగ్గాలు పెట్టెనడిపించే వారిని ''ధని''యని, చీరెలు ఖరీదుచేసి అవసరమగు పెట్టుబడి ధనులకు ఇచ్చేవారిని ''సాహుకారి'' అని పిలిచెడివారు. ఒక్కొక్క సాహుకారి 10 నుండి 30 ధనులకు అవసరమైన పెట్టుబడులు సమకూర్చి ప్రతివారం చెల్లుపెట్టుకునేవారు. నేతకాండ్లు వారంలో 6 రోజులు పనిచేస్తే బుధవారం సెలవు వుండెడిది. ఆ దినం ''బుధవారం అంగడి'' జరిగెడిది. దానిలో అవసరమైన సరుకులు వారమునకు సరిపోవునవి తెచ్చుకొనెడివారు. ఆరురోజులలొ తయారైన చీరెలను ధని సాహుకారికి అందచేసి లెక్కచేసుకుని బాకీ తేల్చుకుని వచ్చె వారమునకు అవసరమగు నూలు డబ్బుతెచ్చి పగలు నేతకాండ్రకు ఇచ్చెడివారు. డబ్బులు అందిన పిదప అవసరమైన సామాగ్రి తెచ్చుకొనెడివారు. స్నేహితులో, చుట్టాలో, పాలివారో ఎవరో ఒకరి ఇంటికివెళ్ళి వచ్చెడివారు. కొందరు కల్లు అడ్డలకు వెళ్ళి త్రాగివచ్చెడివారు. వారమునకు ఈ ఒక్కరోజే సెలవు కావున వీలైనంత సంతోషంగా గడుపుకొనేవారు. ఇది స్థూలంగా సోలాపురం వెళ్ళుట నాటికియున్న పరిస్థితి. మొత్తంపై బావిలో కప్పగా గడిపిన పల్లెటూరును విడిచి జీవితమునందు మార్పుతెచ్చే పరిస్థితి ఏర్పడినది.

నేను సోలాపురం చేరిన పిదప మా తండ్రిగారికి చదువు విషయమై పునరాలొచన కల్గినది. తన కుమారులందరిలో నేను తెలివిగలవాడనని, పట్టుదలతో ఏ పనినైనా చేయగల తెలివితేటలున్నాయని బాగా చదివించి గొప్ప

ఉద్యోగిని చేయాలని సంకల్పం. అందువలన చదువు చెప్పించుటకు అచటి స్కూల్లకు పంపాలని ఆలోచించినపుడు, అక్కడ మరాఠి మీడియం. నాకు తెలుగు, ఉర్దూ కొంత ఇంగ్లీషు వచ్చును కాని మరాఠి రాదు. అందువలన స్కూలుకు పంపవలయునన్న మళ్ళి మరాఠి బాలశిక్ష నుండి ప్రారంభించాలి అది సాధ్యం కాదు. ఎందుకనగా వయసు 14 సంవత్సరములు. ఇతర భాషలతో మంచి పరిచయమే వుంది. కావున ప్రయివేటుగా మరాఠి నేర్పించిన తర్వాత చూచుకోవచ్చుననే ఆలోచనతో అదే వీధియందు ప్రయివేటు పాఠశాల నడిపిస్తున్న ముస్లిం ఉపాధ్యాయునికి పరిచయం చేసి చదువు చెప్పుటకు ఏర్పాటు చేసినాడు. ఐతే ఆ ఉపాధ్యాయునికి తెలుగు రాదు. కొంత హిందీలో మాట్లాడగలడు. ఉర్దూ మాతృభాష అయినా అదిగూడ సరిగా వుండదు. అప్పటికే నేను ఉర్దూ ఆరవ తరగతి చదివితినని తెల్పినపుడు నాతో ఉర్దూ నేర్చుకొనుటకు సిద్ధపడినాడు. మేము అట్లు పరస్పరం నేర్చుకోవటమైనది. మరాఠి భాష ఒకటియైనా లిపులు రెండు. ఒకటి సాదా, రెండవది మోడీయని పుస్తకములో ప్రింటుచేసింది. ఇది మామూలుగా పుస్తకములో అచ్చువేస్తారు. మొదలు ఇదే నేర్పిస్తారు. తర్వాత మోడీ. ఇది లెక్కలు వ్రాయుటకు. ఈ మోడీ లిపిని ముఖ్యముగా వ్యాపారస్తులు ఉపయోగిస్తుంటారు. అపుడు నేను రెండు లిపులను నేర్చుకొని అభ్యాసము సాగించినాను. ఐదారు నెలలలోనే మరాఠిలో ధారాళంగా మాట్లాడటం చదవటం నేర్చుకున్నాను. ''సాముకు లేత చదువుకు ముదురు'' అను సామెత నాపట్ల నిజమైనది. అట్లు సాగిన చదువు పదినెలలకన్న ఎక్కువ జరుగలేదు. నేనెప్పుడు నా చొక్కాజేబులో నోటుబుక్కు పెన్సిల్ ఉంచుకొనెడివాణ్ణి. ఏవేని నాకు నచ్చిన అంశమును లేదా బొమ్మను నోటుబుక్కులో దించెడివాణ్ణి. నా స్నేహితులకు చూపించి సంతసించెడివాడిని. మా ఇంటిప్రక్కయున్న ఒక స్నేహితుడు నా నోటుబుక్కు నందున్న బొమ్మలను చూచిన పిదప నీవు ఒక ఫోటో స్టూడియోలో పనిచేయుట మంచిది. దాని ద్వారా మంచిపనిమంతుడవగుటకు అవకాశముందని ప్రోత్సహించినాడు. ఎందుకనగా ఆయన ఇదివరలో మహాత్మా ఫోటోస్టూడియోలో 3 సంవత్సరములు పనిచేసి కొంతపని నేర్చుకున్నాడట. పైగా ఆ స్టూడియో యజమాని ''శరణప్ప'' అనునతడు మంచివాడని అతనివద్ద పని నేర్చుకొనిన నీవు రాణించగలవని చెప్పినాడు. నేనందుకు సమ్మతించి అతనిని వెంటబెట్టుకొని శరణప్పగారి స్టూడియోకు వెళ్ళినాము. మిత్రుని ద్వారా పరిచయముగావింపబడి

పని నేర్చుకొనుటకు వచ్చినట్లుగా తెలిపినాడు. కాని ఆయన మొదట వొప్పుకొనలేదు. ఈ కాలపు పిల్లలను నమ్మేందుకు వీలులేదు. ఏమేని దొంగతనం చేసిన బాధ్యులెవరని ప్రశ్నించినాడట. అందుకాయన వీరు కిరాయకున్న ఇంటి యజమానితో జామీను ఇప్పించగలనని తనవద్ద నోటుబుక్కులో వున్న బొమ్మలను చూసిన పిదప సరేనన్నాడట. కాని ఆరునెలల వరకు వేతనమివ్వను ఈలోగా నీ నడవడి బాగుండి నీ పనిని పరిశీలించి వేతనం ఏర్పాటుచేస్తాను ఇష్టమైతే రమ్మన్నాడు.

## నా గురువు - స్టూడియో

ఇంటికివచ్చి తండ్రిగారితో విషయం తెలిపి రేపటి నుండి స్టూడియోకు వెళతానన్నప్పుడు తండ్రిగారు స్టూడియోలో పని నేర్చుకొని నీవేమి చేస్తావు. అది మనకెందుకు ఉపయోగపడదు. అదేపని ఇక్కడ ఏ షావుకారి (బట్టల వ్యాపారి) కొట్లో పనిచేసిన వ్యాపారపు మెళకువళు నేర్చుకొనిన మున్ముందు బాగుపడుటకు అవకాశముండును. కావున వలదన్నాడు. ఆయనగారి కోర్కె గొప్ప ఉద్యోగస్తుని చేయాలని వున్నట్టిది ఎటుకాకుండాపోతుంది. కనీసం వ్యాపారములో నన్నుపెట్టిన నేను రాణించగలడను నమ్మకం వుండెడిది. కాని చిన్ననాటినుండి తను అనుకున్నది చేయాలని ఉద్దేశించినది సాధించాలను పట్టుదలతో వున్నవాణ్ణి. కావున తండ్రి మరియు అన్నలు చెప్పిన మాటలను పెడచెవిన బెట్టివెళ్లి మహాత్మా ఫోటోస్టూడియోలో చేరినాను. పనిలో చేరిన పిదప ఇంటిలో అంతకుపూర్వం సాలెపనియందు కొంత తొడ్పడెడివాడిని. కాని ఇప్పుడవకాశము లేదు. ఉదయం 8 గంటలకే స్టూడియోకు వెళ్ళి పగలు ఒకగంట భోజనమునకు వచ్చివెళ్ళి తిరిగి రాత్రి 8 గంటలకు ఇంటికి వచ్చెడివాడిని. ఇది నా దినచర్య అయినది. నేను ఏ వుద్దేశ్యంతొ స్టూడియోలో ప్రవేశించినానో అది సాధించుటకు పూనుకున్నాను. ఇక నా గురువుగారగు శరణప్ప గురించి కొంతచెప్పాలి. ఆయనగారు కర్నాటక పద్మశాలియని గుల్బర్గా దగ్గర భీమనహాళ్ళి. మహారాష్ట్రులో తమ ఇంటిపేరును తమ గ్రామ పేరునకు ''కర్'' అని చేరి చెప్పుకుంటారు. అందువలన ఆయన భీమనహాళ్ళికర్ శరణప్పయని చెప్పుకొనెడివాడు. మంచి మాటకారి. స్ఫురద్రూపి. ఆర్యమతానుయాయి ప్రతినిత్యం (పరిశ్రమ) వ్యాయామం చెసెడివాడు. మంచి శరీర పుష్టికలిగి

సౌమ్యుడుగా కనిపించెడివాడు. ఆ కాలమున ఆయన మంచి ఫోటోగ్రాఫర్‌గా పేరుపొందిన వ్యక్తి. ఆయనను నేను బావూజీ అనగా ''బావగారు'' అని పిల్చెడివాడిని. బావూజీ అనునది మరాఠీ పదము. అతని భార్యను అక్కా అని పిలిచెడివాణ్ణి. ఆయనగారికి ఒక కొడుకు, ఆయనకు ఈ భార్య మూడవ కళత్రం. ఈ అమ్మాయి సోలాపురం తెలుగింటి ఆడపడుచు. ఆయనగారికి 40 సం॥లు, వుంటే ఆమెకు 20 సం॥లు వయసు కలిగియుండెను. పెండ్లయిన పిదప భార్యకు కన్నడ మాట్లాడుట నేర్పినాడట. వారు ఇంటియందు కన్నడిలోనే మాట్లాడుకొనెడివారు. నేను కూడా కొన్నాళ్ళలో కన్నడిభాషలో మాట్లాడుట నేర్చుకొని వారితో కన్నడిలోనే మాట్లాడెడివాడిని.

ఈ శరణప్పగారి వద్ద శిష్యుడిగా చేరుటచే జీవిత ఆశయమునకు సరియైన దారి దొరికినది. నా మనోభీష్టం నెరవేరినది. నాలో యున్నట్టి కళాత్మతకు సరియైన దారి ఏర్పడినది. అదికూడా సరియైన వయసులో లభించినది. అది నా అదృష్టం. ఎందుకనగా శరణప్పగారు మంచి కళాకారుడు, ఫోటోగ్రఫి ఆయనగారికి సైడు బిజినెస్. ఆయన చక్కని పేయింటింగ్స్ చేసేడివాడు. నాడు షావుకార్లు తమ షాపులలో నిలవెత్తు దేవతల పేయింటింగ్స్ వెయించెడివారు. అవి వాటర్ పేయింట్స్ లేక ఆయిల్ పేయింట్స్ వారివారి మతానుసారముగా దేవతల రూపాలు చిత్రించుట సామాన్యము. అవియేగాక చక్కని పర్దాలు, నాటకముల వారికి భిన్నభిన్న దృశ్యములతో చిత్రించెడివాడు. ఇక చిన్నచిన్న పేయింటింగ్స్ ఒక అడుగు నుండి నాలుగు అడుగుల ఎత్తులవి చిత్రించి యిచ్చెడివాడు. ఫోటోగ్రఫి విషయానికి వస్తే చాలా చక్కని ఎక్స్‌పోజింగ్ తీసేవాడు. నాటి ఫోటోగ్రఫి సూర్యరశ్మిపై ఆదారపడియుండెడిది. అప్పటికి ఇంకా ఫోటో పిల్మలు మార్కెటులో పెద్దగా ప్రచారమునందుకోలేదు. గ్లాసు ప్లేట్లు మాత్రం ఎక్కువగా ఉపయోగమునందు వున్నవి. గ్లాసుపై ఒకవిధమైన పూత ఏర్పరచియుండెడిది. దానికి 1-2 లేక ఒక సెకండు సమయం ఫోటో తీయుటకు అవసరపడెడిది. అందుకవసరమైన వెలుతురు ప్రయాసకరమైన పద్ధతులలో ఏర్పరచి ఫోటో తీసెడివారు. ఇప్పుడు 1/120 సెకండ్స్ ఫోటోకు అవసరము. నాడు అట్లుకాదు. ఫోటో తీసెడివారు తక్కువ. దినమునకు ఒకటి రెండు ఎక్స్‌పోజింగ్‌లు జరిగెడివి. నేను ప్రవేశించువరకు స్టూడియోలో ముగ్గురు పనివాండ్లుండిరి. ఒకతను కొంత పనివచ్చి వేతనముపై పనిచేసెడివాడు. ఇంకా

యిద్దరు పని నేర్చుకొనుటకు వేతనము లేకుండా చేసెడివారు. నేను కొన్నాళ్ళు పనిని పరిశీలించుటతోనే గడిపినాను. మొదట్లువారు నాకు పనిసరిగ చెప్పెడివారుకాదు. ఎందుకనగా పని మంచిగా నేర్చుకొనిన పిదప వెళ్ళిపోయి వేరే స్టూడియోలు పెట్టుకుంటారని మెళకువలు నేర్పకపోయెడివారు. ఫోటో ఎక్స్‌పోజింగ్ కొంత అనుభవం సంపాదించుకొన్న పిదప డార్కు రూం దిక్కు దృష్టి మరల్చినాను. డార్కురూంలోకి నాకు ప్రవేశము లేదు. ఫోటో తీసిన పిదప ఫిల్మును కడుగుట దానినుండి ప్రింటుతీయుట, ఎన్‌లార్జింగ్ అనగా పెద్దగా ప్రింటు తీయుట మున్నగు పనులన్ని దానిలోనే జరిగెడివి. అప్పుడు రెడ్‌లైట్‌ను ఉపయోగించి పనిచేసేవారు. ఆ డార్కురూంలొ పని నేర్చుకొవాలని నా పట్టుదల. కాని నాకు ప్రవేశము లేదు. ఒక ఉపాయము ఆలోచించి డార్కురూం ఏర్పరచిన పలుచని చెక్కకు ఒక చిన్న రంధ్రం చేసినాను. తీరిక వేళల్లో ఆ రంధ్రంగుండా దానియందు ఫిల్ములనేవిధంగా రసాయనముల సమ్మేళమునందు కడిగెడిది, దానిని ఏ విధంగా ఆరబెట్టినది మరియు ప్రింట్లు తీయు విధము ఎన్‌లార్జ్ చేసెడి విధము దానికి ఎంతెంత సమయము తీసుకొను దానిని పరిశీలించెడివాడిని. ప్రింట్లు సిద్ధమైన పిదప ఆరబెట్టుటకు తీసుకవచ్చినప్పుడు పరిశీలన చేసెడివాణ్ణి. ఈ విధంగా పరోక్షముగా ఉన్నట్లే వుండి ప్రత్యక్షముగా చూచి నేర్చుకున్నట్లయినది. నేను పనిలో చేరిన కొంతకాలమునకు డార్కురూంలో పనిచేసెడి కుర్రవాడు పనికి వచ్చుట మానుకున్నాడు. ఎందుకనగా అతని చేతివేళ్ళు కెమికల్స్ అంటుకొని రంగుతో యుండెడివి. ఫిల్మును కడిగినా, ప్రింట్లను కెమికల్స్‌లో ముంచి అవసరమైన పద్ధతిలో వానిని కదిలించాలి, ఆ కదిలించి ముంచుట అతను ఇతర పరికరములతో కాక చేతితో చేసెడివాడు. కొంతమందికి కెమికల్స్ పడక పుండ్లు పడుట సంభవిస్తుంది. వాని నివారణకు పరిశుభ్రత పాటించుట చేతితో ముంచుటకు చిమ్మటలాంటి పరికరములు వాడవలెను. అదిచేయక అతని చేతులు వ్రేళ్లకు పుండ్లు ఏర్పడి మానుకున్నాడు. ఆ వారములోనే పనినేర్చుకొనుటకై వస్తున్న ఇద్దరు అబ్బాయిలు కూడా స్టూడియోకు రావటము మానుకున్నారు.

ఇట్లందరు పనిచేయువారు మానుకొనుటచే స్టూడియోలో పని ఆగిపోయే పరిస్థితి ఏర్పడినది. ఒకరోజు నన్ను పిలిచి శరణప్ప డార్కురూంలొ పనిచేయగలవా అని ప్రశ్నించిరి. ఎందుకనగా ఇంతవరకు నాకు డార్కురూం

ప్రవేశమునకు అనుమతించకపోవుటచే కలిగిన ఇబ్బందిని దృష్టియందుంచుకొని ప్రశ్నించినారు. ఆ మాటకు నేను వినయముగా చేస్తానన్నాను. అపుడు ఒక ప్లేటు ఇచ్చి దీసిసి డెవలప్‌చేసి తెమ్మన్నారు. వెంటనే దానిని తీసుకొని డార్క్-రూంలో ప్రవేశించి డెవలప్‌చేసి తెచ్చిచూపినాను. దానిని చూచి ఇది నీవేల చేయగలిగినావని ప్రశ్నించగా నేను ఇదివరలో చిన్నరంధ్రము చేసి దానినుండి పరిశీలించిన అనుభవముతో చేయగలిగితినని నేను చేసిన రంధ్రమును చూపించినాను. గురువుగారు నా శ్రద్ధకు పనిపై నాకున్న పట్టుదలకు సంతోషించి మెచ్చుకున్నారు. నాటినుండి డార్క్-రూం బాధ్యత అప్పగించినాడు. పనియందు ఎటువంటి లోటుపాటు రానియకుండా ప్లేటును డెవలప్‌చేయుట, ప్రింట్లు తీయుట, ఎన్‌లార్జ్‌చేయుట మున్నగు పనులు చేయుచూ అవసరమైన సలహాలు గురువుగారి నుండి నేర్చుకొన్నాను. స్టూడియో పనియేగాక పేయింటింగ్‌చేయుటయందలి మెళకువలపై మనసుపెట్టి మొదట ఎలా స్కెచ్‌వేయాలి, రంగులు ఎలా వేయాలి వెలుతురు ఏ భాగమున ప్రసరించినట్లు చూపాలి. ఆకారము తీర్చిదిద్దుటలో ఏఏ పద్ధతులు శాస్త్రీయంగా అవలంభించాలో నేర్చుకున్నాను. చిన్ననాటి నుండి నేర్వదలచినవాడనగుటచే వానినన్నింటిని ఆకళింపు చేసుకున్నాను. నేను ఇదివరలో ఎన్నో చిత్రపటములను వ్రాసియుంటిని కదా. వానియందలి లోటుపాట్లను తెలుసుకున్నాను. ఇవన్నీ స్టూడియోలో చేసెడి పనులు పేయింటింగ్‌కు రంగులు ఎలా కలుపాలి, బ్రష్‌లను ఉపయోగించుటలో అనుసరించవలసిన పద్ధతి నాకిదివరలో యున్న అనుభవమునకు వన్నెపెట్టినట్లు అయినది. ఈ పనులయందు నాకు తృప్తి కలిగిన పిదప బయటకు గురువుగారితో వెళ్ళి ఫోటోలు తీయుట, గోడలపై చిత్రాలు గీయుట వానిలో రంగులువేయుట అవి చాలావరకు వాటర్ పేయింట్‌వి ఉండెడివి. కొన్ని ఆయిల్ పేయింట్‌వి వుండెడివి. మొదట గురువుగారితో పాటు వెళ్ళి అతనికి రంగులు కలిపియిచ్చుట అతనువేసే బొమ్మలను పరిశీలించుట చేసెడివాడిని. ఫోటోలు తీయునపుడు వెలుతురు ఎటుగుండా వుండాలి, అది ఎంత అవసరము అను అంశాలను నేర్చుకున్నాను. నాడు డబ్బా కెమెరాలు మాత్రమే వాడుకలో యుండెడివి. స్టాండు మున్నగు పరికరములను అమర్చుట, వ్యక్తులను వెలుతురుకు అనుగుణ్యాంగా కూర్చోబెట్టుట, లేదా నిలబెట్టుట మొదట పరిశీలించి అనుభవము వచ్చిన పిదప నేను స్వయంగా చేసి ఫోటో తీయుటకు గురువుగారికి తగిన ఏర్పాట్లు చేసెడివాడిని. ఇట్లు కొలదికాలములోనే ప్రతి అంశమును గురువుగారి మెప్పు అందుకొని పనిమంతుడే కాదు కళాకారుడివి అని అనిపించుకున్నాను.

శరణప్పగారి వద్ద పనినేర్చినపుడు జరిగిన కొన్ని సంఘటనలు. ఒకరోజు గురువుగారొక స్త్రీ చిత్రము గీయాలి. ఆమె ఒక చీరెను పరిశీలిస్తున్నట్లుండాలి. అది ఒక వ్యాపారి తమ కొట్టుముందు పెట్టుకొనుటకు చిత్రించి ఇచ్చుటకు ఆర్డరు యివ్వబడినది. అది 5 అడుగుల ఎత్తులో వుండాలి. చేతియందొక క్రొత్త చీరను విప్పి పరిశీలిస్తున్నట్లు రావాలి. ఆయనగారు సైడుబోర్డుపై పెన్సిల్‌తో వేయటం కుదరక చెరిపి వేయటము ఇట్లు మూడునాల్గు తడవలు ప్రయత్నించి కుదరక చెరిపివేసినాడు. ఆ సమయమున నేను ఇంకొకతను ''రాంభావ్'' ఇతను శరణప్పగారి ప్రియ స్నేహితుడు మంగలి అతను వీరు చిన్నప్పటి నుండి కలిసియుండేవారు. వృత్తులు, కులాలు వేరైనా వారిలో భేధభావము ఎప్పుడు లేదు. నేను కూడా రాంభావ్‌గారిని గౌరవంగా సంభోదించి గౌరవించెడివాడిని. తీరిక వేళలో రాంభావ్ స్టూడియోకు వచ్చి గంటల తరబడి కూర్చునేవాడు. శరణప్పగారు పనిలో వున్నప్పుడు ప్రశాంతంగా కూర్చొని చేసెడి పనిని పరిశీలించెడివాడు. లేదా తీరికగా వుంటే ఏదో మాట్లాడుకొనెడివారు. ఉభయులు ఆర్యమతానుయాయులు. ఇద్దరి మాట ఒకటిగా వుండెడిది. సమవయస్కులు. రాంభావ్ ఈ చిత్రము గీయటము చెరపటము గమనించి మా గురువుగారిని కొంతసేపు విశ్రాంతి తీసుకోమని కోరినాడు. ఆయనగారు ఆశ్చర్యంగా రాంభావ్‌ను చూచి ఎందుకని ప్రశ్నించినాడు. సాధారణంగా రాంభావ్ పనిని ఆపమని చెప్పడు. పైగా చేసేపనికి ఆటంకము కలిగించడు. అందువలన ఆశ్చర్యపడి అడిగినాడు. అప్పుడు రాంభావ్ మిత్రమా నీవు కొంతసేపు విశ్రాంతి తీసుకొని అనుమతిస్తే ఈ బొమ్మను నారాయణచేత ప్రయత్నం చేద్దామన్నాడు. అప్పుడ శరణప్పగారు నాకేరానిది వానికి ఎలా సాధ్యమవుతుందని అంటే ప్రయత్నం చేయటములో తప్పులేదు. నీవు నాలుగు తడవలు చెరిపినావు. ఇప్పుడు ఇంకొక తడవ చెరిపివేద్దాము. అయినా ప్రయత్నించి చూడటములో పొరపాటు లేదుకదా అని అన్నాడు. అతని మాటలు విన్న పిదప నా ముఖంలోకి పరిశీలనగా చూచి తను సైనుబోర్డు ముందునుండి జరిగి పెన్సిల్ నా చేతికి ఇచ్చినాడు. పెన్సిల్‌ను తీసుకొని 5 అడుగుల ఎత్తు, 2 అడుగుల వెడల్పులో ఒక స్త్రీ ఆకారమును ఊహించి చేతులలో పరిశీలిస్తున్న ఒక కొత్తచీర వచ్చే విధంగా భయపడుతు జాగ్రత్తగా కొలతలు సరియగు విధంగా స్కెచ్ చేసినాను. దాదాపు 20 నిమిషాల సమయము పట్టినది. ఆ స్కెచ్ వేయబొతున్నంతసేపు నన్ను నా

చేతిలో కదులుచున్న పెన్సిల్‌ను పరిశీలిస్తు కూర్చున్నారు. నేను స్కెచ్ పూర్తిచేసి వారిని చూచినపుడు రాంభావ్ చప్పట్లు కొట్టి 'శభాష్ సాధించావు' అన్నాడు. మా గురువుగారు చిరునవ్వుతో అభినందనపూర్వకముగా చూచినాడు. నాకు మొదట ఫెయిల్ అవుతానేమోయను భయలు కలిగినది. ప్రయత్నించి సాధించిన పిదప తను చేయలేని దానిని ఒక బాలుడు చేసెను అను ఈర్ష్య భావము ఏర్పడుతుందని భయపడినాను. కానీ మా గురువుగారి అభినందనపూర్వకమైన చూపు నన్ను పులకింపచేసినది. మానవ సహజమైన ఈర్ష్య ఆయనయందు ఏ మాత్రము లేదు. ఇది మా గురువుగారి యందలి గొప్ప గుణము.

ఈ సంఘటన జరిగిన పిదప స్కెచ్‌లు వేయుటవుు నాకు అప్పగించబడినది. ఆయనగారు నాకు ఆ చిత్రము ఎలావుండాలో చెప్పెడివారు. నేను వారి అభిప్రాయమునకు అనుగుణమైన రీతిలో స్కెచ్‌గీసి యిచ్చెడివాణ్ణి. పిదప ఆయనగారు దానియందు ఒక ''కోట్'' రంగులు వేసెడివాడు. ఆ పిదప రెండుమూడు కోట్‌లు రంగులు వేసేపని అప్పగించెడివారు. వారి అభిప్రాయానుగుణంగా రంగులువేసి యిచ్చెడివాణ్ణి. ఇక పేయింటింగ్ వ్యక్తులది వేసియిచ్చుటలో ఫోటో ప్రింటింగ్, ఎన్‌లార్జ్ అవసరమైన సైజులో చేసి దానియందు రంగులు వేసి యిచ్చెడివాడు. దానియందు కూడా మొదటి ''కోట్'' తనువేసి రెండుమూడు కోటింగ్‌లు నాచేత చేయించెడివాడు. ఆయిల్ పేయింటింగ్‌లు మొదట చెప్పుటకు వెనకాముందాడినా తరువాత నా పనియందు శ్రద్ధ దీక్షను కనిపెట్టి నాకే అప్పగించెడివాడు. ఇది నా పునాదిని గట్టిపరుచుటకు తోడ్పడినది. నేను ఆయనగారి వద్ద ఒకటిన్నర సంవత్సరాలు మాత్రమే పనిచేసినప్పటికి నా జీవితాంతము ఉపయోగపడు పనిని నేర్చుకున్నాను.

## అపాయకర సంఘటన

ఇంకొక అపాయకరమైన సంఘటనగురించి తెలపాలి. అది జీవితాంతము భయము కలిగివుండేటట్లుగా చేసింది. డార్క్‌రూంలో పనిచేయు కుర్రవాడు పని మానుకొని వెళ్ళిపోయిన పిదప ఆ పని నాకు అప్పగించబడినది. నేను అందుకొన్ని మార్పులు చేర్పులు నాకు తోచిన విధంగా చేసినాను. అందు ఎన్‌లార్జ్ చేయుటకు ఉపయోగించుటకై సిద్ధపరచిన బాక్సు ఒకటి మొదటి దాని మధ్య రంధ్రం చేసి బల్బ్‌ను ఫిక్స్‌చేసి వెలుతురు వచ్చేట్లు ఏర్పాటు చేసియున్నది. కానీ అది నలుమూలలకు సరిగా అందక వెలుతురు సమపాళ్లలో వుండక మధ్య

వెలుతురు ఎక్కువగా వచ్చెడిది. నేను దానిని మార్చి నలుమూలలకు నాలుగు లైట్లు ఏర్పాటుచేసినాను. దీనివలన అన్ని దిక్కులకు లైటువచ్చి ప్రింటింగ్ బాగుగా వచ్చెడిది. అయితే దానికొరకై ఉపయోగించెడి బాక్సు టీ పౌడర్ బాపతుది. దానికి పైన నాలుగు మూలలకు ఇనుప పట్టీలు వుండేడివి. ఒకరోజు మామూలుగా చేసేటప్పుడు లైటు వేసినాను. డబ్బాపై వుండు ఇనుప పట్టీకేదో వైరు తగిలి కరెంటు వ్యాపించి షాకు కొట్టినది. నేను వెంటనే స్పృహతప్పి పడిపోయినాను. డార్కురూంకు లోపలినుండి తలుపు బిగించుకోవాలి. పైగా బయటి నుండి వెలుతురు రాకుండా మూయబడి వుంది. అందువలన లోన ఏమి జరిగినది బయటివారికి తెలియదు. నేనట్లు స్పృహతప్పి అరగంటసేపు వున్నాను. స్పృహవచ్చి చూచి మొదట కరెంటు బటన్ ఆఫ్‌చేసి మెల్లగా బయటికి వచ్చినాను. జరిగిన సంఘటన నా గురువుగారితో తెలిపినపుడు చాలా బాధపడినాడు. ఆయన కూడా అదే డార్కురూంలో ఇంతకన్నా ప్రమాదకరమైన షాకు వచ్చినదట. దానిని మనస్సునందు పెట్టుకొని.తన జీవితములో కరెంటు విషయమై ప్రత్యేకంగా డార్కురూంలో జాగ్రత్తగా వ్యవహరించడమే కాదు. తనవద్ద పనిచేసిన వర్కర్లను కూడా హెచ్చరించెడివాడు.

అట్లు స్టూడియోలో పనిచేయు కాలమున విశ్రాంతిలేకుండా చేయవలసి వచ్చెడిది. శరణప్పగారు నివసించే ఇల్లే స్టూడియో అందువలన స్టూడియోలోని పనితోపాటు ఇంటిపనులు కూడా చేసెడివాడిని. నీళ్ళు తెచ్చుట, కూరగాయలు తెచ్చుట, కొన్ని సమయములలో గురువుగారి అబ్బాయిని ఆడించుట చేయవలసి వచ్చెడిది. ఉదయం 8 గంటలకే స్టూడియొకు వచ్చి పగలు 12 గంటలకు భోజనమునకు ఇంటికివెళ్లి మళ్ళీ ఒక గంటలో తిరిగి వచ్చెడివాడిని. రాత్రి 8 గంటలకు తిరిగివెళ్ళెడివాడిని. ఉదయం ఏ విధమైన టిపిన్ వుండెడిది కాదు. అప్పటి మా కుటుంబ పరిస్థితి అలాంటిది. నాకు ఈవిధమైన పనుల ఒత్తిడి వలన తలనొప్పి మరియు కాళ్ళు లాగుట, అలసట తరచుగా వచ్చెడిది. అట్లున్నప్పుడు అరగంట కండ్లు మూసుకొని పడుకునేవాణ్ణి. ఈ పరిస్థితి రానురాను పెరిగినది. మా నాన్నగారు డాక్టర్ వద్దకు తీసుకవెళ్లి పరీక్ష చేయించినారు. ఆయనగారు కంటిపై భారము ఎక్కువ అగుచున్నది. కావున చూపుతో పని తగ్గించాలని కొంత కాలం విశ్రాంతి తీసుకొవలసినదిగా సలహాయిచ్చాడు. ఇది విని మా నాన్న పని మానుకుని ఇంటిపట్టున ఉండమని

కోరినాడు. నా పరిస్థితిని ఆలోచించి మానుకుంటానని మాట యిచ్చినాను. మరుసటి దినము స్టూడియోకు వెళ్లి డాక్టర్‌ను కలిసిన విషయము నా ఆరోగ్యస్థితి డాక్టర్ సలహా మున్నగునవి తెలిపి రేపటినుండి పనిలోకి రానని తెలిపినాను. ఈ మాట విని శరణప్ప ఏవో వినరాని మాటలు విన్నట్లుగా నిశ్చేష్టుడైనాడు. తరువాత తేరుకొని నీకు కావాలంటే వేతనము ఎక్కువ యిస్తానన్నాడు. ఇంతవరకు ప్రతినెల ఇచ్చే 5 రూపాయలకు ఇంకొక రూపాయి అదనముగా యిస్తాను. నీవు వెళ్లిపోతే నాకు చేయి విరిగినట్లు అవుతుంది. నా స్టూడియో పని కుంటుపడుతుంది. (వలదని) కావాలంటే మీ నాన్నతో మాట్లాడుతానన్నాడు. అయినా నేను ఆరోగ్యము బాగాలేక మానుకుంటున్నప్పుడు మీరు ఎవరితో మాట్లాడిన లాభం లేదని తెలిపినాను. ఆయనగారి భార్యకూడా నన్ను ఆపుటకు ప్రయత్నించింది. కాని నేనెవరి మాట ఖాతరు చేయలేదు. మరుసటి దినము నుండి మానుకున్నాను. అది ఆగస్టు 1943. తేదీ గుర్తులేదు. స్టూడియోలోనే వున్నప్పుడు నా పెండ్లి అయినది. నా వయసు 18 సంవత్సరములు. నా భార్య వయసు 11 సంవత్సరాలు.

## రంగుల అద్దించుట

శరణప్పగారి వద్ద పనిమానుకున్న పిదప రెండు నెలలు ఇంటిపట్టున గడిపినాను. ఇంట్లో మొగ్గము నేయుటకు మనసొప్పలేదు. అందుకు మా నాన్నగారు ప్రోత్సహించరు. పనిలేకుండా దినమంత గడపటము ఒక బాధగానే పరిణమించినది. కాస్త ఆరోగ్యం కుదుటపడిన పిదప ఏదేని బట్టల షాపులో పనికి కుదుర్చాలని ఆలోచించినారు. కానీ నేనందులకు ఒప్పుకోలేదు. అప్పుడు మా పెద్ద అన్నయ్యగారొక సలహా యిచ్చినారు. దేశములో అనగా తెలంగాణాలో రంగులు అద్దుట చాలా తక్కువ. అచట రంగులు అద్దెడి పరిశ్రమపెడితే బాగుంటుంది. కాని అద్దే విధానము తెలుసుకోవడము అవసరము. ఇక్కడ సోలాపురంలో రంగులు అద్దెడి పరిశ్రమలు చాలావున్నవి. ఇక్కడ రంగులు అద్దెడి పరిశ్రమలో పని నేర్చుకున్నట్లయితే మనకు లాభం గలదు. మా గ్రామం జనగామ తాలూకాలోనిది. అది జనగామకు ఆరుమైళ్ల దూరములో గలదు. అచట మనము ఈ పరిశ్రమ పెట్టినట్లయితే తాలుకాలోని వాళ్ళందరు మనవద్ద అద్దించగలరు. ఇప్పుడు వారందరు వరంగల్, జనగామ వెళ్ళి అద్దించుకొని

వస్తున్నారు. వారికి లాభం కాగలదు. మనకు బాగుంటుందని చెప్పినాడు. ఇట్లయితే స్వంత పరిశ్రమ అవుతుంది. ఎవరివద్దనో పనిచేయాల్సిన గత్యంతరం వుండదు. అని మా నాన్నగారు బలపరిచినారు. కాని ముందు పనినేర్చుకోవాలి గదా అన్నప్పుడు రంగులుఅద్దుట కాకుండా గుమాస్తాగా పనిలో చేరాలని సలహా యిచ్చినారు. మాకు కొద్దిగా పరిచయమున్న మలిపెద్ది చిన్నరాజయ్యగారి ఖార్ఖానాలొ పనిలో చేరినాను. వారివద్ద రంగులు అద్దే వ్యక్తులు నలుగురుండి ప్రతిరోజు పెద్దమొత్తం నూలు అద్దించి మొగ్గాలు నేయించేవారికి సప్లై చేసేవారు. అయితే ఆ ఖార్ఖానాలో పని వత్తిడి ఎక్కువగ వుండి లెక్కలు వ్రాయుటకు ఒక గుమాస్తా అవసరము ఏర్పడినది. అది నాకు అవకాశముగా లభించి పనిలో చేరినాను. లెక్కలు వ్రాయుట యిచ్చిపుచ్చుకోవడాలు వున్నగునవి చిన్నరాజయ్యగారి కుమారుడు అంజయ్య చేసెడివాడు. అతనికి కొద్దిగా తెలుగు మరియు కొద్దిగా మరాఠీ వచ్చును. కానీ అతడు మరాఠీ యందలి మోడీ లిపిలో జమా ఖర్చులు వ్రాయలేక తెలుగులోనే వ్రాసెడివాడు. నేను పనిలో చేరిన పిదప నాకు మరాఠీ మోడీ లిపిలో వ్రాయగలనని చెప్పి వ్రాసి చూపించినాను. మెల్లమెల్లగా లెక్కలు నాకు అప్పగించినారు. నా ఉద్దేశ్యము రంగులు ఎలా అద్దుతారు. రసాయనములు మిశ్రమము ఎలా చేస్తారు? ఏఏ రంగులు అద్దుటకు ఏఏ మిశ్రమాలుంటాయో తెలుసుకోవాలి. అందుకుగాను నూలు అద్దేడివాడికి రంగులు ఇచ్చే బాధ్యతకూడా నేనే తీసుకున్నాను. ఇదివరలొ పనిచేసిన గుమాస్తా లెక్కలు మాత్రమే వ్రాసివెళ్ళిపోయెడివాడు. కాని నెను అన్ని పనులు చేయటం ప్రారంభించుసరికి యజమాని చాలా సంతోషించినాడు. నాకు వారు నెలకు 8 రూపాయల వేతనము ఇచ్చారు.

నేను మలిపెద్దివారి పరిశ్రమలో ప్రవేశించిన పిదప యజమాని ఇంకా వ్యాపారాభివృద్ధి చేసుకున్నాడు. ఆయన గారికి ఇపుడు తీరిక లభించుట వలన ఆసాములను పెంచుకున్నాడు. దాని ద్వారా వ్యాపారం పెరిగినది. ఆసాముల వద్దకు వెళ్ళి డబ్బులు పెండింగ్ పడకుండా వసూలు చేసుకొని వచ్చెడివాడు. తీరికదొరికినపుడు నేను కూడా వెళ్ళి వసూలుచేసి తెచ్చెడివాణ్ణి. యజమానికి నాయందు గురిఏర్పడి పనిభారం మొత్తం నాకు అప్పగించెడివాడు. నేను పైసా తేడా రాకుండా ఖర్చులు సరిచూచుకుని నిలువా తేల్చి వారికి అప్పగించి ఇంటికివెళ్ళిడి వాడిని. ఇది జీవితములో ఇంకొక మలుపుగా పరిణమించినది.

నా పట్టుదల వల్లనేమి నాకున్న శ్రద్ధ వలననేమి కొలదికాలములోనే నేను ఏయే రంగులు ఎలా అద్దాలో వానిని ఏయే పాళ్లలో రసాయన మిశ్రమం చేసి ఇవ్వాలో, ఆ రసాయనాలు ఎక్కడ లభిస్తావో వాని ధరవరలు ఎంతెంత వున్నవి. వానిని సిద్ధము చేసెడి చోటెక్కడో మున్నగు విషయాలను ఆకళింపు చేసుకున్నాను. నాకు పనిపై గల శ్రద్ధను చూచి యజమాని ఆశ్చర్యపడువాడు. వారు నన్ను ఒక గుమస్తాగా కాక ఒక కుటుంబ సభ్యునిగా ఆదరించెడివారు. ఆ కార్ఖానాపై చిన రాజయ్య గారి తల్లి ముసలమ్మ ఆజమాయిషి చేసెడిది. మహా తెలివిగలది. అందరు ఆమె మాటను పాటించెవారు. ఎవరితో ఎలా మసులుకోవాలో ఆమెకు బాగా తెలుసు. చదువులేకున్నా లెక్కలు చేయటంలో దిట్ట. ప్రతి అంశం ఆమె జాగ్రత్తగా కనిపెట్టియుండెడిది. వారి ఇంట్లో పండగ పబ్బాలకు నన్ను భోజనమునకు ఉండమనెడివారు. కాని నేను సున్నితముగా వలదని తప్పించుకునెవాడిని. ఎందుకనగా శరణప్పగారి వద్ద వున్నప్పుడు ఆయనగారితో పాటు నేను ఆర్యసమాజ అనుయాయినయ్యాను. ఆయనతో పాటు వ్యాయామము చేయుట ఆయా సమావేశములకు వెళ్ళుట చేసెడివాడిని. అట్లె మద్యం, మాంసం తినటం మానివేసినాను. సాధారణముగా పద్మశాలి కుటుంబములలో జరిగెడి విందులలో మద్యం మాంసము తప్పనిసరి. అందువలన నేను సున్నితంగా తప్పించుకొనుట చేసెడివాడిని. అప్పట్లో మాంసము తినకపోవుటచే ఇంటిలో ఇబ్బంది నెదురుకొనవలసి వచ్చెడిది. వారమునకు ఒక తడవయైనా మాంసముతో కూర అయినపుడు నా కొరకు ప్రత్యేకముగా వేరెకూర చేయవలసి వచ్చెడిది. అట్లయినప్పటికి నేను సర్దుకుపోయెడివాడిని.

## నేను - ఆత్మాభిమానం

''నేను మలిపెద్దివారి కార్ఖానాలో పనిచేసిన కాలమున జరిగిన ఒకటిరెండు సంఘటనలు గుర్తుంచుకోదగినవి. నేను మద్యం మాంసము ముట్టనను సంగతి వారికి తెలియదు. ఒకరోజు అంజయ్య అనగా యజమాని కుమారుడు నన్ను పిలిచి నీవు పలాని కల్లు అడ్డకువెళ్ళి ఇన్ని శేర్ల కల్లు తీసుకురావలసిదని ఆజ్ఞాపించినాడు. ఆ కాలమున ఇలాంటి కార్ఖానల యజమానులు ప్రతిదినం కడవల కొలది కల్లు తెప్పించుకుని త్రాగెడివారు. వారికి కల్లు అడ్డలయందు

కడువలు వుండెడివి. వారు తమ మనుష్యులను పంపించి కల్లు కడవలు తెప్పించుకునెడివారు. నేనున్న మలిపెద్ది రాజయ్యగారికి కూడ వాడుక వుండెడిది. ఆ రోజు కల్లు తెచ్చుటకు నన్ను పురమాయించినాడు. నేను కల్లు అడ్డకువెళ్లి తెచ్చిన అది అలవాటుగా పరిణిమించగలదు. తేనని మానుకున్న యజమానికి కోపము తెప్పించిన వాడిని అవుతాను. బాగా ఆలోచించి మెల్లిగా చినరాజయ్య తల్లిగారగు ముసలమ్మ వద్దకు వెళ్ళి పరిస్థితి వివరించినాను. నేను ఇటువంటి పనులు చేయుటకు వప్పుకోను. మీ అబ్బాయి నన్ను పనికి పురమాయించినాడు. కావాలంటే మీ వద్ద పని మానుకుంటాను. కాని ఇటువంటి పనులు మాత్రం చేయనని స్పష్టంగా చెప్పినాను. తెలివిగల ముసలమ్మ మొదటినుండి నన్ను గమనిస్తునెవుంది. నేను పని మానుకున్న వారికి ఎంత నష్టమో అర్థం చేసుకోగలది. కావున వెంటనే తన మనుమడు అగు ఆంజయ్యను పిలిపించి నాముందె ఈ అబ్బాయికి ఇలాంటి పనులు అనగా అతనికి ఇష్టము కాని పనులు ఏవి అప్పగించవలదని ఆదేశించింది. అది మొదలు నేను పని మానుకునేంత వరకు నాకిష్టము లేని పనులేవి చెప్పలేదు. అట్లె మరియొక తడవ చినరాజయ్యగారి భార్య యజమాని భార్య నన్ను పిలిచి వంటచెరుకు అటకమీద పెట్టమని ఆదేశించింది. కాని మళ్ళీ నేను ముసలమ్మను ఆశ్రయించి పరిస్థితి వివరించినపుడు ఆమె కోడలును ఈ పిల్లవానికి ఇటువంటి పనులు చెప్పవలదని కోపించింది. ఆ పిదప ఆమె ఎన్నడు నాకే పని చెప్పలేదు. నేనచట పనిచేస్తునే నా గమ్యం వైపు పయనించినాను. రంగులు అద్దించడములో నేర్పరినయ్యాను.

## వివాహం

నేను శరణప్పగారి స్టుడియోలో పనిచేయుచున్నపుడే మార్చి 1943లో నా పెళ్ళి జరిగినది. అపుడు నా వయస్సు 18 సం॥లు. నా భార్య వయసు 11 సం॥లు. అప్పట్లో పెట్టుపోతలు కట్నకానుకలు పెద్దగా లేవు. మంచి కుటుంబంతో సంబంధాలు చేసుకోవడం ఆనవాయితి. మా పరిస్థితి పేదరికమే. అట్లే మర్యాదగల పేదకుటుంబంనుండి సంబంధం. స్థిర పరచినారు. అందునా ప్రమేయమేమి లేదు. అంతా పెద్దలు నిర్ణయించి చేసినదే. పెళ్లి అయిన పిదప నాకేమి మంచి గుడ్డలు పెట్టలేదని మా అత్తగారు బట్టలు కొనుక్కోమని రూ. 15 యిచ్చారు. వానితో నేను ఒక చొక్కాబట్ట మరియొక వేస్టుకోటును తీసుకొని

కుట్టించుకున్నాను. చొక్కా అటు కమీజువలె కాక ఇటు లాల్చీవలె కాక రెండిటిరూపం వచ్చేటట్లు కుట్టించుకున్నాను. ఆ చొక్కాను వేసుకుని పనిలోకి వెళ్లినపుడు నా మిత్రుడు శంకరయ్య అనునతడు తనకు గూడా అటువంటి చొక్కా కావలెనని అదే బట్ట కావలయునని కోరినాడు.

## చేతికి గాయం - చికిత్స

ఆ మరుసటి రోజు ఆయనగారిని వెంటబెట్టుకుని బట్టల షాపుకు వెళ్లి గుడ్డ ఖరీదుచేసి దర్జీకి ఇచ్చి వెనుతిరిగినాము. అప్పటికి నాకు భోజనం వేళ అగుటచే నేను ఇంటికి వెళ్లి భోజనం చేసివస్తానని స్నేహితునితో చెప్పి మా యింటిదిక్కు మరలినాను. నేను పనిచేసె చోటు మా యింటికి దూరమగుటచే కాలినడకతో వెళ్లి వచ్చుటకు ఆలస్యమగునని యజమాని తన సైకిల్ ఇచ్చి పంపించెడివాడు. స్నేహితుడు తన ఇంటిత్రోవ పట్టిన పిదప నేనతనికి కుడిచేత టాటా చెబుతు ఎడమచేత హాండిల్ పట్టుకుని చిన్నమలుపు వుంటె అటు తిరిగి నేను అపుడు ఎడమచేయి హాండిల్‌ను ఆపలేక సైకిల్ పక్కకు ఒరిగి కిందపడినది. అట్లు పడినపుడు ఎడమచేయి భూమికి ఆన్చిపడినాను. అపుడు నా బరువు మరియు సైకిల్ బరువు ఒకేచేతిపై పడుటచే మోచేతికీలు తొలగినది. కిందపడిన పిదప స్పృహ తప్పినట్లు అయినది. స్నేహితుడు వెళ్లిపోయినాడు. ఆ పరిసరములో యున్నట్టివారు వచ్చి సైకిల్ పక్కకు బెట్టి నన్ను లేపి ఒక ఇంటి అరుగుపై పండబెట్టినారు. కొంలది సేపటికి స్పృహవచ్చి చూచి లేవ ప్రయత్నించినాను. నా చేయినొప్పి అధికమై వాపురానేవచ్చినది. స్థానము తప్పిన మోచేతి కీలు స్పష్టంగా చర్మంనుండి కనిపిస్తుంది. నన్ను గుర్తించిన ఒక వ్యక్తి మా ఇంటికి అదే సైకిల్ వేసుకొని మా నాన్నకు ఈ కబురు చెప్పినాడు. వెంటనే మా తల్లితండ్రి, అన్నలు మా ఇంట్లో మొగ్గాలపై పనిచేసేవారు పరిగెత్తుకొని వచ్చినారు. వారందరిని చూడగానే నాకు ఏడ్పు వచ్చినది. మా అమ్మ గోలగోలగా ఏడ్పు ప్రారంభించినది. నేను ఏడ్పును దిగమింగి ఏమి కాలేదు ఏడ్వవద్దని వారించి అందరిని వెళ్లిపొమ్మని కోరినాను. మా అమ్మనాన్న తప్ప మిగతా అందరు వెళ్లిపోయినారు. కొంలదిసేపు అయిన పిదప మెల్లగా నడుచుకుంటు వారితోపాటు ఇల్లు చేరుకున్నాను. నాడు రిక్షాలు కాని ఆటోలు కాని లేవు. టాంగాలు మాత్రం వుండేవి. కాని అవి ఎక్కువగా సెంటర్‌లో వుండేవి. బాధగా వున్నప్పటికి కాలినడక తప్పలేదు.

ఇంటికి వెళ్లిన పిదప చేయి బాగావాచి నొప్పి విపరీతమైనది. దానితో జ్వరం వచ్చినది. భోజనం చేయలేకపోయినాను. వుండె తొలగిన చేతికి కట్టుకట్టించుటకు ప్రభుత్వ హాస్పిటల్‌కు తీసుకువెళుదామని నిర్ణయించినారు. మా ఇంటికి హాస్పిటల్‌కు రెండు కిలో మీటర్ల దూరం. ఎలా వెళ్ళాలి అని ఆలోచించి టాంగా కొరకు ప్రయత్నించినారు. కాని అందుబాటులో లేవు. మళ్ళీ కాలినడకే శరణ్యమయింది. నా వెంట తల్లిదండ్రులు అన్నలు అందరం కలసి మెల్లగా సాయంకాలం నాలుగు గంటల వరకు హాస్పిటల్ చేరినాము. కానీ ఆ రోజు ఏదో సెలవుదినమగుటచే డాక్టర్‌లు అందుబాటులో లేరు. డ్యూటీ డాక్టర్ వస్తాడంటే సాయంకాలం ఆరుగంటల వరకు చూచి వేరే ప్రయత్నం చేద్దామని తిరిగి ఇంటికి వచ్చినాము. మేముండే ఇంటికి కొలది దూరంలో ఒక సాయిబు విరిగిన ఎముకలు సరిచేసి కట్లుకడతాడని అక్కడికి వెళ్ళడం మంచిదని సలహా యిచ్చినారు. వెంటనే నన్ను తీసుకొని ఆ సాయిబుగారి ఇంటికి వెళ్లినారు. వారు తండ్రితాతల నుండి కట్టుకట్టుటలో దిట్టలని పేరున్నవారట. నన్ను చూచిన వెంటనే ఆ సాయిబు విషయము తెలుసుకొని మీరు వెంటనే నా వద్దకు తీసుకొని వచ్చినట్లయితే ఇంత బాధ అనుభవించకపోవును. ఇప్పుడైనా మించినది లేదు. నేను సరిచేస్తానని నన్నిక బల్లపై కూర్చుండబెట్టి మాటలలోనికి దింపినాడు. వాళ్ళు ముస్లింలు అయినప్పటికి ఉర్దూ భాష స్వచ్ఛంగా ఉండదు. పైగా మరాఠీ పదాలు కలుస్తూ వుంటాయి. నేను ఉర్దూభాషలో ఈ సంఘటన ఎలా జరిగినదో వివరించినపుడు నా భాషను మెచ్చుకొనుచు వెన్నలాంటి పదార్థము చేతికి వ్రాస్తూ. నేను ఉర్దూ ఎంతవరకు చదివినది అడుగుతు మాటల సందర్భములోనే చాకచక్యంగా లాగి చేతి కీలును యదాస్థానములోనికి చేర్చినాడు. అతనట్లు మాటలలో పెట్టకపోయినట్లయితే బాధ తట్టుకోలేక పోదునేమో అనిపించినది. తరువాత మంచిగా మాలిష్ చేసి కట్టుకట్టి ఇక మీరు వెళ్లవచ్చు. దినము తప్పించి దినము కట్టు మార్చాలని తగిన సలహాలిచ్చి పంపినాడు. నాకారాత్రి నిద్ర లేదు. నొప్పి జ్వరము వారము రోజులు బాధించినది. కట్టుకట్టించుకొనుట క్రమము తప్పకుండా వెళ్ళెడివాడిని. అట్లొక 15 రోజులు గడిచినది. చేతికి అవసరమైన వ్యాయామము చేయమని చెప్పెడివాడు. కాని ఫలితము పెద్దగా కనిపించలేదు.

ఇట్టి విషయము మా నాన్నగారు నిజాంలో మా గ్రామములో యున్నట్టి మా పెద్దన్నయ్యకు తెలిపినారు. ఆయనగారు వెంటనే మా గ్రామంలో ఒక గొల్ల అతను విరిగిన ఎముకలను సరిచేయటములో అతికించటములో దిట్టయని అతనివద్ద చుట్టుప్రక్కల 10 గ్రామాల వాళ్ళు వస్తారని వెంటనే నన్ను పంపమని కబురుపెట్టినాడు. అపుడు మా పెద్దనాన్న బిడ్డ అబ్బయ్యగారు ఈ వార్తవిని బాగా బాధపడినాడట. ఆయనగారికి సంతానము కలిగి పెద్దవారైనా కొడుకు, కూతురు మరణించినారు. నన్ను చాలా ఆప్యాయంగా స్వంత కుమారునివలె చూచుకొనెడివాడు. ఆయన కూడా మా అన్నయ్య వ్రాసిన విషయాన్ని ధృవపరుస్తు వెంటనే పంపమని కబురుపెట్టినాడు. అది విన్న పిదప మా నాన్న అమ్మ నన్ను వెంటతీసుకొని మా గ్రామం చేరుకున్నాము. నేను పడిన వార్త తెలిసిన పిదప మా యజమాని వచ్చిచూచిపోయినాడు. వాళ్ల పని కుంటుపడినదని బాధపడినాడు. స్నేహితుడు శంకరయ్య నా పరిస్థితి చూచి తన కారణంగా నాకు ఈ కష్టం కలిగినదని రెండురోజులు నన్నంటిపెట్టుకొని యున్నాడు. నేను దేశమువచ్చేవరకు ప్రతిదినము సాయంకాలం కబుర్లు చెప్పేడివాడు. ఆయనగారు గురూపదేశము పొంది వేదాంతము అభ్యసించినాడు. ఆయన గురుస్థానములో కొందరు శిష్యులకు బోధచేసిన వ్యక్తి, మంచిమాటకారి. నన్ను అనునయించుటకు ప్రతిదినం నా వద్దకు వచ్చేడివాడు. నేను దేశము వచ్చిన పిదప కట్టుకట్టే గొల్ల అతన్ని పిలిపించి పరిస్థితి వివరించినారు. ఆయన ఫర్వాలేదు, బాగుచేస్తానని తనవైద్యం ప్రారంభించినాడు. ప్రతినిత్యం ఏదో పసరు రుద్ది బాగా రాసేవాడు. తరువాత అదే ఆకుతో కట్టు కట్టెడివాడు. అట్లాక నెల రోజులలొ నొప్పి పూర్తిగా తగ్గిపోయినది. చేతికి తగిలిన వ్యాయామం చేయించుటచే మునుపటివలె ఆడించుట, కదిలించుట వీలైనది. కానీ కొంచెం వంకర మాత్రం అట్లె మిగిలియున్నది. ఇప్పటికి కుడిచేయి, ఎడమచేయి ఒకచోటికి తెచ్చినపుడు వంగివుంటుంది. దీనితో మలిపెద్దివారి వద్ద ఉద్యోగం మానుకోవటమైనది.

నేను మలిపెద్దివారి రంగుల కార్ఖానాలో చేరుటకు కారణం రంగులు ఎలా అద్దించాలన్నది అది నేర్చుకున్న పిదప నిజాంలో అనగా మా స్వగ్రామమునకు దగ్గరగా వున్న తాలూకా జనగాంలో కార్ఖానా ఏర్పరచి రంగులు అద్దించాలని

వుద్దేశించినాము. నాచేతి నొప్పిపూర్తిగా తగ్గిన పిదప రెండుమూడు తడవలు జనగామాకి వెళ్ళి అచట కార్ఖానాలో రంగులు ఎలా అద్దించుచున్నారో పరిశీలించినాను. అద్దించడములో చాలా తేడాలు వున్నవి. ఇచట కొన్ని రకముల అద్దకాలు మాత్రమే వున్నవి. అవియైనా కొన్ని గాఢమైన రంగులు. చాలా తక్కువ. కచ్చా రంగులే ఎక్కువగా వుండేవి. జనగామాలో జమాలొద్దీన్ అను ముస్లిం నడుపుచున్న కార్ఖానా పెద్దది. దానిలో కూడా పెద్దమార్పు లేదు. జనగాం తాలూకాలో దాదాపు నూటతొంబై గ్రామాలు కలవు. ఇన్ని గ్రామముల నుండి పద్మశాలిలు నూలు ఖరీదుకు లేదా తమ నూలు అద్దించుకొనుటకు ఎక్కువగా జమాలోద్దీన్ కార్ఖానాకే వచ్చెడివారు. ఇంకా కొంతమంది వరంగల్ వెళ్లి అద్దించుకొనుట లేదా అద్దిననూలు కొనితెచ్చుట చేసెడివారు. నేను జనగామాలో రంగులు అద్దుడు కార్ఖానా పెట్టినట్లు అయితే వరంగల్ వారికన్నా మేలైన రీతిలో అద్దకాలు చేయించి ఇవ్వవచ్చునను నమ్మకము ఏర్పడినది. ఒకటిరెండు తడవలు వరంగల్ వెళ్లి అచట రంగులు అద్దుడు పరిశీలించినాను. అయితే ఇది కార్యరూపం ధరించాలన్న పెట్టుబడి అవసరము. అది సమకూర్చటము నా శక్తికి మించిన పని. అది మా అన్నయ్య చేస్తాడని ఆయనను కదిపి చూచాను. కాని ఆయన వల్ల కాని పని అని తెలిపోయినది. అప్పట్లో మా పెద్దఅన్నయ్య బట్టలు ఖరీదుచేసి హైద్రాబాద్- వరంగల్ తీసుకువెళ్ళి అమ్మివచ్చెడివాడు. లేదా అచటినుండి షావుకార్లు వచ్చి ఖరీదుచేసి తీసుకువెళ్ళెడివారు. మా అన్నయ్య వూరువూరు తిరిగి పద్మశాలీ ఇండ్లలో నేయబడిన బట్టలను నాడు మార్కెట్లలో చలామణి అవుచున్న వాటిని ఖరీదుచేసి తెచ్చి అమ్మెడివాడు. దీనిలో కొంత లాభం చూచుకొని వ్యాపారం చేసెడివాడు. పేదవారైన పద్మశాలీలు తాము నేసిన చీరెలో దోవతులలో ఏ రోజుకారోజు అమ్ముకొని జీవనము గడిపెడివారు. నన్ను కూడా ఖరీదు చేయుటకు గ్రామాలకు పంపెడివారు. నేను వెళ్ళి అచటవారివద్ద ఖరీదుచేసి వారి ఆర్థిక పరిస్థితులను అడిగి తెలుసుకొనెడివాడిని. దుర్భరమైన దారిద్ర్యంలో మునిగియుండెడివారు. నాడు కుటుంబ నియంత్రణ లేని కారణంగా అమితమైన సంతానం, విద్యలేమి మూఢాచారాలు త్రాగుడు మున్నగు పరిస్థితులు వుండెడివి. వారు ముఖ్యంగా ఇంటిలోని సభ్యులందరు పనిచేసెడివారు. ఆడమగ అందరు కలిసి నేత పనికి తోడ్పడెడివారు. కుటుంబంలోని అందరు పనిచేసిన పొట్ట గడవడము కష్టంగా వుండెడిది.

బయట వ్యవసాయ కూలికి చాలామంది వెళ్లకపోయెడివారు. ఇంటిపట్టునే వుండి పనిచేసెడివారు. కొలదిమంది వ్యవసాయం కలిగియున్నవారు మాత్రము బయటకు వెళ్లి పనులు చేసెడివారు. నాడు ముఖ్యమైన ఆహారం జొన్నలు. ఇది వారికి అనువైనది. పంటకూడా జొన్నలు అమితంగా పండించెడివారు. మెట్ట పంటలు అధికం. వరిపంటకు నీటివసతి లేని కారణంగా పండించకపోయెడివారు. పండించిన వరి కూడు అందరికి అందుబాటులో వుండెడిది కాదు. పైగా జొన్నలు నూకలుగా విసిరి సంకటి చేసుకొని దానిలో నీళ్ళు లేదా గంజి పోసుకొని ఉప్పు వేసుకొని కలిపి త్రాగెడివారు. నంజుకు కొలది కారము మాత్రమే పెట్టుకొనేవారు. అదే వరికూడని అనుచు దానిలోనికి కూర, పులుసు ఇత్యాదులు కావలసి వచ్చెడిది. అందువలన 90 శాతం మంది జొన్న సంకటితో గడిపేవారు. సంపాదన మంచిగా వున్నప్పుడు మాత్రం బియ్యం కొనితెచ్చుకొని ఒక పూట వరి అన్నం తినెడివారు. పండగ పబ్బాలకు మాత్రం వరి అన్నం తప్పనిసరి. అందుకే తెలంగాణాలో ''పండగనాడు పరమాన్నం'' అను సామెత ఏర్పడినది. మేము కూడా ఇదే స్థితిలో యున్న కారణంగా వారి పరిస్థితులను అవగాహన చేసుకొనేడివాడిని.

అట్లు ఖరీదు చేయుటకు వెళ్ళినపుడు వారివద్దవున్న అన్ని రకముల గుడ్డలను కొనితెచ్చెడివాడిని. ఇది మా అన్నయ్యకు గిట్టకపోయెడిది. మనకు మార్కెట్లలో చెలామణి వున్న బట్టలు మాత్రమే కొనితేవాలి అవసరమైనవి కొని తెచ్చుట అమ్ముట ఇబ్బంది పైగా లాభాలు వుండవు. అని చెప్పెడివాడు. కాని ఎప్పుడు మనకు నేసి ఇచ్చేవారు ఇప్పుడు ఇంకొక చోటికి ఎలా అమ్ముకోగలరు. మన లాభమే ముఖ్యమా? వారి పరిస్థితి కూడా పరిశీలించాలని నేను వాదించేవాడిని. మా నాన్న నా మాటలకు సమర్థించేవాడు. ఎందుకనగా మా నాన్న ఇలాంటి దశననుభవించినవాడు కనుక నైతికంగా ఆలోచించెడివాడు. ఇక లెక్కలు వ్రాయుటలో మా అన్నయ్యకు నాకు తేడా వచ్చెడిది. జమ ఖర్చులు నేను వ్రాయుటలో అనుభవము గడించినవాడిని. ఆయనగారు ఏదో ప్రయివేటులో చదివి పద్దులు వ్రాయగలిగెడివాడు. ఆయితే ఆసాములతో పేచి వచ్చెడిది. జమ ఖర్చులు సరిగా వ్రాయక జమ ఖర్చుగాను ఖర్చు జమగాను వ్రాసి తికమకపడి ఆసాములను తికమకపెట్టెడివాడు. అపుడపుడు వాదోపవాదాలు జరిగెవి. అవి ఎట్లో సర్దుకుపోయెడివి. నేను ఏ పద్దుకు వివరంగా వుండాలని

వ్రాత పద్ధతి అది కాదని చెప్పినపుడు నీవు నా ముందటి పిల్లగానివి. నాకు చెప్పేంత మొనగాడివా? అని నన్ను కించపరిచి మాట్లాడేవాడు. నేను చెప్పెడి మాట పెడచెవిన పెట్టి నామీద కక్ష పెంచుకొనెడివాడు. రంగుల కార్ఖానా రంగులకల అయినది. నా పరిస్థితి దినదినము తీసికట్టుగా తయారైంది. మా అన్నయ్య ఎంతసేపు తన స్వార్థం గురించి ఆలోచించెడివాడు. మేమందరము సోలాపురంలో వుండి పనిచేసి సంపాదిస్తే తను మాత్రం ఊరువిడిచి వచ్చెడివాడు. పైగా తన ఖర్చుకు డబ్బు పంపమని కోరెడివాడు. తన వ్యాపారము తనదేయను భావముతో వ్యవహరించెడివాడు. ఇక్కడ మా నాన్న మా మూడవ అన్న మొగ్గాలు నేసెడివారు. మా అమ్మ వదిన వంటపని మరియు మొగ్గాలకు అవసరమగు కండెలు ఇత్యాదులు చేసెడివారు. నేను కూడా తీరికవేళలో కొంతపని సాయపడే వాడిని.

## తీరని మా నాన్నగారి కోరిక

చేయి విరిగి కుందారం వచ్చె సమయములో పేయింటింగ్‌కు అవసరమైన రంగులు కాన్వాస్ గుడ్డ, బ్రష్‌లు వెంటతెచ్చుకున్నాను. వానిని ఉపయోగించి మా నాన్నగారి పేయింటింగ్ ఒకటి చేసినాను. మా పెదనాన్నగారి ఇల్లు మా ఇంటిపక్కనే. నేను రాత్రిళ్ళు అక్కడనె పడుకొనెడివాడిని. తీరిక సమయములో వెళ్ళి అచటనే విశ్రాంతి తీసుకొనెడివాడిని ఈ పేయింటింగ్ కూడా అచటనే చేసినాను. అది పూర్తి అయిన పిదప మొదట మా నాన్నగారికి చూపించినాను. అది 12"x15" సైజులో తయారుచేసినాను. అది చూచి మా నాన్నగారు అమితంగా సంతసించినారు. మా పెదనాన్నగారి సంతోషమునకు కొదవలేదు. అట్లు పేయింటింగ్‌లు చేయటమే కాక దీపావళి పండగ సందర్భంగా ఇండ్లకు సున్నాలువేసి పిదప గోడలపై దేవతా చిత్రాలను వాటర్‌పేయింటింగ్‌తో వేసినాను. మా ఇంట్లో మరియు మా పెదనాన్నగారి ఇంట్లో మాత్రమే చిత్రించినాను. ఇంకెవరు కోరినా వేయలేదు. నేను శరణప్పగారి వద్ద పనిచేసినపుడు నేర్చుకొనిన పనితనము చూపించినాను. గ్రామములోని చాలామంది ఈ గోడలపై చిత్రించిన చిత్రాలు మరియు మా నాన్నగారి పేయింటింగ్ చూచి ఆశ్చర్యపడేవారు. ఇది మా అన్నయ్యకు కంటగింపుగా వుండెడిది. మా నాన్నకేమో నన్ను ఏదో వుద్యోగములో పెట్టాలని మొగ్గము పని చేయించవద్దని ఆయనగారి కోరిక.

మా గ్రామములో దాదాపు 40 ముస్లింల కుటుంబాలు వుండెడివి. వారిలో కొందరు హైద్రాబాద్‌లో పనిచేసెడివారు. ఇంకొందరు జనగామలో పనిచేసెడివారు. ఒకనాడొక మొగ్గము పైరవీకారు మా నాన్నతో మీ కుమారుని సర్కారు నౌకరి ఎందుకు చేయించరు నాకు తెలసిన తహసిల్దారు ఉన్నాడు. అతనికి చెబితె మీ అబ్బాయికి ఉద్యోగం దొరకటం ఖాయం అని తెలిపినాడట. ఆ మాట విన్న మా నాన్నగారికి తను కన్న కల నిజం కాబోతుందని నాకా విషయం చెప్పినాడు. కాని ఒకడి చేతికింద జీవితాంతము ఉద్యోగం చేయటం నాకిష్టం లేదని స్పష్టంగా చెప్పినాను. అందుకు మా నాన్న మనస్సు నొచ్చుకొని మన కులములో సర్కారి నౌకరి చేసేవాండ్లు మన ఊరిలో ఎవరు లేరు. జనగాంలొ నౌకరి చేయుచున్న కొంతమంది పద్మశాలిలను గురించి తెలిపి కనీసము పంతులు అయినా చేయమని కోరినాడు. నన్ను పంపించుటకు ఆ ముస్లిం పైరవీకారును పంపించి చెప్పించినాడు. ఆతడన్నాడు నీకు ఉర్దూ ఇంగ్లీషు వచ్చును గదా ఉర్దూ నాలుగవ తరగతి చదివిన వారికే ఉద్యోగాలు యిస్తున్నారు. నీవు ఆరవ తరగతి చదివినవాడివి. పైగా ఇంగ్లీషు వచ్చినవాడివి. నిన్ను కండ్లకద్దుకొని నియమిస్తారు. నీవు నీకిష్టమైన ఉద్యోగం చేయుమని చెప్పినాడు. అది ఎంతనిజమో తెలుసుకోవాలని సరే వస్తానన్నాను. మా నాన్నగారు అమితమైన ఆనందం పొందినాడు. మరుసటి దినము అతనితో కలసి జనగామ వెళ్లినాను. నన్ను నేరుగా తహసిల్దారుగారి ఇంటికి తీసుకవెళ్ళినాడు. కానీ ఆ రోజు ఆయనగారు దౌర (టూర్) పై వెళ్ళినాడని వచ్చేవరకు మూడునాలుగు రోజులు పట్టగలవని తెలిసినది. సాయంకాలం ఇంటికి తిరిగి వచ్చిన పిదప మా నాన్నగారు ఎంతో ఆదుర్దాతో ఎదురుచూస్తున్న వ్యక్తి. విషయం విని నీరసపడిపోయినాడు. నాకు మాత్రం ఒకగండం గడిచినట్లు అనిపించింది. ఆ తర్వాత ఆ ముస్లిం పైరవీకారు రాలేదు. నా ఉద్యోగం గురించి మళ్ళీ ప్రస్తావన తేలేదు.

మా అన్నయ్య వ్యాపారములో కాసిన్ని డబ్బులు సంపాదించి వ్యవసాయదారులకు అప్పులు పెట్టుట ప్రారంభించినాడు. అవియైన తన తాహతుకు మించని వుండేవి. ఆయనగారి దృష్టి వ్యవసాయముపై పడినది. ఒక వ్యవసాయదారుడు తన విత్తిన వేరుశెనగ చేలు రెండెకరాలది గుత్తకు అమ్ముతానని ఇప్పుడే కోతకు వచ్చినదని తనకు డబ్బు అవసరమున్నదని మా అన్నయ్య వెంట పడినాడు. ఆయనను చేనుకు తీసుకువెళ్ళి చూపించినాడు. కోత మంచిగా వున్న

దిక్కున రెండుమూడు చెట్లు పీకి కాయలు చూపించినాడు. అతడే విధంగా నచ్చచెప్పినాడో కాని 20 రూపాయలకు పంట ఖరీదు చేసినాడు. వ్యవసాయదారుడు డబ్బులు తీసుకొని చేలును పంటతో స్వాధీనపరిచినాడు. ఈ విషయం ఎంతో ఘనంగా ఇంటిలో మా నాన్నతో చెప్పుకున్నాడు అన్నయ్య. అప్పట్లో పల్లా 5 రూపాయలు మార్కెటులో ధర వుండేది, గ్రామంలో చిల్లరగా బస్తా శెనగకాయలు 1 రూపాయి ధర పలికెడిది. పల్లా అనగా నూటఇరవై శేర్లు. అది ఇప్పటి క్వింటాలుకు సమానం. ఆరుగాలము కష్టపడి పనిచేసేడి రైతు ఇంత తక్కువ వెలకు రెండెకరాల పంట ఇచ్చినాడంటే నాకు అనుమానము కలిగినది. కాని నేను మాట్లాడితే ఆయనగారు విపరీతార్థం తీస్తారు. కావున అపుడు నేనేమనలేదు. మరుసటి రోజు పొలములోని పంటను మా స్వాధీనపరచి పంట చేతికి వచ్చేవరకు కాపలా కాయాలి. పగలు ఎవరో పక్కచేనువాళ్లకు చెబితె చూచుకుంటారు. కాని రాత్రిళ్ళు తప్పనిసరియని రైతు పంటచేనును చూపించినాడు. ఆదివరకే మా పెద్దన్న చూచియున్నాడు. కావున నేను మరియు మూడవ అన్నయ్యకు వైకుంఠం వెళ్ళినాము. వైకుంఠం అన్నయ్య నేను చేయి విరిగి ఇచ్చుకి వచ్చేవరకే ఇక్కడవున్నాడు. ఆయన మేము వచ్చిన పిదప సోలాపురం వచ్చేవాడు ఆగిపోయినాడు. అయితే మేమిద్దరము వెళ్ళి చేనంత కలియ తిరిగి రైతు వెళ్లిపాయిన పిదప వేరువేరుచోట్ల 5,6 చెట్లు పీకి కట్టకట్టుకొని ఊరిలోనికి తీసుకువచ్చినాము. ఊరిబయట వున్న ఒకరైతుకు ఆ పీకితెచ్చిన వేరుశెనగ చెట్లను వానికి కాసిన కాయలను చూపినపుడు మా అన్నయ్యకు కుచ్చుటోపి పెట్టినాడని నష్టం తప్పదని తెలిపినాడు. ఎందుకనగా చెట్లకు సగటున చూచిన 5 లేక 6 కాయలు మించవు. ఆ విషయం విని వాటిని తీసుకుని ఇంటికి వచ్చినాము. మా పెద్దన్నయ్య ఇంటివద్ద లేడు. నాన్నగారికి విషయం వివరించినాము. ఆయన విని నిట్టూర్చినాడు. ఎందుకంటే విషయం విని మనసులో అట్టిపెట్టుకుంటాడు. కాని బయటపడడు. పైగా కొంత నోటిదురుసు అహంభావి అయిన మా అన్నయ్యను మందలించడు చూస్తు వెళుతాడు.

ఇక రాత్రిళ్ళు చేనుకాపలా తప్పనిసరియైనది. నేను మరియు వైకుంఠం అన్నయ్య కలిసివెళ్ళెడివారము. ఒక్కొక్క తడవ నేనొక్కన్నే వెళ్ళెడివాన్ని. ఆ చేనుకు చుట్టుపక్కల వాళ్ళు గూడ కాపలాకు వచ్చెవాళ్లు. నిప్పునడిగి పెట్టుకుని

చుట్టత్రాగుతు గడిపేవాళ్లు. నాకు చుట్ట బీడి అలవాటు లేదు. వీలుంటే వారితో బాతాఖాని వేసెడివాన్ని లేదా చేనుకు ఏదోవయాలకు వుడుచుకుని నిద్రించెడివాన్ని. ఈ చేను పెద్దచింతల తోపులో వన్నదని అదైనా దయ్యాలగడ్డకు దగ్గరగా వున్నదని నేనిదివరలో దయ్యాల ముచ్చట చెప్పినపుడు వివరంగా వ్రాసియున్నాను. అట్లు శెనగచెట్టు గింజలు పూర్తిగా అయిన పిదప చుట్టుప్రక్కల వాళ్ళు పీకిస్తువుంటే మేము కూలివాళ్లను పెట్టకుండా కుటుంబ సభ్యులము అందరము ( మా నాన్న తప్ప) పీకి పనలుపనలుగా పెట్టినాము. అది ఎండుబారు వరకు రేత్రిపగలు కాపలా కాయవలసి వచ్చినది. తీరా ఎండిన పిదప పనలన్ని కుప్పలుగాపెట్టి చెట్టునుండి కాయలు తెంపుటకు తిరిగి మా కుటుంబ సభ్యులందరము చేరినాము. అందరు కాయలు తెంపుతూవుంటే నేను పనలు కుప్పలు తెచ్చి వారిముందు కుప్పగా వేయటం చేసినాను. పగలు 3 గంటల సమయమపుడు మా పెద్దన్నయ్య ఇంకా ఎన్ని పనలు వున్నావని అడిగినాడు. తెంపిన కాయలను చూస్తుంటే నాకు వళ్ళుమండుకొస్తుంది. ఎందుకనగా అది మా అంచనాకన్న చాల తక్కువగా వుంది. అనవసరంగా ఇన్నిరోజులు కాపలా ఇంతమంది శ్రమశక్తి వృధా ఆయెనని నా బాధ. ఆయన అలా అడిగినపుడు వెటకారంగా ఇంకా 20 పనలు కుప్పలు ఉన్నావని అన్నాను. నా మాటలోని ధ్వనిని గుర్తుపట్టి మళ్లి రెట్టించి అడగినాడు. ఆయనకు అర్థమైనది. చాలా నష్టపోతున్నామని, తిరిగి అడిగినపుడు త్రెంపిన పల్లికాయను చూపించి ఇంకా మూడు పనలు మాత్రమే మిగిలినవి. దండగ బేరం చేసి ఇంట్లోవాళ్లందరిని ఎండలో పనిచేయించితివి. వుమ్మల్ని తెల్లందాక దయ్యాలగడ్డకు కాపలా వుంచితివి. అని నాలో ఉన్న ఉక్రోషమును వెళ్లగక్కినాను. మా అన్నయ్య ఇలా నేను తిరుగబడి మాట్లాడతాడని ఊహించివుండడు. నా మాటలు విని రెచ్చిపోయి తిట్లను లంకించుకున్నాడు. నేను ఆయనకు తీసిపోక తిట్లకు బదులుగా రెట్టించి మాట్లాడినాను. నేను మాట్లాడినకొలది ఇంకా రెచ్చిపోయి తన ఇష్టం వచ్చినట్లు తిట్టినాడు. నేను ఒక కుప్ప పనలు తెచ్చి అటుపడవేసి ఇంటిముఖం పట్టినాను. సాయంకాలం వరకు తెంపుట పూర్తిగావించుకొని వేరుశెనగ మూటలతో ఇల్లు చేరినాడు. అందరం కలసి భోజనం చేసె సమయమున మా నాన్నగారితో చేనులో జరిగిన సంఘటన వివరిస్తు నారాయణ నన్ను ఎదిరించి మాట్లాడటమే కాదు నన్ను విమర్శించాడని మా అన్నయ్య చెప్పుకున్నాడు. అంతకుముందే విషయాన్ని మా నాన్న తెలిసికొని వున్నాడు. అయినా నా తప్పు లేకపోయినప్పటికి పెద్దవాళ్లను ఎదురించి మాట్లాడుట తప్పని

నష్టం వస్తుంది ఒక్కొక్కప్పుడు. లాభం గూడ వస్తుంది. ఏదిచేసినా బాధ్యుడు అతడే కావున నీవు అలా ధిక్కరించి మాట్లాడటం బాగాలేదని మా నాన్న ఆయనను సమర్థిస్తు మా అమ్మకూడా నన్నె అన్నారు. నాకు పెద్దగా బాధ దుఃఖము వచ్చినవి. ఎలాగో తమాయించుకుని తిండిమీది నుండి లేచి చేయికడుక్కొని మా పెద్దనాన్నగారి యింటికి వెళ్లిపోయినాను. ఎందుకనగా ప్రతిదినం నేను అక్కడనె నిద్రించెడివాడిని. నాకు సంబంధించిన గుడ్డలు ఇతరములన్ని అచటనే వుంచుకునెడి వాన్ని. నేను వెళ్ళి మా పెదనాన్నతో జరిగిన సంఘటన చెప్పినాను. ఆయన నన్ను ఓదార్చుతు మాట్లాడినాడు. నేనేమి మాట్లాడకుండా పక్కపరుచుకొని ముడుచుకుని పడుకున్నాను.

## సోలాపురం ప్రయాణం

నేను పడుకున్నానన్న మాటే కాని నిద్రపట్టలేదు. నేను వాస్తవాన్ని వివరించి చెప్పినందుకే నన్ను అమ్మానాన్న కోపించినారు. ఈ అవమానం భరింపరానిదిగా వుంది. నేనిక్కడ పనిలేకుండా వున్నందుకే నాపై కోపంగా వున్నారు. ఇక ఇక్కడ వుండటం కూడదనుకున్నాను. సాయంకాలమే ఒక నిర్ణయానికి వచ్చి సోలాపురం వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. అయితే రైలు ఖర్చులు కావాలి కదా? అందువలన మాకు తెలిసిన కిరాణాకొట్టు వంగా వెంకయ్యవద్ద మా అన్న ఇవ్వమన్నాడని రూ. 15/- అడిగి తెచ్చుకున్నాను. అట్లే స్నేహితుడైన బండయ్య అనునతనితో నా ప్రయాణం తెలిపి రేపు పగలు రెండుగంటల పిదప మా అమ్మకు నేను వెళ్లిపోయినానను కబురు చెప్పమన్నాను. ఆ బండయ్య నాతోటి మా పెద్దనాయన ఇంటిలో మాట్లాడుకుంటు పడుకునేవాళ్ళము. అతను వారించే ప్రయత్నం చేసినాడు. కాని నా నిర్ణయమునకు తిరుగులేదని తెల్పినాను. రాత్రి అమ్మానాన్న కోపగించు వరకు వెళ్లాలా వద్దాయను గుంజాటనలో వున్నాను. కాని ఎపుడైతే వారు కూడ కోపగించినారో నిర్ణయమునకు స్థిరత్వము ఏర్పడినది. పడుకునే ముందు ఒక చేతి సంచిలో నా బట్టలు సర్దుకున్నాను. మా పెదనాన్న వాళ్లందరు నిద్రించినారని నమ్మకం కలిగిన పిదప నెమ్మదిగా లేచి సంచి మరియు బూట్లు చేత పట్టుకుని చప్పుడు కాకుండా బజారు తలుపు తీసుకుని బయటకు వచ్చినాను. అపుడు దాదాపు రెండుగంటల రాత్రి అయివుంటుంది. నిశ్శబ్ద వాతావరణం. వెన్నెల వుంది. ఒంటరి వాడినను భావం తప్ప ఏ భావం లేకుండా వూరుదాటి జనగామ త్రోవ పట్టినాను. జనగామ మా గ్రామమునకు దాదాపు

6 మైళ్ళ దూరం. అప్పట్లో రహదారులు సరిగా వుండేటివికాదు. ఐనా అది బండ్లబాట. ఊరుదాటి ఒక తడవ వెనుదిరిగి చూచినాను. ఎవరేని వస్తున్నారేమోయని ఊరిలో కుక్కల అరుపులు దూరంగా చింతల తోపులో నక్కల అరుపులు. ఊరు దాటగానే చింతలతోపు వస్తుంది. దయ్యాలగడ్డ ఇక్కడనే వుంది. అటుగా ముస్లింల గోరీలు, నెమ్మదిగా నడుచుకుంటు వెళుతున్న భయం వున్నప్పటికి వెళ్లాలను పట్టుదల ముందుకు నడిపించింది. అప్పుడు వానచినుకులు పడుతున్నయి. దారికి ఇరువేపుల మోదుగులు, వావిలి పొదలు, వెన్నెల కారణంగా చాలా దూరం వరకు చూడగలుగుతున్నాను. అట్లె దారిలో ఏదేని పురుగు పుట్ర భయంతో కాళ్లకు బూట్లు వేసుకున్నాను. మా గ్రామశివారు దాటిన పిదప పటేలుగూడెం శివారులో పెద్దకుంట దాటాలి. కట్టపై నడువాలన్న పిల్లబాట. క్రిందినుండి బండ్లబాట. బాట ప్రక్క వరిపొలాలు. అన్ని నాట్లు పడివున్నవి. కట్టక్రిందినుండి నడువాలంటె బురద. అందువలన కట్టపైనుండి పయనం సాగించినాను. అచట తరుచుగా బాటసారులను దొంగలు దోచుకునేవారు. రేత్రి అటుగా ఒంటరి ప్రయాణం చేయరు. నా వద్ద రూ. 15/-లు మరియు బట్టలు తప్ప వేరే సొమ్ములు లేవు. నెమ్మదిగా చీమచిటుక్కుమన్నా ఆగి చూచుకుంటు పయనం సాగించి కుంటను దాటినాను. ముందుకు రెండు ఫర్లాంగులు వెళ్లుసరికి వాగు. అది మోకాలిబంటి నీటితో ప్రవహిస్తుంది. బూట్లు విప్పి కొంతసేపు ఒడ్డుపై కూర్చుని బండ్లబాటను బాగా పరిశీలించినాను. ధోవతిని పైకి కట్టుకుని సంచిబూట్లు చేతబట్టుకుని వాగులోనికి దిగినాను. బండ్లబాటను ఏమారక మెల్లిగా దాటుట ప్రారంభించినాను. పెద్దవురవడి లేకున్న నీరవ వాతావరణంలో ప్రవాహం చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. నెమ్మదిగా ఏ ప్రమాదం లేకుండా అవుతలివడ్డుకు చేరినాను.

వాగు దాటిన పిదప రెండు దార్లువున్నావి. ఒకటి కాలిబాటగా తాళ్లతోపుగుండా నెల్లుట్ల చేర్చుతుంది. రెండవది బండ్లబాట జనగామ సూర్యాపేటకు చేరుస్తుంది. ఐతే పిల్లబాట ద్వారా వెళ్ళితే దూరం తగ్గుతుంది. కాని తాటితోపుగుండా వంటరి పయనం భయం అనిపించి బండ్లబాటగుండా రోడ్డెక్కినాను. పెద్దదూరం కాకపోవుటచే తొందరగా రోడ్డు చేరుకుని అచట ఒక కాల్వబండ మోరిపై కూర్చుని కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాను.

దూరంగా ఎవరో ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటు వెళుతున్నారు. మొదట వారు దొంగలని భయపడినాను. కాని వారి మాటలనుబట్టి వారు పటేలుగూడెం వారని ధృవపడి జనగాం దిక్కుగా రోడ్డు పయనం సాగించినాను. దారిలో నెల్లుట్ల దాటాలి. అక్కడికి చేరుకునే వరకు కాళ్ళులాగుట అలసట కలిగినది. ఊరు బయట మోరిపై మళ్ళీ కాసేపు కూర్చుని నెమ్మదిగా పయనం సాగించినాను. నెల్లుట్ల దాటిన పిదప కొంతమేర పొలాలు అవి దాటిన పిదప మోతుకులు. ఈ మోతుకుల వద్ద కనీసం వారమునకు ఒకటిరెండు దోపిడీలు జరుగుతవి. జనగాం నుండి సరుకులు తెచ్చె బండ్లలో గల వానివి దోచుకునేవారు. లేదా రైతులు తమ ధాన్యం అమ్మి తీసుకువెళ్ళె డబ్బులు దోచుకునేవారు. అందువలన బండ్లవాండ్లు జట్టుగా ఆ ప్రదేశమును దాటెడివారు. నాకా విషయం గుర్తుకువచ్చి భయం వేసినది. నాల్గుదిక్కుల పరికిస్తు భయంగా పయనం సాగించి నెల్లుట్ల చెరువుదాటి జనగామ శివారు ప్రవేశం చేసినాను. ఇప్పటివరకు బావులకు మోటలు కట్టి నీరు తోడుచున్న చప్పుడు వినిపిస్తోంది. రైతులు మేల్కొని పశువులకు మేత మున్నగునవి చూస్తున్నట్లుంది. మనుష్యుల అలికిడి వినిపిస్తోంది. పయనం వేగం తగ్గించి మెల్లిగా నడవటం ప్రారంభించి జనగామ వూరిలోకి చేరుసరికి ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. కొందరు రైతులు తమతమ పొలాలకు వెళుతున్నారు. కొన్ని ఇండ్లముందు ఊడ్చుచున్నారు. నేను చక్కగా రైల్వేస్టేషన్‌కు చేరుకుని తెల్లవారువరకు అచటనే యున్నాను. ప్రొద్దుపొడిచిన పిదప స్టేషన్‌కు దగ్గరగా యున్న అంబ బావి దగ్గర ముఖం కడుగుకుని మళ్ళీ స్టేషన్ చేరుకున్నాను. నేను వెళ్లాల్సినరైలు పగలు వంటిగంటకు వస్తదని స్టేషన్ మాస్టర్‌ను అడిగితే చెప్పినాడు. అప్పటివరకు ఏమిచేయాలి. ఒకవేళ తెల్లవారి నేను కనిపించక పోవుటచే బండయ్య ద్వారా నా పయనం విషయం తెలుసుకుని నన్ను తిరిగి తీసుకువెళ్ళుట మా అన్నయ్య వచ్చినట్లు అవుతె ఏమిచేయాలి. అంతవరకు ఎక్కడ వుండాలి అని ఆలోచించగా నాకు పెంబర్తిలో మా మేనమామ కూతురు వున్నదని గుర్తుకు వచ్చినది. నేను అచటికి వెళ్ళి రైలువేళ వరకు వారింట గడిపి వెళ్లవచ్చును. ఒకవేళ నా కొరకెవరైనా వచ్చిన జనగాంలో చూచి నేను కన్పించక పోవుటచే తిరిగి వెళ్లగలరను భావంతో రైలు పట్టాల వెంబడి పెంబర్తి త్రోవపట్టినాను. జనగాం నుండి పెంబర్తి రెండుమైళ్ళుంటుంది. అచట స్టేషన్ వుంది నేను అచటినుండే టికెట్టు తీసుకుని వెళ్ళవచ్చునని నిశ్చయించుకొని నెమ్మదిగా పయనం సాగించినాను. ఉదయం 8 గంటల వరకు స్టేషన్ చేరుకుని అక్కడి నుండి ఊరిలోకి వెళ్లి మా బంధువుల ఇంటికి చేరుకున్నాను. మా వదిన రంగమ్మ

నన్ను చూచి మొదట ఆశ్చర్యపడినా నారాక ఆమెకు సంతోషం కల్గించినది. నన్ను ఆదరపూర్వకంగా ఆహ్వానించినారు.

నన్ను మా వదినె ఆమెభర్త వివరాలు అడిగినపుడు సోలాపురం వెళుతు జనగామ వచ్చినాను. ఇంకా సమయముంది కదాయని ఇక్కడికి వచ్చినానని బొంకినాను. వారు భోజనము ఏర్పాటు చేసినారు. వారితో 12 గంటలవరకు గడిపి భోజనం చేసి స్టేషనుకు వచ్చినాను. నన్ను ఇంకా రెండుమూడు రోజులు వుండమని కొరినారు. కాని నేను రేపటివరకు సోలాపురం చేరుతానని ఉత్తరం వ్రాసినాను. అక్కడ నా కొరకు ఎదురుచూస్తారు. కావున వుండుటకు వీలుపడదని తప్పించుకున్నాను. టికెట్లు కొని వెంటనే ఒక డబ్బాలొ ఎక్కక నాల్గైదు డబ్బాలలో మా వాళ్ళు ఎవరైనా వస్తున్నారేమోనని పరిశీలించినాను. ఎవరు కనిపించలేదు. నిశ్చింతముగా ట్రేను ఎక్కి మరుసటి ఉదయం సోలాపురం స్టేషన్‌లో దిగి మా ఇంటికి కాలినడక చేరుకున్నాను. నన్ను చూచి మా రంగన్న, తమ్ముడు విష్ణు నీవు ఒక్కడవే వచ్చినావు. అమ్మా నాన్న రాలేదెందుకని ప్రశ్నించినారు. నేను ఏవొ మాటలుచెప్పి తప్పించుకున్నాను. కాని వారి సందేహం తీరలేదు. రెండురోజుల పిదప నేను వచ్చిన వార్త తెలిసి మలిపెద్ది రాజయ్య కుమారుడు వచ్చి మళ్ళీ ఉద్యోగములో చేరమన్నాడు. కాని నేను రానన్నాను. వేతనము పెంచుతామన్నాడు. అయినా ఒకరి చేతికింద పనిచేయటం ఇష్టం లేదని స్పష్టంగా చెప్పి పంపించాను. ఒక వారం రోజులు గడిచిన పిదప ఏమి చేయాలని దీర్ఘంగా ఆలోచించి బట్టలు నేయుటకన్న గత్యంతరం లేదని నిర్ణయించుకున్నాను. మరుసటి దినము మొగ్గము నేసెవారివద్ద కూర్చోని నేతపని యందలి మెళకువలు అడిగి తెలుసుకున్నాను. రెండురోజుల పిదప మొగ్గముపై నేతపని ప్రారంభించినాను. రెండుమూడు రోజులు ఇబ్బంది అనిపించినది. కాని తరువాత పని చక్కగా సాగినది. అట్లు రెండునెలలు గడిపిన పిదప దేశము నుండి మా నాన్న అమ్మ, వైకుంఠం అన్నయ్య, అతని భార్య సోలాపురం వచ్చినారు. నేను మొగ్గము నేయుట చూచి ఆశ్చర్యపడినారు. మా నాన్న చిన్నబుచుకున్నాడు. ఆయన ఉద్దేశ్యమునకు అనుగుణంగా నేనెదో ఉద్యోగం చేయలేదని తుదకు అందరివలె నేతపనికే పూనుకున్నానని బాధ. అట్లు నాల్గైదు నెలలు గడిచిన పిదప దేశమునుండి మా పెద్దన్నయ్య వుత్తరం వ్రాసినాడు. అచట మా చెల్లెలికి 316/- కట్నం యిచ్చె ఏర్పాటు అట్లే తమ్మునికి అంతే కట్నం తీసుకునే పద్ధతిపై మాట్లాడినానని ఇవి మంచి సంబంధాలని అవసరమైన వస్తువులు బంగారం

త్రీసుకొని అందర్ని రమ్మని వార్త. ఆ ఉత్తరం చూచిన పిదప వెళ్ళుటకు ఏర్పాట్లు చేసినారు. కాని ఇక్కడ ఇంటివద్ద ఎవరు ఉండాలి. ఆరుమొగ్గాల ఇల్లు. నూలు పరికరాలు నేతకాల్లు. ఇవియన్ని వదలి అందరు వెళితే ఎలాయని ఆలోచించినపుడు నేను ఇక్కడె వుండి మొగ్గాలు నడిపిస్తాను. మీరు వెళ్లిరండని భరోసా యిచ్చినాను. నన్ను సోలాపురంలో వుంచి యిచట వున్న కుటుంబసభ్యులందరు దేశం వెళ్ళిపోయినారు.

నాకు మొగ్గాల బాధ్యత అప్పగించి వెళ్లినారు. అపుడు నూలు కంట్రోల్ ఏర్పడి కార్డులపై ఇచ్చెడివారు. ఆ ఇచ్చే నూలులో అవసరం లేని సన్నపునూలు కూడా వచ్చెడిది. అయితె దానిని బ్లాకులో అమ్ముకుంటె పెట్టెకు 10, 15 రూపాయలు అదనంగా లభించెడిది. నేను జాగ్రత్తగా అవసరమైన నూలు సేకరించి సన్నపునూలును బ్లాకులో అమ్మి డబ్బులు కూడబెట్టుకున్నాను. దేశంలో పెళ్లి కార్యక్రమం ముగించుకొని తిరిగి వచ్చిన పిదప మా నాన్నకు ఈ కాలంలో జరిగిన లావాదేవీలు మొదలగు లెక్కలన్ని మా నాన్నగారిగి అప్పగించి బ్లాకులో సంపాదించుకున్న 125/- రూపాయలు చూపించినాను. పని సక్రమంగా నడిపించుటే కాక అదనంగా సంపాదించినందుకు అభినందించి వానిని నీ ఇష్టం వచ్చిన వస్తువు కొనుక్కోమన్నాడు. నేను అట్టి డబ్బుతో మెడలొ బంగారు వేసుకునే తులమున్నర బంగారుగొలుసు లాకెట్ కొని చూపించి వేసుకున్నాను. అది నా స్వంత సంపాదనతో కొన్నట్టిది. దానిని చూచుకొని గర్వించెడివాడిని.

పెండ్లికి వెళ్ళునపుడు మా వారితో పాటు మా అత్త, మామ, నా భార్యను వెంటబెట్టుకు వెళ్లినారు. వారి స్వగ్రామం భువనగిరి ప్రాంతమున పల్లెర్లయను చిన్నపల్లె. అప్పటికి మా మామగారు కొంత డబ్బు సంపాదించుకొని ఇచటి తన మొగ్గాలను ఆయన బావమరిదికి అప్పగించి దేశంలో సిర్థపడుతానని ఉద్దేశించి వెళ్ళినాడు. అచట తనపూర్వ్వుల ఇల్లువుంటే దానిని బాగుచేయించుకొని అక్కడే ఏదోపని చేద్దామని ఉద్దేశించి వెళ్లినారు. మొదటవారు తమ ఊరికి వెళ్లి పెళ్లికి మామగారు మాత్రమే వుండి తిరిగి తన గ్రామం వెళ్లిపోయినాడు. ఎందుకనగా అప్పుడు మా అత్తగారు నిండుగర్భిణి. మా యింట్లో పెళ్లి అయిపోయిన పిదప మా అత్తగారు ప్రసూతి అయినదని మొగపిల్లవాడు జన్మించినాడని మా నాన్న చెప్పినాడు. 12 సంవత్సరముల పిదప కాన్పు అయినది. అబ్బాయికి అంబదాసు అని పేరుపెట్టినారని తెలిపినాడు. నా

పెండ్లి అయిన పిదప తుల్జాపురం వెళ్ళి అంబాభవానిని సేవించితే సంతానం కలుగుతుందని ఎవరో చెబితె మా మామగారు కుటుంబముతో పయనమ్మై నన్ను మరియు నా తల్లిదండ్రులను తీసుకువెళ్ళినాడు. ఆ కాలమందు తుల్జాపురం నిజాం స్టేటు యందలిది. అచట హాలి నిజాం సిక్కా చెల్లుబాటు అయ్యేడిది. అక్కడ దేవికి మాంసం మరియు మద్యం (సారా)తో నైవేద్యమిచ్చెడి ఆచారముంది. అచటవున్న మూడు రోజులు మాంసము మద్యముతో గడిపినారు. నేనప్పుడు మద్యమాంసములు ముట్టెడివాన్ని కాదు. నేను చాలా ఇబ్బంది పడినాను. అలా ఆ దేవి దగ్గరకు వెళ్ళివచ్చిన కొంత కాలమునకు మా అత్తగారు గర్భవతి అయినది. అట్టి స్థితిలోనే దేశం వెళ్లినంక ప్రసూతి అయి కుమారోదయం అంభాభవానికి మ్రొక్కిన పిదప కుమారుడు కల్గుటచే అంబదాసు అని పేరు పెట్టుకున్నారు. ఒకరోజు మా నాన్నగారు నీవు దేశం వెళ్లి మీ బావమరిదిని చూచిరమ్మని వెళ్లమన్నాడు. నేను గూడా వెళ్లాలనే ఆలోచనలోనె యున్నందున అవసరమైన డబ్బులు అడిగి తీసుకుని మొదట మా గ్రామమునకు వచ్చినాను.

నేను చెప్పకుండా వెళ్లిన పిదప మళ్లి దేశం రావడం ఇప్పుడే నన్ను చూసి మా అన్నయ్య వదిన మరియు పెదనాన్న వాళ్లు సంతసించినారు. రెండుమూడు రోజులు గడిపిన పిదప మా అత్తగారి వూరగు పల్లెర్లకు వెళుతానని చెప్పినాను. అపుడు మా పెదనాన్నగారు నీ పెళ్లి సోలాపురంలో అయినందున నీ భార్యను చూడలేదు. నీవు వచ్చెప్పుడు వెంటతీసుకురమ్మని కోరినాడు. నేను సరే అన్నాను. నేను పల్లెర్లకు వెళ్లటం ఇదే మొదటిసారి. ట్రేను మరియు బస్సుపై వెళ్లాలన్నా చాలా తిరుగుడు వుంటుంది. అందువలన చక్కటి దారి కాలినడక మంచిదని అచటికి దగ్గరగా వెళ్లెవారితో కలిసి పంపించినారు. నేను అతనితో కలిసి వారి వూరివరకు వెళ్లి అటునుండి చక్కగా పల్లెర్లకు చేరుకున్నాను. నన్ను చూసి మా అత్తమామ చాల సంతసించినారు. నేను మా బావమరిదికి వెండి మొలత్రాడు తీసుకువెళ్లియుంటిని. అదివారికి అప్పగించాను. నన్నుచూసి అక్కడి అలవాటుగా మాంసం కల్లు ఏర్పాటు చేయ యత్నించారు. కాని అవి నేను ముట్టనని వారికితెలుసు. మరియొకతడవ గుర్తుచేసి ఏ ప్రయత్నం చేయవలదు. మామూలుగా కూరగాయలతో ఏర్పాటు చేయమన్నాను. అచట కాయకూరలు దొరకటం ఇబ్బంది. నేనచట పదిరోజులున్నాను. బంధుప్రీతిగా వారేమి చేయలేక చాలా బాధపడినారు. ఎందుకనగా తెలంగాణాలో ముఖ్యముగా మా కులమందు మద్యం మాంసమునకు ప్రత్యేకత ఇస్తారు. అవి నాకేవి పట్టవు.

నేనక్కడ వున్న పదిరోజులలో మా మామగారికి సంబంధించిన బంధువులు పాలివారు నన్ను భోజనమునకు తీసుకువెళ్లినారు. కాని వారెవరు తృప్తిపడలేదు. పప్పు కూరగాయలే అగుటచేత వారికి తృప్తి అనిపించలేదు. నేను ప్రతి సాయంకాలం వూరిబయట వున్నట్టి చెరువుకట్టపై కూర్చుని ప్రొద్దుగూకే వరకు వుండి ఇంటికి వచ్చెడివాడిని. ఒకరోజు ఒక వ్యక్తి వచ్చి నన్ను చూసి నీవెవరు? ఎటునుండి వచ్చినావు. నీకిక్కడ బంధువులెవరని ప్రశ్నించినాడు. నేను నిర్భయంగా సమాధానం ఇచ్చినాను. నా మాటతీరు నా వేషభాషల తీరుచూసి తలవూపి వెళ్ళిపోయినాడు. మరుసటి వుదయం ఆ వ్యక్తి మా మామగారిని పిలిపించుకుని వివరాలు అడిగినాడట. ఆయన ఆ వూరికి దొరవారు. ఆతను కన్పించిన వెంటనే ప్రతివ్యక్తి లేచి నిలబడి నమస్కరిస్తారట. నేనది చేయలేదు. మొదట మా మామగారు చాల భయపడినాడట. కాని తర్వాత దొరవారికి నా వివరాలు తెలిపి మంచి ఫోటోగ్రాఫరని, పేయింటింగ్ బాగా చేస్తాడని నాలుగు భాషలు వచ్చునని, అన్ని భాషలలో మాట్లాడగలడని, చెప్పినపుడు ఆయనగారు బాగా సంతోషించినాడట. నేను అతని ముఖం చూడగనే పోల్చుకున్నాను. మంచితెలివి గలవాడని అని అన్నాడట. ఇంటికి తిరిగివచ్చి వివరాలన్ని తెలిపినపుడు ఆ గ్రామ పద్మశాలీలు చాల సంతసించి నన్ను బాగా పొగిడినారు.

పల్లెర్లలో 10 రోజులు గడిపిన పిదప పయనమైనాను. నాతో పాటు నా భార్యను పంపమని కోరగా అమ్మాయి చిన్నపిల్ల అంతదూరం నడువలేదు. పైగా వంటరి పయనం పంపమన్నారు. కాని నేను పట్టుబట్టి తప్పదని చెప్పినపుడు మా అత్త తల్లిగారిని మావెంట కలిపి పంపుటకు నిశ్చయించినారు. అమ్మాయికి అప్పుడు 13 సంవత్సరములు. పాదములు సరిగా మోపి నడవదు. నడక అలవాటు లేనిది. దూర పయనం. ఉదయం సద్దులు కట్టుకుని పయనం మొదలుపెట్టినాము. నెమ్మదిగా నడుచుకుంటు దారిలో పగలు సద్దితిని కొంతసేపు విశ్రాంతి తీసుకుని మళ్లి నడక సాగించినాము. చాలా కష్టంపై సాయంకాలం వరకు పెద్దమడూరులో మా అక్క వున్నట్టి గ్రామం చేరుకున్నాము. అప్పటికి ఆమె పాదాలు వాచినవి. మమ్మల్ని చూసి మా అక్కచాల సంతసించినది. మేము వస్తామని వూహించనిది. ఆమెకు సంతానం లేదు. నా భార్యను చాల అప్యాయంగా ఆహ్వానించినది. మేమక్కడ 3 రోజులు వున్నాము. నాకు మద్య మాంసములు నిషిద్ధమగుటచే మా బావగారు చాలా బాధపడ్డాడు.

అచట వున్ననాళ్లలో ఒక సంఘటన జరిగినది. నేను మా బావగారి ఇంటిముందు అరుగుపై కాలుపైకాలు వేసుకొని దర్జాగా కూర్చున్నాను. అటు దగ్గరగా రెడ్డి ఇండ్లు వున్నవి. వారు ఇటు అటు తిరుగునపుడు మా బావగారి ఇంటిముందు నుండి వెళ్లాలి. వారు నన్నుచూచి వీడెవడు. మా ముందు అరుగుపై కాలుపై కాలువేసుకు కూర్చుని లేవలేదు. పైగా నమస్కరించలేదని, మా బావగారిని పిలిచి ఆరా తీసినారు. అపుడు మా బావగారు నా విషయం తెలిపి ఆతనెవరికి భయపడడు. ఇంగ్లీషు, మరాఠీ, ఉర్దూ కన్నడ భాషలలో ప్రావీణ్యం గలవాడని తెలిపినాడట. ఆ విషయం విన్న పిదప వారు నోరుమెదప లేదని ఇంటికివచ్చి మా బావగారు తెలిపినారు.

నేనచట 3 రోజులుండిన పిదప నా భార్యను ఆమె అమ్మమ్మను వెంటబెట్టుకొని కుందారం పయనమైనాను. మడూరు నుండి మా గ్రామం 6 మైళ్ల దూరం వుంటుంది. మొన్నటి పయనంతో కలిసిన అలసట కొంత తగ్గుముఖంపట్టినది. మళ్ళీ అచట మేము భోజనాలు చేసి పయనమై సాయంకాలం వరకు ఇల్లు చేరుకున్నాము. ఇచట నా భార్యను మా పెదనాన్నకు, పెద్దమ్మకు చిన్నమ్మకు ఇతర పాలివాండ్రకు పరిచయం చేసినాను. ఇక్కడ కొన్నాళ్లున్న పిదప పల్లెర్ల నుండి మా మామగారు తన కూతురును పంపించ వలసినదిగా కబురుపెట్టినారు. మేము ఇక్కడ ఒక నమ్మకమైన కూలి మనిషిని మాట్లాడి అతనితో నా భార్యను ఆమె అమ్మమ్మను ఇచ్చి పంపించినాము. ఆ కూలి మనిషి వారిని పల్లెర్లలో దిగబెట్టి మరుసటి వుదయం తిరిగి వచ్చి వారిని క్షేమముగా చేర్పించానని అచట వాళ్లందరు కులాసాగ వున్నారని తెలిపినాడు.

వాళ్లు వెళ్లిపోయిన పిదప రెండుమూడు రోజులు వుండి మా బంధువులను చూచుటకై గ్రామాలు తిరుగుట ప్రారంభించినాను. నేను మొదట మా వూరునుండి చక్కగా వడ్లకొండ చేరినాను. మా తమ్ముని అత్తగారి వూరు. ఇది మా వూరికి 8 మైళ్ల దూరం వుంటుంది. నేను ఉదయం ఇంటినుండి వెడలి ఇక్కడికి ఉదయం 11 గంటల వరకు చేరుకున్నాను. మా తమ్ముని అత్తగారి తల్లిగారి వూరు కుందారమే. ఆయన మొదటి భార్య మరణించుటచే ఈమెను మళ్లి పెళ్లిచేసుకున్నాడు. నన్ను గురించి వారు తెలిసిన వారు. కావున ప్రేమతో ఆహ్వానించినారు. నేను ఆ దినం గడిపి మరుసటి దినం మా చెల్లెలి అత్తగారు వూరైన వెలిదండ వెళ్లినాను. మా చెల్లె పెండ్లి సమయమున నేను సోలాపురంలో వుండుటచే వీరెవరికి పరిచయము లేను. నేనక్కడ చేరిన పిదప

మా చెల్లి ద్వారా నేను ఫలానా అని తెలువగనె ఆమె అత్తమామ మా బావగారు చాలా అప్యాయంగా ఆహ్వానించినారు. ఆ కాలమున బంధుత్వమునకు ఎంతో ప్రాదాన్యత ఇచ్చెడివారు. మా చెల్లి అత్తగారిది ఒక మోస్తరైన కుటుంబం. వృత్తి వైద్యంతోపాటు కొంత వ్యవసాయం కలిగివుండి గౌరవంగా బ్రతుకుచున్నారు. మా చెల్లెలు మామలది అప్పట్లో సమిష్టి కుటుంబం. చెల్లెలు మామగారి పేరు శిద్దిరాములు. ఆయనగారి తమ్ముని పేరు చినశిద్దిరాములు. చిన్న అతను వైద్యం చేసెడివాడు. పెద్దాయన వ్యవసాయము మరియు కుటుంబ వ్యవహారములు చూచెడివాడు. చినశిద్దిరాములు అత్తగారు కూడ మా గ్రామమే. అతని భార్య నాకు వరుసకు కూతురు అవుతుంది. నేను వారికి మామ వరుస. కాని మా చెల్లెను పెద్దశిద్దిరాములు గారి కుమారునకు ఇచ్చుటచే ఇప్పుడు వరుస తారుమారైనది. చినశిద్దిరాములు గారు వైద్యవృత్తితో పాటు కళయందు అభిమానము కలవ్యక్తి. తనకు హైద్రాబాద్‌లో ఒక స్టూడియో అతను స్నేహితుడని అతను చేయించుకొన్న పేయింటింగ్ చూపినాడు. నేను తర్వాత తెల్సుకున్నపుడు అది ''మెట్రొ స్టూడియో'' అని తెలిసినది. మా చెల్లె పెండ్లికి వీరందరు వచ్చి మా ఇంట్లో మరియు మా పెదనాన్నగారి ఇంట్లో నాచే వేయబడిన గోడబొమ్మలు రామలక్ష్మణ సీతా మున్నగు వానిని చూచి చాలా సంతసించినారట. నేను వెంట ఎప్పటికి ఒక పాకెట్‌నోటు బుక్‌ని వుంచుకొనెడివాడిని. దానియందు నేను దించిన బొమ్మలు వుండెడివి. ఏదేని దృశ్యము మంచిది కనిపించినపుడు దానిని చిత్రీకరించెడివాడని. వారు నా నోటుబుక్ నందుగల చిత్రములన్ని పరిశీలించి చాలా మెచ్చుకున్నాడు. వీరి కుటుంబం పద్మశాలి వృత్తినందు లేక నాగరికంగా వుండెడివారు. వ్యవసాయము పాడి సమృద్ధి. మొదటిరోజు మాంసము ముట్టనని తెలిసి నిరాశపడినారు. కాని పుష్కలమైన పాడి దానితో పాటు కూరగాయలు తెప్పించి మంచి భోజనం ఏర్పాటుచేసెడివారు. నేను మా బావగారిని పరిశీలించినపుడు అమాయకంగా కన్పించినాడు. మాట కొద్ది నత్తి. మనిషి మొరటు. ఇంటియందు గూడ చిల్లరపని చెప్పి చేయించెడివారు. ఈ సంబంధం మా అన్నగారు స్థిరపరచి మా నాన్నకు కబురుపెట్టి పిలిపించినాడు. ఆయన వారింటియందున్న మర్యాద, కల్గిన కుటుంబం మంచి మర్యాదలనే చూచినాడు. కాని పిల్లవాన్ని పరిశీలించినట్లు లేదు. నాకపుడు ఆయనగారు తొందరపడినారనిపించినది. నిజజీవితములో అది నిజమని నిరూపింపబడినది. నేను వెలిదండలో 5 రోజులు వున్నాను. ఇక వెళ్లిపోతానంటే ఇంకా వుండమని నిర్బంధించినారు. కాని నేను సోలాపురం వెళ్లిపోవాలి. వచ్చి చాలారోజులు అయినదని చెప్పి ఇంటిత్రోవ పట్టినాను.

వెలిదండనుండి నేరుగా ఎర్రగొల్లపాడు అను గ్రామమునకు వచ్చినాను. ఇక్కడ మా పెద్దమ్మ కూతురు వుంటుంది. ఆమె మా కుటుంబమును చాలా ప్రేమగా చూచుకొనెడిది. చిన్ననాడె తలిదండ్రులు మరణించుట చేత మా నాన్నగారు ఆమెను ఆదరించినాడు. ఆమె మా ఇంటికి తల్లిగారింటికి వచ్చినట్లు వచ్చెడిది. మా అన్నతమ్ములను తోడబుట్టువులుగా భావించెడిది. నేనక్కడ రెండు రోజులు వున్నాను. నేనెక్కడికి వెళ్ళినా తిండి సమస్య ఇబ్బంది కల్గించెడిది. ఇంతదూరం వస్తే ఏమీ ప్రత్యేక భోజనం పెట్టలేకపోయినామని బాధపడెడివారు. మూడవనాడు మా గ్రామమునకు దారిలో వున్నట్టి మండెలగూడెం వెళ్లినాను. అచట మా నాన్న అక్కవున్నది. ఆమెకు ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు జనగామలో వుంటాడు. చిన్న కుమారుడు మండెలగూడెంలోనే వుంటాడు. మా అత్తకూడా తన చిన్నకొడుకుతోనే వుంటుంది. తన చిన్నకొడుకుకు మా గ్రామం అమ్మాయినే చేసినారు. పేరు శాంతమ్మ. నిజంగా శాంతమె రూపుధరించినట్లుండెడిది. నన్ను చూచి చాలా సంతసించినారు. ఆది మా మేనత్త వూరు కనక చిన్నప్పుడు ఒకటిరెండు తడవలు వచ్చినట్లు గుర్తు. ఆ దినం మండెలగూడెంలో గడిపి మరుసటి దినం కుందారం పయనమైనాను. నన్ను అపుటకు వారెంతో ప్రయత్నించినారు. కాని నేను వెళ్లివచ్చినాను. ఇంటికి వచ్చేవరకు మా అన్నయ్య-మా పెద్దనాన్న ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు. ఒక్కన్నె వెళ్లుటచేత మరియు దారి అంత అడివిమయమగుటచేత పైగా నా మెడలో బంగారు గొలుసు వుండుటచేత నేను చిన్నవాన్ని అగుటచేత నేను వెళ్ళిన నుండి ఏ విధమైన కబురు వారికి అందకపోవుటచే భయపడినారట. నేను (మంచిగా) క్షేమంగా ఇల్లు చేరుకొనుటచే ఊపిరి పీల్చుకున్నారు.

కుందారములోనే రెండుమూడు రోజులు గడిపి సోలాపురం వెళుతానని మా అన్నగారితొ చెప్పినాను. సరె వెళ్ళిరమ్మన్నాడు. మా పెదనాన్న పెద్దమ్మవద్ద సెలవు తీసుకొని సోలాపురం వెళ్ళినాను. అచట మళ్లి మెుగ్గముపై బట్టలునేయుట ప్రారంభించినాను. ప్రతి బుధవారం సెలవు. ఆ దినము ఏదేని పేయింటింగ్ దొరికిన చెసెడివాడిని. సెలవుదినాన్ని ఉత్సాహంగా గడిపెడివాన్ని. నేను వేరొక ధనివద్ద ప్రతి బుధవారం లెక్కలు చేసిపెట్టెడివాన్ని. ఆయనకు చదువురాదు. ఆయన ఆరు మొగ్గాల ధని. అట్లు లెక్కలు చేసిపెట్టినందుకు ఆయన నెలకు రెండు రూపాయలు ఇచ్చెడివాడు. నేను వారమునకు అరగంట పనిచేసిపెట్టెడివాన్ని. అప్పట్లొ మా ఇంట్లొ సన్ననూలుతో చీరెలు నెసెడివారము.

నాచే నేయబడిన చీరెలు బాగుండెడివి. వారమునకు నేను దినమునకు ఒకటి చొప్పున 6 చీరెలు నేసెడివాడిని. బుధవారం సెలవు అగుటచే పనిచేయక పొయెడివాడిని. మా ఇద్దరు అన్నయ్యలు, నేను మా తమ్ముడు నల్గురం పని చేసేడివారము. ఇంకొకనేతకాళ్లను వారిలో ఒక కట్లను వుంచుకున్నాము. (కట్ల అనగా భార్య, భర్త మొగ్గం నేస్తె భార్య కండెలు చుట్టుట మున్నగు పనులు చెసెడిది) ఆమెకు లెక్క ప్రకారంగా కూళ్లు ఇచ్చెడివారము. కొంతమంది తమ కుటుంబములో బ్రతుకుదెరువు కొరకు వచ్చెడివారు. చాలామంది వంటరిగా వచ్చి కష్టపడి డబ్బులు సంపాదించి ఇంటికి భార్య పిల్లల కొరకు పంపించెడివారు. అట్లేవారు కోంత డబ్బు తీసుకువెళ్లి దేశంలో కొంతకాలం గడిపి తిరిగి వచ్చెడివారు.

దేశం నుండి మామగారు తిరిగి వచ్చినారు. కుటుంబంతో అక్కడ స్థిరపడుదామని వెళ్ళినాడు కాని అది సాధ్యపడక పని వసతి కలువక కొన్ని అప్పులు చేసుకుని తిరిగి వచ్చినాడు. తను వెళ్లనపుడు తన మొగ్గాల్ని బావమరిదిలకు అప్పగించి వెళ్లియుండెను. వంళ్ళీ వచ్చిన పిదప తను తీసుకుని నడిపించుకొనుచున్నాడు. ఇపుడు నా భార్య తిరిగి సోలాపురం వచ్చుటచే మా యింటికి తీసుకువచ్చినారు. మాది సమిష్టి కుటుంబం. ఇద్దరు వదినెలు, మా అమ్మ. ఇపుడు నా భార్యకూడా చేరినది. కూతురు ఒకతే అగుటచే ప్రేమగా పెంచుకున్నారు. పనిలో చురుకుదనం తక్కువ. కాని మా ఇంటికి వచ్చిన పిదప పనులు చేయుట యందు శ్రద్ధ కనబరచి మాట పడకుండ నడచుకునేది. అపుడామె 14 సం॥లు. మేము భార్యాభర్తలం మాట్లాడుకొనుటకు వీలుదొరకక పొయెడిది. సమిష్టి కుటుంబమగుటచే అత్తమామలు, బావలతొ ఏరాండ్ర ముందు మాట్లాడుటకు సిగ్గుపడెడిది. నా భార్య అమాయకత్వమును ఆధారముగా తీసుకుని మా వదినెలు ఆమెకు ఎక్కువ పనులు పురమాయించెడివారు. ఐనా ఓర్పుతో చేసెడిది. కొన్నాళ్ల పిదప మా అమ్మానాన్న దేశం వెళ్లిపోయినారు. ఇక మా వదినెలు పెత్తనంతొ నా తిండి విషయం శ్రద్ధ తీసుకునెడివారు కాదు. నేను స్వతంత్రించి నా భార్యతో చెయించలెను. చెప్పినా ఆమె చేయదు. అగుటచే నాకు ప్రతిదినం ఏదో ఒక కూర ప్రత్యేకంగా మా అమ్మ వున్నపుడు చేసిపెట్టెడిది. కాని ఆమె వెళ్లిపోయిన పిదప నాకు సమస్యగా పరిణమించినది. దినమంత మొగ్గంపై పనిచేసి సరియైన తిండిలేక ఇబ్బంది అయ్యెడిది. సోలాపురంలో రోట్టెలు ముఖ్య ఆహారం. వానిలో

జొన్నరొట్టెలు. వానికి సరియగు కూరలేకుండా తినుట కష్టము. అయినా చాల కాలం నేను ఓర్పువహించి ఎలాగో సర్దుకుపోయెడివాడిని.

ఈ కాలముననే నా భార్యకు తెలిసినది. నేను మొదటినుండి శుచి శుభ్రతకు ప్రాధాన్యత ఇచ్చెడివాడినని అది లోపించెడిది. ఇప్పుడు నా విషయమే కాకుండా నా భార్య విషయం ఆలోచించాల్సిన పరిస్థితి ఏర్పడినది. అచట ప్రతి మంగళవారం కట్టెల అంగడి జరిగెడిది. అంగడికి వెళ్లి కట్టెలమోపులు ఖరీదు చేసుకుని నెత్తినపెట్టుకుని తెచ్చెడివారు. దీనికి అడవెుగ అందరు కలిసివెళ్లెడివారు. నేను మాత్రం వెళ్లకపోయెడివాడిని. కాని నా భార్యను ఆపలేకపోయినాను. అందరి కోడండ్రతోపాటు ఆమె వెళ్లినది. నేనీవిషయం మా అన్నలతో ప్రస్తావించి మీరు పని మానుకుని అంగడికి వెళ్లి మోసితెచ్చెడికన్న కూలివానిచేత మోపించి తేవటము లాభం. ఎట్లనగా మీరు వెళ్లివచ్చె సమయానికి అర్ధరూపాయి పని చేయుగలరు. మీరిద్దరు కలిసి ఒకరూపాయి పని పోడగొట్టుచున్నారు. ఈ రూపాయి పెట్టినట్లు అవుతే 8 మంది కూలీలు కట్టెలమోపులు తెచ్చివేయుగలరు. నాడు బేడ డబ్బులకు కూలివాడు కట్టెలమోపును తెచ్చి ఇంటిముందు వేసివెళ్ళెడివాడు. దీనిపై మాలో మాట పట్టింపులు వచ్చినవి. నేను ఇంతగా శ్రమించి పనిచేసి నిష్ప్రయోజనంగా వున్నది. గుర్తింపు లేదు. వాస్తవమైన విషయాన్ని చెబితె అర్థం చేసుకోరు. అపార్థం చేసుకుంటారు. ఏమి చేయాలి? వేరుగా వుండడం కుదరదు. వీరిలో ఇమడలేను. ఏదేని స్వతంత్రమైన పని చూచుకోవాలి. నేను ఇంకొకరి వద్ద నౌకరి చేయను. పేయింటింగ్‌పై బ్రతుకుదెరువు సాగదు. అందుకు ఫోటోగ్రఫి ఒక్కటే సరియైన మార్గము. ఒక కెమెరా తీసుకుని దేశం వెళ్లినట్లు అవుతే అచట పని మంచిగా సాగగలదు. అంతెకాదు మా గ్రామమునకు దగ్గరగా యున్న జనగాంలో స్టూడియో పెడితే మంచిగా నడవడమే కాదు స్వతంత్రంగా జీవించుటకు అవకాశముండును. ఇది సరియైన పద్ధతి అని నిర్ణయించుకున్నాను. అయితే కెమెరా తత్సంబంధమైన ఫిల్ములు, పేపర్లు, కెమికల్స్ మున్నగు వస్తువులు ఎన్నో కావాలి. అందుకు పెట్టుబడి అవసరము. మా అన్నలను అడగటము నాకు ఇష్టం లేదు. అయితే మా ఇంటిప్రక్క ఇంట్లొ సింగయ్య అను ఒక ధని వుండేవాడు. అతను నాపై చాలా అభిమానం కలిగిన వ్యక్తి. తనకే సమస్య కలిగినా నాతో చెప్పి సలహా పొందెడివాడు. ఆయన నాకన్న పెద్దవయసువాడైనా నా మాటపై ఆయనకు గురి. మామూలు పల్లెటూరి చదువు నేర్చుకున్న వ్యక్తి. నా ఫోటోగ్రఫి

అంటె అతనికి అభిమానం నేనొక రోజు నా సమస్యను ఆయనకు వివరంగా తెల్పినాను. ఆయన నా అవసరాన్ని గుర్తించి అవసరమైన డబ్బు ఇస్తానన్నాడు. అయితే నేను దేశం వెళ్ళి సంపాదించుకొని వచ్చి నీ బాకీ తీరుస్తాను. అంతవరకు ఓర్పు వహించెడివాడివి అయితె ఇవ్వమన్నాను. ఆయన సరే అట్లే తెర్పుదువు. నీకు వీలైనప్పుడివ్వమని అప్పు ఇచ్చినాడు.

## ఫోటోగ్రఫీ, వృత్తిగా

సింగయ్యవద్ద రూపాయలు 200/- తీసుకొని అట్లె నా మెడలో వేసుకునెందుకు చేయించుకున్న చిన్నగొలుసు అమ్మితె వంద రూపాయలు వచ్చినవి. నేను శరణప్పగారి వద్ద పని చేయుచున్నపుడొకకెమెరా అమర్చే డబ్బా బేరమునకు వస్తే ఖరీదు చేసియుంటిని. దానికి అనువైన పోస్టుకార్డు సైజు కెమెరాను రూ. 212/-లకు ఖరీదు చేసినాను. దానితో పాటు పిల్మలు, ప్రింట్సు కొరకు అవసరమైన పేపరు, కేమికల్స్, డబ్బాపై కప్పుటకు బట్ట వగైరాలన్ని ఖరీదు చేసినాను. ఇవియన్నిటిని జమచేసిన పిదప ఒక దినం కెమెరాను డబ్బాకు అమర్చి ఒకటిరెండు ఫోటోలు తీసి పిల్మలు డెవలప్ చేసి ప్రింట్లు తీసినాను. అవి నల్లగా వచ్చినవి. నేను పోటొ తీసిన ఆకారాలు లేవు. నేను నాల్గైదు తడవలు ప్రయత్నించినప్పటికి ఫలితం శూన్యమైంది. నాకప్పుడు భయమేసినది. నేను శరణప్పగారి స్టూడియోలో సంపాదించిన అనుభవమును నెమరువేసుకొని పరిశీలించినాను. నేను శాస్త్ర ప్రకారంగానే చేయుచున్నాను. ఐతె బొమ్మ ఎందుకు రావటం లేదు. రెండురోజులు దీని విషయమై బాగా ఆలొచించి చేసిన యత్నం మళ్ళి విఫలమైంది. ఐతె దీన్ని గురించి ఎవరినడగాలి? ఎవరైతే నాకు నిజాయితిగా చెప్పగలరని ఆలొచించినాను. (అప్పట్లొ సోలాపురంలో 8 స్టూడియోలున్నాయి) కాని శరణప్పగారు గుల్బర్గా దగ్గర యాదగిరికివెళ్లిపోయి అక్కడనే స్టూడియో పెట్టుకుని వుంటున్నాడు. ఆ మధ్య ఆయనగారు ఇక్కడికి వచ్చినపుడు తనెక్కడ వున్నది తెలిపియుండెను. ఆయన వద్దకు వెళ్లటమా లేక ఇక్కడ ఏ స్టూడియోలోనైనా చూపించటమా అని ఆలోచించాను. శరణప్ప తప్ప ఇంకెవరితో నాకు సన్నిహితం లెదు. అంతేకాక స్వతంత్రముగా చేయుటకు ఇంకా అవసరమైన మెళకువలు నేర్చుకొనుటకు వీలౌతుంది. అట్లె పోటోలు రాకపోవుటకు కారణము తెల్సుకోవచ్చని ఒక దినం పయనమై యాదగిరికి వెళినాను. సోలాపురం నుండి ఆ కాలమున ఒక ప్యాసింజర్ ట్రేన్ వుండెడిది.

నేను యాదగిరి స్టేషన్ చేరుసరికి సాయంకాలం 4 గంటల సమయమైంది. స్టేషన్‌కు గ్రామం మూడుమైళ్ళు వుంటుంది. నా వద్ద కెమెరా డబ్బు తత్సంబంధమైన సామాను వుంది. వీటిని నెత్తిపై పెట్టుకొని నడుచుట సాధ్యం కాదని గుఱ్ఱంబండి (టాంగా) వుంటె దానిపై పయనించినాను. నాతో ఇంకా ముగ్గురు ప్రయాణీకులను తీసుకుని వెళ్లినాడు. వూరిబయట ఒక చిన్న బోడు (గుట్ట) లాంటిది వుంది. దానికి అవతలివేపు గ్రామం. గుట్ట దగ్గర టాంగాను ఆపివేసినాడు. ఇంకా వూరు రాలెదు. ఎందుకాపినావని ప్రశ్నించాను. ఆ టాంగా వాల ముందుకు చూపించినాడు. ఆచటికి కొంతదూరంలో కొండెంగల గుంపు ఒకటి నడిరోడ్డుపై కుప్పిగంతులు వేస్తున్నది. వానిని చూపి అవి వెళ్ళేవరకు మనము వెళ్లరాదు. ఈ కొండెంగలు, వాటిలో అవి తర్కించుకుంటు ఇంకొకటి వచ్చి చేతితో సైగచేసి, మరియొకటి వచ్చి సైగచేసింది. అదికూడా మనుష్యవలె మాట్లాడుకుంటు సమావేశమైనవని ఆ టాంగావాడు చెప్పాడు. అవి ఇట్లు ఒకగంట వరకు కొట్లాడుకొని వెళ్లిపోయినవి. కొంతసేపట్లో వెళ్ళిపోతాయి. అట్లుకాక మనముందే వెళ్లి వాని ఏకాంతమునకు ఆటంకము కలిగించి వెంటపడి చికాకు చేస్తాయి. అని వివరించినాడు, ఒక అరగంటలో అవియన్ని గుట్టపైకి వెల్లిపోయిన పిదప గ్రామం చేరుకున్నాను. నేను టాంగా దిగి కెమెరా డబ్బాను భుజంపై పెట్టుకొని మా గురువుగారి స్టూడియొ ఎక్కడవున్నదో అడిగి తెలుసుకొని స్టూడియో ప్రవేశమొనర్చినాను. నేను వెళ్ళెసరికి శరణప్పగారు మరియు ఆయన భాగస్వామి జంగందేవర (ఆయన పేరు గుర్తులేదు. ఆయునగారు జంగాల గురువుగారని తెలుసు) స్టూడియోలో ఏదో పనిచేయుచున్నారు. నన్నుచూచి మాగురువుగారు ఆశ్చర్యపడిపోయినారు. నాది ఊహించని రాకడ. నన్ను సాదరంగా ఆహ్వానించి తన భాగస్వామితొ నన్ను గురించి చాలాచాలా చెప్పినాడు, ఇదివరలో కొన్ని తడవలు నన్ను గురించిన సంభాషణ వారిమధ్య వచ్చెడిదని ఇప్పుడు ప్రత్యక్షంగ చూచినందుకు సంతోషం అయినదని జంగదేవర అభినందించినాడు. ఈ జంగమదేవరకు ఫోటోగ్రాఫీ యందు మక్కువ. ఎక్కువ ఖర్చులు లేవు. ఆయనకు సంతానం లేదు. కాలేదు కావున స్టూడియోలో వచ్చె ఆదాయము చెరిసగం తీసుకునేవారు. మా గురువుగారు అదనముగా పేయింటింగ్స్ వేసి సంపాదించుకొనేవారు. ఈయనగారికి ఒక కుమారుడు మాత్రమే. మాగురువుగారి పూర్వులు నిజాంవారే. తరువాత కర్ణాటక ప్రాంతమునకు వెళ్లి అచట స్థిరపడ్డారు. వీరి తండ్రి ఏదో ప్రభుత్వ నౌకరి చేసెడివాడు. మా గురువుగారు మాత్రం ఈ పనిలో

పడినాడు. సోలాపురంలో కొంతకాలం ఉండి పిదప తన జన్మస్థానమ్మైన ఊరు చేరుకున్నాడు. ఆ పిదప యాదగిరిలో స్టూడియో ఏర్పరచి ఒక భాగస్వామిని పెట్టుకొని నడిపిస్తున్నాడు. నాడు యాదగిరి అను ప్రాంతం నిజాం పరిపాలనలో యుండెడిది. నిజాం పాలనలో 8 తెలంగాణ జిల్లాలు, 5 మహారాష్ట్ర జిల్లాలు, 3 కర్ణాటక జిల్లాలు కలిపి మొత్తం 16 జిల్లాలుగా నిజాం పరిపాలన విస్తరించి యుండెడిది. నేనుండె సోలాపురం ఇంగ్లీషు వారి పాలనలలో వుండెడిది. నాడు ఇంగ్లీషు పాలన ప్రాంతంలో డబ్బును కల్దారు అని నిజాం పాలనలో హాలీ అని పిలిచెడివారు. కల్దారు 100 రూపాయలకు హాలీ 117 రూపాయలు మారకము రేటు వుండెడిది. హాలీ రూ. 1కి 96 పైసలు. అదే కల్దారు రూ. 1కి 64 పైసలు. లెక్క వుండెడిది. నేను కాసేపు ఆగిన పిదప నే వచ్చిన కారణం గురించి మా గురువుగారు ప్రశ్నించినారు. నేను ఉద్దేశించిన ఆలోచన అందుకు నేను చేసిన ప్రయత్నం అది ఎట్లు విఫలమైనది తెలిపి దానికి కారణం మీ వద్ద తెలుసుకోవాలని వచ్చినానని విన్నవించినాను. ఆయనగారు ఆదరంగా విషయమంతా విని సరే రేపు పరిశీలిద్దాము ఇంటికి వెళదాము రమ్మని కెమెరా డబ్బాను స్టూడియోలో పెట్టించి ఇంటికి తీసుకొనివెళ్ళినాడు. ఆయనగారి భార్య నన్ను చూచి సంతోషించి క్షేమము విచారించినది. నాకు వంట ఏర్పాటు చేసినది. మా గురువుగారుకూడా శాఖాహారమే తీసుకుంటాడు. కావున ఏ ఇబ్బంది లేదు. ఆ రాత్రి అక్కడ భోజనం చేసి వారి ఇంటిలో నిద్రించినాను.

మరుసటి దినం స్టూడియోకు వచ్చిన పిదప మా గురువుగారు తన భాగస్వామితో నా సమస్యను గురించి తెలిపినాడు. ఎందుకనగా జంగందేవరగారికి డబ్బా కెమెరాతో బాగా అనుభవమున్న వ్యక్తి. ఆయన నా సమస్యను గురించి విన్న పిదప డబ్బాను పరిశీలించినాడు. అది పాతది. లోనిచెక్కలు వదులై వెలుతురు ప్రసరించి పేపరు చెడిపోయి వుంటుందని పైన నల్లబట్టకప్పి లోని ప్రక్కలు పరిశీలించినాడు. ఆయనగారి అంచనా సరైనదని తెలిసినది. వెంటనే లప్పము తెప్పించి సందులన్ని పూడునట్లుగా ఆయనగారే రుద్దినాడు. నల్లనిరంగు దానికి లోన వేసి వెలుతురు ప్రసరించకుండా చేసి నాతో ఒక ఎక్స్‌పోజు చేయించినాడు. దానిని డెవలప్‌చేసి ప్రింటు తీసిన పిదప చక్కని ప్రింటు వచ్చినది. అట్లే నాతో రెండుమూడు పాటోలు తీయించి సరిచూచినాడు. అప్పుడు అందున్న లోపమేమో నాకు తెలిసి వచ్చినది. అయితే జంగదేవర చాలా నెమ్మదైన మనిషి. ఆయన వయసు 45 సం॥లు వుంటాయి. ఫోటోగ్రఫిలో

వస్తున్న మార్పులను ఆయన స్వీకరించి పాత పద్ధతిలోనే నడుపుచున్నాడు. అప్పటివరకు యాదగిరిలో కరెంటు లేదు. అందుకు డార్క్ రూంలో ఎర్రలైటుకు బదులుగా లాంపును ఉపయోగిస్తున్నాడు. దానివలన ఒక్కొక్క ప్రింటు తీయుటకు కనీసం ఒకగంట సమయం తీసుకుంటుంది. పైగా ఆయన ఫిల్ములను ఉపయోగించక గ్లాసు ప్లేటును ఉపయోగించెవాడు. ఫిల్ములతో సరియైన రిజల్టు రాదని ఆయనగారి అభిప్రాయం. నేను శాస్త్రీయంగా మారుచున్న మరియు మార్పులు చెందిన ఫొటోగ్రఫీ విషయాలు ఆయనగారికి చెప్పినాను. డార్క్ రూంలో లాంపు ఉపయోగించుటకు బదులుగా ఒక ఫ్రేం చేయించి దానియందు సూర్యరశ్మి వచ్చు దిక్కున రెండు గ్లాసులు అమర్చినాను. అవి అవసరమైనపుడె వెనకకు ముందుకు జరిగే పద్ధతిలొ అమర్చినాను. ఆ గ్లాసులలొ ఒకటి ఎర్రది మరియొకటి తెల్లది. చీకటి అవసరమైనపుడు సూర్యరశ్మికి ఎదురుగా ఎర్ర గ్లాసును లాగుకొని తెల్లగ్లాసును ప్రక్కకు జరుపునట్లుగా మరియు వెలుతురు అవసరమైనపుడ తెల్లగ్లాసును పక్కకు జరిపి ఎర్రగ్లాసును లాగునట్లు ఏర్పాటుచేసి ఫిల్మ్ డెవలప్‌మెంట్ కొరకు అట్లె ప్రింట్లు తీయుటకు తగిన వాతావరణమును కలిగించి చేసిచూపించినాను. ఆయనగారు చాలా సంతసించి నన్ను అభినందించినాడు. అట్లె వారి డార్క్‌రూంలో అవసరమైన మార్పులన్ని చేయించినాను. ఇవి అన్ని చేయించుటకు నాకు మూడునాలుగు రోజులు పట్టినది. జంగందేవర నన్ను తన ఇంటికి ఒకనాడు భోజనమునకు ఆహ్వానించినాడు. నేను మా గురువుగారి అనుమతి తీసుకొని వెళ్లాను. అప్పుడు మామిడిపండ్ల కాలం. మామిడిపండ్ల రసము పల్లెము నిండా పోసి నాముందుంచినాడు. అట్లె తనముందుంచుకున్నాడు. నాకింత అవసరము లేదన్నాను. అట్లే ఒక పల్లెములో గోధుమపిండితొ చేసిన అట్లు ముందుంచినాడు. మీరు తిని చూడండి మిగిలితే చూద్దామన్నారు. నేను ఒక అట్టును రసములో ముంచుకొని తిన్నాను. ఆ రసం చాలా మధురంగా వుంది. వరుసగా పల్లెములొ రసం పూర్తి అగువరకు అట్లు తింటూనే వున్నాను. జంగందేవర కూడా అలాగే తిన్నారు. పిదప నేటివరకు అలాంటి పండ్లరసం నాకెక్కడ లభించలేదు. మొత్తం 5 రోజులు యాదగిరిలో గడిపి నాకున్న సందేహాలకు సమాదానాలు పొంది మా గురువుగారితో మరియు జంగందేవరతో సెలవు తీసుకొని ఇంటికి అనగా సోలాపురం వచ్చినాను.

నేను యాదగిరి వెళ్లివచ్చిన పిదప నా ఉద్దేశ్యాన్ని మా అన్నలతొ చెప్పినాను. ఇది వారు ఊహించనిది. కెమెరా బాగు చేసుకున్నాను. అంటే ఫోటొలు ఇక్కడ తీయుటకనుకున్నారు. కానీ నేను దేశము వెళుతాను. అది నాభార్యను వెంటబెట్టుకొని వెళతానంటే వారు జీర్ణించుకొలేక పోయినారు. నా పయనాన్ని వారు ముక్తకంఠంతో వ్యతిరేకించినారు. మా వదినెలు కూడా వద్దంటెవద్దన్నారు. కాని నా నిర్ణయమునకు మార్పులేదు. మా అన్నయ్యలు మాకు తెలిసిన పెద్దమనుష్యులచేత చెప్పించి చూచినారు. నాకు పిల్లనిచ్చిన మామగారితో చెప్పించారు. అంతేకాదు నా వెంట నా భార్యను పంపను అనునంతవరకు మా మామతో అనిపించినారు. అందుకు నేను ఎక్కడికో కొత్తచోటుకు వెళ్లడం లేదు మా స్వగ్రామం పైగా మా తల్లిదండ్రులు అక్కడనే వున్నారు. నా భార్య అక్కడ వారి ఆజమాయిషిలో వుండగలదు. భయపడవలసిన అవసరం లేదు. పంపమన్నాను. నాకు ఒక్కగానొక్క కూతురు దేశంలో వుండుటకు పంపనన్నాడు. నాకు చికాకు పుట్టి ఇపుడు నావెంట నీ కూతురును పంపని తీరుకు శాశ్వతంగా నీ బిడ్డను నీ వద్దనే వుంచుకోవచ్చు. నా భార్య నా వెంటవుండక నీ యింట ఎలా వుంటుంది. పంపిస్తావా సంబంధము వుంటుంది. పంపవా ఇంతే సంగతులని తెగించి మాట్లాడేవరకు ముఖాలు తెల్లబడ్డాయి. ఐతే నీ యిష్టం ఏమన్న చేసుకో అని వెళ్ళిపోయినారు. నేను ఫలానా తేదినాడు వెళుతున్నానని మా వాళ్లకు అట్లే స్నేహితులకు చుట్టాలందరికి చెప్పివచ్చినాను. మా అత్తగారు నా భార్యను తోలుకుపోయి రెండురోజులు వుంచుకొని తెచ్చి మా ఇంట్లొ తోలిపోయినారు. నేను నా కెమెరా డబ్బాతో పాటు అవసరమైన పోటో సామానంతా ముల్లెగట్టుకుని బట్టలు సర్దుకుని తయారైనాము. మా మామగారు మా వెంట తన అత్తగారిని పయనం చేసినాడు. ఆమె కుందారం వరకు మాతో కలిసివచ్చి పిదప పల్లెర్లకు వెళుతుంది. ఈ అన్ని ఏర్పాట్లతో మేము ఏప్రిల్ 1946లో తిరిగి మా వూరు వచ్చినాము. అంటే స్థిరంగా ఇక్కడె జనగాంలో స్టూడియో పెట్టుకుని సెటిల్ అవుదామని ఉద్దేశంతో వచ్చినాను.

## పల్లెపల్లె తిరగుతూ ఫోటోగ్రఫీ

మేము సోలాపురంలో రైలుఎక్కి మరుసటి సాయంకాలం 6-30 గంటలకు మా గ్రామమునకు దగ్గరయగు రఘునాధపల్లి స్టేషన్‌లో దిగినాము. అటునుండి మా గ్రామమునకు కాలినడకగా వెళ్లాలి. కనీసం రెండుగంటల ప్రయాణం. వెంట సామాను ఆడవాళ్లతో వెళ్లటం సాధ్యపడదని ఒక వైశ్యుల ఇంటికి వెళ్లినాము. ఆ ఇంటి కోడలు మా వూరి తల్లిగారు. ఆ అమ్మాయి

నన్ను గుర్తుపడుతుంది. మాకు వారు వుండుటకు చోటు చూపించినారు. మేము వెంట సద్దితెచ్చుకున్నాము. అవసరమైన నీళ్లవసతి కల్పించినారు. మరుసటి ఉదయం ముఖాలు కడుగుకుని వారిచ్చిన చాయ త్రాగి పయనం ప్రారంభించి ఉదయం 9-00 గంటల వరకు ఇల్లు చేరినాము. మమ్మల్ని చూచి అందరు ఆశ్చర్యపడ్డలయ్యారు. మా నాన్న, అమ్మ, అన్నయ్య ఏ కారణం వలన సోలాపురం విడిచి వచ్చినానని నిలదీసినారు. నీవు అక్కడ ఏదో గొడవపడి వచ్చివుంటావు. నిజం చెప్పమని వత్తిడి చేసినారు. నేను విషయం వివరిస్తు పోటోగ్రఫి నేర్చుకుని వృదాగా వుండిపోయినది యిక్కడ పోటోలు తీసి సంపాదించవచ్చును, అందువలన కెమెరా తీసుకుని వచ్చినానని తెల్పినాను. నా మాట వారికి తృప్తి కల్గించలేదు. అక్కడ మొగ్గాల పరిస్థితి ఏమైందో అని బాధపడ్డారు. ఎందుకనగా నేను వున్నట్లు అవుతె బజారు పని అంతచూచుకొనెడివాడిని. నేను లేకపోవుటచే వ్యవహారం దెబ్బతినగలదని విచారపడినారు. మేమచ్చుటికి చేరిన పిదప 10 రోజులకు నా భార్య అమ్మమ్మ పల్లెర్లకు వెళ్లిపోయినది. నేను గ్రామంలో మిత్రులందరిని కల్సి నేను వచ్చిన వుద్దేశం చెప్పినాను. వారు నన్ను ఉత్సాహపరిచినారు. కెమెరా డబ్బాలో ఇంకా కొన్ని మార్పులు చేయవలసి వుండి నా సహపాఠి అయిన కమ్మరి నర్సయ్యతో చేయించినాను. ఆయనకు వడ్రంగి పనివచ్చు. అది పూర్తి అయిన పిదప మొట్టమొదట ఆయనగారి ఇంటిలోనే నాల్గు స్నాపులు తీసినాను. అవి చక్కగా వచ్చినవి. చూచిన వాళ్లందరు చాలా బాగున్నావని అన్నారు. అప్పటికి ఒక్కనెల గడిచినది. ఈలోగా గ్రామంలో ఇంకా కొందరి పోటోలు తీసినాను. కొందరు కావాలని పిలిపించుకుని తీయించుకున్నారు. మొదటి కాపి రూ. 2-50 మరియు అదనపు కాపీ ఒక్కంటికి ఒక రూపాయి ధర నిర్ణయించినాను. నేను పనిలో పడిన పిదప సోలాపురంలో వ్యవహారం చక్కబెట్టుటకు మా అమ్మానాన్న వెళ్లిపోయినారు. ఇంటివద్ద మా పెద్దన్న మరియు వదిన వుండెడివారు. నా భార్య అప్పుడు నాల్గునెలల గర్భవతి . నేను మా గ్రామంలో తీసిన పోటోల వలన కల్గిన ఉత్సాహంతో చుట్టుప్రక్క గ్రామాలకు వెళ్లి పోటోలు తీసి సంపాదించాలను నిర్ణయమునకు వచ్చినాను. అపుడు నా వెంట వుండుటకు మరియు కెమెరా డబ్బా సామానులు మోయుటకు ఒక మనిషి కావలసి వచ్చినది. దానికి మా గ్రామ వాస్తవ్యుడైన ఒక ముస్లిం అబ్బాయిని భోజనం పెట్టి రోజుకు అర్థరూపాయి కూలిఇచ్చె ఏర్పాటుపై మాట్లాడుకున్నాను. అబ్బాయి ఆరోగ్యంగా ధృడంగా వున్నాడు. పయనమునకు ఏర్పాట్లు చేసినాను.

ఆ కాలమున బస్సు వసతి వుండెడిది కాదు. ఎటువెళ్ళాల్సినా కాలినడకన లేదా ఎద్దులబండి ముఖ్య సాధనాలు. బండిపై వెళ్లుటకు నా సంపాదన కిరాయలకే సరిపోదు. అందువలన కాలినడక నిర్ణయించుకున్నాము. మా వెంట ఫోటోగ్రఫీ సామానుతోపాటు రెండు పళ్లాలు, రెండు గిన్నెలు, రెండు గ్లాసులు కొన్ని బియ్యం కొలదిగా పచ్చడి తీసుకుని ఒక ఉదయం బయలుదేరినాము. కొన్ని వూళ్ళు తిరిగి వారం పదిరోజులకు ఇంటికివచ్చి వెలుతువుండాలి. ఎందుకనగా నా భార్యకు ఈ ప్రదేశం క్రొత్త. పైగా ఇంట్లో మా వదినె తప్ప తోడు ఎవరు వుండరు. బావ అగుటచే మా అన్నయ్యతో అస్సలు మాట్లాడెడిది కాదు. మేము మొట్టమొదట మా గ్రామమునకు రెండుమైళ్ల దూరమందున భానాజీపేట వెళ్ళినాము. నాకు ఆ గ్రామంతో మంచి పరిచయమున్నది. పైగా నేనే గ్రామము వెళ్ళినా మొదట నాకు పరిచయము లేదా చుట్టరికమున్న పద్మశాలి ఇంటికి వెళ్ళెడివాడిని. ఆయనతో నేను వచ్చిన ఉద్దేశం తెలిపి అచట ఆ గ్రామమందు పోటో దిగుటకు ఉత్సాహం చూపించు వ్యక్తులెవరో తెలుసుకునేడి వాడిని. ఆయనను వెంటబెట్టుకొని సదరు వ్యక్తులను కలిసెడివాడిని. వారిలో ఏ ఒక్కరితో మంచి పరిచయమేర్పడిన పిదప మొదట వ్యక్తిని వారింటికి పంపించివేసి నా పని చూచుకొనెడి వాడిని. నేను వెళ్లిన ప్రతిచోట ఈ పద్ధతి అవలంభించినాను. ఇక భోజన విషయమై నాకు పరిచయమున్న వారికి బియ్యం ఇచ్చి వంటచేసి పెట్టమని కోరెడివాడిని. కొందరు మా వద్ద బియ్యం తీసుకోకుండా అన్నం పెట్టెడివారు. మా బియ్యం తీసుకున్నా వారు పచ్చడి పులుసు వేసెడివారు. నేను శాఖాహారినగుటచే నాకు భోజనమునకు సమస్య ఏర్పడునది కాదు. భానాజీపేటలో గౌడులు సంపన్నులు. వారిని కల్సి నేను వచ్చిన విషయం తెలిపినాను. పెద్దగా స్పందించకపోయినా ఇద్దరో ముగ్గురో పోటోలు దిగినారు. అటునుండి సాయంకాలం కోమళ్ల అను గ్రామం వెళ్ళినాము. అచట మాకు తెల్సిన బంధువులు వున్నారు. నా పని విషయం తెల్సుకుని ఉత్సాహపరిచినారు. కాని భోజనంపెట్టి పోటోలుతీసే ఆలోచన కన్పించినది. వారు ఇతరులతో పరిచయం చేయించలేకపోయినారు. రెండురోజులు అచట కొలది పోటోలు మాత్రమే తీసి లాభము లేదనుకుని సముద్రాల యను గ్రామం వెళ్లినాను. అచట మాకు దగ్గర సంబంధం గల చుట్టాలు వున్నారు. ఆయనగారు వైద్యం చేస్తారు. ఆయనగారి మనుమరాలిని నాకు ఇచ్చి పెళ్లిచేయాలనుకున్నారట. మా పెద్దన్నయ్య చాలా ప్రయత్నం చేసినాడట. కాని నాన్నగారు వప్పుకోలేదట. నేను వారింటికి వెళ్ళినపుడు చాలా ఆదరంగా ఆహ్వానించినారు. ఆయనగారు

ప్రయత్నపూర్వకముగా నాకు తోడ్పడె యత్నం చేసినాడు. ప్రతి పోటోకు రూ. 2-50లు అంటే నాడు చాలా ప్రియం. ఈ డబ్బులకు నాడు రెండుకుంచాల జొన్నలు లేదా నాల్గుకుంచాల వడ్లు వచ్చెడివి. పైగా పోటో దిగితే దిగినవారి ఆయుష్షు తగ్గుతుందని, తమ శక్తి నశిస్తుందని చెప్పెడివారు. అచట కూడా పెద్దగా పోటోలు దిగుట జరుగలేదు. అటునుండి ఒక విధమైన నిరుత్సాహముతో తిరిగి ఇంటికి వచ్చినాము.

ఇంటికివచ్చి పదిరోజులువుండి మళ్లి ప్రయాణం సాగించినాము. ఈసారి జనగామకు పడమరగా సాగించినాము. మొట్టమొదట మా తమ్ముని అత్తగారి వూరగు వడ్లకొండకు వెళ్ళినాము. అచట పెద్దగా స్పందన లేదు. ఎందుకు అనగా వారికి జనగామ దగ్గర. ఉత్సాహవంతులు అచటికి వెళ్లి పోటోలు దిగెడివారు. నేను వెళ్లినందుకు రెండు పోటోలు దిగినారు. ఆ దినం అచట గడిపి మరుసటి వుదయం మా చెల్లెలు అత్తగారి వూరగు వెలిదండ వెళ్లినాము. అచట కూడా పెద్దగా స్పందనలేదు. మా చెల్లి చినమామ చినసిద్దిరాములు గారికి పోటోగ్రఫీపై చాలా మక్కువ. ఆయనగారి పోటో అట్లె మా చెల్లి అత్తగారి ఇంట్లో తీసినాను. ఇంకొక ఇద్దరు తీయించుకున్నారు. మేము ఆ దినం అచట గడిపి మరుసటి దినం నర్మెట్ట చేరుకున్నాము. అచట మా కులం వాళ్లు మంచి భూస్వాములు చుట్టుప్రక్కల గ్రామములలో బాగా పేరున్నవ్యక్తులు. మాకు బంధుత్వము కూడా కలదు. కాని ధనవంతులగుటచే చిన్నచూపు చూస్తారని వారి యింటికి వెళ్లక అట ఒక వడ్రంగి వారి యింట వంట ఏర్పాటు చేయించి వారింటనే బస చేసినాము. నాకు మొదటినుండి కులపట్టింపులు లేవు. నేను ఎవరింటనైనా భోజనం చేసెడివాడిని. నేను బసచేసిన వడ్రంగి నా విషయమై శ్రద్దతీసుకుని తను పోటో దిగటమే కాక తనకు తెలిసిన వారిని ప్రోత్సాహపరిచినాడు. ఆచట రెడ్లు కాపులు తదితరులు చాలావంది నా విషయం తెల్సుకుని ముందుకువచ్చినారు. ఫలాని కుందారం బిట్ల నారాయణ ఈ వూరిలో పోటోలు తీస్తున్నాడని చింతక్రింది శంకరయ్య మాకు బంధుత్వం కలిగిన భూస్వామికి తెలిసి నన్ను కలిసికొనుటకు వచ్చి పరిచయం చేసుకున్నాడు. నాకాయన పరిచయం లేదు. కాని మా చెల్లెలి పెళ్లి సందర్భమున కుందారం వచ్చినారట. నేను అపుడు సోలాపురంలో వున్నాను. ఆయనగారు మా ఇంట్లో మరియు మా పెదనానగారి ఇంటిలో గోడలపై చిత్రించిన చిత్రాలను చూచినాడట. నా పసితనమును ముందే తెలుసునని అచటి వారందరితో చెప్పినాడు. పిదప తమ

ఇంటికి రమ్మని కోరినారు. నాకు సరియైన ఆదరణ వుంటుందా యని భయము. అందువలన ఇక్కడ నాకేమి ఇబ్బంది లేదు. అన్ని వసతులు బాగున్నాయి అని చెప్పినాను. అపుడాయన కనీసం భోజనం చేయుటకైనా రమ్మని కోరినాడు. నేను అలాగె రాత్రి భోజనమునకు వస్తానని మాట ఇచ్చి సాయంకాలం వెళ్ళినాను. నన్ను తన కుటుంబ సభ్యులకు పరిచయం చేసినాడు. వారు నన్ను ప్రేమగా ఆహ్వానించారనే చెప్పాలి. కాని నేను పేదవాడినను భావన నాలో మేము ధనవంతులమను భావన వారిలో గోచరించినది. వారు మాంసము నేర్పాటుచేసినారు. కాని శాఖాహారిని అని ఇతర కూరలతో పాడితొ తిన్నాను. నా వెంటవున్న సాయెబు మాత్రం మంచిగా తిన్నాడు. భోజనం చేసి మా బసకు వెళ్లిపోయినాము. మరుసటి దినం కూడా భోజనమునకు రమ్మని గుర్రంపై ఎక్కివచ్చినాడు. వారు గ్రామంలో గాని, పొలమునకు కాని గుర్రముపై తిరుగుతారట. కాని నేను మర్యాదపూర్వకముగా నిరాశపరచినాను. అచట నాకు ప్రోత్సాహకరమైన వ్యాపారమే జరిగినది. ఆ గ్రామంలో నాల్గురోజులు వుండి కేశిరెడ్డి పల్లెకు వెళ్లినాము.

కేశిరెడ్డిపల్లిలో మంచి ప్రోత్సాహం ఇచ్చినారు. ఒక రెడ్డివాళ్ల అబ్బాయి నన్ను అంటిపెట్టుకుని నేనున్న నాల్గురోజులు నా వెంట తిరిగినాడు. ఆతనికి ఫోటోగ్రఫిపై బాగా మక్కువ. నన్ను అక్కడివాళ్ళు బాగా ఆదరించినారు. నేను పేపర్ వృధా అయినా లెక్కించక ఫోటోప్రింటు మంచిగా వచ్చేట్లు చేసి యిచ్చెడివాడిని. నాడు 1 రూ.కి. 33 కార్డు సైజు ఫోటోప్రింటింగ్ పేపర్లు వచ్చెడివి. ఇచ్చట గూడ బాగానే ఫోటోలు దిగినారు. నర్మెట్టకన్న ఇక్కడ బాగా జరిగినట్లు లెక్క. అటునుండి అయిదవనాడు కన్నెబోయినగూడెం వెళ్లినాము. ఇక్కడ పెద్దగా ఫోటోలు దిగనప్పటికి నిరుత్సాహం కాలేదు. ఇక్కడ రెండురోజులు గడిపి అటునుండి వెనికిరాల వెళ్లినాము. అచట ఒక వైశ్యుల ఇంట్లో బసచేసినాము. ఆయన మమ్మల్ని బాగా ఆదరించినాడు. ఇక్కడ కూడ కొన్ని ఫోటోలు తీసినాను. కాని నా అంచనాకు తగినట్లుగా లేదు. కాని ఇక్కడ ఒక సంఘటన మాత్రం గుర్తుంచుకోదగినది జరిగినది. ఆ గ్రామ పోలీస్ పటేల్ మస్కూరిని పంపి నన్ను పిలుచుకు రమ్మన్నాడని వచ్చినాడు. నేనపుడెవరిదో ఫోటో తీయుచున్నాను. మొదట ఫోటోలు తీయుటకు పిలిపించినాడేమో అనుకున్నాను. కాని మస్కూరి మాట తీవ్రతను బట్టి ఇంకేమి విషయమో తెల్సుకుందామని కెమెరా డబ్బాను నా వెంటవున్న సాయెబుల అబ్బాయికి ఇచ్చి

అతని వెంట పోలీసు పటేల్ ఇంటికి వెళ్ళినాను. నేను వెళ్ళిన పిదప నన్ను ఎగాదిగా చూచి మీదేవూరని ప్రశ్నించినాడు. నేను చెప్పిన పిదప నీ వెంట లైసెన్సు వున్నదా? యని ప్రశ్నించినాడు. లైసెన్సు దేనికని నేను ప్రశ్నించాను. వూరికి ఎవరు క్రొత్తవారు వచ్చినా తాము తహసీలుదారుతో తెచ్చుకున్న లైసెన్సు తీసుకు మొదట గ్రామములో నన్ను కలిసి నా అనుమతి తీసుకుని వూళ్ళో వ్యాపారమైనా ఏదైనా చేయాలి. ఇది నీకు తెలియకుండా ఎలా గ్రామాలు తిరుగుతు పోటోలు తీస్తున్నావన్నాడు. అతను మాటాడేతీరు నాకొక విధముగా క్రొత్తగా దోచినది. అపుడు నేను ఉర్దూలో మాట్లాడుట ప్రారంభించినాను. నేనిప్పటికి జనగాం తాలూకాలో చాలా గ్రామములు తిరిగినానని ఈ ప్రశ్న ఎవరు వేయలేదని మరియు పోటోగ్రాఫర్‌కి లైసెన్సు అవసరం లేదని ఇంతవరకు నీవెవరినన్నా పోటోగ్రాపర్ పెట్టుకు తిరుగుట చూచినావాయని, నేను బాంబే, సోలాపురం మున్నగు ముఖ్యపట్టణములలో పోటోలు తీసినవాన్నని ఉర్దూతోపాటు ఇంగ్లీషు పదాలను కలిపి మాట్లాడినాను. నా మాటలువిని నీరుగారిపోయినాడు. అపుడు కాస్త తగ్గి వూరిలోనికి దొంగలుదోపిడిగాళ్లు వస్తారు. ఏవో మారువేషాలతొ వస్తారు. అందువలన ఇంతగా తెల్సుకోవాల్సి వచ్చిందన్నాడు. నేను నా వివరాలు చెబుతు చుట్టుప్రక్కల గ్రామాలలో గల మా బంధువుల పేర్లు చెప్పినాను. వారి పేర్లువిన్న పిదప పూర్తిగా తగ్గిపోయినాడు. ఐతే పోటో వక్కంటికి ఎంత తీసుకుంటున్నావు? ఎందరు దిగినారని అడిగితె ఈ వూరిలో ఎవరు పెద్ద ఉత్సాహం చూపటం లేదు. ఇద్దరు మాత్రం దిగినారని బుకాయించాను. నావద్ద ఏమైనా డబ్బు పుట్టించాలని ఉద్దేశించినట్లు అన్పించి అలా చెప్పినాను. తర్వాత తనకు పోటో దిగవలసి యున్నట్లు వెలిబుచ్చినాడు. అపుడు నేను వచ్చినదే అందుకొరకు మీ బజారుకు వచ్చినపుడు తీస్తానని సెలవు తీసుకొని వచ్చినాను. పగలు భోజనమునకు వెళ్ళినపుడు నేను బసచేసిన వైశ్యునకు ఈ వివరం తెలిపినాను. అతడు ఆ పటేల్ వట్టి లంచగొండి నేను వచ్చి మాట్లాడాలాయని అడిగితే అవసరం లేదు. సరియైన జవాబు యిచ్చి వచ్చినానని తెలిపినాను. ఇచట రెండురోజులు వుండి ఎఱ్ఱగొల్లపాడు వచ్చినాను.

ఈ ఎఱగొల్లపాడులో మా పెద్దమ్మ బిడ్డ వున్నది. అక్కడ వారి ఇంటిలో బసచేసి ప్రయత్నించినాను. చిన్నవూరు. అంతా వ్యవసాయదారులు మరియు వ్యవసాయ కూలీలు. అచట ఏమి పోటోలు దిగలేదు. కాని మా అక్క వాళ్ల కుటుంబం పోటో తీసినాను. నా ఉద్దేశంలో పోటోయందు తమ రూపము

కనిపించి వారి ప్రతిరూపముగా వుండగలదను భావం ప్రజలకు రావాలని అట్లే మళ్ళీ వచ్చినపుడైనా పోటోలు దిగుతారని నా నమ్మకం. ఆ రోజచట గడిపి మరుసటి దినం మండెలగూడెం వెళ్లినాను. ఇచట మా మేనత్త వుంటుంది. ఆమె తన చిన్నకుమారునితొ వుంటుంది. పెద్దతను జనగాంలో వుంటున్నాడు. నేనచటికి వెళ్ళినపుడు అక్కడ పద్మశాలీల గురువు వచ్చియున్నాడు. ఆతడు తన పోటో దిగి దాని కాపీని అందరి ఇండ్లలో వుంచుకొమ్మని ఆదేశించినాడు. ఎందుకనగా తన పోటోవుంటె తానున్నట్లు అనుభూతి కలుగుతుందని చెప్పినాడు. దానితో పాటు ఇంకా కొంతమంది పోటోలు దిగినారు. నేనవియన్ని సాయంకాలం వరకు అందజేసి మరుసటి దినం ఇంటిత్రోవ పట్టినాను. ఈసారి 17 రోజులు తిరిగి కొంత సంపాదించినాను. నాకు ఒక విధమైన నమ్మకమేర్పడినది. ఈ విధంగా సంపాదించి జనగాంలొ స్టూడియో పెట్టగలనని ఇంటికి వచ్చెసరికి నా కొరకు ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు. ఇన్ని రోజులు విడిచిపెట్టి వుండుటచే నా భార్య బెంగపడినది. వచ్చి వారం రోజులు గడిపిన పిదప వెలిదండ నుండి చినసిద్దిరాములు మా గ్రామం వచ్చినాడు. అయన అత్తగారు మా వూరే. అతను వచ్చి నన్ను కలిసి రేపు హైద్రాబాద్ వెళ్లుచున్నాను. నీకెమైనా పోటోగ్రఫీ వస్తువులు కావలసియుంటే నావెంట రమ్ము. అక్కడ నాకు తెల్సిన మంచి పోటొగ్రాపర్‌లు వున్నారు. నీకు పరిచయం చేస్తాను. అట్లె ఏ వస్తువు ఎక్కడ దొరుకుతుందో తెలుసుకోవచ్చునన్నాడు. నేను సరెయని అవసరమైన డబ్బులు తీసుకొని అతనితో పాటు వెళ్లినాను. నన్ను మల్హార్‌రావు అను ( రీగల్ పోటో స్టూడియో యజమాని) ఒక ఫోటోగ్రాపర్‌కు పరిచయం చేసినాడు. అతడు ఫోటోగ్రాఫ సంబంధమైన వస్తువులు, కోఠీలొని ''మెహల్'' అను స్టూడియోలో దొరుకగలవని అడ్రస్ ఇచ్చినాడు. సిద్దిరాములు గారు తను వైద్యం చేయుచున్న ఇద్దరు రోగులను కలిసి వారి విషయం తెలుసుకుని తనకు ఇంటిలో అవసరమైన పర్నిచర్ కొరకు అనుమతి ఇచ్చి నన్ను మిగితా స్టూడియోలకు తీసుకువెళ్ళినాడు. అచట నాకు కావల్సిన కెమికల్స్, ఫోటో పేపర్ మరియు 3 డజనుల మౌంట్లు తీసుకున్నాను. అవి పలచగా వుండెడివి. ఫోటో సైజును దృష్టియందుంచుకొని మధ్య పోటో కొరకు ఏర్పరచిన స్థలములొ నాలుగు మూలలకు సన్నగా కోసి ఫోటొను దానిలో ఇరికించెడివారు. కాని నాకొక ఆలోచన వచ్చి ఈ మౌంట్లు ఎక్కడ ప్రింటు చేస్తారని తెలుసుకొన్నాను. అవి సికింద్రాబాద్‌లో ఫలానా బజారులో చేస్తారని చెప్పినాడు. అపుడు సిద్దిరాములు గారికి నా ఆలోచన చెప్పి వెంటతీసుకొని సికింద్రాబాద్ వెళ్లినాను. అచట

ప్రింటింగ్ పేపర్‌మార్టు పేపర్లు అమ్ముచోటు కొన్ని తెల్లని సన్నని, అట్టలను ఖరీదు చేసుకుని దగ్గరగా వున్న ప్రెస్‌కు వెళ్లి నా వద్దవున్న మౌంటునొక దానిని చూపించి అదే సైజులో కటింగ్ చేయించినాను. అవి రెండువందల ముక్కలు వచ్చినవి. అపుడు నేనిచ్చిన మౌంటు మధ్యగల డిజైను ప్రింటుచేసి దానిక్రింద ''బిట్ల నారాయణ కుందారం'' అను పేరు వచ్చేట్లు ప్రింటు చేయమని యిచ్చినాను. ఆతడు రేపు వుదయం ఇస్తాను రమ్మన్నాడు. అపుడు మళ్లి సిద్దిరాములుతో కల్సి హైద్రాబాద్‌వచ్చి ఆయనగారి పరిచయస్తుల ఇంటిలో పడుకొని మరుసటి వుదయం ప్రింటింగ్ ప్రెస్‌కు వెడలి మౌంట్స్ తీసుకొని సికింద్రాబాద్ స్టేషన్‌కు వచ్చినాము. అటునుండి కాజీపేటకు వచ్చెడి పాసింజర్‌లో వచ్చి జనగాంలో దిగినాము. సిద్దిరాములు గారు సైకిల్‌పై తన గ్రామం వెళ్ళినాడు. ఆయనగారికి సైకిలు వుంది. దానిని జనగాంలో పెట్టివచ్చినాడు. నేను కాలినడకన ప్రొద్దుగూకు వరకు ఇల్లుచేరుకున్నాను. ఈ పనిలో సిద్దిరాములుగారు నాకు బాగా తోడ్పడ్డారు. ఆంతేకాదు నా భోజనం ఖర్చులు ఇతర ఖర్చులు కూడ ఆయనగారే భరించి పంపించినారు.

ఇపుడు ఇంటివద్ద పదిరోజులు గడిపినాను. నేను కోమాళ్ల గ్రామం వెళినపుడు 3 పేయింటింగ్ ఆర్డర్స్ తెచ్చుకున్నాను. ఈ పదిరోజులు వుండి వానిని పూర్తిచేసినాను. వానిని తీసుకొని కోవంళ్ళవెళ్లి చూపితే సంతసించి బాగున్నావన్నారు. నేను పేయింటింగ్ చేసి యిచ్చిన పోటో ఒక పద్మశాలి సహకార సంఘ సంచాలకునిది. అతనికి అది యిచ్చిన పిదప కంట్రోలుపై మాకు వచ్చే నూలుకన్న అదనంగా ఇంకోపెట్టె తెచ్చుకోగలిగాను. ఇది మా అన్నగారికి సంతోషం కలిగించినది.

పిదప మూడవ ట్రిప్‌గా ముస్లిం అబ్బాయిని వెంటబెట్టుకొని సరంజామాతో పయనమైనాము. మొదట కోలుకొండ గ్రామం వెళ్లినాము. అచట మా బంధువుల ఇంటిలో బసచేసి ఫోటోల పనిలో పడినాను. ఇచట ఎక్కువగా గౌడ కులస్తులు వున్నారు. కోలుకొండ గ్రామంలో తాడిచెట్లు అధికం. ఆ గ్రామమునకు చుట్టుప్రక్కల ఏడెనిమిది గ్రామాలవాళ్ళు వచ్చి కల్లు పెద్దమొత్తంలో ఖరీదుచేసి తీసుకువెళ్ళి తమతమ గ్రామాలలో అమ్ముకుంటారు. ఆందువలన తాళ్లు ఎక్కి కల్లు గీసెడి వారి సంఖ్య అధికము. నేనచట రెండురోజులున్నాను. పెద్దగా స్పందనలేకపోయినప్పటికి నిరాశ మాత్రం కాలేదు.

అటునుండి గూడూరు వెళ్లినాను. ఇచట గూడ పద్మశాలీల వారు మంచిస్థితి యందున్నవారుకలరు. మాకు వాళ్లు పరిచయం కూడ. వాళ్ల ఆధారముగా అక్కడ ఫోటోగ్రఫీ యత్నం చేసినాను. పెద్దగా స్పందనలేకపోయినా కొన్ని ఫోటోలు దిగి తర్వాత రమ్మని కోరినారు. ఇట్లు కోరుట ప్రతిగ్రామంలో జరుగుతునే వుంది. మళ్లి తప్పక వస్తానని ఆ వూరునుండి కదలి ఇప్పిగూడెం వెళ్లినాను. ఈ గ్రామంలో మేక కొమురయ్య అను పద్మశాలి యాజ్ఞికం నిర్వహిస్తు పద్మబ్రాహ్మణుడని పిలిపించుకునేడివాడు. చుట్టుప్రక్కల విద్యావంతులైన పద్మశాలి యువకులను చేరదీసి వారికి యాజ్ఞికము నేర్పించి వారితో పెళ్లిల్లు చేయించెడివాడు. తను స్వయంగా చేసెడివాడు. నాకు ఆయనగారి పరిచయమేర్పడినది. నా ప్రయత్నాన్ని ఆయన మెచ్చుకున్నాడు. నావద్ద కోమాళ్ల బాపతి ఒక పేయింటింగ్ డబ్బులు తరువాత ఇస్తానంటే వారికి ఇవ్వకుండ తెచ్చియుంటిని. ప్రస్తుతం దానిని నా వెంట వుంచుకొని పేయింటింగ్‌లో నాకు అనుభవమున్నదను విషయం చూపుటకు తెచ్చినాను. దానిని చూచి కొమురయ్యగారు బాగా ప్రబావితుడైనాడు. నాకు అవసరమైన ప్రచారం చేసి గ్రామస్తులందరిని పరిచయం చేయించినాడు. అతని మాట మన్నించి చాలామంది పోటోలు దిగినారు. నేనక్కడ ఎనిమిది రోజులున్నాను. ఇన్ని రోజులు తన ఇంటియందుంచుకుని కొమురయ్యగారు ఆదరించినారు. నేను తిరిగి వచ్చెడిరోజు గ్రామస్తులు మీరు మళ్లి తప్పక రావాలని మాటతీసుకున్నారు. నేను సరేయని అటునుండి కంచనపల్లి యను గ్రామం వచ్చినాను. ఇచట కూడ మా బంధువులు ఇంట్లో బసచేసి నా ప్రయత్నం సాగించినాను. ఇచట గుంటూరు నుండి వచ్చి ఇచట స్థిరపడిన రెడ్లు బాగా కలిగిన కుటుంబాలు వారంతా రోమన్ కేథలిక్ మతస్తులు. నేను వారిని కలిసి విషయం చెప్పినపుడు చాలా మంది ఫోటోలు దిగినారు. వూరి వాళ్ళుకూడా కొంతమంది దిగినారు. పెద్దగా నాకున్న మంచిబేరము కింద జమ ఇచట మూడురోజులు గడిపి అటునండి కుందారం వచ్చినాను. ఈసారి గూడా 15 రోజులు తిరిగివచ్చినాను. నా ప్రయత్నం వృధా కాలేదు. నాకు ఉత్సాహంగా వున్నది.

ఇంటికివచ్చిన రెండుమూడురోజులు వరకు మా నాన్నఅమ్మా సోలాపురం నుండి వచ్చినారు. అప్పటికి నా భార్య ఏడునెలల గర్భవతి. ఆమె విషయమై వచ్చినారు. వచ్చిన మూడునాలుగు రోజులలొ శ్రీమంతం ఏర్పాటుచేసినారు. మళ్ళీ వారం రోజులకు మా మామగారు ఫలాహారాలు

తీసుకొనివచ్చినారు. ఇప్పుడు నా భార్యకు ఏడుసిండి 8 నెలలు ప్రవేశించినవి. ఆయనగారు రెండుమూడు రోజులుండి పల్లెర్లకు పోయినాడు. తన కూతురు మొదటి కాన్పుకు తమ ఇంట ఉండదాయెనని దూరదేశంలో వున్నదని బాధపడినాడు. మా అమ్మానాన్న సముదాయించి పంపినారు. మా నాన్నగారు నా వ్యాపారమందలి అభివృద్ధిని గురించి అడిగినాడు. నా సంపాదన గురించి చెప్పినాను. నేను ఇప్పుడు జనగాంలో స్టూడియో స్వంతంగా పెట్టుకోగల ఆర్థిక స్థోమత కలిగియున్నానని తెలిపినాను. నా పట్టుదల చూచి మా నాన్నగారు ఏమి సంపాదించలేదు. పైగా బాధపడినట్లు కనిపించినాడు. అయినా నేను వెనక్కి మరలుట సాధ్యపడదని నిర్ణయించుకున్నాను. మళ్లీ ఒక ట్రిప్పు గ్రామాలు తిరిగి రావలయునని ముల్లెమూట సర్దుకొని ముస్లిం అబ్బాయి నెత్తిలో పెట్టి కదిలినాను. ఇప్పుడు పెద్దగా పరిచయం లేని ప్రదేశాలనెన్నుకున్నాను. మొదట దమ్మన్నపేటకు వెళ్ళినాను. పరిచయస్థులు లేరు. వెళ్ళి పరిచయం సంపాదించుకొని ఒక దినం ఉన్నాను. రెండోమూడో ఫోటోలు దిగినారు. పెద్దగా స్పందనలేదు. మరుసటి దినం జఫర్గడ్ వెళ్ళినాను. అచట పరిచయస్థులున్న నా అంచనా ననుసరించి ఫోటోలు దిగలేదు. అక్కడికి కూడా కొలది స్నాపులు మాత్రమే తీయడమైనది. మళ్ళీ మరుసటి దినం చినవంగర, అటునుండి పెదవంగర మరియు వావిలాల అను గ్రామములో ఒక్కొక్కరోజు గడిపినాను. వేళ్లపై లెక్కించదగిన పోటోలు మాత్రమే తీయడమైనది. నిరుత్సాహమనిపించి వావిలాల నుండి సాయంకాలం వరకు కుందారం చేరుకున్నాను. మళ్ళీ కొన్నిరోజులు విశ్రాంతి తీసుకోవాలనుకున్నాను.

నేను నాలుగవసారి తిరిగి వచ్చిన పిదప మూడురోజులకు మా రంగన్న భార్యాపిల్లలతో పాటు సోలాపురం నుండి వచ్చినారు. వారి రాక మా అందరిని ఆశ్చర్యపరిచింది. ఇది అనుకోని సంఘటన. వారి రాకకు కారణం అడిగినపుడు మా వైకుంఠం భార్యతో తగవులవుతున్నాయని తాను విసిగివచ్చినానని తెలిపినాడు. ఇప్పుడు అక్కడ వైకుంఠం అతని భార్య మరియు మా తమ్ముడు సోలాపురంలో మిగిలిపోయినారు. ఆరు మొగ్గాల వ్యవహారం. అచట పనికి చాలా ఇబ్బంది జరుగుతుంది. ఈ విషయాన్ని ఆలోచించి మా నాన్నగారు చాలా బాధపడ్డారు. అంతేకాక మా అత్తగారు నా భార్యను తీసుకొని రమ్మన్నారని మొదటి కాన్పు వారి యింటిలో చేయించాలని బ్రతిమిలాడినారని తెల్పి నన్ను వెంటనే సోలాపురం వెళ్లమన్నాడు. కానీ నా నిర్ణయం అందుకు విరుద్ధం. నేను

జనగాంలో స్టూడియోపెట్టి ఇక్కడనే వుంటాను. వెళ్ళనుగాక వెళ్లనని మొండికేసినాను. దీనిపై మా ఇద్దరికి మాటామాటా పెరిగి ముఖాలు మాడ్చుకొని కూర్చున్నాము. మా రంగన్న అమాయకుడు. ఆయనకు భార్య ఎంతచెబితే అంత చేసెడివాడు. ఇది చూచి మా నాన్న చాలా బాధపడ్డాడు. నన్ను చూస్తు మీ ఎర్రోళ్ల కారణంగా ఈ సంసారం విచ్చిత్తి అవుతుంధి. (మా రంగన్న భార్య మరియు నేను తెల్లగా వుంటాం అందువలన మా ఇద్దరిని ఎర్రోళ్లు అని పేరుపెట్టినారు) సంసారం ఒక వరుసకు వచ్చే సమయానికి మీరు చెడగొడుతున్నారు. సంసారం బాగుపడాలె అంటే నీవు నీ భార్యను తీసుకొని వెళ్లమని కోరినాడు. నేను ఊహించినది ఒకటి జరుగుతున్నది. వేరొకటి ఇంటిలో చిన్న యుద్ధవాతావరణం వలె కనిపించసాగినది. మా నాన్నగారి బాధచూసి నేను మనస్సు మార్చుకోలేక తప్పలేదు. నేను సోలాపురం వెళితె అచట వ్యవహారం చక్కబడుతుందని మా నాన్న ఉద్దేశ్యం. అందుకు ఆయన ఆజ్ఞకు తలవంచి భార్యతోపాటు పయనమై సోలాపురం వెళ్లినాను. అచట మమ్మల్నిచూచి మా వైకుంఠం అన్నయ్య అతని భార్య లచ్చమ్మ చాలా సంతోషించినారు. నా భార్య మరియు లచ్చమ్మ చాలా కలయికగా వుంటారు. అట్లె నా జట్టు వైకుంఠం అన్నయ్య నేను ఏ విషయమైనా మా వైకుంఠం అన్నయ్యతో చెప్పెడివాడిని. ఆయనను సంప్రదించి పనులు చేసెడివాడిని. మేము వచ్చిన వివరం తెలుసుకొని మా అత్తగారు పరుగెత్తుకొని వచ్చినారు. వారు సంతోషించినారు. నా భార్య అప్పటికి నిండు గర్భవతి. వచ్చిన పిదప రెండురోజులకు ప్రసూతి కొరకని తీసుకొనిపోయినారు. అది డిసెంబర్ 1946, 26-1-1947 మధ్య జననం.

# సోలాపురంలో మొగ్గాల పని

ఇక నేను సోలాపురం వచ్చేముందు తెలంగాణాలో పద్మశాలీల పరిస్థితి చాలా దయనీయంగా వుంది. నూలు లభించక ఇబ్బందులు పడుచున్నారు. అప్పుడు ప్రభుత్వము కంట్రోలు ఏర్పరచి కొన్ని కేంద్రాలలో మేము మొగ్గమునకు ఇంతయని నూలు సప్లయి చేయుచున్నారు. ఈ అదనును కొంతమంది స్వార్థపరులు కేంద్రములయందు పెత్తనం కలిగియుండి శ్రామికుల నోళ్లుకొట్టి వచ్చిననూలు సరిగా పంచక బ్లాకులో అమ్ముకొని సంపాదనకు పూనుకున్నారు. ఆ సమయమున ఇచట ఆంధ్ర మహాసభ యనునది ఒక రాజకీయ పార్టీ ఏర్పడినది. దానినుండి కమ్యూనిస్టు ధృక్పధం గలవాళ్లు విడిపోయి

ఆంధ్రమహాసభ పేరిట జమిందారులు, భూస్వాములు, జాగిర్దారులు చేసెడి అన్యాయాలకు ఎదుర్కొనుట ప్రారంభించినారు. మా ప్రాంతమునందు రావి నారాయణరెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి, నల్ల నర్సింహులు మున్నగువారు దొరల పెత్తనముపై తిరుగుబాటు చేయించి వెట్టినుండి బీదవారిని విముక్తులను చేయుచున్నారు. ప్రజలలో ఒక విధమైన చైతన్యం కలిగినది. తమ గోడు విని తమ కష్టములను దూరం చేయు నాయకులున్నారని సంఘటితంగా దుర్మార్గాన్ని ఎదురుకోవచ్చునని తెలుసుకున్నారు. అప్పటికే పాలకుర్తిలో విస్నూరు రామచంద్రారెడ్డికి వ్యతిరేకంగా మరియు పూస్కూరి దొరలకు వ్యతిరేకంగా ధర్మారంలో విస్నూరి రామచంద్రారెడ్డిని ఎదుర్కొనుటకు కడవెండి పాలకుర్తిలొ, నిర్మలలో ఇంకా చాలా చోట్లు తిరుగుబాటు జరిగినవి. ప్రభుత్వమును అండగా తీసుకొని దొరలు, భూస్వాములు ఈ ప్రజా చైతన్యాన్ని అణచివేయాలని చాలా దుర్మార్గంగా వ్యవహరిస్తున్నారు. అట్లే ప్రజలలో కూడా చైతన్యం పలికి సామూహికంగా తిరుగుబాట్లు చేయుచున్నారు. వెట్టి చేయించడం మానుకున్నారు. దొరల దుర్మార్గాన్ని అన్నివిధాల నాయకుల సలహా సహకారములతో ఎదుర్కొంటున్నారు. తమ హక్కులు సాధించుకొనే యత్నం చేస్తున్నారు. ఇదియంతా ఆంధ్రమహాసభ పేరిట చేయబడుతోంది. దీని మూలం కమ్యూనిజం అయినప్పటికి పేరు మాత్రం ఆంధ్రమహాసభ దానిలో సభ్యులుగా చేరి సంఘబలముతో దొరలను ఎదుర్కొని తమను ఈ బానిసత్వము నుండి విముక్తులు గావించుకోగలమను భావన ప్రజలలో కలిగింది. ఆనాడు ఆ నాయకులు వారికి కనువిప్పు కలిగించి మార్గదర్శకులై ప్రజలను సంఘటితపరచి పనిచేయుచున్నారు. స్థూలంగా నేను కుందారం నుండి సోలాపురం 1946 డిసెంబర్‌లొ వచ్చేవరకున్న పరిస్థితి.

నేను సోలాపురం వచ్చిన పిదప మళ్ళీ మొగ్గాల పనిపై దృష్టిసారించినాను. మాకున్న ఆరు మొగ్గాలు పూర్తిగా నడువలెనన్న తగిన పరిస్థితి కల్పించాలి. అందుకు ముందుకు పూనుకున్నాను. నేను కూడా మొగ్గం నేయుట ప్రారంభించాను. నేను అన్నయ్య మరియు తమ్ముడు మరి ముగ్గురు నేతకాళ్లను పెట్టుకొని ఆరు మొగ్గాలు నడిపించుట ప్రారంభించినాను. పని మంచి వరుసకు వచ్చినది. లాభాలు కూడా మంచిగా వస్తున్నవి. ప్రతిచీరవెనుక మూడు రూ॥లు మిగులుచున్నవి. ఇందులొ నేతకానికి చీరెకు ఒక రూపాయి యిచ్చెడివారము. స్వంతం నేసుకొనే మాకు మూడు రూపాయల మిగులు వుండేవి. ఇక నాకు వ్యక్తిగతంగా ఖర్చులు లేవు. ఇదివరలో వారం వారం పద్దులు వ్రాసే పని తిరిగి

ప్రారంభించినాను. అతడు నెలకు రెండురూపాయలు ఇచ్చేడివాడు. ఇది మాత్రమే నేను ఖర్చుపెట్టుకొనుట ఇక్కడ పనిక్రమమునకు వచ్చినదని తెలిసి మా అమ్మానాన్న కుందారం నుండి తిరిగివచ్చినారు. వారు వచ్చిన కొన్ని రోజులకే నా భార్య ప్రసూతి అయినది. కుమారుడు జన్మించినాడు. 25-1-1947 నాడు కుమారుడు జన్మించినాడు. నాకు మొదటి సంతానం కుమారుడని మా తల్లిదండ్రులు, అత్తమామలు అందరూ సంతసించినారు. మా అన్న వైకుంఠం గారికి ఇంకా సంతానం కాలెదు, అప్పట్లో మా ఇంట్లో చిన్నపిల్లలు లేరు అనగా రంగయ్యగారి పిల్లలు కాస్త పెద్దవారయ్యారు. నన్ను వారం రోజులవరకు కుమారుడను చూడనివ్వలేదు,. వారం తరువాత చూపించినారు. నా ప్రతిబింబాన్ని చూచుకున్నట్లు అనుభూతి కలిగినది. ఈ సంతోషము మాకొక వారం రోజులు వుండిపోయినది.

# పొత్తులో చీరల వ్యాపారము

నేను ఎంతకాలం ఇలా మొగ్గముపై పనిచేయుట అను భావం కలిగినపుడు చికాకు అనిపించేది. ఏదేని వ్యాపారము చేయాలన్న పెట్టుబడి కావాలి. అది అంతగా మాతోకాదు. పైగా మా నాన్నగారు ఒప్పుకొరు. నేను ప్రతివారం లెక్కలు వ్రాసే కొమురయ్య తమ్ముడు ఇతరులతొ పొత్తుల చీరెల షాపుపెట్టి నడుపుచున్నాడు. అతనికి సరిగా చదువురాదు. గుమాస్తాతొ లెక్కలు వ్రాయించి నడుపుచున్నారు. ఒక వారం లెక్కలు వ్రాయుటకు వెళ్లినపుడు కొమురయ్యగారితొ చీరెల వ్యాపారము మీరు నేను కలిసిచేస్తే ఎలా వుంటుంది. నేను వ్రాస్తాను. గుమాస్తా అవసరములేదు. ఆలొచించి చెప్పమన్నాను. నేను ఇంటికి వచ్చిన పిదప నా ఆలోచన మా వైకుంఠం అన్నయ్యతో తెలిపినాను. ఎందుకనగా ఆయన మా నాన్నతో చెపితె సమ్మతించవచ్చు. మొదట మా నాన్నగారు సమ్మతించలేదు. కాని ఉభయులము కలసి చెప్పినపుడు దీనిద్వారా వ్యాపారానుభవము ఏర్పడి భవిష్యత్తులొ మనం స్వంతంగా షాపుపెట్టవచ్చునని చెబితే ఒప్పుకున్నాడు. పదివేలు పెట్టుబడికి సమ్మతించినాడు. కొమురయ్య కూడా తన తమ్మునితొ సంప్రతించి ఆమోదము తెలిపినాడు. ఎందుకనగా రెండు సంవత్సరముల నుండి నన్ను మరియు నా గుణములు తెలిసియున్నవాడు కావున ఆమొదించినాడు. ఒక మంచి ముహూర్తమున ఒక బట్టల షాపు ప్రారంభము చేసినాను. మా ఇంటిలో తయారైన చీరెలు మరియు కొమురయ్యగారి ఇంట్లో

నేయబడిన చీరెలు అట్లై ఇంకా కొందరు ఆసాములను నేర్పరుచుకొని బేరము సాగించినాము. ఒడిదుడుకులు లేకుండా మంచిగా నడిచినది. రెండుమూడు నెలలు గడిచిన పిదప వ్యాపారంలొ మాంద్యం ఏర్పడి సన్నపు నూలుతో నేసెడి చీరెలు మాత్రమే మార్కెట్లొ అమ్ముడుపోయెవి. ఐతే మా ఇంటిలొ తయారయ్యె చీరెలు సన్నపువి కొమురయ్య గారి ఇంట్లొ తయ్యారయ్యె చీరెలు దొడ్డువి. వారి సరుకంత నిలువా వుండిపోయినది. వ్యాపారం మా చీరెలతొ సాగుతు వచ్చినది. కొమురయ్యగారి పెట్టుబడిని దాటి వారి దొడ్డు చీరెలు నిలువా వుండిపోయినవి. కాని లాభాలు చెరిసగం కదా. దీనిపై మా ఇంట్లో ప్రశ్నలు మొదలైనవి. మొత్తం వ్యాపారం మా పెట్టుబడిపైననే నడుస్తున్నప్పుడు వారికి లాభాలు పంచియివ్వటం బాగోదని వాదన. కాని భాగస్వామి మన్నపుడు లాభనష్టాలు సమానమనే సూత్రాన్ని అంగీకరించక నన్ను ఆ వ్యాపారం నుండి విరమించుకోమని వత్తిడి మొదలైంది. అట్లొక రెండునెలలు భరించి విధిలేక మానుకొనుటకు వప్పుకున్నాను. వెంటనే మా పెట్టుబడికి సమమైన మా సన్నపు చీరెలను ఇంటికి పంపించివేసినాను. వ్యాపారములో మా భాగస్వామ్యము విరమించుకున్నట్లుగా కొమురయ్యగారితో చెప్పినాను. ఆయనగారు బాధపడి నేను కూడా సన్నపు చీరెలే నేపిస్తాను. మానుకోవలదని చాలా ప్రయత్నం చేసినాడు. నాకిష్టము లేకున్నా మావాళ్ల వత్తిడిని తట్టుకోలేక విరమించుకున్నాను. ఆరునెలలలో ఆ వ్యాపారము మూలపడి మళ్లీ నేను ఇంట్లొ మొగ్గము నేయుట ప్రారంభించినాను. ఈ వ్యాపారము వలన పెద్దగా లాభాలు లేకపోయిన నష్టం మాత్రం రాలేదు. మా నాన్నకిచ్చిన పెట్టుబడి తిరిగి ఆయనకు అప్పగించినాను.

మొగ్గం నేయుట ప్రారంభించిన పిదప నా మనస్సు పరిపరి విధాల ఆలోచనలు చోటుచేసుకొనెడివి. మనశ్శాంతి కొరకు నా కుమారుడైన మధుసూదన్‌ను మొగ్గము దగ్గర వేసుకొనెడివాడిని. వాడి బోసినవ్వులు నన్ను ఊహలలో విహరింపచేసెడివి. వీడు నా మాదిరిగా కులవృత్తిలొ వుండిపోతాడా లేక అధునాతన పద్ధతులలో వెడతాడ? వీడిని అలా కానివ్వకూడదు. వీని భవిష్యత్‌ను తీర్చిదిద్దాలని ఊహాలోకములొ విహరించెడివాడిని. మా ఇంట్లొ ప్రస్తుతము ఇతడే చిన్నపిల్లవాడు అవటం బొద్దుగా ముద్దుగొలిపే రూపుతో అందరిచేతులలొ ఆడెడివాడు. ప్రతివాళ్లు తమవద్ద ఉంచుకొని గడపాలని కోరెడివారు. వాడు అందరిని అలరించేడివాడు. ఇది నాకు

గర్వకారణమనిపించెడిది. నా కుమారునకు 8 నెలలు వచ్చేవరకు దేశం బ్రిటీషు వారినుండి విడిపోయి స్వతంత్రతను ప్రకటించుకున్నది. స్వాతంత్రోత్సవాలు గొప్పగా నిర్వహింపబడినవి. ఎటుచూసినా ఉత్సాహం వెల్లివిరిసినట్లు కనిపించినది. అందుకు పూర్వము గాంధీని, అతని సిద్ధాంతాన్ని వ్యతిరేకించిన వారు వేషాలు మార్చినారు. గాంధి టోపీని ధరించుట వారికి ఒక చిహ్నముగా మారింది. ఖద్దరు బట్టలు వేసుకొని నిన్నటివరకు కాంగ్రెసును వ్యతిరేకించిన ధనికులు ఇప్పుడు ప్రభుత్వము నిర్వహించు ప్రతి అంశమునందు ముందు నిలిచి తము కాంగ్రెసు అనుయాయులు యను బావన కల్గిస్తున్నారు. ఇంతలో పాకిస్తాన్ నుండి వచ్చెడి హిందువులు హాహాకారాలు మిన్నుముట్టినవి. దాని ఫలితం ప్రతిగా బారతదేశం మందలి ముఖ్యపట్టణములలో కన్పించినది. సోలాపురంలో కూడా దాని చేదు ఫలితం కనిపించినది. కొంతమంది అమాయకులు సమిధలయ్యారు. అనామకులు నాయకులయ్యారు. స్వార్థపరుల ఆటలు ప్రారంభమైనవి. నిన్నటి వరకు తమ సర్వస్వాన్ని త్యాగం చేసి స్వాతంత్ర్యం కొరకు అహర్నిశలు శ్రమించినవారు అడుగునపడుచున్నారు.

అట్లె నిజాం స్టేట్‌లో కూడ ప్రజలు స్వేచ్ఛాశంఖము పూరించినారు. అచట ముస్లింల ఆగడాలు పెచ్చుమీరినవి. ఇండియన్ యూనియన్‌లో కలువమని ప్రోత్సహించిన వల్లభబాయిపటేల్ నినాదాన్ని నైజాం ప్రభువు తృణీకరించినాడు. తను స్వతంత్రుడనని తన దేశం స్వతంత్రంగా వుండగలదని అందుకు అవసరమైన సహాయం పాకిస్తాన్ మున్నగు ముస్లిం దేశాల నుండి పొందగలనని కలలు కన్నాడు. అతని కలలకు ప్రతిరూపంగా రజాకారు స్వయంసేవకులు అను ఒక సంస్థ స్థాపించబడినది. దానికి నాయకుడు ఖాసింరజ్వి. అతని ఆధ్వర్యములొ రెండవ పాకిస్థాన్ అను నినాదము చేసినాడు. వారి దుర్మార్గాన్ని ఎదుర్కొనుటకు అచటి ప్రజలను ఆంధ్రమహాసభ (సంఘం) అను సంస్థపేరిట కమ్యూనిస్టు నాయకులు సంఘటితపరచి విజృభించినారు. రజాకార్లకు అనుయాయులుగా అక్కడి భూస్వాములు, దొరలు, జమిందారులు ఏకమై ప్రజావాహిణిని అడ్డుకునే యత్నం జరిగినది. కొంతమంది హిందువులు సైతం రజాకార్లుగా మారి దొరల ఆగడమునకు దోహదపడినారు. కోందరు దొరలు తమ నివాస స్థానములు (గడీలు) రజాకార్ల కేంద్రములుగా మార్చి రజాకార్లను వెంటబెట్టుకొని ఊరువూరు తిరుగుతు వారు చేసిన ఆగడములకు అంతులేదు. అయినప్పటికి తెలంగాణ వాసులు

మొక్కవోని ధైర్యంతో సంఘం నాయకుల నాయకత్వమున నిజామును గడగడలాడించినారు. వారి విజృంభనకు తట్టుకోలేని భూస్వాములు, పెత్తందార్లు, దోపిడి ముఠాలు, జాగిర్దారులు తమ గ్రామములను వదిలేసి పట్టణములను అశ్రయించినారు. సంఘము నాయకులు అలా గ్రామాలు వదిలి పారిపోయినవారి భూములను పేదప్రజలకు పంచిపెట్టేవారు. వారి చరాస్తులన్నింటిని పంచివేసినారు. ఇది స్థూలంగ నాటి పరిస్థితి.

## వివిధరకాల వ్యాపారాలు

నేను మొగ్గము నేయుటను ఇష్టం లేదను విషయం మా తల్లిదండ్రికి అన్నలతో స్పష్టంగా చెప్పి వేరే ఏదేని వ్యాపారము చేస్తానని ప్రయత్నాలు ప్రారంభించినాను. నా దృష్టి చిల్లరకొట్టుపై పడినది. ఎందుకనగా ఏదేని పెద్దవ్యాపారము చేయుటకు పెట్టుబడి సమస్య పెద్దగా మా వారు సహకరించరు. అందువలన చిన్నగ ప్రారంభించి పుంజుకోవచ్చునను ఆలోచనతో నాకు తెలిసిన దుకాణం వ్యాపార సరళి పరిశీలించినాను. అప్పుడు మేముండే ఇంటికి దగ్గరలోనే ముఖ్యమైన బజారులో 12 రూపాయలకు ఒక చిన్న కొట్టు అద్దెకు తీసుకున్నాను. మానాన్నగారితో విషయం తెలిపి పెట్టుబడి విషయం ప్రస్తావించాను. అయితే పెద్దమొత్తాలు కావు. కనుక ఒప్పుకున్నాడు. మొదట కొట్లోనికి కావలసిన చెక్క బీరువాలు, త్రాసు, బాట్లు మున్నగు వస్తువులు కొనితెచ్చి తరువాత కొద్దికొద్దిగా సరుకులు తెచ్చి కిరాణా కొట్టు ప్రారంభించినాను. నా అంచనా వృధా కాలేదు. మెల్లమెల్లగా వ్యాపారం పుంజుకున్నది. నేను బజారునుండి హోలుసేలులో సరుకులు కొనితెచ్చి అమ్ముటకై కొట్లో కూర్చునుట సాధ్యపడలేదు. ఖరీదుదారులు పెరిగిన కొలది అన్నిరకముల వస్తువులను కొనితెచ్చుట అమ్ముట ఇబ్బంది కలిగినది. విషయం మా నాన్నగారికి తెలిపి నాకు ఇంటికివచ్చి భోజనము చేయుటకు కూడా సమయం లభించుటలేదు. అందుకు మా తమ్ముడు విష్ణువును కొట్లో నాచేతి క్రింద ఉంచుకొని నడుపుతానన్నాను. చిల్లరకొట్టు అగుటచే ఎవరో గుమాస్తాలకు వదిలి వెళ్ళుటము కుదరదు. కావున తమ్ముని పంపమనగ విషయాన్ని పరిశీలించి తమ్ముని పంపించినాడు. నేనతనికి కొట్లో ఎలా అమ్మాలో ఎలా వ్యవహరించాలో తగిన శిక్షణ ఇచ్చిన పిదప అతనికి కొట్టు అప్పగించి ఖరీదులకు వెళ్ళేవాడిని. మేమిద్దరము కొట్లో వున్నంక వ్యాపారం ఇంకా వృద్ధిపొందినది.

నమ్మకమైన వారికి పది రూపాయలలోపు అప్పుల పెట్టుట ఇంకా పెరిగినది. నేను బజారులో ఖరీదుకు వెళ్ళినపుడు మా తమ్మునికి ఒక్కనికి కొట్టు నడుపుట ఇబ్బంది అయి ఒక అబ్బాయిని కూడా మూడు రూపాయలకు వేతనము ఏర్పరచినాను. ఇప్పుడు నాకు వెసలుబాటు ఎక్కువగా కలిగినది. అప్పుడు నా దృష్టి ఇతర వ్యాపారము మీదికి మరల్చుటకు అవకాశం కలిగినది. మొగ్గాలు నేసెవారు మోవముతో చేయబడు బిల్లలను వాడతారు. అవి ఎక్కువగా అమ్ముడుపోయే అవకాశం వుండెడిది. నేను ఆలోచించి బొంబాయి నుండి రెండుసంచుల మోము తెప్పించి దానిని కరిగించి గిన్నెలలొ పోసి బిల్లలుగా చేసి కొట్లో పెట్టి అమ్మెడివారము. అవి బాగా అమ్ముడుపోవుటచే దానిని ఇంకా వృద్ధిచేసి దానిపై మా పేరువచ్చే విధం ఏర్పాటుచేసినాము. నా తీరిక వేళలో ఇవి తయారుచేసి కొట్లో పెట్టెడివాడిని. మిగతా సమయం కొట్లో వ్యాపారం మరియు పద్దుల వసూళ్లు, బజారు నుండి కొట్లోకి అవసరమైన వస్తువులు కొనితెచ్చుట చేసెడివాడిని. కొలది కాలములోనే మా కొట్టుకు బాగా పేరు వచ్చినది. మా కొట్లో ప్రతివస్తువు దొరకగలదు. మరియు సరసమైన రేట్లకు ఇస్తారని పేరు వచ్చినది.

నాకెప్పుడు కొత్త విషయమును గురించి ఆలోచించుట మరియు దానిని కార్యరూపములో పెట్టి సాధించాలని ఆలొచన వుండెడిది. అందువలన మాకు దగ్గర బంధువైన గుండేటి సదాశివుడు అని మిత్రుని కలుపుకొని ఒక హోటల్ అద్దెకు తీసుకొని నడపాలని ఆలోచించినాను. ఆ హోటల్ సినిమా హోలు దగ్గర వున్నది. అది ముఖ్యంగా పద్మశాలీలు వున్న ప్రదేశంలో వుంది. ఆ సినిమా హాలులో తెలుగు సినిమాలే ఆడెడివి. ఆ హోటల్ నడిపే వ్యక్తి తన వ్యక్తిగత కారణాల వలన మానుకున్నాడు. మేము అతనిని సంప్రదించి నెలుకు 50 రూపాయల అద్దె అది హోటలునందున్న ఫర్నీచర్, వంట సామానులు, రేడియోతో సహితంగా పనిచేసెడివాడికి వేతనములు మేమే ఇచ్చే ఖరారుపై మాట్లాడినాము. ఇది మా ఇంట్లో ఎవరికి తెలియకుండా ఏర్పాటుచేసినాను. అద్దెకు హోటలు ప్రారంభించినాము. హోటలుకు కావలసిన వంటసరుకులు నేను తెచ్చిపెట్టెడివాడిని. మొదట నేను మా మిత్రుడు చూచుకున్నాము. నాకు దుకాణములోకి సరుకులు తెచ్చుట బజారు పని చూచుటచే ప్రొద్దంతా హోటలులో కూర్చునుటకు వీలుపడలేదు. పైగా నాకు మళ్లీ విశ్రాంతి లేని స్థితి ఏర్పడినది. కొట్లో సరిగ వుండటం లేదని వెళ్ళినవాడు వెంటనే తిరిగి రావటం లేదని మా తమ్ముడు ఇంటిలో చెప్పినాడు. మా పెద్దలు కారణమడిగి

నన్ను నిలదీసెడివారు. నేనేమో దానియందు సరిగా లాభం కనిపించిన పిదప చెప్పాలని నిశ్చయించుకున్నాను. మిత్రుడు సదాశివుడు మొదట చూపించిన ఉత్సాహం తగ్గించినాడు. ఇంటిలో నన్ను తిరుగుడు తగ్గించి ఇంటిపట్టున వుండుమని పోరుపెట్టుచున్నారని చాలా రాత్రివరకు నాకు వుండుటకు వీలుపడదని పేచీపెట్టినాడు. హోటలు సినిమా హాలు పక్కనే గనక రెండవ ఆట అగువరకు వుంటే బాగుంటుందని నా ఆలోచన. సదాశివుడు తప్పించడం ప్రారంభించినాడు. నాకు ఎటు పాలుపోలేదు. ఇక లాభం లేదనుకొని హోటలు యజమాని వద్దకు వెళ్లి నడపటం నాకు సాధ్యం పడటం లేదు. ఈ నెల అద్దె తీసుకొని విముక్తున్ని చేయమని కోరినాను. అందుకు అతడు పేచీ పెట్టి ఒక పెద్దమనిషి వద్ద ఫిర్యాదు చేసినాడు. అతడు నన్ను పిలిపించి నీవు మానుకొనదలచినట్లయితే రెండు నెలల అద్దె చెల్లించమని తీర్పు చెప్పినాడు. ఈ బాధలకన్న అద్దె మంచిదనుకొని రెండునెలల అద్దె వంద రూపాయలు చెల్లించి వదులుకున్నాను. మేము హోటలు నడిపించినది 15 రోజులు. అందుకు రెండునెలల అద్దె కట్టవలసి వచ్చినది. దండగ పడితినని బాధపడిన ఒక అనుభవము మిగిలిపోయినది. అయితే ఈ నష్టపోయిన వంద రూపాయలు ఎలా సంపాదించాలను ఆలోచనతో యెల్లయ్య అను ఒక మిత్రుని సలహా మేరకు అతనితో కలిసి బొంబాయిలో ఇల్లుఇల్లు తిరిగి చీరెల అమ్మకమునకు పూనుకున్నాను. ఆ బేరము అవమానకరంగా కనిపించినది. అమ్మిన చీరెల డబ్బులతో దుకాణములోనికి బాంబేలో లవంగాలు మసాల దినుసులు, గొడుగులు కొన్ని ఇతర వస్తువులు హోలుసేల్ ధరల్లో తెచ్చినాను. దానిని చూచి ఇంటిలో గొడవ. నీవు తీసుకువెళ్లిన చీరెలకు డబ్బులు తేవాలి కాని ఇలాంటి వస్తువులు తెచ్చి ఎప్పుడు అమ్ముతావు? ఇది నీతో కాని పని. నిన్ను నమ్ముకుంటే పుట్టి ముంచగలవని కోపించినారు. ఒక సినిమా హాలును అద్దెకు తీసుకొనే యత్నం చేసినాను. కాని పెట్టుబడి సాధ్యం గాక మానుకున్నాను. నేను కిరాణకొట్టు పెట్టి నడుపుచున్న కాలములో నిజాంలో రజాకార్ల అలజడి విపరీతమైంది. అచట మా చిన్నబావగారి ఊరు వెలిదండ నాడు కమ్యూనిస్టులకు కేంద్రంగా వుండెడిది. అందు పద్మశాలీ యువకులు ప్రముఖపాత్ర వహించి దొరల దురాగతాలు, రజాకార్ల దుర్మార్గాన్ని పార్టీ ఆధ్వర్యములో ఎదుర్కొని వారి ఆటకట్టించినారు. మా బావ అప్పట్లో యువకుడు. అమాయకుడు పద్మశాలి నాయకులు చెప్పినట్లు వారికి తోడ్పడ్డాడు. ఇది రజాకార్లకు గ్రామాధికారులు తెల్పుటచే ఈయనను పట్టుకు వెళ్లి బాగా హింసించి జమానతుపై వదిలిపెట్టినారు. ఆయన తండ్రిగారు ఇతడు గ్రామంలో వుంటే ప్రమాదమని మా చెల్లిని మరియు బావగారిని సోలాపురం

మా వద్దకు పంపించినారు. ఆ రజాకార్ల కాలమందు అనేకులు తమ గ్రామాలు వదిలి ఇతర ప్రాంతములకు వెళ్లి మిలిటరీ ఆక్రమణ తర్వాత చేరుకున్నారు. మా చెల్లి మరియు బావగారి రాక మాకు ఆనందం కలిగించినది. మా బావగారికి మొగ్గం నేయుట రాదు. ఆయన వైద్యం నేర్చుకుని ఇపుడిపుడే ప్రాక్టీసు చేస్తున్నాడు. ఆయన వచ్చిన కొన్నాళ్ల పిదప మా కుటుంబంలో గుసగుసలు ప్రారంభమైనవి. ఎంతకాలం వీరిని పనిలేకుండా పోషించటం అని మా అన్నయ్యలు, వదినెలు చెల్లి కడగొట్టు కూతురగుటచే మా అమ్మ ఆమెచేత ఏ పని చేయించెడిది కాదు. ఇది మా వదినెలకు కోపం. దీనిపై కొంత రభస జరిగినది. మా బావగారికి సిగరెట్లు త్రాగుట, అపుడపుడు కల్లు త్రాగుట అలవాటు వుండెడిది. నేను మా కుటుంబ సభ్యుల మనోభావాలను గుర్తించి ఆయనను తీసుకవెళ్లి కిరాణకొట్లో ఏదోపని చేసినట్లుగా చేయించెడి వాడిని. ఆయనగారికి అవసరమైన చిల్లర ఖర్చులకు డబ్బులు మా ఇంట్లో ఎవరికి తెలియకుండా ఇచ్చెడివాడిని. ఇట్లు కొంతకాలం గడిపిన పిదప మిలిటరీ ఆక్రమణతో నైజాం స్వతంత్ర రాష్ట్రముగా కాక ఇండియన్ యూనియన్‌లో చేర్చబడి కొంత ప్రశాంతత ఏర్పడిన పిదప మా బావగారిని తిరిగి రమ్మని ఆయన తండ్రిగారు కబురుపట్టినారు. మా చెల్లి బావ రామస్వామి గారలకు క్రొత్తబట్టలు పెట్టి కిరాయ మరియు ఇతర ఖర్చులకు డబ్బులిచ్చి 1948లో పంపించినాను. వారు వెళ్లిపోయిన పిదప మా ఇంటిలో మా అన్నయ్యలు విమర్శించి నీవు వారికి బట్టలుపెట్టి కిరాయలు ఇచ్చి పంపించి మంచివాడివని పించుకుని మమ్మల్ని శత్రువులను చేసినావని దానిపై అత్తగారింటికి ఆపదలో వచ్చిన బావగారిని, చెల్లిని అదుకోవటం మన ధర్మం. ఇది అందరికి వర్తిస్తుంధి. మీరు చేసినా నేను చేసినా మన ఇంటి నుండే మనవారికేయని సమాధానం ఇచ్చినాను. దీనిని మా నాన్నగారు సమర్థించి మా అన్నయ్యల సంకుచితాన్ని ఎత్తిచూపినారు. ఇది నాకొక కనువిప్పు. మా వారందరికి గుణపాఠం అయినది.

## కమ్యూనిజం వైపు ఆకర్షణ

ఇపుడు నాకు తీరిక ఎక్కువగా దొరికినది. కాని గోళ్ళుగిల్లుకుంటు కూర్చోవడం నా స్వభావమునకు వ్యతిరేకం. మొగ్గం నేయుటకు మనస్కరించదు. కొట్టును మా తమ్ముడు స్వతంత్రముగా నడుపుకునే స్థాయికి వచ్చినాడు. ఏవేని పేయింట్స్ దొరికితే చేసెడివాన్ని. కాని అవి ఎల్లప్పుడు దొరికేటివి కాదు. కొన్నాళ్లపాటు తెలంగాణా మా వూరికి వెళ్లిరావాలని నిర్ణయించుకున్నాను.

నాకు చిన్ననాటి నుండి ప్రతి విషయాన్ని వినుటయే కాదు దాని గురించి ఆలోచించి ఆచరించాలను అలవాటు ఏర్పడినది. అందుకే గ్రుడ్డిగా మా పెద్దలు చేస్తున్న కృషి (వృత్తి) లో ఇమిడివుండలేకపోయినాను. ఇప్పుడు నా వయసు 22 సం॥లు పూర్తిఅయి 23 నడుస్తున్నవి. నేను ఇంతవరకు నిర్వహించిన ఏ పని కూడా నాకు సంతృప్తి కలిగించలేదు. నేను శరణప్పగారి వద్ద పనిచేసేప్పుడు ఆయనగారి ద్వారా ఆర్యమతము అవలంభించినాను. మద్య మాంసాదులు త్యజించినాను. కొన్నాళ్లు మా గురువుగారితో పాటు వారి సమావేశములకు వెళ్లి ఉపన్యాసాలు వినుచుండెడివాడిని. దాని సాహిత్యము తెచ్చి చదువుకునే వాడిని. అందు ''సత్యార్థ ప్రకాశిక'' అను గ్రంధము నన్ను అమితముగా ఆకర్షించినది. దానిని ఒకటికిరెండుసార్లు చదివిన పిమ్మట నాలో వివేచన, విచక్షణ దృష్టి అలవడినది. అందు ప్రతి మతమును గురించి ప్రశ్నసమాధాన రూపములో దయానంద సరస్వతి గారు తన ఆలొచనా సరళిని పొందుపరిచినారు.నాలో మొట్టమొదట వెలుతురును చూపించినది ఆ గ్రంధమే. అట్లు కొన్నాళ్ళు గడిచిన పిమ్మట కమ్యూనిజం వైపు ఆకర్షితుడనైనాను. శరణప్పగారి స్టూడియో నుండి మా ఇంటికి వచ్చేదారిలో దాని ఆఫీసు వుంది. మహారాష్ట్ర భాషలో దానిని ''లాల్‌బౌటా'' ఆఫీసు అని పిల్చెడివారు. అనగా ఎర్రజండా ఆఫీసు. దానియందు ఎక్కువగా పద్మశాలి యువకులే పనిచేసెడివారు. అది పద్మశాలీలు అధికంగా వున్న ప్రాంతంలో నెలకొల్పబడినది. అప్పట్లో మడూరు వెంకప్ప నాయకుడు. ఆయన పద్మశాలి. నాడు దాదాపు 1,30,000 వేల మంది పద్మశాలీలు సోలాపురమందున్నట్లు లెక్కలు తీసినారు. వీరందరు నిజాములో తెలంగాణ ప్రాంతమైన నల్‌గొండ, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ నుండి వలస వచ్చినవారు. అచట తమకు బ్రతుకుతెరువు లేక జీవనాధారం వెదుకుకొనుచు ఇచ్చటికి వలసవచ్చి కొంతమంది సెటిల్ అయినారు. వారు స్థలములు సంపాదించి ఇండ్లుకట్టుకుని ధనులయ్యారు. (అనగా మాస్టర్ వీవర్సు) చాలా మంది నేత కార్మికులు వీరు స్థిరముగా ఇక్కడవుండక వచ్చివెళ్లుచుండెడివారు. కొంతమంది కుటుంబంతో అధికులు వంటరిగా వచ్చి సంపాదించుకొని వెళ్ళెడివారు. అట్లె కర్నాటకనుండి కూడా చాలా మంది పద్మశాలీలు మరియు మార్వాడీలు గుజరాతులు బలిజెవాండ్లు. వీరిలో బలిజెవాండ్లు ఆర్థికంగా బలపడి చీరెల దుకాణాలు మరియు ధాన్యపు కొట్లు పెట్టి పెత్తనం సాగించెడివారు. ఈ వలస 1880 నుండి అధికంగా ప్రారంభమై 1948 వరకు నాటివరకు 1,50,000 వరకు చేరినది. ఇచట మాస్టర్ వీవర్సు (ధనులు) మరియు షావుకార్లు (చీరెల దుకాణదారులు) ఒక పార్టీగా వ్యవహరించెవారు. కూలీలందరు కమ్యూనిజం వైపు వుండెడివారు.

ఈ షావుకార్లు మాస్టర్ వీవర్సు కమ్యూనిస్టులనగా దేశద్రోహులని రష్యా ఏజంట్లని దేశానికి చీడపురుగులని ప్రచారము చేసెడివారు. స్వాతంత్ర్యమునకు పూర్వము ఇంగ్లీషు వానిని ప్రశంసించి కాంగ్రెసును గేలిచేశారు. స్వాతంత్రం వచ్చిన పిదప వేషాలు మార్చుకొని కాంగ్రెసు తీర్థం పుచ్చుకున్నారు. అయితే కమ్యూనిస్టులు మొదటినుండి కార్మికుల పక్షాన నిలిచి వారి యోగక్షేమాల కొరకు ధనికులతో నిత్యం పోరాటం జరిగెడిది. సోలాపురం నందు వున్న బట్టల మిల్లులలో 30 వేలమంది కార్మికులు పనిచేసెడివారు. వారిలో అధిక సంఖ్యాకులు కమ్యూనిస్టు అనుయాయులు. తమ కష్టసుఖాలు పార్టీ సహాయంతో సాధించుకొనేవారు. అప్పట్లో విఠల్‌పలమారిసానె మొదలగువారు చేనేత కార్మికులకు వెంకప్పమడూరు, రామన్న, సోమన్న తదితరులు వీరు ప్రతినిత్యం ఆఫీసును అంటిపెట్టుకుని కార్మికులకు ధనికులకు కార్మికులకు కార్మికులకు మధ్య ఏర్పడు తగవులను పరిష్కరించెడివారు. మాస్టర్ వీవర్సు నుండి ఇబ్బంది కలిగిన పరుగెత్తుకొని వచ్చి ఆఫీసులో తెలిపేడివారు. మడూరు తదితరులు అట్టి విషయాన్ని పరిష్కరించేవాడు. వారు కార్మికులకు చెల్లించు కూలీ విషయమై ప్రతినిత్యం పోరువుండేది. చీరెల ధర పెరిగిన కొలది కూలీ పెంచవలసినదిగా ధనికులకు హెచ్చరికచేసి పెంచని తీరుకు కార్మికులతో సమ్మె చేయించుతుమని బెదిరించెడివారు. నేత కార్మికులకు ప్రతి బుధవారం సెలవు దినం. ఆ రోజు సాయంకాలం పబ్లిక్ మీటింగు పెట్టెడివారు. కార్మికులందరు సభకు వచ్చి నాయకులుచెప్పే విషయాలు విని తామెట్లు దోపిడీకి గురి అగుచున్నది తెలుసుకొనెడివారు. ఆ మీటింగులో ముఖ్యంగా మడూరు వెంకప్పగారు ముందుండెడివారు. నాడు పద్మశాలి కూలీలకు ఆయనొక రక్షకుడుగా కన్పించెడివాడు. నేను శరణప్పగారి ఫోటో స్టూడియో నుండి ఇంటివెళుతు దారిలోవున్న పార్టీ ఆఫీసులోకి వెళ్ళి తెలుగు పత్రిక చదివెడివాడిని. అచట జరుగు సంభాషణలను ఆలకించెడివాడిని. అట్లే ఆఫీసు ద్వారా లభ్యమయ్యే కమ్యూనిస్టు సాహిత్యం, తెలుగు పుస్తకాలను అడిగి తీసుకువెళ్లి చదివి తెచ్చెడివాడిని. శ్రామికులు దాదాపు నిరక్షరాస్యులు. తెలుగు పత్రిక చదవటం కాని పుస్తకములు చదవటం కాని తక్కువ. నేను ప్రతినిత్యం ఆఫీసుకు వెళ్ళి గంట, అరగంట గడిపి రాత్రి ఇంటికి వెళ్లెడివాడిని. అట్లు నేను ఆఫీసుకు వెళ్లటం అలవాటు పడిన పిదప నాయకుల దృష్టియందుపడినాను. నేను కొన్నికొన్ని సందర్భాలలొ వారితో విషయ చర్చ జరిపేవాడిని. మొదట నన్ను పట్టించుకోలేదు. కాని నాడు వచ్చెడి చదువుల గురించి మరియు విషయ

పరిజ్ఞానము గురించి మరియు కమ్యూనిస్టు సాహిత్యం చదువుటయందు నేను చూపెడి శ్రద్ధగురించి తెలుసుకున్న నాయకులు నా అవసరాన్ని గుర్తించినారు. నాకు మరాఠీ, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, కన్నడి భాషలతో పరిచయం వుంది. అచట కరపత్రములు మరాఠీ భాషలో అచ్చొత్తించెడివారు. తెలుగు ప్రింటింగ్ లేదు. పైగా తెలుగులో వ్రాయువారు లేరు. వున్నవారి భాష సగం మరాఠీ పదాలతో కలిసి వుండెడిది. అందువలన మరాఠీ లో ప్రింటు చేయించిన కరపత్రములను తెలుగు అనువాదము చేయుట చేసిన వానిని సైక్లోస్టయిల్‌పై కరపత్రాలు తీసి ఇచ్చెడి పనికొరకు నన్ను ఉపయోగించుకొన్నారు. నేను వారితో కలిసి పనిచేసినప్పటికి సభ్యత్వము తీసుకొనకుండా సానుభూతిపరుడుగా వున్నాను. ఎందుకనగా మా ఇంట్లో మొగ్గాలు వున్నవి. మా నాన్న మాస్టర్ లీడర్. ఆయన కుమారున్ని కమ్యూనిస్టు సభ్యుడనైనా వ్యాపారమునకు దెబ్బరావచ్చునెడి భయముండెడిది. అందువలన సభ్యత్వం తీసుకోలేకపోయినప్పటికి నన్ను వారి అనుయాయిగా గుర్తించి నాతో అవసరమైన పనులను తీసుకొనెడివారు. నేను శరణప్పగారి వద్ద పనివమానిన పిదప కూడా పార్టీతో సంబంధం వుంచుకున్నాను. తీరికవేళలో తప్పక వెళ్లెడివాడిని. పబ్లిక్ మీటింగులకు వెళ్లెడివాడని. రానురాను ఆర్యవంతవము నుండి కవమ్యూనిజం వైపు ఆకర్షితుడనయ్యాను. నేను దేశం వచ్చి ఫోటోలు తీసిన కాలములో తెలంగాణాలో జరుగుచున్న మార్పులను గమనించినాను. ప్రజలలొ కలుగుచున్న చైతన్యం పెత్తందార్ల అధికారం సమాప్తం చేయగలదని ఊహించినాను. కానీ ఎక్కడ ప్రకటించలేదు.

నిజాం రాష్ట్రములో మిలటరీ ప్రభుత్వము నడుస్తోంది. రజాకార్ల విజృంభణముకన్న కేంద్ర ప్రభుత్వము కమ్యూనిస్టుల వ్యాప్తిని నిరోధించుట ముఖ్యమనుకుని పోలీసు ఆర్డరు జరిపి నైజామును తొలగించి అచట మిలటరీ పాలన ఏర్పరచినారు. కమ్యూనిస్టులను ఆయుధములు స్వాధీన పరచి లొంగిపొమ్మని ఆదేశించినారు. కమ్యూనిస్టు పోరాట పటిమను నిస్సారమొనర్చి మార్పుతో పెత్తందార్ల అధికారం పునరుద్ధరించుటకు పూనుకున్నారు. తెలంగాణా పోరాటం నడిపించాలి. లేదు మానుకొని పార్లమెంటరీ పద్ధతిలో ప్రభుత్వాలనేర్పరుచాలను ( ఏర్పరుచాలను) వాదములు కమ్యూనిస్టు పార్టీలో చెలరేగినవి. జోషిని తొలగించి రణధీర్‌ను నియమించుటతో మొదలైనది. ఇది మిలటరీ ఆర్డరు తరువాత ఉధృతమైనవి. తమ ప్రాణాలను లెక్కించక రజాకార్ల

నెదుర్కొనిన కమ్యూనిస్టులలో నిర్లిప్తత వచ్చినది. వారికి సరియైన నేతృత్వము కరువైనది. కాంగ్రెసువారు కమ్యూనిస్టులపై నిందారోపణలు మొదలిడినారు. మనలను రజాకార్ల నుండి నిజాం ముష్కర పరిపాలన నుండి విముక్తులను చేసి మనలో శాంతి నెలకొల్పుటకు వచ్చిన మన మిలటరీపై తుపాకులు ఎక్కుపెట్టినారని ఇది దేశద్రోహుల లక్షణమని మీరెవ్వరు సంఘం వారికి సహకరించక మిలటరీ ఆదేశాలను పాటించి శాంతినెలకొల్పుటకు సహాయపడవలసిదిగ ప్రచారం మొదలుపెట్టినారు. మొదట మిలటరీవారు ఇప్పించిన గడువు లోపల ఆయుధాలు అప్పగించక యుద్ధం ప్రకటించి శాంతిస్థాపనకు ఆటంకం కలిగిస్తున్నారను సాకుపై కనిపించిన కమ్యూనిస్టులను కాల్చివేయవలసినదిగా ఆర్డరు యివ్వబడినది. ఆ సమయమున మిలటరీ ముఖ్యమగు చోట్ల క్యాంపులు ఏర్పరచి ప్రతినిత్యం కొన్ని గ్రామాలను చుట్టుముట్టి ప్రజలను ఒకచోట చేర్చి నిర్దాక్షిణ్యంగా హింసించుట ప్రారంభించారు. గొర్రెను తినువాడు పోతే బర్రెను తినువాడు వచ్చినాడను సామెత వలె ఉన్నదని ప్రజలు బాధపడ్డారు. కొంతమంది మధ్యతరగతి రైతుబిడ్డలు మొదట రజాకార్ల కాలమున పోరాటము చేసినవారు కాంగ్రెసువారి ప్రచారమునకు తలవొగ్గి పార్టీనుండి విడిపోయి సరెండర్ అయినారు. వున్నవారికి సరియైన మార్గదర్శకత్వము అందటం లేదు. నాయకులు వచ్చి తమకు సరియైన దారి చూపగలరను ఆశతో ఎదురుచూస్తున్నారు. వారు ప్రాణాలు అరచేత పట్టుకొని తిరుగాడుచున్నారు. ప్రజలు మాత్రము వీరి ఉనికిని మిలటరీకి అందించక వారికి ఆహారం, ఆశ్రయం కల్పిస్తున్నారు.

అది 1948 నవంబర్ ఆఖరు వారం నాకు దేశమనగా తెలంగాణా వెళ్లి అక్కడి పరిస్థితులు చూచి రావలయునను భావం కలిగినది,. అప్పుడు మా అమ్మా నాన్న దేశంలోనే వున్నారు. నాకుకూడా పెద్దగా పనిలేదు. కొన్నిరోజులు వెళ్లివద్దామని మా అన్నలతో తెలిపి కుందారం వచ్చినాను. నన్ను చూచి మా తల్లిదండ్రులు ఎందుకు వచ్చినావు. ఇక్కడి పరిస్థితులు ఏమీ బాగాలేవు. మిలటరీ వాళ్లు కొత్తవారిని చూస్తే చంపివేయటమో కాక జైల్లో వేయటమో చేస్తున్నారని భయపడినారు. నేను పెద్దగా స్పందించలేదు. కొలది రోజులు వుండిపోదామని వచ్చినాను. భయపడవలసిన పనిలేదని తెలిపినాను. రాత్రిళ్లు సంఘంవాళ్లు వచ్చి మీటింగులుపెట్టి వెళుతున్నారు. పగలు మిలటరీ వాళ్లు వచ్చి కమ్యూనిస్టుల

ఆరాతీసి పట్టుకువెళుతున్నారు. రెండుమూడు రోజుల పిదప పెదమడూరు మా అక్కయ్యగారి ఇంటికి వెళివస్తానని పయనమైనాను. నా పయనాన్ని చూచి నీవు రహదారి చీటీ తీసుకొని వెళ్లాలి. లేనిచో దారిలో మిలటరీవాళ్ల చేతులుచిక్కిన కష్టాలు వచ్చునని మా పెద్దన్నయ్య చెప్పినాడు. కాని నేను ఖాతరు చేయలేదు. పొద్దున్నే పయనమై వెళ్ళినాను. దారిలో చినమడూరు మీదుగా వెళ్లాలి. అచట మిలటరీ క్యాంపు వున్నది. అచట ఒక పంజాబీ సైనికుడు నన్ను ఆపి రహదారి చీటీ చూపమన్నాడు. నేను తేలేదు. మాది దగ్గర గ్రామమని తెల్పినాను. మొదట అతను మొరటుగా మాట్లాడినాడు. కాని నేను హిందీలో మాట్లాడుసరికి కాస్త మెత్తబడి తమ ఆఫీసర్ దగ్గరకు తీసుకువెళ్లినాడు. అతడు నా వేషభాషను గుర్తించి వివరాలు అడిగినపుడు తెలిపి ఇచట పెదమడూరులో మా అక్కయ్య బావగారు వున్నారు. చూచివెళదామని వచ్చినానని తెలిపాను. సోలాపురం నుండి మా బంధువులను రెండు రోజులుండి చూచిపోదామని వచ్చినాను. నేను ఫోటో పని సోలాపురంలో చేస్తాను. మొదట కర్కశంగా మాట్లాడిన పిదప నన్ను అర్థం చేసుకొని నాకు చాయ త్రాగించి ఇక ముందు రహదారి పత్రము లేకుండా పయనించిన ప్రమాదమునకు లోనగుదువని పంపించినాడు. నేను మా అక్కయ్య ఇంటికివెళ్లి జరిగిన సంఘటన చెప్పినప్పుడు చాలా భయపడినారు. నేనచట నాలుగు రోజులుండి తిరిగి కుందారం వచ్చినాను. నేను వచ్చుటకు ముందురోజే మిలటరీ వారు తెల్లవారు 4 గంటలకు గ్రామమును చుట్టివేసి ఊరిలో వున్న యువకులందరిని ఊరిబయటకు తీసుకువెళ్లి మీలో కమ్యూనిస్టులు ఎవరో తెలుపుడని బాగా హింసించినారట. విషయాన్ని తెలిపి నన్ను వెంటనే తిరిగి సోలాపురం వెళ్లిపొమ్మని హెచ్చరించినారు.

నాకు మా గ్రామములో చిన్ననాటి మిత్రుడు వంగ నర్సయ్య అనునతడు నాకన్న 5 సం॥లు చిన్నవాడు. ఐనా మాకు బడినుండి స్నేహం ఏర్పడినది. నేను ఇచట వున్నంత కాలం జోగురాజు పంతులుగారి వద్ద ఇద్దరం శిష్యరికం చేసినాము. సోలాపురం నుండి వచ్చి యిక్కడ ఎన్నిరోజులు వున్నా ప్రతిదినం మేము ఉభయులము కల్సుకొని విషయాలు చర్చిస్తు వుండేవాళ్లము. నేను బస్తి వివరాలు తెలుపుతు వుండెవాన్ని. ఆర్యమతమును గురించి చెప్పినపుడు అతడు సత్యార్థపు కాదల్ తెలుసు అను వాదం తెచ్చుకుని చదివి ఆర్యమతావలంబియై మద్యమాంసములు మానుకున్నాడు. ఆతడెపుడు నన్ను ఆదర్శంగా

భావించినడుచుకొనెడివాడు. నాకతడు స్నేహితుడు, శిష్యుడు, చుట్టము. గ్రామములో తెలుగులో మంచి ప్రావీణ్యము కల్గిన వ్యక్తి! అప్పటికే అతను భారతం భాగవతం పద్యకావ్యాలను చెప్పుచున్నాడు. అతనితో పాటు గ్రామములోని యువకులు చాలామంది అతనిని అనుసరించి యుండెడివారు. నేను కుందారం వచ్చిన పిదప ఇక్కడి పరిస్థితులు వారితోపాటు సమీక్షించాను.

ఆ సందర్భములోనే సంఘంవారు ఒక సాయంకాలం పబ్లిక్ మీటింగ్ పెట్టబడునని చాటింపు వేయించినారు. మిలటరీ ఆక్షన్ అయిన పిదప ఎక్కువగా మీటింగులు పెట్టటం తగ్గినవి. ఈరోజు సభకు గ్రామములోని చిన్నాపెద్ద అందరు వినుటకై వచ్చినారు. ఆ మీటింగులో ముఖ్యముగా నల్లా నర్సింహులు కాసం నారాయణగారు ఉపన్యసించినారు. దానిలో తెలంగాణాను స్వాతంత్ర్యం వైపు నడిపించుటకు, రజాకార్లనెదురుకొనుటకు, వారి దౌర్జన్యాల నరికట్టుటకు గ్రామమందలి పెత్తందార్ల దుర్మార్గాన్ని అంతం చేయుటకు ఎలాంటి కృషిచేసినది. దాని పర్యవసానంగా ఈ పెత్తందార్లు గ్రామాలు విడిచి పారిపోయిన పిదప వారి ఆస్తులు స్వాధీన పరచుకుని పేదలకు పంచి ఇచ్చిన వైనం, దున్నేవాడిదే భూమియను నినాదాన్ని ప్రజలలో కల్గించి పనిచేసినాము. మీరందరు మాకు సహకరించి విజయానికి తోడ్పడ్డారు. ఈ పోరాటంలో వందలకొలది యువకులు తమ ప్రాణాలు అర్పించినారు. వేల గ్రామాలను దుర్మార్గుల నుండి విముక్తి గావించినాము. ఎంతోమంది స్త్రీలు తము చెప్పరాని అవమానాల పాలైనారు. వారిని రక్షించుటకు ఎదురొడ్డించి పనిచేసినాము. కొన్ని లక్షల ఎకరాల భూమిని పంచిపెట్టినాము. తుదకు కేంద్రప్రభుత్వ జోక్యంతో.నిజాం పాలన అంతమైనది. కాని పరిస్థితి మొదటికి వచ్చినది. మళ్ళీ భూస్వాములు, పెత్తందార్లు మిలిటరీ సాయంతో గ్రామాలు ప్రవేశించి తమచే పంచబడిన భూములను స్వాధీనపరచుకొనుచున్నారు. ఇంతమంది వీరులు త్యాగం చేసి సాధించిన ఫలితం దక్కని పరిస్థితి ఏర్పడినది. ఇంత కష్టపడి సాధించినదంతా బూడిదలో పోసిన పన్నీరైంది. కాంగ్రెసువారు నిన్నటివరకు ఎక్కడనో బస్తీలలో గడిపి యిపుడు మిలిటరీ సాయంతో కమ్యూనిజాన్ని వ్యతిరేకిస్తు ప్రచారం చేయుచున్నారు. వీరు, పెత్తందారులు కుమ్మక్కు అయి మళ్లి మనను పాత పరిస్థితులలోనికి తీసుకువెళుతున్నారు. అందువలన మీరింత వరకు ఏ వుత్సాహం ప్రోత్సాహం, సహాయం, సహకారాలు మాకు అందించినారో వానిని అదే ఉత్సాహంతో తోడ్పడాలి. మీ తోడ్పాటుతోనే మేము ముందుకుసాగుతాం. కాంగ్రెసువారు

చెప్పె కల్లబొల్లి మాటలకు తలయొగ్గవలదు. వారెంత సేపు ధనవంతుల కొమ్ముకాసెడివారె. పేదలు వారి దృష్టికి అందరు. మనము మళ్లి పూర్వ ధైర్యంతో పనిచేసిన మనము సాధించుకున్న భూములు, హక్కులు మనకు దక్కగలవు. ద్రోహబుద్ధితో వ్యవహరించెడివారు. సంఘవ్యతిరేక పనులకు పాల్పడుచున్నారు. అలాంటి వ్యక్తులకు తగినబుద్ధి చెప్పాలి. అందుకు మీ తోడ్పాటు మాకు అవసరం. మిలిటరీ వాళ్లకు భయపడి మన రహస్యాలు వెలిబుచ్చవలదని చెప్పి సభ చాలించి భోజనాలు చేసి వెళ్లిపోయినారు. మరుసటి దినంవంగ నర్సింహులు అతని మిత్రులు నేను సమావేశమై రాత్రి బహిరంగ సభలో చెప్పిన అంశాలను చర్చించి మనమందరం ఒక దళంగా ఏర్పడి మిలిటరీ వాళ్ల నెదుర్కొందామని, కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారం చేద్దామని సూచించినారు. కాని నేనందుకు ఒప్పుకొనక మిలిటరీతో పోరాటమనగా మాటలతో కాదు. ముందు మనము సంఘం నాయకులతో సంప్రదించి శత్రువులనెదుర్కొను వ్యూహరచన తెల్సుకొని అందుకు తగిన శిక్షణపొంది ఆయుధాలు సంపాదించిన పిదప దళంగా ఏర్పడుటకు అవకాశముంటుంది. కావున ఈ లోపు కొందరము వెళ్లి సంఘం సంచారదళంలో చేరి మన ఆలోచనను వివరిద్దామని చెప్పిన పిదప మంచిదనుకున్నాము. అందుకు చాలా మంది సిద్ధమైనారు. కాని ఇద్దరు ముగ్గురం వెళుదామని సూచించాను. మరుసటి దినం కాసాని నారాయణ సంచారదళంతో కుందారం దగ్గర అప్పిరెడ్డిపల్లి హద్దులో వున్నాడు వెళదామన్నాడు. మేము ఎంతతగ్గించినా ఆరుగురం తయారైనాము. నేను, వంగ నర్సయ్య, వంగ బాలయ్య, వల్లాల పుల్లయ్య, తెనుగు బొందయ్య ఇంకొక హరిజనుడు. మేమెవరము ఇంటివద్ద మా ప్లానును చెప్పక కట్టుబట్టలతొ పయనమై విడివిడిగా గ్రామం నుండి వెడలి నిర్దేశిత స్థలములో అందరం కలుసుకొని సాయంకాలం లోగా మేము కాసం నారాయణగారి సంచారదళాన్ని కలుసుకున్నాము.

మేము దళం నందు కాసం నారాయణనను కలిసిన పిదప కుందారం వాళ్లని గుర్తించి యువకులందరు కట్టకట్టుకొని వచ్చినారు. కారణం ఏమియని మాలో వంగ నర్సయ్యతొ ఆయనగారికి ముందు పరిచయం వుంది. నర్సయ్య మేమెందుకు వచ్చినది నన్ను గురించి పరిచయం చేసినాడు. నన్ను పరిశీలనగా చూచి మంచిది మనమిప్పుడు ఇంకొక చోటుకు వెళుచున్నాము. రండియని వెంట తీసుకొని కదలినాడు. అతనివెంట ఇంకొక అయిదుగురు వున్నారు. వారిలో ఇంకొకతను పాపిరెడ్డి మాజీ సైనికుడు, రెండవ అతను గొల్ల రాములు.

కోలుకొండ అతను. యువకుడు, మొరటు మనిషి. ఎటువంటి కష్టసాధ్యమైన పనికైనా వెనుకాముందాడక పనిచేయువాడు. ఇతరులు సామాన్య దళసభ్యులు. పాపిరెడ్డి వద్ద వొక మూడువందల మూడు రైపిల్‌గొల్లరాములు వద్ద ఒక బర్మారు, మిగతా ఇద్దరి వద్ద బరిశెలు, ఇంకొకరు కర్రకలిగియున్నారు. మేము మొదట తూర్పుగా పయనించి దక్షిణమునకు మరలి చీకటిపడు వరకు నేలపోగుల చేరుకున్నాము. మా దళం రాకగురించి కొరియర్ ద్వారా గ్రామదళ సభ్యులకు తెలియపర్చబడి యుండుటచే మేము ఊరిలోనికి చేరగానే స్వాగతించినారు. మమ్మల్ని చక్కగా చావడి వద్దకు తీసుకువెళ్ళినారు. అచట బహిరంగ సభ ఏర్పాటుచేసియున్నారు. సభలో కాసం నారాయణ, పాపిరెడ్డి మరియు మాలో వంగ నర్సయ్య మాట్లాడినారు. విషయం నేటి పరిస్థితులను ఎలా ఎదుర్కోవాలో తెలిపి ముగించినారు. తరువాత భోజనాలుచేసి మేము ఒక మాగిజొన్న చేనులో పండుకొన్నాము. అది ఊరికి కొలది దూరంలో యున్నది. డిసెంబర్ నెల 1948 సంవత్సరం విపరీతమైన చలి ఆరుబయట చల్లని గాలి దున్నని భూమి, జొన్నసాలు మధ్య ప్రక్కకు ఏమీ లేదు. కప్పుకొనుటకు చిన్న పైకండువ తుండువంటిది ముఖముపై కప్పుకొని పడుకున్నాము. ఆ రాత్రి కాసం నారాయణతో వివరంగా మాట్లాడుటకు వీలుపడలేదు. మరుసటి దినం చినమడూరు చేరుకున్నాము. అచట స్నానాలు పూర్తిచేసుకొని నారాయణతొ సమావేశమైనాము. ఆయనగారు మా రాకగురించి పెద్దగా ఉత్సాహపరుస్తూ మాట్లాడలేదు. వారి ఉధృతదాడులనుండి రక్షించుకొనుటకు దళసభ్యులను 20 నుండి 5-6 వరకు పరిమితి చేయుడమైనది. పైగా ఆయుధాలు అధునాతనమైనవి మనకు ఒకటే వుంది. మిలిటరీ వారికి గ్రామస్థులు భయపడుచున్నారు. మనము ప్రతి అడుగు జాగ్రత్తగా వేయవలసివస్తుంది. కనుక సరిగా ఆలొచించుకొని నిర్ణయించండని సలహా యిచ్చినాడు. విషయం విన్న పిదప ఇద్దరు ఇంటిత్రోవ పట్టినారు. ఇంకా మేము నలుగురము మిగిలినాము. దళం పగటివేళలో గ్రామ ప్రవేశం చేయకపోయెడివారు. భోజనాలు మేముండే చోటికి తెప్పింపబడేవి. అది ఏ ఒక్కరో వండితెచ్చినది కాక ఇంటికింత అడిగితెచ్చెడివారు. అందు సంకటి, వరి అన్నం రకరకములు కలిసి వుండేవి. అట్లే కూరలన్ని ఒకచోట కలిపివచ్చెడిది. పచ్చళ్లు కారపు ముద్దలు (నాడు మిరపకాయలను రోట్లో నూరి ముద్దలు చేసి వుంచెడివారు) ఒక పెద్ద గంపలో పెట్టుకొని చేనుకు వెళుతున్న రైతు మాదిరిగ నెత్తిపై పెట్టుకుని తెచ్చెడివారు. మేమెప్పుడు నిర్దేశిత రహస్య స్థావరములందు ఆగెడివారము. ఎప్పటికి ఇద్దరు

కొరియర్లు పనిచేయుచుండెడివారు. మేము ఎటువెళ్లినది కొరియర్ ద్వారా ఆయా గ్రామ దళాలకు తెలిపెడివారు. ఇంకొక కొరియర్ చుట్టుప్రక్కల గ్రామములలో జరుగుచున్న సంఘటనలు తెలుసుకొని చేరవేసెడివాడు. మేము ఏ చోటనైనా మూడుగంటలకు మించి వుండినది లేదు. తూర్పుకని చెప్పి పడమర దిక్కు పయనించెడివారము. మా పయనం కొరియర్‌కు నాయకునకు మాత్రమే తెలిసివుండెడిది. మిలిటరీ సంచరించుటచే మాకు అరచేతిలో ప్రాణం పెట్టుకుని వ్యవహరింపజొసెడిది. అడుగడుగున ప్రమాదమున్నట్లు మసలుకోవలసి వచ్చెడిది. ఇంకొకరెండురోజులు గడిచిన పిదప వంగ బాలయ్య మరియు వల్లాల పుల్లయ్య వెళ్లిపోయినారు. ఇపుడు వంగ నర్సయ్య మరియు నేను మాత్రమే మిగిలినాము.

మేము దళంలో కలిసిన పిదప అయిదు రోజులకు నల్లా నర్సింహులు జనగాం ఏరియా తూర్పు ప్రాంత ఆర్గనైజర్ మా దళమునకు వచ్చినాడు. ఆయనగారి వెంట బద్దం ఎల్లారెడ్డిగారు వచ్చినారు. నర్సింహులుగారి వెంట థాను అను ఒక అంగరక్షకుడు వుండెడివాడు. అట్లె కొరియర్ తాను ఒక లంబాడి యువకుడు వారి కుటుంబమంతా పార్టీసేవకు అంకితమైన పనిచేసిన వ్యక్తులు. ధైర్యవంతులు, విశ్వాసపాత్రులు. నర్సింహులు తన వెంట ఒక రైఫిల్ కలిగియున్నాడు. ఆయన జనగాం తూర్పు ఏరియాలో వున్నట్టి దాదాపు 100 గ్రామాలను ఆర్గనైజు చేసెడివాడు. దళాధిపతులు ఇతని ఆజ్ఞకు లోబడి పనిచేసెడివారు. నల్లా నర్సింహులు మాకు బంధువు అవుతాడు కాని మేమెప్పుడు కలుసుకోలేదు. వంగ నర్సయ్యకు పరిచయస్థుడు. నర్సయ్య ద్వారా నా వివరం తెలుసుకున్నాడు. అట్లే కాసం నారాయణగారి ద్వారా మా వివరాలు సేకరించినాడు. వచ్చిన పిదప నాటి పరిస్థితులను సమీక్ష చేయుచు బద్దం ఎల్లారెడ్డిగారితో పార్టీ ఆదేశం మేరకు నేటి పరిస్థితులు మిలిటరీ సంచారముతో ప్రజల మనోభావాలు, దళసభ్యుల ఉద్దేశ్యాలు మున్నగు అంశాలను సేకరించుటకు పంపినారు. విషయం తెలుసుకొని పాలసీ నిర్ణయించుటకు పంపబడినాడు. నాటి పరిస్థితి డోలాయమానముగా వుంది. మధ్యతరగతి ప్రజలు ముఖ్యంగా బ్రాహ్మణ, వైశ్య, రెడ్డి మున్నగువారు పోరాటం ఆపివేస్తే బాగుంటుందను భావముతో వున్నారు. ఇప్పుడు మిలిటరీతో యుద్ధమనిన నెహ్రూ ప్రభుత్వముపైననే కదా ఇంతకు ముందు నిజాంకు వ్యతిరేకంగా పోరాడినాము. ఇప్పుడు మన ప్రభుత్వముపైన పోరాటము ఎందుకు అని

ఆలోచిస్తున్నారు. ఇప్పటికే సంపన్న కుటుంబముల నుండి సంఘంలో చేరి దళంలో పనిచేసిన యువకులు మెల్లగా తప్పించుకొని ఇతర రాష్ట్రములకు వెళ్లి తలదాచుకుంటున్నారు. ఇవన్ని నాడు గ్రామములకు వెళ్లినపుడు గ్రామ దళసభ్యులు తాము గ్రామములో విన్న విషయాలని కాసం నారాయణగారితో చెప్పేడివారు. నల్లా నర్సింహులుగారికి బద్దం ఎల్లారెడ్డిగారికి ఇట్టివిషయాలు వివరింపబడినవి. వారు మా వెంట 4 రోజులు గడిపినారు,. నర్సింహులుగారు వచ్చిన పిదప ఆయనగారి రేడియో ద్వారా వార్తలు వినెడివాడిని. పేపరు అసలే లేదు. నాకు ప్రతినిత్యం సోలాపురంలో పేపరుచూచే అలవాటు. వంగ నరసయ్య, నల్లా నర్సింహులుగారితో ఈ 4 రోజులు అంటిపెట్టికొనియున్నాడు. ఆయనగారు దళమును విడిచి వెళ్లేముందు కాసం నారాయణగారితో దళమును మళ్లీ తగ్గించి 4 లేక అయిదుగురిని మాత్రమే ఒక గుంపులో వుంచవలసినదిగా చెప్పివెళ్లినాడు. ఈ వారం పదిరోజులలో జనగామ తూర్పుప్రాంత గ్రామాలలో కొన్ని చుట్టబెట్టినాము. మాకు రెండవజత బట్టలు లేని కారణంగా పై కండువా కట్టుకొని వంటిపై గుడ్డలు పిండుకొని ఆవి ఆరిన పిదప స్నానం చేసి కట్టుకొనేవారము. చలికాలం అయినందు వలన పెద్దగా చెమటతో తడుచుట వుండకపోయేది. 3 రోజులకు ఒక తడవ అది ఎండవేళ ప్రశాంతం, అపాయరహితమైన చోట చేసెడివారము. మేము అగియున్న చోటనుండి ఒక కొరియర్ నాలుగుదిక్కులా కాపలా కాసెడివాడు. ముఖ్యంగా జీపులు, ట్రక్కులు తిరుగాడుటకు అవకాశం లేనిచోట ఆగియుండెడివారము.

ఒకరోజు కోలుకొండగుట్టలలో మకాం చేసి యున్నాము. అది తాళ్లతో నిండిన గ్రామము. బద్దం ఎల్లారెడ్డిగారు నల్లా నర్సింహులుగారు రహస్య సమావేశం చేస్తున్నారు,. ఇంతలో ఒక జీపువస్తున్న అలికిడి అయినది. మాకు ముందు మైదాన ప్రాంతము వెనుక గుట్టలు పక్కకు తాళ్ల వనం. ఆ చప్పుడు విని ఎక్కడివాళ్లం అక్కడ ఆగిపోవటమో లేక తప్పుకొని పారిపోవటమో చేసినాము. నల్లా నర్సింహులుగారు ఎటో తప్పుకున్నారు. ఆయనగారికి ఈ ప్రదేశమంతా కొట్టినపిండి. కాని బద్దం ఎల్లారెడ్డిగారికి కొత్తప్రదేశం. పైగా అనారోగ్యంతో వున్నట్టివాడు. ఆయన బాగా తికమకపడ్డాడు. ఇద్దరు కామ్రేడ్స్ ఆయనను సురక్షితమైన చోటకు తీసుకువెళ్ళినారు. నేను కూడా వారిని అనుసరించినాను. మేమిక అచట ఆగకుండా గబ్బెట చేరుకున్నాము. ఇక్కడ నిర్దేశిత స్థలములో మళ్లీ అందరం కలుసుకున్నాము. ఆనాటి రాత్రి బద్దం

ఎల్లారెడ్డిగారు తిరుమలారెడ్డిగారిని కలిసి మాట్లాడి కంచనపల్లి నుండి ఆయన తన గమ్యస్థానమునకు వెళ్లిపోయినాడు. తిరుమలారెడ్డిగారు కాసం నారాయణ వలె దళాధ్యక్షులు. ఆయన మంచి పోరాట పటిమ గల్గి దొరల గుండెలలో నిద్రించినాడు. వారి కుటుంబమంతా పార్టీకి అంకితమైనవారు. తరువాత మార్చి 1949లో పితూరి జరిగి మిలటరీకి పట్టుబడి చంపబడినాడు. నర్సింహులు వెళ్లిపోయిన పిదప మళ్లీ మా దళాన్ని చీల్చి రెండు భాగాలుగా చేసినారు. నన్ను మరియు వంగ నర్సయ్యకు పాపిరెడ్డి ఆధ్వర్యములో చేర్చినారు. పాపిరెడ్డి వద్ద 303 రైపిల్ గలదు. ఆయన మిలటరీలో కొంతకాలం పనిచేసి రిటైర్ చేయించుకొనివచ్చి పార్టీలోచేరి దళములో తిరుగుచున్న వ్యక్తి. ఆయనగారి కడవెండి. నల్లా నర్సింహులుగారి ఊరే. ఇప్పుడు మా దళములో అయిదుగురము మాత్రమే మిగిలినాము. ఒకేఒక ఆయుధం. పాపిరెడ్డిగారు సైనికుడే గాని రాజకీయంగా ఎదుగలేదు. ఆ మాటకువస్తే నాటి పోరాటములో పాల్గొన్న కామ్రేడ్స్‌లో 90 శాతం పార్టీ అంటే ఏమిటో సైద్ధాంతికంగా తెలియని వారే. ఇతనితో తిరుగుట విసుగు కలుగుతోంది. గ్రామాలలో సమావేశాలులేవు. భోజనం తెప్పించుకొని తినట తిరుగటం. కాసం నారాయణ గారితో ఉన్నపుడు నాతో ఆయన సన్నిహితంగా వుండటమె కాదు కమ్యూనిజంను గురించి చాలా విషయాలు అడిగి తెలుసుకున్నాడు. ఏవేని గ్రామమందలి తగవులు వచ్చినా చక్కని పరిష్కారం చెప్పిపంపెడివాడు. అతనితో వున్నంతకాలం నాకు పెద్దగా బాధ అనిపించలేదు. రాత్రుళ్లు మాత్రం చలికి కప్పుకొనుటకు ఏమీ లేక నిద్రపట్టక మేల్కొని గడిపేవాడిని. ప్రొద్దంత తిరిగి అలిసియుండుటచే వెంటనే నిద్రపట్టెడిది. కాని మెలకువ వస్తె తిరిగి నిద్రపట్టకపోయెడిది. పాపిరెడ్డిగారితో నాలుగు రోజులు గడిపినాము. మేము ఏ వుద్దేశంతో వచ్చినామో అది నెరవేరదని రూఢి అయినది. పైగా ప్రతి నిమిషం ప్రాణభయం. పోరాడుటకు ఆయుధాలు లేవు. తప్పుకొవటమే ముఖ్య ఆశయంగా దళాలు సంచరిస్తున్నవి. మాలో నిరాశ చోటు చేసుకున్నది. 15వ నాడు నేలపోగులకు వచ్చినపుడు మేము ఇంటికివెళ్ళిపోతాము. వీలుంటే మళ్లివస్తామని ఇంటిత్రోవ పట్టినాము. మేము గ్రామ ప్రవేశమొనర్చునప్పటికి చీకటిపడినది.

నేను చక్కగా ఇంటికివెళ్లినాను. నర్సింహులు తన ఇంటికివెళ్లిపోయినాడు. నన్నుచూచి మా తల్లిదండ్రులు, మా అన్నయ్య కంటతడిపెట్టినారు. నిన్ను మళ్లి ప్రాణాలతో చూస్తామనుకోలేదని ఇచట మేము వెళ్లి దళంలో కలిసిన నాటి

రాత్రి వేరొక దళం గ్రామములో యున్న కొంతమంది భూస్వాములు మరియు షావుకార్లను పట్టితెచ్చి ప్రజలముందు పెట్టి మీరు మిలిటరీకి తోడ్పడుచున్నారని వారిని దేహశుద్ధి చేసి కొందరి పశువులను తీసుకవెళ్లినారట. మీరు మిలిటరీకి మా సమాచార మేమాత్రము అందచేసినా పరిస్థితులు గంభీరంగా వుండగలవని హెచ్చరించి వెళ్లిపోయినారట. మాకు ఈ విషయాలేవి తెవియవు. ఇది యాధృచ్ఛిక మైనప్పటికి నింద మాపై పడినది. మేమువెళ్లి దళ నాయకునకు కొంతమంది పేర్లు ఇచ్చినందున వారువచ్చి దేహశుద్ధి చేసి పశువులను తోలుకుపోయినారని భ్రమించినారు. దానికి అనుగుణ్యంగా ఇచట దళమునేర్పరుచాలని ఉవ్విళ్లూరుచున్న అమాయక యువకులు అంతే జరిగివుంటుంది. మీరందరు జాగ్రత్తగా వుండవలెనని హెచ్చరించినారు. మేము దళములోనికి వెళ్లిన పిదప మిలటరీలో వారు రెండు తడవలు గ్రామమునందలి పురుషులందరిని ఊరిబయటకు చేర్చి సంఘంలో కలిసిన వారెవరో చెప్పుమని హింసించినారట. అయినా హింసకు ఓర్చినారే కాని మా పేర్లను బయటపెట్టలేదు. ఈ వివరాలన్ని విన్న పిదప నాకు భయం వేసినది. మిలటరీ చేతికిచిక్కిన ప్రమాదము కావున నీవు వెంటనే సోలాపురం పోవలసినదని నన్ను పయనం చేసినారు. వంగ నర్సయ్య పరిస్థితి నాకన్నా భిన్నంగా లేదు. వంగ బాలయ్య ముందేవెళ్లిపోయినాడు. మరుసటి ఉదయం పెందలకడె వంగ నర్సయ్య మరియు నేను జనగాం చేరుకుని అటునుండి సికింద్రాబాద్ వెళ్లి మా మేనకోడలు ఇంటిలో రెండురోజులు గడిపి సోలాపురం వెళ్లిపోయినాము.

నేను సోలాపురం చేరిన పిదప మళ్లి నాకు ఏమి పని చేయాలను సమస్య. దుకాణం మా తమ్ముడు స్వతంత్రముగా నడుపుచున్నాడు. అక్కడ నా అవసరము లేదు. ఏదేని పెద్ద వ్యాపారం పెడుదామని చూస్తే పెట్టుబడి సమస్య. మొగ్గము నేయుటకు ఇష్టం లేదు. అందువలన పేయింటింగు పని చేయాలనుకున్నాను. కాని అవి ఎప్పుడు దొరకవు కదా. దీని విషయమై మా గురువుగారగు శరణప్పగారిని కలిసినాను. ఆయనగారు ఈ మధ్య యాదగిరి నుండి మకాం మార్చి మళ్లీ సోలాపురంలో స్టూడియో పెట్టి నడుపుచున్నాడు. ఆయనగారు తనవద్ద నౌకరి చేయుమన్నాడు. నాకిష్టం లేదు. ఆయనకు పేయింటింగ్స్ బాగా వస్తుంటవి. అందువలన నేను కొన్ని నాకు వచ్చినవి చేసిపెడతానన్నాను. కాని మొత్తం పని నీకు ఇవ్వటం కుదరదు. నేను పేయింటింగ్ రఫ్‌గా వేసియిస్తాను. దానిని పూర్తిచేసి యివ్వు. వచ్చేదానిలో చెరిసగం

తీసుకుందామన్నాడు. ఆయనగారు రఫ్‌గా ఒకగంటలో వేసియిస్తాడు. కానీ నేను దానిని పూర్తిచేయుటకు కనీసం రెండురోజులు పడుతుంది. వచ్చే కూలీ చెరిసగం అయిన పనిలోని లోటుపాట్లు నేర్చుకోనుటకు అవకాశముంటుంది. మునుముందు పేయింటింగ్ చేయించుకొనే వారికి పరిచయువౌతానని ఆలోచించి సరేనన్నాను. దీనికి మునపటి వలె ఉదయం వెళ్లి సాయంకాలం వరకు వుండవలసిన అవసరం లేదు. నాకిష్టం వచ్చినపుడు వచ్చివెళ్లుటకు వీలుపడినది. పనియొక్క తొందరను దృష్టియందుంచుకోని చేసెడివాడని. ఇప్పుడు సమయం చూచుకొని ''లాల్‌బౌటా'' ఆఫీసుకు తరచూవెళ్లెడివాడిని. ఇప్పుడు ఆఫీసులో మడూరు గారితో తెలంగాణా పరిస్థితిని చర్చించెడివాడిని. ఆయనగారేమో తెలంగాణాలో పోరు ఉధృతం చేయాలి, పోరాటం ఆపవలదు ఈ దేశమంతటికి ఆదర్శం. దీని స్ఫూర్తితో భారతదేశం ఒక కొత్త ఒరవడిని ఎన్నుకోగలదు. అక్కడ మిలటరీ వాళ్ల దురాగతాలను ఎండగడుతూ మాట్లాడేవారు. కాని నేను ప్రత్యక్షంగా చూచి వచ్చిన అంశం ప్రస్తావించి మధ్యతరగతి ప్రజలు ఊగిసలాటలో యున్నారు. ధనవంతులు, భూస్వాములు, దొరలు వ్యతిరేకిస్తున్నారని పేదప్రజలు మాత్రం తమ సహాయసహకారాలు అందిస్తున్నారని అంతేకాదు మిలటరీవారు యుద్ధవిద్య యందు శిక్షణ పొందినవారు. పైగా వారివద్ద అధునాతన ఆయుధాలు వున్నవి. వారు తిరుగాడుటకు వాహన సౌకర్యం వుంది. అటువంటి మిలటరీని ట్రేయినింగ్ లేని అధునాతన ఆయుధాలు లేని యువకులు ఎలా వారిముందు నిలువగలరు? అలా నిలిచినవారు నిర్దాక్షిణ్యంగా చంపబడుతున్నారు. ఇప్పటికే చాలామంది తమ ప్రాంతం విడిచి పారిపోయినారో లేక మరణించినారో అయివుంటారు. కావున ప్రస్తుతము పోరాటము ఆపుట బాగుంటుందని వాదించెడివాడిని. ఎప్పటివలె తెలుగులో నేను మరాఠీ కరపత్రములను తెలుగులోనికి అనువాదించి సైక్లోస్టయిల్‌పై తీసియిచ్చుట చేసెడివాడిని.

ఇంతలో భారతదేశరైల్వే సమ్మె 1949 మార్చి 21 నాడు చేయబడునని పార్టీ ప్రకటించినది. సోషలిస్టు పార్టీ జయప్రకాష్‌నారాయణ కూడా దీనిని సమర్థించినారు. దీనివలన ప్రభుత్వమును ఒక ఊపువూపి తమ బలమును నిరూపింపవచ్చునని సంకల్పించినారు. ప్రతిగా ప్రభుత్వము భారతదేశమందలి ప్రతిపక్షనాయకులందరిని వేలకొలది మందిని అరెస్టుచేసి జైళ్లలో త్రోసినారు. సోలాపురంలో కమ్యూనిస్టు పార్టీలో పనిచేయు వారినందరిని పట్టివేసినారు.

ఇక తెలంగాణాలో పనిచేసి వచ్చి ఇచట తలదాచుకొనిన వారి లిస్టును అప్పటికే సిద్ధం చేయించినారు. అప్పట్లో పద్మశాలి యువకులను కొందరిని హోంగార్డుగా నియమించి వారికి శిక్షణ యిచ్చారు. పద్మశాలి యువకులలో కమ్యూనిస్టు భావాలు గలవారు మరియు తెలంగాణా పోరాటములో పాల్గొన్నామని ప్రగల్భాలు కొట్టేవారిని లేదా పోరాటములో పాల్గొని రహస్య జీవనము గడుపువారి లిస్టును ప్రభుత్వమునకు అందించినారు. ఈ ఆల్ ఇండియా రైల్వే సమ్మెను పురస్కరించుకొని పై వారందరిని అరెస్టుచేసినారు. వంగ నరసయ్యను, వంగ బాలయ్యను అరెస్టుచేసి మా ఇంటికి వచ్చినారట. నేను ఆ ఉదయం ఒక మిత్రునితో కలిసి మార్నింగ్ షో సినిమాకు వెళ్లినాను. పోలీసులు మా ఇంట్లో లేనిది తెలుసుకొని శరణప్పగారి స్టూడియోకు వెళ్ళినారు. అక్కడ దొరకలేదు. ఇంకా నా స్నేహితుల ఇండ్లన్ని వెదికి మా ఇంటిచుట్టుపక్కల కాపలా కాయుచున్నారట. మా తల్లిదండ్రులు భయపడి సోలాపురంలో వున్న ప్రతి సినిమాహాలు వద్దకు ఒకరిని పంపించినారు. నేను వెళ్లిన హాలువద్ద మా వైకుంఠం అన్నయ్య కాపువేసి వున్నాడు. సినిమా విడుదల అయిన వెంటనే మా అన్నయ్య కన్పించినాడు. ఆయన ఏదో ఆదుర్దాతో వున్నట్లు అనిపించినది. ఆయన నా వద్దకువచ్చి పరిస్థితి వివరించి నీవు వెంటనే ఎక్కడికైనా పోలీసుల కంటపడకుండా తప్పుకోమన్నాడు. నేను కొట్టిపారవేసినాను. ఏమీ కాదని నేను ధీమాగా మాట్లాడినాను. కానీ ఆయన బాగా భయపడుచున్నాడు. సరే అలాగే కొన్నాళ్లు రహస్యంగా వుంటానన్నాను. అప్పుడు నా వెంట వచ్చిన మిత్రుడు సదాశివుని షాలివారు. గొంగడిబస్తీలో యున్నారు. అటు వెళదామన్నాడు. అప్పుడు మేమిద్దరము దారిమార్చి అచ్చటికి చేరుకున్నాము. మూడునాలుగురోజులు పోలీసులు, హోంగార్డులు మా ఇంటిచుట్టు తిరిగినారట. కానీ వారికి దొరకలేదు. ఇంకా దొరికినవారిని అరెస్టు చేయుచున్నారని నా పేరిట వారెంటు తీసినారని ఇక్కడి నుండి వేరే సిటీకి కొంతకాలం వెళ్లి రావలసినదిగా ఆ పార్టీ ఆఫీసు నుండి సలహా వచ్చినది. మా తల్లిదండ్రులు కూడా వెళ్లిరమ్మని కొంత డబ్బుయిచ్చి బొంబే పంపించినారు. మొదట పదిరోజులు చూచిన పిదప వెళ్లవచ్చునని పార్టీనుండి సందేశమిచ్చి నాకు రహస్యంగ వుండుటకు ఏర్పాటుచేసినారు. వారి ఇంటిలో వారు నాకు యిచ్చిన మర్యాద చూస్తే ఏదో ఒక గొప్పనాయకుడికి ఇచ్చిన గౌరవం యిచ్చినారు. వారు చూపే గౌరవం నన్ను సిగ్గిల చేసింది. ఎందుకనగా నేను పార్టీకి చేసిన సేవ గానీ, తెలంగాణాలో నేను

చేసిన పనులుగానీ ఏవీ లేవు. నా మనస్సు బాధపడి మిన్నకున్నాను. తరువాత బాంబే వెళ్లమన్నారు. వెళ్లేనాటి రాత్రి ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులను కలసి నా భార్యతో భయపడవలసిన పనిలేదని ధైర్యం చెప్పినాను. ఆమె ఇప్పుడు గర్భవతి. నా మొదటి కుమారుడు మధుసూదన్‌కు రెండు సం।లు పూర్తిఅయి మూడవ సంవత్సరం ప్రవేశించినది. నేను వచ్చేటప్పుడు బాగా ఏడ్చినాడు. నా వెంట వస్తానని పేచీ ఒకజత బట్టలు తీసుకొని సోలాపురం స్టేషన్‌లో ఎక్కి బొంబాయి చేరినాను.

## రహస్య జీవితము - బొంబాయిలో

బాంబేలో మొదట నాకు పరిచయమున్న వారింటికి వెళ్ళినాను. మా పాలి అతను నన్ను చూసి బాంబే రావలసిన కారణమడిగినాడు. అపుడు విషయం వివరించినాను. అట్లగుటచో కొంతకాలము నీఉనికి తెలియని చోటువుండటం శ్రేయాస్కరము అని అచటికి రెండువైళ్ళ దూరములో యున్నట్టి ''జోగేశ్వరము'' చేర్చినాడు. జోగేశ్వరము ఒక గుట్టగుహయందు నిర్మించిన గుడి యందుండెడి శివునిగుడి అచట ఒక సాధువుండెడివాడు. ఆయన అచటి ముఖ్యమైన బ్రహ్మచారి. అతనితో పాటు ఇంకా చాలామంది సాధువులు వుండెడివారు. వారందరు గంజాయి మత్తులో మునిగి తేలెడివారు. అచటి ప్రజలు వారి యందు భక్తి ప్రపత్తులు కలిగి వారి అవసరములను తీర్చుచూ సేవచేసెడివారు. ప్రభుత్వం కూడా వారి సౌకర్యమునకై చాలా ఏర్పాట్లుచేసినది. అది ఒక పెద్దమఠంగా రూపుదిద్దుకున్నది. ప్రశాంత వాతావరణం, తోటలు పూలమొక్కలు పెట్టి పైరుపచ్చలతో అలరింపచేయుచున్నట్టిది. అచట ఒక పెద్దబావి కలదు. అచటి వారందరు ఆ బావినీళ్ళనే వాడుకొనెడివారు. అచటి సాధువు అనుమతితో కొంతమంది పద్మశాలీలు చిన్నచిన్న గుడిసెలు వేసుకొని నివసిస్తున్నారు. బొంబాయిలో పని దొరుకుతుంది. కాని వుండుటకు చోటు దొరకదు. జోగేశ్వరములో వున్న కార్మికులందరూ తెలంగాణావారే. తెలంగాణాలో పని దొరకకా, దొరికినా కడుపునిండక గ్రామాధికారుల దుర్మార్గాన్ని తట్టుకోలేక బొంబాయి చేరి బ్రతుకు చున్నట్టివారు. వారు ఉదయం 4గంటలకే పనిలోనికి వెళ్ళుటకు సద్దులు తీసుకొని పయనమయ్యెడివారు. వారుండుచోటునకు వారు పనిచేయు చోటునకు 20 నుండి 25 కిలో మీటర్లు.

వానిలో 3 షిఫ్టులలో పనిచేయటం జరుగుతుంది. వారు దినములో 4, 5 గంటల విశ్రాంతి తీసుకొని జీవితాలు గడుపుచున్నారు. వారిని పరిశీలించి వారి పనిని చూచిన పిదప బ్రతుకుటకై ఎటువంటి దుర్భర పరిస్థితిని ఎదుర్కొనుచున్నారో అర్థమైనది. ప్రత్యక్షంగా వారి పరిస్థితులను చూచిన పిదప నాకు పేదవారి కష్టాలు ఎలాంటివో తెలిసివచ్చినది. ఇంతవరకు తండ్రిచాటు వానిగానే జీవితంవెళ్ళబుచ్చినాను. వా అవసరములను దృష్టియందుంచుకొని నన్ను మలిచేయత్నం చేసినారు. అచట ప్రశాంతముగానే గడిచినది. ఒకనెల గడిచిన పిదప ఒకటి రెండుసార్లు సిటీలోనికివెళ్ళి మా స్నేహితుని పెద్దమ్మ కుమారుడు గుజ్జాకాంతయ్యను కలిసినాను. ఆయన నా విషయం అదివరకే తెలిసియున్నాడు. అతనేకాదు మా బంధువులు, పాలివాండ్లు అందరికి నేను వచ్చిన విషయం తెలిసింది. కాంతయ్యగారు ''న్యూచాక'' మాటుంగలో నివసిస్తున్నాడు. అది పాకిస్తాన్‌నుండి వచ్చిన హిందువుల కొరకు నిర్మింపబడినది. దానిలోని కొందరు ఇతరులకు అమ్ముకున్నారు. అలా ఒక రూమును కాంతయ్యగారు కొన్నారు. ఆయన తన అన్న, వదినె, తను తన భార్యతో వుంటున్నాడు. ఆయన ఆహ్వానం మేరకు జోగేశ్వరం వదలి వారి రూం చేరుకున్నాను.

కాంతయ్యగారికి సుద్దాల హనుమంతు గారితో మంచి పరిచయం వుంది. నేను కాంతయ్య ఇంటిలో భోజనం చేసి బ్రహ్మచారుల గదిలో నిద్రించెడివాడిని, అప్పటికి నావద్ద పదిరూపాయంలు మాత్రమే మిగిలినవి. నాకు హనుమంతుగారితో పరిచయమైన పిదప నా పరిస్థితి వివరించినాను. ఆయన నల్గొండ జిల్లాయందు రామన్నగూడెం తాలూకాలోని సుద్దాల స్వగ్రామ నివాసి. ఆయన నేనుండు గదికి కొంతే దగ్గర గదిలో తన భార్య బావమరిదితో వుంటున్నాడు. ఆయన అక్కడ దాదర్‌లో ఒక బట్టలు కుట్టే షాపులో కుట్టేవాడు. అది తెలంగాణా వారితో ఏర్పరచబడినది. గుంటుక నర్సయ్యపంతులుగారు కొంతమంది కలిసి ఖాదీబండారు అనే బట్టల దుకాణం పెట్టినారు. అందులో ఖాదీ బట్టలే అమ్మేవారు. కుట్టినబట్టలు అమ్మేవారు. దానియందు అన్ని ఖద్దరు గుడ్డలు మాత్రమే కుట్టెడివారు. నేను ఆయనగారితో కుట్టుపని నేర్చుకొని సంపాదించి భోజనమునకు ఇవ్వాలని అన్నారు. ఆయన మరుసటి దినము తన బట్టలుకుట్టే షాపునకు తీసుకువెళ్ళి పరిచయం చేసాడు. నా పరిస్థితి విని మొదట సందేహించి కాదన్నాడు. కానీ హనుమంతరావుగారు పూచీపడుతానన్న పిదప

ఒప్పుకున్నాడు. ఎందుకనగా ఆ షాపు ఏర్పరచినది ఒక కాంగ్రెసు నాయకునిది. ఈ మేనేజ్‌మెంట్ అప్పగించబడిన వ్యక్తి కూడా కాంగ్రెసే. అయినా కొన్నాళ్లు చూచి మంచిగా అనిపించని తీరుకు తీసివేస్తానని పనిలో పెట్టుకున్నాడు. నాకు కుట్టు పనిరాదు. మెల్లగా హనుమంతుగారి సాయంతో నేర్చుకున్నాను. మొదట గాంధీ టోపీలు కుట్టేడివాన్ని. పనిలో వరుస దొరికిన పిదప బాగా కుట్టడము ప్రారంభించినాను. రోజుకు ఆరు డజన్ల టోపీలు కుట్టేడివాడిని. కూలీ అందరికన్నా ఎక్కువగా తీసుకొనెడివాడిని. మేనేజరు నా మీద మొదటినుండి వక్రబుద్ధితో వుండేవాడు. పని ఇచ్చుటలో పేచీ పెట్టేవాడు. కుట్టుటకు తక్కువ ఇచ్చెడివాడు. నేను టోపీలు, చొక్కాలు, పైజామాలు, భుజానికి వేసుకునే సంచులు కూడా కుట్టటము నేర్చుకొని మంచిపనివాన్ని అయినాను. నేను బ్రతకగా ఇంటికి కొంతడబ్బు పంపాలి అని బాగ పనిచేసెడివాడిని. రాత్రిళ్లు కాళ్లు విపరీతముగా లాగెడివి. భోజనము వారుపెట్టినదే తినాలి. ప్రత్యేకతకు అవకాశం లేదు. ఒకవిధమైన మానసిక వ్యధ రాత్రిళ్లు సరిగా నిద్రపట్టక పోయెడిది. నేను హనుమంతుగారు కలిసి కూర్చొని రాత్రి 12 గంటలవరకు ఎన్నో విషయాలపై చర్చించెడివారము. ఆయన మొదట సాధువులతో కలిసి పిదప ఆర్యసమాజములో చేరినాడు. ఆ పిదప కమ్యూనిస్టు పార్టీచేత ఆకర్షింపబడినవాడు. చక్కని గాత్రము బాగా పాటలు పాడెడివాడు. ప్రతి బహిరంగ సభలలో సుద్దాల హనుమంతగారి గొల్లసుద్దులు లేదా బుర్రకథ లేదా ఇంకెదో ప్రోగ్రాం వుండెడిది. ప్రజలు ఈయనగారి ప్రోగ్రాం చూచుటకు విరగబడి వచ్చెడివారు. తరువాత నాయకుల ఉపన్యాసాలు వుండెడివి. ఈయన నాటకాలు, వీధి భాగవతాలలో వేషాలు వేసి ప్రేక్షకుల నలరించెడివాడు. స్పురద్రూపి. ఎల్లప్పుడు నవ్వుతూ మాట్లాడుట ఆయన ప్రత్యేకత. పేదల అభివృద్ధిని ఆకాంక్షించెడివాడు.

నాకు రానురాను ఈ కుట్టుపని మీద విసుగు కలగటం మొదలైనది. ఇంకేదైనా మంచిపని దొరికితే బాగుండునని ఆలోచించెడివాడిని. మేముండెడి ఛాకలోనే రూం నెం. 30లో చాలామంది తెలంగాణా బ్రహ్మవారులు వుండెడివారు. వారందరికి గొల్లనర్సింహులు అనునతడు నాయకుడు. మంచి నడవడి గలవాడు. కమ్యూనిస్టుపార్టీ అభిమాని. ఆయన షాపులోనే నేదైనా స్టూడియో పనిచేయవచ్చునను ఆశ కలిగినది. నేను నర్సింగంను కలిసిన పిదప నా పరిస్థితి తెలిపినాను. అయితే అదివరకే నన్ను గురించి ఆ రూంలో

నివసించెడివారు చాలామంది ఎరుగుదురు. ఆయన నన్ను మనస్ఫూర్తిగా ఆహ్వానించినాడు. ఇట్టి విషయం హనుమంతుగారికి కాంతయ్యగారికి వివరిస్తే దూరం అవుతామని బాధపడినారు. తరువాత నేను వచ్చి రూం నెం. 30లో చేరినాను. భోజనము గోశ్ల నర్సింగం గారి ఇంటిలో చేసెడివాడిని. నర్సింగరావు మొదట సామాన్యుడే కానీ అతని సాహసం చొరవ వలన నాయకుడైనాడు. కొంత కాలం క్రితం దాదర్ ప్రాంతంలో తెలంగాణ పద్మశాలీలంటే చాలా చిన్నచూపు వుండెడిదట. వారిని స్థానికులైనవారు బెదిరించడము, హేళన చేయడము వారి స్త్రీలను కూడా కించపరచటము జరిగేదట. ఎవరన్నా తిరగబడినా ఆ ప్రాంతం గూండాలు దాడిచేసి కొట్టేవారట. అయితే నర్సింగరావు దానికి తగిన ఏర్పాటుచేయాలని యువకులకు ప్రోత్సాహమిచ్చి స్థానికుడెవడేని అవమానించిన తగినబుద్ధి చెప్పమన్నాడు. అట్లొకసారి దెబ్బలాట జరిగిన పిదప కొందరు గూండాలు కట్టకట్టుకొని వచ్చినారట. ఇది ఊహించని వీరందరు ఐక్యంగా నిలబడి ఎదురించటమే కాక పోలీసు రిపోర్టు యిచ్చి పట్టించినారట. నాటినుండి తెలంగాణా వారిపై ఇదివరకున్న చిన్నచూపు తగ్గి కలిసి వుంటున్నారు. నేను వుండే ప్రాంతములో మూడు సినిమాహాళ్లు వుండేవి. అవిగాక అచటకి కొంతదూరంలో రాజకపూర్ క్రొత్తగ సినిమా తీయుటకు ఫ్లోర్లు నిర్మిస్తున్నాడు. నా విషయం తెలిసిన పిదప నర్సింగరావు నన్ను రాజకపూర్ స్టూడియోకు తీసుకవెళ్లినాడు. అయితే అది ఇంకా ప్రారంభదశలోనే వుంది. లాభం లేదనుకుని తిరిగి వచ్చినాము. పిదప సినిమాహాళ్లలో వాల్‌పోస్టర్లు పేయింట్‌చేసెడివారిని పరిచయం చేసినాడు. వారు నా పనిని పరిశీలించి నియమించినారు. నాతో మంచిగా పని తీసుకున్నారు. కాని కూలీ ఇవ్వక తిప్పలుపెట్టెడివారు. నాకు చేతిలో డబ్బులేదు. భోజనము కాడ చెల్లించాలి. కూలీ ఇవ్వమని తిరిగి విసుగు పుట్టి పని మానుకున్నాను. మరి ఏమి చేయాలి? పొట్టగడవడం సమస్య. ఒక దినం లెనిన్‌గారిదొక పోటో దొరికినది. నేను దానిని తీసుకుని అవసరమైన పేయింట్స్ వగైరాలు తెచ్చి 20" x 25" సైజులో మూడురోజులు శ్రమించి పేయింట్ చేసినాను. ఇది మిత్రులందరి దృష్టిలో పడినది. నర్సింగరావు దీనిని చూచి ఆఫీసులో పెట్టినాడు. అది నాకు ఒక మంచి అవకాశమైనది. కొంతమంది మిత్రులు తమ ఫోటోలను తెచ్చి పేయింటింగ్ చేయమని ఇచ్చినారు. అవిచేసి ఏదో నామినల్‌గా చార్జి చేసెడివాడిని. అట్లు మెల్లమెల్లగా ప్రచారం జరిగి పనిదొరకటం జరిగినది.

పనియందలి ప్రత్యేకత గుర్తించిన చాలామంది నా వద్దకు తమ ఫోటోలు తెచ్చి పేయింటింగ్ చేయించడం ప్రారంభమైంది. చుట్టుప్రక్కల నుండి రావటం ప్రారంభించినారు. ఒకరోజు ఒక రైల్వే ఇంజనీర్ తన గురువుగారి ఫోటో తీసుకుని వచ్చినాడు. ఆతడు విన్న దానిని బట్టి నేనేదో గొప్పవాడినని అట్టహాసంగా వుంటాడని ఊహించినట్లుంది. మొదట ఆయన మేముండే 30 నెంబరు రూంనకు వచ్చినాడట. నేనపుడు నర్సింగ్‌గారి ఇంటిలో భోజనానికి వెళ్లినానని తెలిసి అక్కడికి వచ్చినాడు. అచట బిట్ల నారాయణ ఎవరు అని అడిగితే నేను వెళ్లి పరిచయం చేసుకున్నాను. నన్ను చూసి అదోలా ఫీలయి నేను రూంలో వుంటానని వెళ్లిపోయినాడు. నేను చాలా సింపుల్‌గా వుండేవాన్ని. నెక్కరు బనీయన్‌పై వున్నాను. ఆయన దృష్టిలో నేను ఆనలేదు. భోజనం చేసి రూంకు వెళ్లిన పిదప తను తెచ్చిన ఫోటో చూపించి దీనితో మంచి పేయింటింగ్ చేసి యివ్వగలవా? అని ప్రశ్నించినాడు. నేను వినయంగా ప్రయత్నిస్తానని చెప్పినాను. కొంత స్థిమితపడి నేను మధ్య ఒకసారి వచ్చి చూచినంక అడ్వాన్సు యిస్తానన్నాడు. మీరు వారం తరువాత రండి. పూర్తి అయిన పిదప డబ్బుయివ్వండి. తొందరలేదు అన్నాను. ఆయనవెళ్లి వారం తర్వాతవచ్చి చూచి ఆశ్చర్యపడినాడు. అతనిదివరకు ఇద్దరు ముగ్గురుతో చేయించినాడట. కాని ఎవరు మంచిగా చేయలేదు. ఆయన తన గురువుముందు కూర్చుని పూజిస్తున్నట్లు పోటో తీయబడినది. నేను పూజా సామాగ్రి అన్నివిధాల ఎదురుగా వుంచి పూజిస్తున్నట్లు పేయింట్ చేసినాను. ఆయున తీసుకువెళుతానన్నాడు. ఇంకా పూర్తికాలేదు. చాలా పనివుంది. తర్వాత ఇస్తానన్నాను. ఆయన ఇంకా ఆశ్చర్యానికి లోనై మంచిగానే వుందికదా ఎందుకు ఆపుతావు అంటే ఇంకారెండు కోటింగ్‌లు రంగులు వేయాలి. అపుడింకా బాగుంటుందన్నాను. ఇంకో నాలుగు రోజులకు వచ్చి తీసుకువెళ్లమన్నాను. ఆయున అట్లే నాలుగు రోజుల పిదప మిత్రులను వెంటబెట్టుకుని వచ్చి నన్ను ఇంటికి ఆహ్వానించి పోటోను నన్ను తీసుకువెళ్లినాడు. ఇంటివద్ద భోజనమునకు నా కొరకు ఏర్పాట్లు చేసినాడు. నేను అడిగిన దానికన్నా ఎక్కువ డబ్బులు యిచ్చి సాదరంగా పంపించినాడు. ఈ సంఘటన నాకు గొప్ప ప్రచారమైనది. దాదర్, వర్లి మున్నగు ప్రాంతముల నుండి పేయింటింగ్స్ కొరకు ఫోటోలు తెచ్చేవారు. తీరిక లేని పని అయ్యింది. కాని దీనికన్న ఎన్‌లార్జ్ చేసిన ఫోటొపై కలర్‌వేసి యివ్వటం సులభము. కావున నేను సోలాపూర్‌లో వుంచివచ్చిన పోస్టుకార్డు సైజు డబ్బా కెమెరా తెచ్చినట్లు

అవుతే తొందరతొందరగా పనిచేయవచ్చునను నిర్ణయమునకు వచ్చి మిత్రులతో ఈ విషయం తెల్పి ప్రయాణం నిశ్చయించి ఒక తులం బంగారం, కొన్ని బట్టలు, మా నాన్నగారికి ఒక బ్లాంకెట్ ఖరీదు చేసుకుని ఒకరోజు సాయంకాలం వరకు సోలాపురం చేరినాను.

నేను చీకటిపడిన పిదప మా అత్తగారింటికి చేరినాను. ఎందుకనగా ఇంకా నా పైన వారంటువున్నట్లు అవుతే అరెస్టు చేస్తారని భయపడినాను. నన్ను చూచి మా మామ, అత్త చాలా సంతోషించినారు. నే చెబితే వెళ్లి నా భార్యను తీసుకువచ్చినారు. ఆమె రెండునెలల క్రితం ప్రశూతి అయినది. అబ్బాయి జన్మించినాడు. పేరు శ్యాంసుందర్. చిన్నవాన్ని మాత్రమే తీసుకుని వచ్చినది. పెద్దబ్బాయి నిద్రలో వున్నాడని. మరుసటి దినం ఉదయం ఇంటికివెళ్లినాను. నా కొరకిప్పుడు ఎవరు ఆరా తీయటం లేదు. నిర్భయంగా వుండవచ్చునని తెలిపినారు. నా రాక మా తలిదండ్రులకు అమిత సంతోషం కలిగించినది. నేను తీసుకువెళ్లిన బ్లాంకెట్ బంగారం ఇతర వస్తువులు చూచి ఆనందించినారు. నా విశేషాలు అడిగినపుడు నేను తిరిగి బొంబాయి వెళుతానని అక్కడ నాకు మంచిగా పనిదొరికే పరిస్థితి ఏర్పడినది. కావున భార్యాపిల్లలను తర్వాత తీసుకువెళ్లి అచటనే సెటిల్ అవుతానన్నాను. దీనిపై మా తలిదండ్రులు అన్నలు వ్యతిరేకించి నీవు ఇక్కడనే మాతోనే వుండాలని కోరినారు. మా నాన్న ''నాకీ వృద్ధాప్యంలో శాంతిలేకుండా చేస్తావా? పెద్దాడు కుందారం విడువడు. నీవేమో బాంబేలో వుంటానంటావు. మిగతా సోలాపురంలో. నేను ఎక్కడని తిరుగాలి. నాచేతగాని కాలంలో శ్రమకలిగిస్తున్నారని'' కంట తడిపెట్టినాడు. మా అమ్మ దుఃఖానికి అంతేలేదు. నేను బాగా ఆలోచించి ముసలితనంలో తలిదండ్రులను దుఃఖింప చేయటం భావ్యం కాదని, భవిష్యత్‌ను ఇంకోవిధంగా మలుచుకోవచ్చునను ఆలోచనతో ఇంకా కొన్నినెలలు బాంబేలో వుండి తిరిగివస్తానని మాటయిచ్చి నాలుగైదు రోజులు గడిపి కెమెరా ఇతర పోటో పరికరాలు తీసుకుని బాంబే వచ్చినాను. ఈసారి తలిదండ్రులు తృప్తిగా పంపించినారు. ఇప్పుడు నా ఆదాయం పెరిగినది. భోజనములో కొన్ని మార్పులు చేసుకున్నాను. చేతినిండ పని. నేను 30 నెంబర్ రూంలోనే వుండెడివాడిని. ఆ రూంలో నివసించే శ్రామికులందరునాకు భాగా సహకరించెడివారు. ఉదయం 8 గంటలనుండి పని ప్రారంభించి సాయంకాలం 5 గంటలవరకు పేయింటింగ్ లేదా పోటోగ్రపీ పని చేసేడివాడిని. ఆ గదిని నేనొక స్టూడియో మాదిరిగా వాడుకున్నాను. నేను పనిచేస్తుంటే నా చట్టూ కూర్చుని పరిశీలించెడివారు. కార్మికులకు మిల్లులో షిఫ్టు పద్ధతి వుంటుంది. మూడు షిఫ్టులకు వెళుతూవుంటారు. కావున ఎపుడు

అందరు ఒక్కసారేగదిలో వుండరు. వున్నవారైనా నా పనికి ఆటంకం కలుగకుండా మసలుకొనేవారు. వారందరు కమ్యూనిస్టు పార్టీ అభిమానులు. నేను రహస్య జీవితం గడుపుచున్నవాన్ని. నా మీద ఎనలేని అభిమానం చూపెడివారు. సాయంకాలం షికారుగా తిరిగి వచ్చెడివారము. ఎటువెళినా ఎనిమిది పదిమందిమి వెళ్లి తిరిగివచ్చెడివారము. వారితో బోంబాయినంత చుట్టిపెట్టినాను. సెలవురోజులలో వనభోజనమునకు వెళ్లెడివారిమి. జోగేశ్వరం మొదలగు చోట్లకు వెళ్లి ఉత్సాహంగా గడిపెడివారము. అందరం బ్రహ్మచారులమే. ఎందుకనగా తమతమ కుటుంబాలు ఇచట లేవు. తీసుకురారు. వారే వెళ్లివస్తుంటారు.మేము పార్టీ ఏర్పరచే ప్రతి మీటింగుకు వెళ్లెడివారము. గోళ్ల నర్సింగ్ నాయకత్వములో వెళ్ళివచ్చెడివారము. ఆయా సభలలో అమర్‌శేఖ్ మున్నగు గొప్ప నాయకులు శ్రామికుల కష్టాలను వివరిస్తు వారి విముక్తి కొరకు సంఘటితము కొరకు మరాఠీలో చక్కని పాటలు పాడేవారు. నేను బోంబాయిలో వున్నంతకాలం ప్రతి బహిరంగ సభలకు తప్పక వెళ్లేవాడిని. పేదల కష్టజీవితాలను ప్రత్యక్షంగా పరిశీలించినాను. మా మిత్రమండలిలో ఎప్పుడు చర్చలు జరిగినా కమ్యూనిజం గురించి చర్చించేవారము. ప్రజలు మతమౌఢ్యములో మునిగియున్నవారిని గురించి ఆలోచించేడివారము. ఇట్లొక మూడునెలలు గడిచిన పిదప మళ్లీ సోలాపురం వచ్చినాను. నా రావటం బాంబేలోని మిత్రులందరిని బాధపెట్టినది. తప్పదుగా.

## బోంబాయిలో మరువలేని సంఘటనలు

నేను బాంబేలో వుండగా జరిగిన కొన్ని సంఘటనలు వివరించి ఈ రహస్య జీవితం ముగిస్తాను. నేను దాదర్‌లో బట్టలు కుట్టునపుడు లోకల్ ట్రైన్‌లో వెళ్లెడివాడిని. వానియందు రద్దీ అధికం. ఏ మాత్రం అశ్రద్ధచేసినా ట్రైన్ తప్పటం ఖాయం. అలా తొందరపడి ఎక్కటంలో అపాయం పాలయ్యేడివారు. ఒకరోజు ఒక సింధి స్త్రీ ట్రైన్‌క్రిందపడి శరీరం నుండి తలవేరైనది. చిట్లిన తలనుండి మెదడు బయటకువచ్చి భయంకరంగా యుండి నన్ను బాగా కదిలించినది. దానిని వారం రోజులు మరువలేకపోయినాను. కళ్లుమూసుకున్న అదే దృశ్యము కన్పించేది. మరియొక తడవ ఒక మరాఠా యువతి ట్రైన్‌కిందపడి రెండుకాళ్లు తొడలవరకు తెగిపోయినవి. ఆమె స్పృహకు వచ్చిన పిదప తన కాళ్లను చూచుకొని మొదట పైకిపోయిన తన చీరెను సరిచేసుకొనుట హైందవ స్త్రీ తన స్త్రీత్వమును ఎలా కాపాడుకుంటుందో అర్థమైంది. ప్రాణాపాయ స్థితిలో వుండికూడా తనను తాను

స్త్రీత్వరక్షణ విషయమై కనబరచిన ఆదుర్దా మరువరానిది. ఇంకొక విచిత్రమైన సంఘటన నేను సోలాపురం వెళ్లివచ్చి పోటోలు తీయుచు పేయింటింగ్‌చేస్తూ బాగా ప్రచారం పొందినాను. ఆ సమయమున ఒక ఫోటోగ్రాఫర్ ఇద్దరు స్నేహితులను వెంటబెట్టుకొని నేనుండే రూం నెం. 30కి వచ్చి నేను చేయుచున్న పేయింటింగ్ చూస్తు కూర్చుని నన్ను మాటలలోనికి దించినాడు. ఎవరో పేయింటింగ్ చేయించుకొనుటకు వచ్చినారనుకున్నాను. వారు మాటల సంధర్భంగా నా ఎదుటనున్న వ్యక్తిని చూపించి ఈయనగారు పద్మశాలి. మంచి, పోటోగ్రాఫర్. వీరికి రెండు కార్లు వున్నావి. ఆయనకు పెళ్లీడు కూతురు వున్నది. ఆ అమ్మాయిని నీకు ఇచ్చి ఒక క్వార్టరు ఇస్తానని నీవందు స్టూడియోపెట్టుకుని మంచిగా సంపాదించవచ్చునని చెప్పినారు. నాకు నవ్వు వస్తుంది. నేనంత విన్న పిదప నాకు పెళ్లి అవటమేకాదు ఇద్దరు కుమారులున్నారని, పెద్దకుమారుని పోటో తీసి చూపించాను. వారు నోరువెళ్లబెట్టినారు. ఎందుకనగా నేను కురచగా వుంటాను. పైగా పని సమయమునవెక్కరు వేసుకుని బనీయన్‌పై వుండెడివాడిని. చూపరులకు చిన్నవయసు వాడివలె కన్పించెడివాడిని. వారు విషయం విని నల్లబడిన ముఖాలతో వెళ్లిపోయినారు. రూంలో వున్న మిత్రులందరు ఒకటే నవ్వు. నన్ను కొన్నిరోజులు మళ్లీ పెళ్లి చేసుకోమని ఆటపట్టించారు.

అట్లె మేమున్న గదియందు తెలంగాణా నుండి నా వలెవచ్చి రహస్యజీవితము గడుపుచున్న రెడ్డి యువకుడెండివాడు. అతడు సాయుధపోరాటములో పాల్గొన్నానని కథలు చెప్పెడివాడు. కొన్నాళ్లపిదప ఇంకొక రెడ్డి యువకుడు వచ్చి ఇతనిని చూచిన పిదప నాతో మొదటి రెడ్డిని గురించి తెల్పినాడు. అతడు పార్టీకి ద్రోహం చేసి కొందరి అరెస్టుకు కారణమైనాడని అతనిని మట్టుపెట్టుటకు, పార్టీ యత్నిస్తున్నదని. అయితే అతను తప్పించుకుని వచ్చి ఇచట అజ్ఞాత జీవితము గడుపుచున్నాడని ఈ విషయం విన్న పిదప నర్సింగ్ గారికి ఈ విషయం వివరించాను. ఆయన మండిపడ్డాడు. మనము తెల్వక ఒక ద్రోహికి తోడ్పడ్డామని బాధపడి ఆ రెడ్డిని గదినుండి పంపివేసినాడు. ఇకముందెప్పుడు కన్పించవలదని, ఇపుడు క్షమించినాము కాని మళ్లీ కన్పించిన శిక్ష తప్పదని వెడలగొట్టినాడు.

## సోలాపురంలో బిట్ల స్టూడియో ఏర్పాటు

సోలాపురం వచ్చినాను కాని నేను ఇచటికి వచ్చిన పిదప రెండుమూడు రోజులకు నా రెండవ కుమారుడైన శ్యాంసుందర్‌కు నీళ్ల విరేచనాలు ప్రారంభమైనవి. పిల్లలకు పండ్లువచ్చే సమయాన ఇలా విరేచనాలు అవుతావని

ఏదో చేతివైద్యం లాంటిది చేయించినారు. మా పెద్దలు దీనికి భయపడవలసిన పని లేదని రెండుమూడు రోజులలో చక్కబడుతుందని చెప్పుటచే నేను మిన్నకున్నాను. డాక్టర్‌కు చూపించి తగ్గు మందులు యిప్పించుట బాగుయని తీవ్రతను చూచిచెప్పినా లక్ష్యపెట్టలేదు. దానితో పెద్దల నెదిరించుట బాగుండదని నేను మాట్లాడలేదు. కాని మూడునాలుగు రోజులలో డిహైడ్రేషన్ ఏర్పడి ప్రాణాంతకమైంది. అపుడు ఏమీచేయలేని పరిస్థితి ఏర్పడినది. మరణానంతరం మా నాన్న డాక్టర్‌కు చూపించితే బ్రతికేవాడని అనవసరంగా ప్రాణాన్ని బలితీసుకున్నట్లు అయిందని వాపోయినాడు. ఇకముందెప్పుడు కూడా జబ్బు విషయంలో వీరి మాటలు పాటించక తగువైద్యం చేయించాలని నిర్ణయించుకున్నాను. మళ్లీ ఏమీ చేయాలనునది సమస్య. మావాళ్లంటారు మొగ్గము నేయమని. అది నాకు ఇష్టం లేదు. వారం రోజులు గడిచిన పిదప మాకిరాణా కొట్టు ప్రక్క ఒక షాపు ఖాళీగా వుంది. దానిని చూచిన పిదప దీనిలో పేయింటింగ్ ప్రారంభించి చూద్దామని అద్దె మాట్లాడి వారితో తెల్పినాను. వారందరు ఇది నడవదు మానుకోమన్నారు. కాని నేను మానుకోలేదు. పని ప్రారంభించినాను. మొదట పెద్దగా రానప్పటికి మెల్లిమెల్లిగా పేయింటింగ్స్ రావటం మొదలైంది. అది ముఖ్యంగా పద్మశాలీలు ఎక్కువగా వుండెడి ప్రదేశం. నేను పేయింట్ చేయునపుడు యువకులు కొందరు వచ్చి కూర్చుని నా పనిని పరిశీలించెడివారు. అది ఒకరికి పదుగురుగా ప్రచారం ప్రారంభమైంది. నా వద్ద డబ్బా కెమెరా వుందికదా దానితో కొందరి పోటోలు తీసి ఎన్‌లార్జ్ చేసి కలర్లు వేసి లేదా పేయింటింగ్‌చేసి యిచ్చెడివాడిని. అయితే అటుదగ్గరగా జిందె అనునొక ఆర్టిస్టు పేయింట్స్ చెసెడివాడు. అతను ప్రత్యేకవముగా దీనిపైన ఆధారపడియున్నట్టి వ్యక్తి. కెమెరాపై పోటోతీసి చేయలేడు. నేనది చేయగలను. నా కారణంగా ఆతని ఆదాయం తగ్గిపోయినది. దీనితో ఆయన నాపై దుష్ప్రచారం ప్రారంభించినాడు. బిట్లకు సరిగా పనిరాదని ఆతను అనుభవశూన్యుడని పైగా కమ్యూనిస్టు అని సందర్భానుసారంగా ప్రచారం వ్యతిరేకంగా ప్రారంభించినాడు. తిట్లు దీవెనలైనట్లుగా అతడెంత దుష్ప్రచారం చేశాడో అది నా పాలిట వరమై నేను చేయుచున్న పని చాలామందికి తెల్సివచ్చినది. వారందరు వచ్చి నాతో సంప్రదించెడివారు. పనిగూడా బాగా పెరిగినది. పోటోలుతీసి పేయింట్‌చేసి యివ్వటం, ఇదివరకున్న పోటోలుతెస్తే పేయింట్ చేసి యివ్వటం చేస్తూవచ్చాను.

ఒకరోజు ఇద్దరన్నదమ్ములు ఒక గ్రూపు పోటో తీసుకువచ్చినారు. అది పంక్తి భోజనముచేయునపుడు తీసినది. ఆ పోటోలో వారి తండ్రి ముఖం సగం మాత్రము తొంగిచూస్తున్నట్లుగా కనిపిస్తుంది,. దానిని చూపించి మా తండ్రిగారి పేయింటింగ్ కావాలి. ఆయన మరణించినాడు. ప్రయత్నము చేయగలరా అని అడిగినాడు. నేను బాగా పరిశీలించి మీరు రెండురోజుల పిదప రాండి మొదట ముఖం వచ్చేటట్లు చేయాలి. మిగతా శరీరం ఎట్లా కావాలనుకుంటే అలా చేస్తానని చెప్పినాను. వారు వెళ్లిన పిదప బాగా పరిశీలించి కెమెరాపై ఆ సగం ముఖం వచ్చేటట్లు పోటో తీసి ట్రిక్ పోటో గ్రాఫిక్‌గా మిగతాసగం వచ్చేటట్లు రెండవసారి తీసి అవసరమైన మార్పులుచేసి వారువచ్చినప్పుడు ముఖం పూర్తిగా వున్నట్టిది చూపించి ముఖములో ఏదేని తేడ వుందాయని అడిగినాను. సరిగా వుంది. పూర్తి ఆకారము వచ్చేట్లు తీయమన్నారు. నేను వారికి మాటయిచ్చిన ప్రకారంగా కుర్చిలో వ్యక్తి కూర్చున్నట్లుగా ముఖమునకు అనుగుణమైన అవయవాలను చిత్రించి పక్కకు చిన్న స్టాండుపై పూలదాను పెట్టినట్టుగా పేయింటింగ్ చేసి పదిరోజుల పిదప చూపించినాను. వాళ్లసంతోషమునకు మేరలేదు. అది నా పనికి పెద్దప్రచారమైనది. ఆ పేయింటింగ్‌ను స్టూడియోలో కొన్ని దినములు అంటిపెట్టుకొని వర్జినల్ పోటోలోని సగం ముఖమునకు పూర్తిచేసిన ఆకారము చూపించెడివాడిని. దీనితో జిందగారు తగ్గిపోయినారు.

తరువాత కొన్నాళ్లకు అదే రోడ్డుపై లభించిన పెద్దఇల్లు పైభాగం అద్దెకు తీసుకొని పూర్తి స్టూడియోకు ఏర్పాట్లు ప్రారంభించినాను. సంపాదన పెరుగుచున్నకొలది పోటో పరికరాలు చేయించటం లేదా ఖరీదుచేయటం ప్రారంభించినాను. మా గురువుగారి నుండి ఒక కెమెరాతెచ్చి వాడుకున్నాను. అట్లే అమ్మకమునకు వచ్చిన రెండు కెమెరాలు ఖరీదు చేసినాను. అందు ఒక ఫుల్‌సైజు కెమెరా ఒకటి అటువంటిదే సోలాపురంలో స్టూడియోలో ఎవరివద్ద లేనటువంటిది సంపాదించినాను. అది 800 వందల రూపాయలకు అమ్మకమునకు వచ్చినది. అయితే అప్పుడు నావద్ద రెండువందలు మాత్రమే వుండెను. నేను మా వైకుంఠం అన్నయ్యను తప్పించి మా ఇంట్లో ఎవరికి తెలియకుండా తీసుకొని ఖరీదుచేసినాను. ఒక వడ్రంగిని ఏర్పరుచుకొని అతనితో స్టూడియోకు అవసరమగు ఎన్నో పరికరములను చేయించినాను. అల్యూమినియం గిన్నెలను ఖరీదుచేసి వాన్ని డూంలుగాతయారు చేయించినాను. డార్కురూం, అందలి అవసర సరంజమా చెబుతు చేయించినాను. అతడు నన్ను అర్థం చేసుకొని నా అభిప్రాయానుసారంగా

పనిచేసినాడు. పిదప స్టూడియోకు ''బిట్ల ఫోటో ఆర్ట్ స్టూడియో'' ప్రొ. బిట్ల వెంకటనారాయణ అని బోర్డు వ్రాయించిపెట్టినాను. దీనితో పద్మశాలి ఫోటో స్టూడియో అను పేరు స్థిరపడి పద్మశాలీలందరు నా వద్దకే రావటము ప్రారంభించినారు. మేముండే వీధిలో ఎక్కువగా ముస్లింలు ఇండ్లు గలిగివున్నారు. మేము మొగ్గాలు పెట్టిన ఇల్లుకూడా ముస్లింలదే. మా ఇంటి ప్రక్కన వున్న ఒక ముస్లిం యువకుడు ''హనీఫ్'' అనునతడు ఫోటోగ్రాఫీలో ఉత్సుకత కలిగి తరచు స్టూడియోకు వచ్చి నేను చేసేపని పరిశీలిస్తు వుండెడివాడు. అతను మిల్లులో (బట్టల మిల్లు) పనిచేసెడివాడు. పనికివెళ్లివచ్చి దాదాపు మిగతా సమయం స్టూడియోలో నాతో పాటు గడిపెడివాడు. అతనికి పనియందుంగల శ్రద్ధను పరిశీలించి నేను మెంచ్చి మెల్లగా పనులు పురమాయించెడివాడిని. అతడు కడు శ్రద్ధతో చేసిపెట్టెడివాడు. రానురాను నాకొక సహాయ ఫోటోగ్రాఫర్‌గా తయారైనాడు. నాకు పని ఒత్తిడి వున్నప్పుడు డార్కు రూంలో పని అప్పగించెడివాన్ని. ఫోటోలు తీస్తుంటే లైటింగ్ చూచేవాడు. ఏవేని ఎన్‌లార్జ్ చేయవలసియున్న చేసిపెట్టెడివాడు. కాని ఎప్పుడు తనకు వేతనము ఇవ్వమని అడుగలేదు. దీనితో నాకు పేయింటింగ్స్‌పై ఎక్కువ సమయం కేటాయించి పనిచేసెడివాడిని. నెమ్మదిగా కొన్ని సమయాలలో అతడు లేకుండా పని కష్టమయ్యేడిది. అతను తన ఉద్యోగమునకు షిఫ్టుననుసరించి వెల్లివచ్చెడివాడు,. అదనముగా నా వద్ద పనిచేసెడివాడు. స్నేహశీలి, నమ్మకమైనవాడు. నేను అన్నివిధముల అతనికి అప్పగించి పరిశీలించినాను. ఎన్నడుకూడా పొరపాటు రాలేదు. రెండుమూడు రోజులు నేను గ్రామాంతరము వెళ్లవలసి వచ్చిన అప్పగించి వెళ్లెడివాడిని. ఆయన తన తీరికవేళలో స్టూడియోలో పనిచేసి నేను వచ్చిన పిదప అన్నింటి వివరాలు మరియు డబ్బులు అప్పగించెడివాడు. ఇతని స్నేహం కారణంగా మిల్లుకార్మికుల ఫోటోలు మరియు పేయింటింగ్స్ నాకే వచ్చెడివి. అట్లే ముస్లింలు కూడావచ్చి ఫోటోలు తీయించుకొనెడివారు. నేను మాత్రము హనీఫ్‌కు తెలియకుండా అతని తండ్రికి కొంతడబ్బు ఇస్తుండేవాడను. అతని పని దామాషాను పట్టెయిచ్చెవాడిని.

నాకు మొదటినుండి పనిలో ఒక ప్రత్యేకత చూపించాలని సోలాపురం ఫోటోగ్రాఫర్‌లలో ఒక ప్రత్యేకత నెలకొల్పాలని యుండెడిది. అప్పట్లో అన్ని స్టూడియోలలో ఫిల్మ్ డెవలపింగ్ ఒకవిధంగా వుండెడిది. నేను తత్సంబంధమైన విషయం పుస్తకముల ద్వారా మరియు కెమికల్స్ అమ్మేవారిచ్చే వివరణ ద్వారా స్టడీచేసి ప్రయోగాలు చేసెడివాడిని. కెమికల్స్‌లో మార్పు చేయుట, లైటింగ్

మున్నగు పద్ధతులవలంభించి ప్రయోగాలుచేసి ఫోటోలు దిగేవారి మనస్తత్వము మరియు వారి రంగు మున్నగు అంశములు దృష్టియందుంచుకుని డెవలప్‌చేయుట ప్రారంభించినాను. ఇది నాకు వ్యాపారమునందు అభివృద్ధికి దారితీసినది. అట్లు వ్యాపారాభివృద్ధి చేసి డబ్బుప్రోగుచేసి కెమెరా కొరకు మా వైకుంఠం అన్నయ్య వద్ద తీసుకున్న ఆరువందల రూపాయలను తీర్చివేసినాను. ఆ సందర్భమున ఒక సంఘటన మార్వాడి షావుకార్లలో నా పరపతి పెరిగినది. అది మా నాన్న ఒక మార్వాడి వ్యాపారికి మా ఇంటిలో తయారయ్యే చీరెలు ఇచ్చెడివాడు. ఒకరోజు ఫోటోల విషయమై మాట సందర్భంగా సాఖర్‌పేటలో పెట్టిన ఫోటోస్టూడియో ఎవరిది ఆ అబ్బాయి ఫోటోలు చాల బాగా తీస్తాడట. వారి ఇంటిపేరు మీ ఇంటిపేరు ఒకటిగా వుంది అని అన్నాడట. అపుడు మా నాన్న అతను నా నాల్గవ కుమారుడు ఆ బిట్ల స్టూడియో మాదేనని తెలిపిన వెంటనే ఆ సేటులో మార్పు చోటుచేసుకొని అంతకుపూర్వం ఎప్పుడు గూడా నీవు అని సంభోదించేవాడు మీరు అని సంభోదించి మర్యాద కనబరిచినాడట. ఆ పిదప ఒకరోజు తన భార్యను వెంటబెట్టుకుని మా స్టూడియోకు వచ్చి ఫోటోతీసి పిదప పేయింటింగ్‌చేయాలి మంచిగా తీయమని కోరినాడు. ఇతను మాకు షావుకారు అని నాకు తెలుసు. పైగా మా నాన్నగారు చీరెల దుకాణములో జరిగిన వివరం గూడా తెలిపియున్నాడు. నేను ఆయనను మర్యాదపూర్వకముగా ఆహ్వానించి ఆయన శ్రీమతిగారి ఫోటో తీసినాను. మార్వాడి స్త్రీలు నెత్తిపై కొంగువేసుకుంటారు. ముఖం స్పష్టంగా కన్పించాలి. దానితో పాటు మెడయందలి బంగారుహారాలు కన్పించాలి. అందుకు మొదట సేటు స్వయంగా ఆమెగారి నెత్తిపై కొంగుసరిచేయ యత్నించినాడు. కాని చేతగాలేదు. తుదకు ఆవిడగారే ఆతనిని మాన్పించి నాచేత సరిచేయించుకుని ఫోటో దిగినది. పిదప ఆ ఫోటోను దృష్టియందుంచుకుని 12" x15" సైజు పేయింటింగ్ చేసియిచ్చినాను. ఇది మార్వాడి సేట్లలో ఒక మార్పుతెచ్చి చాలామంది మార్వాడి సేట్లు ఫోటోలు పేయింటింగ్‌లు చేయించినారు. అంతకుపూర్వం పనితనం గుర్తించనందున ఇతరములైన స్టూడియోలు పాతవాటియందు తీయించెడివారు.

ఆ మధ్య కార్మిక కళ్యాణ కేంద్రంలో చిత్రకళా ప్రదర్శన ఏర్పాటుచేసినారు. దాని సంచాలకులు ''ముసప్పజట్ల'' అనునతడు. ఆయనగారు పద్మశాలీలు సోలాపురంలో పేరు ప్రఖ్యాతులు పొందాలని కళాకారులను ప్రోత్సహించేవారు. ఆయనగారు నా స్టూడియోకు వచ్చి

పరిశీలించి వెళుతుండెడివాడు. చిత్రకళా ప్రదర్శనను ఏదేని ఒక మంచి పేయింటింగ్‌చేసి యివ్వమని కోరినాడు. అప్పటికి ప్రదర్శన అయిదురోజులు మాత్రమే ఉన్నది. నేను అంతకుపూర్వం ప్రదర్శనలలో పాల్గొనలేదు. పైగా ఇతరములైన వానిని చిత్రించలేదు. ఏమి చిత్రించాలని మధనపడుచున్న సమయంలో కమ్యూనిస్టు పార్టీ ఆఫీసులో ఉన్నట్టి ''స్టాలిన్'' బొమ్మ గుర్తుకువచ్చి ఆఫీసుకువెళ్లి వారి అనుమతితో దానిని తెచ్చి పేయింటింగ్ ప్రారంభించినాను. దానిని బాగా ఆకర్షవంతముగా వుండునట్లు పేయింట్ చేసినాను. జట్లగారు వచ్చి సకాలమునకు ఫోటొ తీసుకువెళ్లినారు. అది ఇంకా పూర్తిగా ఆరలేదు. జాగ్రత్తగా తీసుకువెళ్లి ప్రదర్శనలొ పెట్టినారు. దాని ప్రత్యేకత ఏమనగా అది ఫోటో దించినట్లుగా కన్పిస్తుంది. కాని అది పేయింటింగ్. ఇది పరిశీలించిన వారిని బాగా ఆకర్షించినది. నాకేదో ప్రైజు మరియు సర్టిఫికేట్లు యిచ్చినారు. ఈ పేయింటింగ్‌ను తర్వాత కమ్యూనిస్టు పార్టీ ఆఫీసులో పెట్టినారు. అది చూపరులను ఆకట్టుకుంటుంది. దీనిద్వారా నేను నలుగురి దృష్టిలొపడినాను. వ్యాపారం దినదినాభివృద్ధిగాంచినది. ది. 4-12-1951 నాడు మూడవ కుమారుడు జన్మించినాడు. ఇతనికి రవియను నామకరణం చేసినాను. నేను రాజారవివర్మ గొప్ప పేయింటర్‌ను దృష్టియందుంచుకొని నా కుమారునకాపేరు పెట్టినాను. తరువాత నేను వరంగల్‌లో స్టూడియో ప్రారంభించినపుడు రవి కాక రవివర్మ ఈ కుమారుని పేరిటనే రవివర్మ ఫోటో స్టూడియో అని పేరుపెట్టినాను.

ఆ కాలమున యువకులు తమ తల్లిదండ్రుల ఫోటొలు ఇంటియందుంచుకొనుట అవి వారి తదనంతరం గుర్తుగా వుండేందుకు తీయించెడివారు. ఇంకా కొందరు మరణించినప్పుడు శవాలను ఫోటొతీయించి కొందరు పేయింట్స్ చేయించెడివారు. శవములను ఫోటో తీయుట ఇబ్బంది. కళ్లుమూసి వుంటవి. వారిని కూర్చోపెట్టుట చాలా ఇబ్బంది అయ్యేడిది. కూర్చోబెట్టిన పిదప తలను పైకిఎత్తి వుంచటం సాధ్యంకాకపోయెడిది. అట్టి సమయములందు శవము అలంకరించిన పిదప కుర్చిపై కూర్చుండబెట్టి కదలకుండ కొన్ని కట్లు ఏర్పరచి వంచిన తలను పడుగు (నూలును మొదట చీరెలకు అవసరమైనంత పొడవుగా పోసిన దారాల సమూహము) ను మెడక్రింద నుండి వెనుకకు లాగి కుర్చికి కట్టించెడివాడిని. పిదప మూసియున్న కళ్లను కొలదిసేపు తెఱచియుంచి వెంటనే ఫోటో తీసెడివాడిని. ఇదియంత ప్రజలకు

ఫోటోలపై ఇష్టము ఏర్పడాలని, అట్లే నా ప్రచారము జరుగాలని ఇబ్బంది అయినా చేసెడివాడిని. కొన్నాళ్ల పిదప శవములను ఫోటోలు తీయుట మానివేసినాను. అది ఇబ్బందే కాకుండా సమయం ఎక్కువగా తీసికొనెడిది. ప్రజలు దీనితో ప్రాణముండగనే ఫోటోలు తీయించటం ప్రారంభించినారు. పూర్తిగా చేతగాని వారైతే ఇంటికి తీసుకవెళ్లి ఫోటో తీయించుకునెడివారు.

మా పాలి అతను బిట్ల మాణిక్యం అనునతడు తన భార్య చావుబ్రతుకులో వుందని నన్ను వరంగల్‌జిల్లా ఘనపురం దగ్గర గ్రామములో తన అత్తగారి ఇంటిలో వున్న ఆమెను ఫోటో తీయుటకు తీసుకువెళ్లి అంత్యఘడియలలో ఫోటో తీయించినాడు. నేను ఫోటో తీసిన 10 నిమిషములలో మరణించినది. చూచిన వారందరు ఈ ఫోటోకొరకే కొనఊపిరితో వున్నదని, తరువాత ఆయన తన భార్య ఫోటోను పేయింటింగ్ చేయించుకున్నాడు. హనీఫ్‌ను వెంటబెట్టుకుని ఒక తడవ పూనావెళ్లి అవసరమైన కెమెరా మరియు కెమికల్స్ ఇతర ఫోటో సామానులు కొనితెచ్చినాము. హనీఫ్ నాతోపాటు మంచిపనివాడుగా స్థిరపడుచున్నాడు. అట్లే ''రాంభావ్'' అను ఒక వ్యక్తి మా గురువగు శరణప్పగారి స్నేహితుడు. స్నేహశీలి, కళను అభిమానించు వ్యక్తి. నాపై ప్రత్యేక అభిమానం కలవాడు. ఆయన తన తీరికవేళలలో స్టూడియోకు వచ్చి నా పని పరిశీలిస్తు కూర్చునేవాడు. గంటలతరబడి కూర్చుని పరిశీలిస్తు నన్ను మాత్రం డిస్టర్బ్‌చేయకపోయెడివాడు. పేయింటింగ్ చేసేటప్పుడు మాతం కొన్ని సూచనలు ఇచ్చేవాడు. అవి సరియైనవిగా వుండెడివి. వయసులో నాకన్న 20 సంIIలు పెద్దవాడు. అతడు నేను వరంగల్ వచ్చి స్థిరపడిన పిదప కూడా ఇక్కడికివచ్చి కొన్నిరోజులు నాతో గడిపినాడు.

1953 ఆగస్టులో మా నాన్నగారికి బాగా సుస్తుచేసినది. నాకు బాగా పరిచయమున్న డాక్టర్‌ను నియమించి వైద్యం చేయించినాను. కొన్నిరోజులు పరిస్థితి విషమించి మేమందరం ఆయనను అనుసరించి సేవ చేసినాము. ఆ సమయమున నా భార్య నిండుగర్భిణీ. నాన్నగారి పరిస్థితి విషమించియున్న సమయమున ప్రశూతి అయినది. మళ్లీ కుమారుడే జన్మించాడు. ఇది నాలుగవ కాన్పు. అయితే పుట్టిన మూడవనాడే ఏదో జబ్బుచేసి గంటలలోనే మరణం సంభవించినది. మేమందరము మా నాన్నగారిని చూచుకొనుటలో పుట్టిన శిశువుపై శ్రద్ధచూపలేదు. నాకు కలిగిన నలుగురు కుమారులలో ఇద్దరు

మరణించారు. మధుసూదన్ పెద్దకుమారుడు. మూడవ కుమారుడు రవివర్మ మాత్రము బ్రతికియున్నారు. పదిహేను రోజుల పిదప మా నాన్నగారి ఆరోగ్యం తెరపి యిచ్చినది. కొన్నిరోజుల పిదప పూర్తిగా స్వస్థత ఏర్పడినది. మేమందరము మళ్లీ మా మా పనులపై దృష్టి సారించాము.

## ఆరోగ్యం - హితబోధ

నేను గత సంవత్సరం భార్యాపిల్లలతో మా అత్తగారి స్వగ్రామమైన పల్లెర్లకు (తెలంగాణ) వెళ్లినాము. అచట కొన్నాళ్ళు వుండి అటునుండి యాదిగిరిగుట్ట యందలి గుడికి వెళ్లి మా స్వగ్రామమైన కుందారం వెళ్లాలని నిర్ణయించుకొని మా అత్తమామలను సోలాపురం పంపించినాను. నేను మొదట మా చెల్లివద్దకు వెలిదండ వెళ్లి అటునుండి కుందారం ఆపై అక్కయ్య పెదమడూరుగారి ఇంటినుండి సోలాపురం తిరిగివచ్చినాము. మేము వచ్చేవరకు ఇచట మా అన్నయ్యలు ఇల్లు ఖరీదుచేసినారు. అవి 11 మొగ్గాల ఇల్లు. ఒకక్రమంలో కట్టినట్టిది కాదు. మా వాళ్లు దానిలోనికి ప్రవేశిద్దామను ఆలోచనలో యున్నారు. అది వాస్తుననుసరించి నిర్మాణం జరుగలేదు. తిరిగి నిర్మాణం చేయించువరకు వద్దని పూర్వము మొదలున్న ఇంటిలోనే వుండి దానిని అద్దెకు యివ్వటమైనది. ఇది మా వాళ్లు ఇష్టము లేకపోయిన నా మాటపై ఆగినారు. నేను అప్పట్లో సిగరెట్లు తాగెడివాడిని. ఒక వ్యక్తి తన తల్లి ఫోటో పేయింటింగ్ చేయించుకొనుటకు నావద్దకు వచ్చినాడు. ఆతడు అహ్మదాబాద్ నివాసి. తానిదివరకు పేయింటింగ్ చేయిస్తే మంచిగా లేదని నాతో చేయించుకోవాలని తెలిపినాడు. అతడు ఇక్కడ చీరలు ఖరీదుచేసి తీసుకొనివెళ్లేవాడు. కానీ ఈసారి పేయింటింగ్ చేయించుకొని వెళతానని ఆగిపోయినాడు. వీలైనంత తొందరగా చేసియివ్వమని కోరినాడు. హోటలులో భోజనముచేసి మిత్రుని ఇంట్లో మకాం చేసెడివాడు. పగలంతా స్టూడియోకువచ్చి నేను చేసే పేయింటింగ్ చూస్తుకూర్చునేవాడు. నేను అలవాటు ప్రకారం సిగరెట్టు కాలుస్తు పేయింటింగ్ చేస్తున్నాను. నేను విడిచిన పొగ అతనికి ఇబ్బంది కలిగింది. అయినా రెండురోజులు భరించినాడు. మూడవనాడు మర్యాదపూర్వకముగా ఈ సిగరెట్లు తాగటం వలన మీకేమీ లాభం కలుగుతుంది? ఆరోగ్యం పాడవడము, డబ్బు దండగ, టి.బి.కి మూలం. మున్నగు విషయాలు నష్టాలని తెలిపి మీ ఇష్టానికి నేను వ్యతిరేకిని కాను. కానీ

నాకు తెలిసింది చెప్పినానన్నాడు. ఆ మాటలలో నిజాయితీ, వాస్తవికత నాకు అర్థమై అతనిముందే చేయియందలి సిగరెటును పారవేసి ఇకముందు సిగరెట్లు ముట్టనని శపథము చేసినాను. ఇప్పటికి మళ్లీ సిగరెట్లు ముట్టలేదు. జన్మాంతరం గుర్తుంచుకోదగిన హితబోధచేసి నా ఆరోగ్యాన్ని కాపాడినాడు.

# వరంగల్‌లో స్టూడియోకై సలహా

పిదప కొన్నాళ్లకు నాకు తెలిసిన ఒక సిద్ధాంతిని సంప్రదించి మేము ఖరీదుచేసిన ఇల్లు చూపెట్టినాను. ఆయన దానిని చూచి వాస్తు సరిగాలేదని అవసరమైన మార్పులు చూపించినాడు. ఆయన చెప్పినట్లుగా మార్పులు చేయించి మేము గృహప్రవేశము చేసినాము. మేము మార్పులు చేయకముందు కిరాయకువున్న వ్యక్తులు కష్టనష్టాలకు లోనైనారు. ఇది మా వారికి తెలిసివచ్చింది. అప్పుడే మార్పులకు వప్పుకుని తోడ్పడ్డారు. మేము గృహప్రవేశము చేసిన కొన్నాళ్లకు తెలంగాణా యందు వరంగల్‌లో వ్యాపారం చేయుచున్న సోలాపురం వ్యక్తి ఒకతను తన తల్లిగారి ఫోటో పేయింట్‌కు తీసుకువచ్చి చేయించుకున్నాడు. మాటల సందర్భమున వరంగల్ పెద్దపట్టణం కదా అచట ఎందుకు చేయించలేదని ప్రశ్నించినపుడు ఆచట మంచి పనివారు లేరు. నీవంటి వ్యక్తి అచట స్టూడియో పెట్టినట్లు అవుతే తెలంగాణా రాణించగలదని చెప్పినాడు. నాకు మొదటినుండి కూడా దేశములో ఆందు నా జన్మస్థలమైన కుందారమునకు జిల్లాయగు వరంగల్‌లో స్టూడియో పెట్టాలని వుండెడిది. కానీ అక్కడి పరిస్థితులు తెలియవు కదా. ఈ వ్యక్తి చెప్పిన పిదప నాకు వెళ్లి పరిశీలించాలని ఆలోచన కలిగినది. నా ఆలోచన మా నాన్నగారికి తెలిపి ఒక మిత్రుడు కూచయ్య అను వ్యక్తిని వెంటబెట్టుకొని వరంగల్ చేరినాను. ఇది 1954వ సంవత్సరము. ఇచట నాకు పరిచయము మరియు బంధుత్వము వున్న గుండేటి పెద్దనారాయణగారి ఇంటికి వచ్చినాను. ఆయన నన్ను సాదరంగా ఆహ్వానించి విషయం తెల్సుకుని తప్పక రమ్మని ప్రోత్సాహపరచినాడు. అచట ఒక వారం రోజులు వుండి వరంగల్‌లో గల ఫోటోస్టూడియోలను పరిశీలించాను. ఒకరిద్దరు మంచి పనివారే కానీ సమయాన్ని పాటించరు. పైగా తామెంతో పనివారమని తమతో సమానమైనవారు లేరను భావం కలిగియున్నారు. అధునాతనమైన పద్ధతులను అవలంభించడం లేదు. స్టూడియోల యందు తగిన హంగులు లేవు. మంచి పేయింటర్ ఎవరులేరు. ఇది నా పరిశీలనలో తేలిన అంశం. నేను ఇచట స్టూడియో పెట్టినట్లు

అవుతే మంచిగా నడువగలదని నాకు నమ్మకమేర్పడినది. తప్పక స్టూడియో పెట్టాలను నిశ్చయానికి వచ్చి తిరుగు పయనం ప్రారంభించినాను. మొదట స్వగ్రామమైన కుందారం, పెద్దమడురు అటునుండి సుద్దాలకు వెళ్లినాను. అచట (గుజ్జుం హన్మంతు) సుద్దాల హన్మంతు అనునతని స్వగ్రామం. నేను బాంబేలో వుండగా ఎక్కువ సమయం అతనితో గడిపినాను. వక తడవ అతని వద్దకువెళ్లి కలిసి పరిస్థితి తెలుసుకురావాలని మనసుకలిగి వెళ్ళినాను.

హన్మంతుగారు నా రాకతో ఆశ్చర్యపోయినారు. విడిపోయిననుండి కనీసం మాకు ఉత్తరాలు ప్రత్యుత్తరాలు లేవు. నేను ఆయన గారి ఇంటికివెళ్ళుసరికి పార్టీ మీటింగు జరుగుతోంది. ఆయనగారు ఆ గ్రామములో ఒక ప్రముఖుడుగా చలామణి అగుచున్నాడు. గ్రామ మందలి మంచిచెడుకు ముందుండి పేదవారిని ఆదుకొనుచు పార్టీ పనులు నెరవేరుస్తున్నాడు. నాకు అచట తన పనులు మరియు అచటి వ్యక్తులను పరిచయం చేసినాడు. అప్పటికి ఆయనగారికి ఒక కుమారుడు. బాంబేలో వుండగా ఇంకా సంతానం కాలేదు. నేనచట మూడురోజులన్నాను. మూడురోజులు ఆయన వ్రాసిన పాటలతో, బుర్రకథలతో ఇతర కార్యక్రమాలతో బాగా ఆకట్టుకున్నాడు. నేను విన్నదానికన్న ప్రత్యక్షంగా చూచినది అధికంగా కన్పించినది. నేను వరంగల్‌లో స్టూడియో పెట్టదలచుకున్నానని విని చాలా ఆనందించినాడు. మీ బోటికళాకారులు చాలా అవసరమని చాలా వృద్ధిలోకి వస్తారని తప్పక రావలసినదని ప్రోత్సహించినాడు. పిదప సెలవు తీసుకుని మళ్లీ కుందారం మీదుగా సోలాపురం చేరుకున్నాను. నేను వచ్చేముందు స్టూడియోను హనీఫ్‌కు అప్పగించివచ్చినాను. ఆయన ఇన్నిరోజులు దానిని అంటిపెట్టుకొని వుండి ఫోటోలుతీసి వచ్చిన గ్రాహకులను తృప్తిపరచి పంపినాడు. లెక్కలు ఎప్పటికప్పుడు స్పష్టంగా వ్రాసి వచ్చిన పిదప అప్పగించాడు. నాకు అతని నిజాయితీపై పూర్తి నమ్మకము. దానిని అతడు ఎపుడు కాపాడుకొనుచున్నాడు. ఈతనితో సన్నిహితం మా వారికి మాత్రం కంటగింపుగా వుండెడిది. దానిని నేను కాని అతడు కాని ఎన్నడు పట్టించుకోలెదు. దేశం వెళ్లివచ్చిన పిదప అచటి విషయాలను మా నాన్నగారు అడిగినారు. నేను వెళ్లిన విషయం చూచాయగా మాత్రమే తెలుసు. అందుకే వివరమడిగినాడు. నేను విషయంమంతా వివరంగా చెప్పి మనం వరంగల్‌లో స్టూడియో పెట్టినట్లు అవుతే ఆర్థికంగా బాగుపడుతామని అంతేకాదు మన స్వగ్రామమునకు దగ్గరలో వుంటామని అందువలన వెళ్లి అచట స్టూడియో ఏర్పాటుచేయ నిశ్చయించుకున్నానని

తెలిపినాను. ఆయన వివరములువిని సంతసించినట్లు కనిపించాడు. కాని తన అభిప్రాయం చెప్పలేదు. రెండురోజుల పిదప తనకు అనుమతి ఇవ్వవలసినదిగా కోరినపుడు ప్రస్తుతం వలదన్నాడు. ఎందుకనగా నేనింకా ఎంతోకాలం జీవించను. ఇది నెలలోనే వుంటుంది. పైగా నీవు కుటుంబాన్ని తీసుకుని వెళ్లాలి. నేను బ్రతికి వుండగనే కుటుంబం విచ్ఛిత్తి జరగటం ఒప్పుకోను. అందువలన నా తదనంతరం నీ ఇష్టం వచ్చినచోటికి వెళ్లమన్నాడు. నేనొక వారం ఆగి మళ్లీ అడిగినా ఆయన తన నిర్ణయములో మార్పులేదని స్పష్టపరిచినాడు. నా నిర్ణయం తాత్కాలికంగా వాయిదా వేసుకున్నాను. నాన్నగారి తదనంతరమే వెళుదాము. ప్రస్తుతం ఇక్కడ కూడా బాగా వుంది కదాయని విరమించుకున్నాను. అయితే మా నాన్నగారితో ఒక ఒప్పందం చేసుకున్నాను. అదేమనగా ఇంట్లో భోజనమునకు కొలది డబ్బుఇచ్చి మిగతా నేను ప్రోగుచేసుకుంటాను. అట్లే అవసరమైన వస్తువులు కొనిపెట్టుకుంటాను. వరంగల్ వెళ్లునాటికి కొంత డబ్బు కూడబెట్టుకుంటానని చెపితే సరే అలాగే చేసుకోమన్నాడు.

## మంగళవారం – అంగడి

అయితే మా నాన్న అన్నయ్యలు నాకు తెలియకుండా డబ్బు మొగ్గాలపై వచ్చేదానిని ప్రోగుచేయుచు వచ్చినారు. అది ఒకసారి నేను స్టూడియో నుండి రాత్రి ఇంటికివెళ్లుసరికి బాగా ఆలస్యమైనది. నేను ఇంటికి వెళ్లుసరికి మా నాన్న, రంగన్న మరియు వైకుంఠం అన్నయ్య డబ్బులు లెక్కపెట్టుచున్నారు. నా రాక కనిపెట్టి అట్టి డబ్బుపై గుడ్డ కప్పినారు. నేను చూచియు చూడనట్లుగా వెళ్లినాను. వారి భయమేమిటంటే డబ్బు ఉన్నదని తెలిస్తే ఏదైనా క్రొత్త వ్యాపారం పెడుతానని వెంటపడి నష్టపెట్టిస్తానేమోయని. కాని నేను చేసిన ఏపనికూడా నష్టం వాటిల్లు దానిని చేయలేదు. వారికి క్రొత్తపని అంటే భయం. అందుకే నాకు ఇంటి ఆర్థిక పరిస్థితిని తెలియనీయకుండా యుంచెడివారు. నా సంపాదన కూడా మంచిగా వుండుటచే నేను చేయదలచుకున్నది చేసెడివాడిని. బొంబాయివెళ్ళి ఫోటో సామానులు కొనితెచ్చెడివాడిని. సోలాపురంలో కంటే అచట 30 శాతం తక్కువ ధరకు దొరికెడివి. అట్లే నేను వెంట కెమెరా తీసుకువెళ్లి పరిచయస్తుల ఫోటోలు దించెడివాడిని. వానియందు కొన్నింటికి పేయింటింగ్ ఆర్డర్స్ కూడా వచ్చెడివి. అది ఉభయత్రా లాభసాటియైనది. అట్లే సోలాపురంలో ప్రతి మంగళవారం ఒక అంగడి జరిగెడిది. దానియందు చాలా పాత సామానులు దొరికెడివి. చిన్న

ఇనుప శీలనుండి పెద్దవాటివరకు అన్నిరకముల ఇనుప పాత వస్తువులు, కర్ర వస్తువులు, గుడ్డలు, ఆహార పదార్థాలు, మసాలా దినుసులు. ప్రతి మంగళవారం ఉదయం 11-00 గంటలకు హనీఫ్‌ను వెంటబెట్టుకునివెళ్లి ఏదో ఒక వస్తువును తెచ్చెడివాడిని. ఒక తడవ ఒక పాత కర్రటేబుల్ మంచి నగిషీ చెక్కబడి కనిపించినది. అది మట్టితో కప్పబడి వికారంగా కనిపిస్తోంది. నేను దానిని కొంతరాకిచూచి తీసుకోవాలని నిర్ణయమునకు వచ్చి బేరము చేసినాను. అతడు 70/- రూపాయలు చెప్పినాడు. నేను 30/- రూపాయలకు అడిగి తిరిగివచ్చినాను. అట్లు రెండుమూడు వారాలు వానివెంటపడి 45/- రూపాయలకు కొనితెచ్చినాను. దానిని బాగుచేయించి స్టూడియోలో పెట్టినపుడు స్టూడియోకు ఒకవిధమైన శోభవచ్చినది. అది ఇప్పటికి రవివర్మ స్టూడియోలో వున్నది. దాని నగిషీ పని చాలాగొప్పది. దానిని ఏ రాజా లేదా జాగీర్దారు చేయించుకొని వుంటారు.

నేను వరంగల్‌నుండి సోలాపురం వచ్చిన కొన్నాళ్లకు మిత్రుడు పెద్దగుండేటి నారాయణ మరణించినాడని తెలిసినది. అతడు డబ్బును ఏనాడు లక్ష్యపెట్టలేదు. అతనికి డైయింగ్ వ్యాపారములో అంతులేని ఆదాయము వచ్చెడిది. దానిని తిరిగి అట్లే ఖర్చుపెట్టెడివాడు. తుదకు ఆ డబ్బే ఆతని ప్రాణం తీసినది. లక్ష్యపెట్టక విపరీతమైన ఖర్చులు ఆదాయాన్ని మించిచేసి అప్పుల పాలైనాడట. అది నాకొక గుణపాఠం అయినది. జీవితమున అట్లెన్నడు చేయరాదని పైగా నేను కష్టపడి పైసాపైసా కూడబెట్టుట అలవర్చుకున్నాను. మా నాన్న అన్నలు అందరమదే దారిలో వుండుటచేత డబ్బు విలువ మాకు చిన్ననాటినుండి తెలిసినది. ఈ సమయమునందే మా గురువుగారగు శరణప్ప నోటియందు కేన్సర్ వచ్చి మరణించినాడు. దీనితో నాకు పెద్దతోడు లేకుండాఅయినది. నా స్థాయికి ఆయనయే ముఖ్యకారణం. నేను స్టూడియో పెట్టిన పిదప నాకెన్నో విధములైన సలహాలు యిచ్చి నిస్వార్థంగా నా అభివృద్ధిని ఆకాంక్షించి నేనెపుడు ఏ విషయమై సందేహాలు చెప్పుకున్నపుడు సరియైన పరిష్కారమార్గాలు చూపించితోడ్పడ్డాడు. అతని తదనంతరం ఆయన తండ్రిగారు గురువుగారి భార్యాపిల్లలను తీసుకొని కర్ణాటకలోని తమ స్వగ్రామమునకు భీమనహళ్లి అనే గ్రామము తీసుకువెళ్లినాడు. స్టూడియో శాశ్వతంగా మూసివేసినారు. కొలది సామానువుంటే నాకు అప్పగించి వెళ్లినారు.

# ఫోటో[గ్రాఫర్‌ల సంఘం

మారుచున్న కాలానుగుణ్యంగా మార్పుకోరుతు సోలాపురంలో వున్నట్టి ఫోటో[గ్రాపర్‌లందరిని సమావేశపరచి ఒక సంఘంగా ఏర్పరచినాను. ''సోలాపురం ఫోటో[గ్రాఫర్‌ల సంఘం'' పేరిట ఏర్పరచనైనది. దీనిద్వారా అంతకుపూర్వము మా మధ్యవున్న స్పర్ధలు తగ్గడమే కాకుండా ధరలలో కూడా ఏకత్వము సాధించడమైనది. ప్రతినెలకు ఒకరోజు సర్వసభ్య సమావేశమేర్పరచి సాధకబాధకాలు చర్చించి పరిష్కార మార్గాలు చర్చించెడివారము. అట్లే అభివృద్ధి చెందుతున్న ఫోటో[గ్రఫీ నూతన పద్ధతులను ఎలా అనుసరించాలో ఒక్కొక్కరు చెప్పెడివారు. ఒక దసరా పండుగకు ఫోటో[గ్రఫీ ప్రదర్శన ఏర్పాటుచేసి దానియందు ప్రతి ఫోటో స్టూడియో నుండి రెండుమూడు ఫోటోలు ప్రదర్శనకు వచ్చే ఏర్పాటుచేసినాము. న్యాయనిర్ణేతగా జి.డి. శుక్లాయను ఒకగొప్ప ఆర్టిస్టును హైద్రాబాద్ నుండి ఆహ్వానించినాము. ఆయన మహారాష్ట్రుడే హైద్రాబాద్‌లో వుంటున్నాడు. ఆయన స్టూడియో పెట్టలేదు. కానీ ఆయనకు గొప్పగొప్ప వ్యక్తులను ఫోటోలు తీయించెడివాడు. ఆయన ఎన్నో కొత్త ప్రక్రియలు కనుక్కొని వానిని అమలులో పెట్టెడివాడు. మామూలు స్టూడియోవారు తీసుకొనే చార్జీకంటే ఆయనగారు నాలుగురెట్లు ఎక్కువ వసూలుచేసేడివాడు. అయినా అతని పనితనమును గుర్తించినవారు పిలిపించుకొని ఫోటోలు తీయించుకొనెడివారు. ఆయనగారి కుమార్తెకూడా ఆయనతో పాటు మంచి కళాకారిణిగా రూపొందినది. మేము ఏర్పాటుచేసిన ఫోటో ప్రదర్శనకు తండ్రికూతురును కూడా ఆహ్వానించినాము. దీనిపై బాగా ప్రచారము చేసినాము. పట్టణవాసులు చాలామంది ప్రదర్శనను దర్శించి అభినందించారు. ఆ ప్రదర్శనలో పెట్టబడిన ఫోటోలలో 10 ఉత్తమమైనవిగా నిర్ణయించినారు. నేను రెండింటిని పెట్టినాను. నా ఒక ఫోటోకు 7వ నెంబరు వచ్చినది. దీనిలో నేను ప్రత్యేకంగా పనిచేయుటచే నాకు మంచిగుర్తింపు వచ్చినది. అది మూడురోజులు వరుసగా నడపబడినధి. ఎంతోమంది కళాభిమానులు దర్శించినారు.

# నాన్నగారి నిర్యాణం

దసరా పండగ తెలంగాణావారు ప్రత్యేకంగా చేసుకుంటారు. ఆ దినం కుటుంబ సభ్యులందరు ఒకే సమయమున ఫలహారాదులు, భోజనాదులు చేస్తారు. ఇంటి యజమాని అందరిని తనముందు కూర్చోబెట్టుకుని తృప్తిగా తిని తమకు అలవాటు వున్నమేరకు త్రాగుడుచేస్తారు. ఇది మొదటి నుండి వస్తున్న ఆచారం. ఆ రోజు మా నాన్న స్వయంగా ప్రతి విషయాన్ని పర్యవేక్షించి సమావేశపరుస్తాడు. అది 1955 సం॥ నాటి దసరా పండగ. పండగనాడు ఉత్సాహముతో కొంతమంది ఫోటోలు దిగే ఆచారముంది. నేను స్టూడియోలో వుండిపోయినాను. సమయానికి రాలేదని మా నాన్న నా పని మాన్పించి ఇంటికి పిలిపించి పండగపూట సంపాదనవద్దు. తృప్తిగా అందరము కలిసి తిని త్రాగుదాం అని నన్ను మెత్తగా మందలించి తన చేతిమీదుగా మాంసం, మద్యం అందించినాడు. అందరం సంతోషంగా పండగ చేసుకున్నాము. ఆనాటి రాత్రి కొద్దిగా నాన్నగారికి జ్వరం వచ్చినది. నేను ప్రదర్శనకాడికి వెళుతానని చెప్పివెళ్లినాను. మరుసటిదినం జ్వరం తగ్గకపోగా ఇంకొంచెం ఎక్కువ అయినది. నేను డాక్టరును తీసుకువస్తానంటే ఇది మామూలే కనుక వద్దన్నాడు. నేను ఫోటో ప్రదర్శన హడావిడిలో వుండిపోయాను. ఆ సాయంకాలం ప్రదర్శన కడకు వెళుతు నాన్నగారితో మాట్లాడివెళుతానని చెప్పివెళ్లినాను. మరుసటి ఉదయం చిన్న పార్టీలాంటిది చేయాలని సంకల్పించుకుని ఏర్పాట్లు చేస్తున్నాము. కొంతమంది టిపిన్లు చేస్తున్నారు. నేను అదే యత్నంలో వున్నాను. ఇంతలో ఇంటినుండి ఒక మనిషివచ్చి నాన్నగారు స్పృహలో లేరు. నిన్ను వెంటనే తీసుకుని రమ్మన్నారని కబురు చెప్పినాడు. నేను అచట మిగతావారికి తెలిపి ఇంటికి సైకిల్పై వెళ్లినాను. నేను వెళ్లుసరికే నాన్నగారు మరణించియున్నారు. రాత్రి తన గదిలో నిద్రించిన పిదప ఒకటిరెండు తడవలు మూత్రమునకు వెళ్లివచ్చినాడట. 26-10-1955 తెల్లవారి గదినుండి లేచిరాలేదట. కనుక్కునేందుకు లోనికి వెళ్లి పరిశీలించినారట. అయితే అప్పటికే మరణించి యున్నాడట. నేను ఆఖరు సమయమున వుండలేకపోయినానని నాకు అమితమైన దుఃఖం వచ్చినది. నన్ను తన కుమారులలో ప్రత్యేకంగా చూచుకొనే తండ్రి లేడను భావం నన్ను బాగా

క్రుంగదీసినది. రెండుమూడు రోజులు దుఃఖాన్ని తట్టుకోలేకపోయినాను. మా అమ్మ దుఃఖానికి అంతేలేదు. ఆమెను చూడగానే నాకు మళ్లీ దుఃఖం ముంచుకువచ్చేడిది. ఒక నెలవరకు మా అమ్మ ఒక విధమైన అపస్మారకస్థితి యందే గడిపినది. స్టూడియో పూర్తిగా బందుపెట్టినాను. ప్రదర్శన మిగతా వారందరు పూర్తిఅయిందనిపించినారు. వారందరు వచ్చి తమ సానుభూతిని చూపివెళ్లినారు.

నాల్గవనాడు మా నాన్నగారిది ఒక పేయింటింగ్ చేయాలని సంకల్పించుకొని అదివరలో తీసిన ఫోటోలు పరిశీలించినాను. ఒకరోజు నా పెద్దకుమారుని ఫోటో తీయాలని రాత్రి స్టూడియో నుండి కెమెరా తెచ్చియుంటిని మరుసటి ఉదయం వాని ఫోటో తీయుటకు బయటకు వెళ్ళుసరికి మా నాన్నగారు ఇంటిఅరుగుపై కాళ్ళమిద గొంతుకూర్చుని చుట్టా త్రాగుచున్నాడు. ఆదృశ్యం నాకు చాలా నచ్చినది. వెంటనే రెండు స్నాపులు తీసినాను. అది బాగుంది. దానిని పెయింట్‌చేయాలని దాని ప్రింటు తీయించి ప్రేముకు 17''x23'' సైజులో పేయింటింగ్ ప్రారంభించినాను. దీక్షగా కూర్చుని దానిని వారంరోజుల వరకు పూర్తిచేసినాను. ఆ పేయింట్ంగ్ ఎందరితోనో ప్రశంసలు అందుకున్నవి. నేను వరంగల్‌లో స్టూడియో ఏర్పరచిన పిదప దానిని స్టూడియోలో ప్రవేశించుటకు ముందుగదిలో ఏర్పాటు చేసినాను. ప్రతి వ్యక్తి దానిని చూచి లోనికి వస్తాడు. అది నా నిపుణత్వమునకు ఒక గీటురాయిగా పరిణమించినది. మానాన్న జీవించి యున్నంత కాలం నా అభివృద్ధిని ప్రత్యేకతను ఆకాంక్షించినాడు. మరణానంతరం ఈ పేయింటింగ్ ద్వారా వచ్చే గ్రాహకులకు నాకుమారుని ప్రత్యేకత చూచినారా యని చెప్పినట్లుగా నన్నాశీర్వదిస్తున్నట్లుగా నాకు అనుభూతి కలుగుతుంది. దశ దిన కర్మ జరిగిన పిదప నాకు మానాన్న చెప్పిన మాటలు స్ఫురణకు వచ్చినవి. నా తదనంతరం నీ ఇష్టంవున్న చోటికి నీకు అభివృద్ధి కలుగుచోటికి వెళ్లమని చెప్పినాడు. నేననది గుర్తుచేసుకొన్నాను. నెల మాసికమునాడు సోలాపురం నందలి ఫోటోగ్రాఫర్‌లందరిని స్టూడియోకు ఆహ్వానించి చిన్న పార్టీ ఏర్పాటుచేసినాను. దానిలో మా నాన్నగారి పేయింటింగ్ పెట్టి పూలదండలేసి వుంచినాను. ఆహ్వానితులందరు ఆ చిత్రాన్ని చూచి బాగా ప్రశంసించినారు. కొందరు తమ ఉద్దేశాలను ప్రకటిస్తు మాట్లాడినారు. పార్టీ సాత్వికమైనది. ఏర్పాటుచేసి ''అరిశెలు'' (అప్పచ్చులు) చేయించినాను. ఇవి

మహారాష్ట్రములో చేయరు. వానిని సప్పటి పప్పు, నెయ్యిపోసి వడ్డించడమైనది. ఇది కొత్తగావుండి మరీమరీ పెట్టించుకుతిన్నారు. సమావేశ అనంతరం వారందరు తమతమ సానుభూతిని కృతజ్ఞతలను తెలిపి వెళ్లిపోయినారు. ఫోటోగ్రాపర్లతో సమావేశం ఇది నాకు ఆఖరు అయినది.

## చంద్రవర్మ - చిత్రకారుడు

ఇచట ''మాళిగె''యనునొక ఫోటోగ్రాఫర్ ఓరియంటల్ అను స్టూడియో పెట్టినడుపుచున్నాడు. ఆయన తరచు నా వద్దకు వచ్చెడివాడు. అతనొక చిత్రకారుని గురించి చిత్రమైన విషయాలు తెలిపినాడు. ఆ చిత్రకారుడు కమ్మరి అతడు చంద్రవర్మ. పెద్దగా విద్యావంతుడుకాదు. కానీ బొగ్గుతో దొరికితే పెన్సిల్ పేపర్పై చాలా చక్కగా చిత్రించగలడు. సోలాపురంలో పరదేశి స్టూడియో ఒకటి కలదు. దాని యజమాని ఒక పార్శి అతను. చాలా పెద్ద స్టూడియో తన బంగళాలో ఏర్పాటు చేసినాడు. పెద్ద హాలులో ఎక్స్పోజింగ్ చేయించేవాడు. అయితే దానికి అనుగుణ్యమైన బ్యాగ్రౌండ్ పరదా లేదు. అందుకొరకు ఒక ఫారిన్ నుండి వచ్చిన ఆర్టిస్టుతో పరదా వేయించినాడట. కానీ అది యజమానికి నచ్చలేదు. ఫారిన్ తిరిగివచ్చిన అతడు వేసిన పరదాను చూస్తానని ఈ కుమ్మరి చంద్రవర్మ వెళ్లినాడట. అప్పుడా స్టూడియో యజమానికి ఇతడు మంచి చిత్రకారుడని ఎవరో చెబితే నీవు చిత్రించగలవా అని అడిగినాడట. ఎందుకనగా పల్లెటూరి వేషభాషలు సాధారణ వ్యక్తిత్వం అయితే ప్రయత్నిస్తాను. ఈ వస్తువులు తెప్పించి ఇద్దరు పనివాండ్రను యివ్వమని కోరి వస్తువులన్నీ తెప్పించిన పిదప విదేశీ చిత్రకారుడు చిత్రించిన పరదాను పెండనీళ్లతో శుభ్రంగా కడిగించి చిప్పలలొ రంగులు నానబొసి రేపువస్తానని వెళ్లిపోయినాడట. మరుసటి ఉదయం వచ్చి ఆ ఇద్దరు పని కుర్రాళ్ళను వెంటవుంచుకొని సాయంకాలం వరకు పూర్తిచేసినాడట. దాని యజమానిని పిలిపించి చూపించినాడట. ఒకరోజులోనే పూర్తిచేయటమే కాదు అద్భుతమైన దృశ్యాలతొ చిత్రించినాడట. యజమాని మహా సంతోషపడి 100 రూపాయలు ఇస్తే నాకివ్వన్ని ఎందుకు ఒకరోజు కూలీ యిప్పించండి అన్నాడట. దానికి ఆ పార్శి అతను ఇంతకన్న విలువైన పనిచేసినావు. వుంచుకోమ్మన్నాడట. అయితే ఆ చిత్రకారుడు తనతో పనిచేసిన ఇద్దరు కూలీలకు చెరి 25 రూపాయలు యిచ్చి మిగతా 50 రూపాయలు సంతోషంగా తీసుకున్నాడట. ఇతని చిన్నతనములో ప్రతిభ గుర్తెరిగిన కొందరు స్నేహితులు

ఇతనిని బొంబే తీసుకువెళ్ళి రెండుపూటలా భోజనముపెట్టి కాగితము, పెన్సిల్, రబ్బర్ యిచ్చేవారట. ఇతనికి ఆలోచన వచ్చినపుడేదో చిత్రాన్ని గీసి ఇచ్చేవాడట. దానిని స్నేహితులు ప్రింటు చేయించి కాపీలను అమ్ముకొని సొమ్ముచేసుకునేవారట. కొంతమంది చంద్రవర్మతో నీవు తీసిన చిత్రములు కాపీలను అమ్ముకొని డబ్బు సంపాదించుకొనుచున్నారు. నీకు ఏమీ యివ్వటం లేదంటే నేను వట్టిగా వుండేకంటే పని కల్పిస్తున్నారు. నాకు రెండుపూటలా భోజనము పెడుతున్నారు. నా చిత్రాలను మార్కెట్లో అమ్మి పరోక్షంగా నన్నుగురించిన ప్రచారము చేస్తున్నారు. ఒక కళాకారునకు ఇంతకుమించి ఏమీ కావాలి అని సమాధానం చెప్పినాడట. ఒక తడవ ఒక మార్వాడీ తన రూపము చిత్రించియిస్తే డబ్బు యిస్తానన్నాడట. నమ్మి అతను యిచ్చిన కాగితముపై చక్కగా చిత్రించి తీసుకువెళ్లి చూపించినాడట. ఆ పిసినారి మార్వాడీ డబ్బులు తగ్గించాలను దుర్బుద్ధితో సరిగారాలేదు ఇంకా బాగా వేయాలని తనవద్ద వుంచుకున్నాడట. దీనిని కనిపెట్టిన చంద్రవర్మ చిన్నమార్పుచేసి యిస్తానని చేసి తెస్తానని తీసుకువెళ్లి నాలుగువీధుల సెంటర్‌లో దానిని ప్రదర్శించి ఇది ఎవరి బొమ్మయని వచ్చిపోయే వారిని అడిగినాడట. ఆ మార్వాడీ ఆ ఊళ్లో ప్రసిద్ధుడు. అతనిని అందరు గుర్తిస్తారు. వారు ఫలానా మార్వాడీదని చెప్పినారట. ఈ బొమ్మలోని వ్యక్తి ఇది నా మాదిరిగ లేదని బొంకినాడు. ఇతనిని సత్కరించాలని ఆ చిత్రమును వీదిలోపెట్టి చెప్పుతో కొట్టినాడట. ఇట్లా ఆ టౌనులో నాల్గైదు దిక్కుల చేసినాడట. ఈ విషయం సదరు మార్వాడీకి తెలిసినది. ఇంటికి పరిగెత్తుకొనివచ్చి తన తప్పు క్షమించమని బ్రతిమిలాడి తానిదివరకు ఒప్పుకున్న దానికన్న రెండింతలు డబ్బులు ఇచ్చి తీసుకొనిపోయినాడట. ఆతని చిత్రాలు ఇప్పటికి ఔంధు మహారాజ ఏర్పరచిన చిత్రశాలలో వున్నావని చెప్పెడివాడు.

మా నాన్నగారి మరణానంతరం మా పెద్దన్న తన కుటుంబంతో కుందారంలో ఇల్లుఖాళీచేసి సోలాపురం చేరినాడు. ఇపుడు ఇంటికి తాను పెద్దదిక్కు. అన్నట్లు మానాన్న వున్నంతకాలం కుందారం విడిచి రాలేదు. ఇపుడు పెత్తనం చేయుటకు వచ్చినాడు నాకు మొదటినుండి ఆయన స్వభావం గిట్టదు. మా రంగన్న అమాయకుడు. అతనికి వ్యవహారం చేతకాదు. కొన్నాళ్ళు ప్రయత్నించి భంగపడి మానుకున్నాడు. నాకు వరంగల్ పోవాలను భావన ఇంకాతొందర చేసినది. ది.21-1-1956. నాడు నాకు ఐదవ సంతానం

కూతురు కలిగినది. పేరు విమల ముందు నలుగురు అబ్బాయిల తర్వాత అగుటచే నాకు చాలా సంతోషమైనది. కూతురు 21 దినం డోలారోహణము నాడు బంగారు కడియాలు చేయించి తెచ్చిపెట్టినాను. ఆ దినం ఒకరొకరు ఎత్తుకుని తొట్టిలొ వ్రేయునపుడు వదులుగా వున్న కడియములలో ఒకటి వడిలొ పడినట్లుంది. ఎంతవెదికినా కనిపించలేదు. నాకు బాధ అనిపించింది. తర్వాత చిన్ననాడు దానికి బంగారు కడియాలు పెట్టలేదు. మా అన్నల కూతుర్లెవరికి బంగారువి లేవు. నేను నా కుమార్తెకు పెట్టుటయు కూడా బాగుండదని విరమించుకున్నాను. కానీ మా అమ్మ తననొక బంగారు పట్టెడ చేయించుమని కోరినది. ఆమె నానుండి ఎన్నడు ఏమీ కోరనిది. ఆమె కోర్కె తీర్చుట నా విధిగా భావించి 3 తులాల బంగారం తెప్పించి పట్టెడ చేయించినాను. నాడు తులం బంగారం ఖరీదు 76-00 రూపాయలు మాత్రమే.

నేను వరంగల్ వెళ్లిపోతే ఇక్కడి స్టూడియో ఏమీ చేయాలి అను ప్రశ్న వచ్చినది. నాకు మొదటి నుండి స్నేహితుడు గుండేటి సదాశివుడు. ఇట్టి విషయాన్ని దృష్టియందుంచుకొని ఒకరోజు స్టూడియోకు వచ్చిపనినేర్చుకో బాగుంటుంది అని చెప్పినాను. అతడు నెలకెంత వేతనమిస్తావని ప్రశ్నించినాడు. అతను ఎంతసేపు స్వార్థచింతనతో వుండెడివాడు. రెండవ వ్యక్తి హనీఫ్. ఇతను నేను స్టూడియో పెట్టిన నుండి నిస్వార్థంగా పనినేర్చుకోవలయునని పట్టుదలతో పనిచేయుచున్నాడు. నేనే పనిచెప్పినా ఎన్నడు వెనుకాడలేదు. చెప్పిన పనిని నిర్వహించేవాడు. నేను ఎన్నిరోజులు గ్రామాంతరం వెళ్లినా అన్నిరోజులు తన ఉద్యోగమునకు సెలవుపెట్టి చేసెడివాడు. ఏనాడు నాకు ఇంత ప్రతిఫలమీయమని అడుగలేదు. నేనే ఆతని పనిని విచారించి అతనికి తెలియకుండా అతని తండ్రికి ఇచ్చెడివాడిని. నేను వరంగల్ వెళ్లటం ఖచ్చితంగా నిర్ణయించుకున్న పిదప ఒకరోజు అతనితో ''నేను వరంగల్ వెళ్లిన పిదప నీ ఉద్యోగమునకు నాలుగు నెలలు సెలవుపెట్టి స్టూడియో నడిపెదవా అని అడిగినాను. అతడు వెంటనే అలాగే చేస్తాను. అంతేకాదు మంచిగా నడిపి మీరు వచ్చిన పిదప అప్పగిస్తానన్నాడు. ఇదే ప్రశ్న సదాశివునితో వేస్తే నేనెట్లు నడపగలను. పైగా నాలుగు నెలలు పనిమానుకుని స్టూడియోలో వుండటం సాధ్యపడదని చెప్పినాడు. ఈ ఇద్దరిని బేరీజు వేసుకొని హనీఫ్‌కే మొగ్గుచూపినాను. ఇది మా వాళ్లకు ఇష్టములేదు. మా పెద్దన్న కుమారుని జనార్థన్‌ను పెడతానంటే మా అన్నయ్య ఫోటోల ఉద్యోగమే వద్దు అని నిర్లక్ష్యంగా మాట్లాడినాడు. అందువలన మావారికి పనిపై శ్రద్ధలేదు. పైగా

ముస్లింకు ఇవ్వటం ఇష్టములేదు. అయినా నేను ఖాతరు చేయలేదు. హనీఫ్ మిల్లులో పనిచేసేవాడు. అపుడాతనికి నెలకు రూ. 40/- వేతనం పైగా తండ్రితో వేరుపడినాడు. ఇద్దరు పిల్లలు. ఆయినా అతడు సిద్ధపడినాడంటే అతనికి ఫోటోగ్రాఫీపై కల అభిమానమే కారణము. ఆతని భవిష్యత్‌కు ఆ పని పునాదులు వేసినది. నేను అతనికి అప్పగించేందుకు ధృఢంగా నిర్ణయించుకున్నాను.

అప్పటివరకు మధుకు 8 సం॥లు నడుస్తున్నవి. బడికి వెళ్లుచున్నాడు. నాలుగవ తరగతి చదువుచున్నాడు. మరాఠీ చదువు. తెలుగు అక్షరాల వరకే పరిమితమైనది. చదువులో పెద్దగా శ్రద్ధవుండకపోయెడిది. వానిని అమ్మమ్మ, మేము అందరం గారాబం చేయుట చేత ఒకవిధమైన మొండితనం వచ్చేసినది. ఇంటిలో అన్నల పిల్లలకంటే చదువులో మెరుగే అయినా నా దృష్టిలో గొప్పవిద్యావంతున్ని చేయాలని వాని మొండితనం నన్ను భయపెట్టెడిది. ఏదన్నా కావాలని మంకుపట్టుతో సాధించుకునేవాడు. ఒక తడవ చదువు విషయమై నేను కాస్త కోపగించినందులకు నేను ఇంటినుండి వెళ్లిపోతాను. నా రేషన్‌కార్డు ఇవ్వమని, ఇది విని నవ్వుకున్నా నా మనసు చాలా బాధపడినది. ఇంక రెండవ కుమారుడు రవివర్మ నాలుగు సంవత్సరాల పిల్లవాడు. విమల చిన్నపిల్ల.

## వరంగల్‌లో స్టూడియో స్థలముకై అన్వేషణ

నేను 1-3-1956 నాడు వరంగల్‌లో స్టూడియోకు షాపుచూద్దామని సోలాపురం నుండి బయలుదేరినాను. నా పయనం మా ఇంట్లో ఎవరికి ఇష్టం లేదు. నాకు పరిచయమున్న గుండేటి పెద్దనారాయణగారి తమ్ముడు చిననారాయణ ఇంటికి వచ్చినాను. గుండేటి పెద్దనారాయణ మరణించి రెండు సంవత్సరములైనది. వారి కుటుంబం కష్టాలపాలైనది. ఆయన పెద్దకుమారున్ని చిననారాయణ తన డైయింగ్ కంపెనీలో నౌకరి వుంచుకొని కొంత వేతన మిచ్చి తోడ్పడుతున్నాడు. చిననారాయణ గారికి నారాక రుచించినట్లు కన్పించలేదు. ఆనను షాపు వెదుకుటకు నాతో రమ్మని కోరితే సంశయించినాడు. అయితే ఆయనవద్ద గుమాస్తాగా వున్న రమాకాంతయ్య అను వ్యక్తిని తీసుకొని వరంగల్‌లోని ముఖ్యకూడలులు మరియు పెద్దబజారులన్ని వెదకినాము. స్టేషన్ నుండి క్రొత్తచౌరస్తా వరకు నాకు నచ్చిన షాపు కనిపించలేదు. పాత చౌరస్తా దిక్కు అంతే. క్రొత్తచౌరస్తా దాటి హన్మకొండకు వచ్చేరూటులో చౌరస్తాకు దగ్గరగా జె.పి.యన్. రోడ్డులోనే మాడిశెట్టి లక్ష్మీనారాయణ గారి ఇల్లు నచ్చినది. అది

ఆపీసు రూం, ఎక్స్‌పోజింగ్ రూం, డార్క్ రూం మరియు ఇతర అవసరాలకు సరిపోవునట్లుగా వుంది. నేను అద్దె విషయం అడిగినపుడు సంవత్సరమునకు వేయిరూపాయలు సంవత్సరం కిరాయ అడ్వాన్సు ఇవ్వాలి. ఇష్టమైతే ఇస్తానన్నాడు. నేనందుకు ఒప్పుకున్నాను. కానీ అంత డబ్బు వెంటతేలేదు. సోలాపురం వెళ్లుటకు ఖర్చులుపోను రెండువందలు మాత్రమే వున్నవి. నేను ఆ రెండువందలు ఆయనకు ఇచ్చి వారం రోజులలో మిగతా 8 వందలు పంపుతానంటే జమానత్ ఇవ్వమని లేదా డబ్బుతెచ్చిన పిదప ఖాయం చేస్తానంటాడు. అంతవరకు గ్యారంటీ లేదన్నాడు. ఆతని ఇంటికెదురుగా ఒక గుజరాతి వారి షాపు కలదు. ఆయనవద్దకు వెళ్లి నాచేతి వాచి ఉంగరం ఆయన వద్దపెట్టి 15 రోజులవరకు జమానతు పడుమన్నాను. ఆతడు ఆలోచించి 15 రోజులలో డబ్బు అందని తీరుకు 2 వందలు మరియు ఈ వస్తువులు తిరిగిరావని చెప్పి వప్పించుకుని జమానతు ఇచ్చినాడు. ఆ పిదప ఇంటియజమాని దీనిలోపల ఏమీ షాపు పెడతావు అని అడిగినాడు. అపుడు నేను స్టూడియో పెడుతానని చెప్పినపుడు ఆశ్చర్యపడ్డాడు. స్టూడియోకు ఇంతపెద్ద ఇల్లు అనవసరము. పైగా స్టూడియో పెట్టి సంపాదించిన వారెవరని మాట్లాడినాడు. ఎందుకనగా సిటీలో వున్న స్టూడియోలన్నీ చిన్న గదులలో ఏర్పాటుచేసినవే. నేను ఆతనితో ఇది సరిపోదు ఇంతకన్న పెద్దవసతి కావాలి. ప్రస్తుతము ఒక సంవత్సరం దీనిలో నడిపి లాభనష్టాలు బేరీజు వేసుకుంటానన్నాను. నీవు సోలాపురం నుండి వచ్చి వరంగల్‌లోనే ఎందుకు పెట్టాలనుకుంటున్నావని అడిగితే మాది కుందారం. ఇదే జిల్లావారము. బ్రతుకుదెరువుకై సోలాపురం వెళ్లిపోయినామని తిరిగి ఇచట స్థిరపడాలని వచ్చినానని తెలిపినాను. ఆయన సంతసించి తన ఊరు మావూరి దగ్గరి నవాబుపేటయని, తాను తన అత్తగారింటిలో వుంటున్నానని తెలిపి నా రాక తనకు సంతోషం కలిగిస్తుందని తెలిపినాడు.

నేను వరంగల్‌లో పని ముగించుకుని వచ్చేముందు గుండేటి నారాయణగారితో మీ అడ్రస్‌పై సామాను రైల్వే పార్శిల్‌లో పంపుతామని చెప్పి సోలాపురం వచ్చినాను. వచ్చిన పిదప నా పయనం నిశ్చయమైనట్లు స్టూడియోకు షాపు మాట్లాడి వచ్చినట్లు తెలిపినాను. అయితే అదువరకు స్టూడియో కొరకని కొనియుంచినట్టి పాత వస్తువులు తీసుకువెళ్లటం ఇష్టములేక హనీఫ్‌ను వెంటబెట్టుకొని బాంబే వెళ్లినాను. అచట మిత్రులందరిని కలిసి నా వరంగల్

పయనం గురించి తెలిపి స్టూడియోకు అవసరమగు ఎల్క్ట్రికల్ మరియు కెమికల్స్, ఫిల్ములు, పేపర్లు వగైరాలు ఖరీదుచేసుకుని మూడురోజులు అచట గడిపివచ్చినాను. వెంటనే సామాను స్టూడియోకు అవసరమైనట్టిది కట్టలుకట్టి రైల్వేపార్శిల్‌చేసి పంపించినాను. సామాను పంపిన వారం రోజులకు మా వైకుంఠం అన్నయ్యను వెంటబెట్టుకుని వరంగల్ వచ్చినాను. అప్పటికి నావద్ద మూడువేల డబ్బుంది. వానిలో 8 వందలు ఇంటిఅద్దె అతనికి చెల్లించినాను. అప్పటికే నాకు జమానతు పడినట్టి గుజరాతీ వ్యక్తి ఎదురుచూస్తున్నాడు. నన్ను చూసి మాట ప్రకారం వచ్చినందుకు అభినందించాడు. నాయందు ఆయనకు ఏర్పడిన అభిమానమునకు సంతసించి కృతజ్ఞతలు చెప్పుకొని మీ సలహాపాటిస్తానని మాటయిచ్చినాను. రైల్వే సామాను విడిపించి తెచ్చి స్టూడియోలో పెట్టించినాను. మా అన్నయ్య నా వెంటవుండి ప్రతి విషయాన్ని పరిశీలించి సలహా యిచ్చినాడు.

## వరంగల్‌లో రవివర్మ స్టూడియో ప్రారంభం

పరిస్థితులు పరిసరాలు మార్పునాలో ఒక విధమైన ఉత్సాహం మరియు భయము చోటుచేసుకున్నవి. నేను ఏ పనిచేసినా పూర్వాపరాలు సరిగా ఆలోచించి చేయటం అలవర్చుకున్నందున భయమున కన్న ఉత్సాహమే ఎక్కువగా వుండినది. సామాను తెచ్చి స్టూడియోలో పెట్టినాను. కానీ దానిని స్టూడియోగా మార్చటం అందుకు అవసరమైన పరికరాలు అమర్చుకోవటం ముఖ్యం. మొదట ఇంటికి సున్నంవేయించి ఒక వడ్రంగి పని వచ్చిన అబ్బాయిని మాట్లాడినాను. అతనిపేరు సత్యం. ఇతను మొదట పనిలో కాస్త తికమక పడినా నన్ను అర్థం చేసుకుని నాకు అవసరమగు రీతిగా చెప్పిన వానిని చెప్పినట్లుగా తయారుచేసినాడు. డార్క్‌రూం, అందుండవలసిన పరికరాలు, ఫోటోలు తీయుటకు హాలు అందు టేబుల్‌ఫర్నీచర్ వగైరాలు అనుకున్నట్లుగా చేసి యిచ్చినాడు.

నేను కుటుంబాన్ని వెంట తీసుకురాలేదు. భోజనము సమస్య అయినది. గుండేటి చిననారాయణ ఇంటిలో కొన్నాళ్లపాటు చేస్తాననుకున్నాను. కానీ వీలుపడలేదు. పెదనారాయణగారి ఇంటిలోనే భోజనమునకు మాట్లాడుకున్నాను. నారాయణ గారు మరణించిన పిదప వారి కుటుంబం ఆర్థికంగా దెబ్బతిని సంపాదించే వారులేక అవస్థపడుచున్నారు. నేను బరువు కాకూడదను ఉద్దేశంతో వారికి తగిన ప్రతిఫలమిస్తానని వప్పించాను. మా

అన్నయ్య నేను వారింట్లో భోజనం చేసి స్టూడియోలో నిద్రించెడివారము. దినమంత స్టూడియోలో ఏర్పాట్లు చేయుటలోనే గడిచిపోయేది. నా ఉద్దేశం ప్రకారంగా స్టూడియో ఆకర్షణీయంగా మరియు పెద్దగా వుండాలి. ఇతర స్టూడియోలన్నిటికన్నా మిన్నగా వుండాలి. అందుకొరకే స్టూడియో కొరకు పెద్దయిల్లు తీసుకోవడమైనది. వరంగల్‌లో అదివరకున్న స్టూడియోలన్నీ ఒక గదివరకు పరిమితమై వున్నవి. నేనట్లుగాక ఆఫీసు గది, డార్క్‌రూం, ఫోటోలు దిగుటకు సరియైన హాలు ఇతర సౌకర్యములుండునట్లు అమర్చుకోవాలని పట్టుదలతో ఏర్పాటుచేసినాను. ఈ ఏర్పాట్లను చూచేవారు స్టూడియోకు ఇంతపెద్దగా అలంకరణా అని ఆశ్చర్యపోయేవారు. ఎందుకనగా ఇటువంటి ఏర్పాట్లు చేసినవి లేవు. అట్లే బయటపెట్టుటకు సైనుబోర్డు సిద్ధం చేయించి నాకు నచ్చినవిధంగా కళాత్మకంగా వుండేట్లు పేరు వ్రాయించినాను. ''రవివర్మ ఫోటో స్టూడియో'' అనునది పేరు. ఇది నా రెండవకుమారుని పేరు. అతని పేరుతోనే స్టూడియో ఏర్పాటు అయినది. అప్పట్లో వరంగల్‌లో వున్న స్టూడియోలు మొత్తం ఎనిమిది. అవి హరిబ్రదర్స్ వారివి మూడు స్టూడియోలు, విజయ స్టూడియో కె. లక్ష్మణ్‌ది, ప్రతాప్ స్టూడియో, అజంతా స్టూడియో ఇంకా హన్మకొండలో కొన్ని యుండెడివి. వీరందరిలో లక్ష్మణ్ కొంత పనిలో మెరుగు. మారుచున్న కాలానుగుణ్యమైన మార్పులను పెద్దగా పట్టించుకునెడివారు కాదు. ప్రయత్నించెడివారుకారు. ఇదినేను వరంగల్ వచ్చే వరకు వరంగల్ ఫోటో స్టూడియోల పరిస్థితి.

నేను **1-6-56.** వరకు అన్ని ఏర్పాట్లు పూర్తిచేసిన పిదప నాకు తెలిసిన కొంత మందిని మాత్రమే ఆహ్వానించి ప్రారంభంచేసినాను. పెద్దగా ఏర్పాట్లు చేయలేదు. వచ్చిన అతిధులలో మా స్టూడియో ముందు దుకాణము దారుని విఠల్‌రావుగారిని ఒక స్నాపు తీసినాను. దానితో ప్రారంభమైనది. ఇంకా రెండుమూడు స్నాపులు తీసినాను. వానిని రాత్రి డెవలప్ చేసినపుడు అవి కరిగిపోయినవి. వట్టి ఫిల్ము మాత్రమే మిగిలినది. నాకు చెమటలు పట్టినవి. కారణం అర్థం కాలేదు. కెమికల్స్‌లో ఏ లోపం లేదు. అన్ని సక్రమంగా కలిపినాను. అగుచో ఎందుకైనట్లు? ఇంటికి చున్నం వేయించుట మరియు జూన్ నెల విపరీతమైన ఎండ కారణంగా జరిగినట్లు మరుసటిరోజు వరకు తట్టినది. తగు జాగ్రత్త వహించి చేసినపుడు ఫలితం కన్పించింది. చున్నం వేడి మరియు ఎండవేడి కాస్త తగ్గుముఖం పట్టి పిదప ఇబ్బంది కాలేదు. తగిన వాతావరణం

కల్పించుటకు ఫాన్‌లు ఉపయోగించి చల్లబరుచుట చేసినాను. ఇది ఒక అనుభవమైనది. నాతో వచ్చిన మా అన్నయ్య ఇచ్చటనే వుండిపోయినాడు. స్టూడియో ప్రారంభించిన పిదప సోలాపురం కబురుపెట్టినాను. నా కబురు కొరకు ఎదురుచూస్తున్న శ్రీమతి ముగ్గురు పిల్లలను మా అమ్మను, తన తలితండ్రులను తీసుకుని వచ్చినది. నాకెంతో బరువు తీరినట్లు అనిపించినది. స్టూడియోలోనే ఒక గది ప్రత్యేకించి వుంచినాను. దానిలో వంట ఏర్పాటు చేసినాము. మూడు రోజులున్న పిదప మా అన్నయ్య, అత్తమామలు సోలాపురం వెళ్లిపోయినారు.

స్టూడియో ఏర్పాటుచేయుచున్న సందర్భంలో గుండేటి నారాయణ వచ్చి నన్ను ఎదుటి ఇంటిలోకి తీసుకువెళ్లినాడు. నన్ను పరిచయం చేసిన పిదప నీవు అనవసరంగా అంత పెద్దఇల్లు తీసుకున్నావు. ఇక్కడ స్టూడియోలు పెద్దగా నడువవు. నీవు ఇంకో చిన్నగదిలో ఏర్పాటుచేసుకో నేను మాట్లాడిపెడతాను. నన్ను ప్రతివాళ్లు తక్కువ అంచనావేయుచున్నారని బాధ అనిపించినది. అయినా తొణకకుండా నా దృష్టిలో ఇది చిన్నది. ఇంకా కొన్నాళ్లు పోయినంక దీనికన్న పెద్దఇల్లు తీసుకొని స్టూడియో నడుపాలని వుంది,. నేను లక్ష్మినారాయణగారికి ఒక సంవత్సరం అద్దె అడ్వాన్సుగా యిచ్చినాను. ఈ సంవత్సరం మొత్తం చూస్తాను. పని నడవకపోయినా ఇబ్బంది పడను. ఎందుకనగా సంవత్సర ఖర్చులకు సరిపడు డబ్బు నావద్ద వుందని చెపినపుడు నీ ఇష్టం అని ఒకవిధమైన అయిష్టంతో మాట్లాడినారు. నేను పెద్దగా పట్టించుకోలెదు. స్టూడియో ముందుగా మా నాన్నగారి పేయింటింగ్ కనిపించేటట్లు పెట్టినాను. గ్రాహకులు మొదట దానిని దాటి లోనికి రావాలి. అగుచో ప్రతివ్యక్తి ఆ పేయింటింగ్ చూచి కాసేపు నిలిచి పరిశీలించి అడిగెడివాడు. ఇది ఎవరి బొమ్మయని నేను అది మా నాన్నగారిది. దానిని పేయింటింగ్ చేసినది నేనేనని చెప్పెడివాడిని. పైన చెప్పిన విఠల్‌రావుగారు ప్రారంభం నాడు స్టూడియోకి వచ్చి ఏర్పాట్లుచూచి మా నాన్నగారి పేయింటింగ్ చూచి చకితుడయ్యాడు. మొదట ఎవరితోనో పేయింటింగ్ చేయించి తెచ్చినావనుకున్నాడట. కానీ ఇంకా కొన్ని నేను వచ్చేపుడు సోలాపురం నుండి తెచ్చినవి పేయింటింగ్ చేస్తున్నవి చూచి అపుడు నమ్మక తప్పలేదు. తుదకు అతనే అన్నాడు నీవు వరంగల్‌లో విజయం పొందుతావన్నాడు. అట్లు సందేహించి నిజం తెల్చుకున్న వారిలో ఇల్లు అద్దెకిచ్చిన లక్ష్మినారాయణ, ఫోటోగ్రాఫర్ లక్ష్మణ్. మొదట లక్ష్మణ్ దానిని చూచి ఇది చేయటం పెద్దకష్టమేమి కాదు.

ఎన్‌లార్జ్ ద్వారా సులభంగా చేయవచ్చునన్నాడు. వారి తండ్రిగారి ఫోటోతో ప్రయత్నించాడు. కానీ పెయింటింగ్‌కు ఫోటో ఎన్‌లార్జ్‌కు గల తేడా తెలిసివచ్చినది. తరువాత తన ఆలోచన తప్పు అనుభావం వెలిబుచ్చినాడు. ఇక్కడి ఫోటోగ్రాఫర్‌లలో నన్ను ఎక్కువగా అంటిపెట్టుకొనియున్న వ్యక్తి వరదరాజులుగారు.

## వరదరాజులు - జయ స్టూడియో

వరదరాజులు స్టూడియో ఏర్పాటు చేయలేదు. కానీ బయటకు వెళ్లి ఫోటోలు తీసి తన గదియందే ప్రింట్లువేసి యిచ్చెడివాడు. ఇతను గుంటూరు నుండి వచ్చి ఇచట స్థిరపడినాడు. నాడు ఆంధ్రనుండి తెలంగాణాకు చాలామంది ఉద్యోగాలకు వ్యవసాయ భూములు ఖరీదుచేసి స్థిరపడినారు. వారు చాలామంది గలరు. అట్టివారిలో ఇతనొకడు. శాంతస్వభావి, స్నేహశీలి. వాస్తవికతను గుర్తించటములో అహంభావం ప్రదర్శించక పోయెడివాడు. మితభాషి. అవసరమున్న మేరకే మాట్లాడువాడు. ఇతని మంచితనము పనితనమును గుర్తించి గ్రూపు ఫోటోలకు పిలిపించుకొనెడివారు. ఎవరు పిలిచినా వెళ్లి ఫోటోలుతీసి తెచ్చెడివాడు. ఇతని ద్వారా నాకు వరంగల్ పట్టణ పరిస్థితులు మరియు ఫోటోగ్రఫీ అట్లే ఫోటోగ్రాఫర్లు, వారి శైలి, నడవడి మున్నగు అంశములు తెలిసివచ్చినవి. ఇతనితో మైత్రి పెంచుకున్నాను. నా స్టూడియోకు వారందరువచ్చి చూచివెళ్లెడివారు. నా ఫోటోలలో ఏమీ లోటుపాట్లున్నవో వెదకే యత్నం చేసేవారు. నేను ఫిల్మును రిటచ్‌చేసి ప్రింట్లు తీసేడివాడిని. ఇది వారికి చేతకాదు. మొదట అర్థం కాకపోయినా తర్వాత తెలుసుకుని ప్రాకృతమైన దానిని మార్చి ఫోటోలు యిస్తున్నాడని అవి వాస్తవమునకు విరుద్ధమని మేమట్లుకాక ఉన్నదునట్లుగా తీసియిస్తామని తమదే సరియైనదని ప్రచారం ప్రారంభించినారు. ప్రతివ్యక్తి తను దిగిన ఫోటో మంచిగా కన్పించవలెనని కోరుకుంటాడు. నేను గ్రాహకుల అభిరుచిని దృష్టియందుంచుకొని పనిచేసెడివాడిని. మెల్లమెల్లగా వ్యాపారాభివృద్ధి చెందినది. గ్రాహకుల సంఖ్య దినదినాభివృద్ధి చెందుచువచ్చినది.

నేను ఇక్కడికి కుటుంబమును పిలిపించిన పిదప పిల్లల చదువు విషయమై కొంత సమస్య ఏర్పడినది. పెద్దకుమారుడు మరాఠీ నాల్గవ తరగతి పాసైనాడు. అందువలన పెద్దవాని చదువు మళ్లీ బాలశిక్షతో ప్రారంభం కావలసి వచ్చినది.

అట్లుగాక కొన్నాళ్లు తెలుగు ప్రైవేటుగా నేర్పించిన మాతృభాష తెలుగు అగుటచే తొందరలోనే నేర్చుకొనుటకు అవకాశముంటుందని ప్రైవేటుగా తెలుగు నేర్పించుటకు ఏర్పాట్లుచేసి చిన్నవాడిని ఒక ప్రైవేటు బడిలో చేర్పించినాను. అపుడు నా పెద్దకూతురు 5 నెలల అమ్మాయి. కావున ఆమె చదువు అవసరం ఏర్పడలేదు. మేము స్టూడియో యందలి ఒక రూములో వంటచేసుకొని రాత్రి ఫోటోలుదించే హాలులో నిద్రించెడివారము. ఇరుకుగా వున్న ఇండ్లలో గడుపుటలో అలవాటు వుండుటచేత పెద్దగా ఇబ్బంది అన్పించలేదు. కానీ ఎవరేని బంధువులు వచ్చినా యిబ్బంది పడక తప్పలేదు.

## ప్రతిభకు అవకాశం

నేను వరంగల్ వచ్చిన కొన్నాళ్లకు మంచి అవకాశము నా ప్రతిభ ప్రదర్శించుటకు అవకాశమేర్పడినది. అప్పట్లో వరంగల్ నందలి అనంతలక్ష్మి ఆయుర్వేద కళాశాల యందలి (బాలికల) నూతన భవన సముదాయము ప్రారంభోత్సవమునకు కేంద్రమంత్రి గారు వరంగల్ విచ్చేసినారు. నాకు పడిశాల వీరభద్రయ్యగారు కొంత అడ్వాన్సు డబ్బు పంపించి ఆ ప్రారంభోత్సవమునకు ఆహ్వానించినాడు. నాకు ఇచట వ్యక్తులందరు క్రొత్త. ఎవరెవరు ఏ పార్టీవారో వారి ప్రత్యేకతలెట్టివో తెలియదు. పడిశాల వీరభద్రయ్యగారు కాంగ్రెసువారని తెలిసినది. నేను సకాలమునకు చేరుకున్నాను. నేను వెళ్లుసరికి హరిబ్రదర్స్ ముగ్గురు, లక్ష్మణ్ మరియు ఇంకొక ఇద్దరు వచ్చినట్లున్నది. ప్రారంభోత్సవమునకు పట్టణమందలి ప్రముఖులందరు వచ్చినట్లున్నది. చాలా హడావిడిగా వున్నది, నేను సందర్భానుసారంగా స్నాపుతీయుటకు యత్నించాను. ఇది వారెవరు ఊహించని పని. నేనింత తొందరగా స్నాపు తీస్తానని ఊహించివుండరు. హైస్కూలు శంఖుస్థాపన సమయమునందు ఇంతే జరిగినది. రాజశేఖరము నన్ను పరిశీలిస్తూ వస్తున్నారు. అతని ఇషారాపైమంత్రి గారికి దగ్గరగా వున్నప్పుడు ఒకటిరెండు స్నాపులు తీసినాను. సాయంకాలం హన్మకొండలో రోటరీక్లబ్‌వారు ఏర్పాటుచేసిన సమావేశమునకు నన్ను ఆహ్వానించినారు. అచటికి గూడవెళ్లి ఫోటోతీసి తెచ్చినాను. మరుసటిదినం ఫిల్ములను డెవలప్‌చేసి ప్రింట్లువేసి యిచ్చినాను. అన్నికూడా బాగావచ్చినవి. చూచిన వారందరు బాగున్నవని సంతసించినారు. నన్నొక వ్యక్తి నెగెటివ్ ఇవ్వమన్నాడు. నేను ఇవ్వనన్నాను. నీవు కొన్నాళ్లుండి వెళ్లిపోతావు. మాకు మళ్లీ

ఈ ఫోటో అవసరమేర్పడితే యిబ్బందికదా అని అన్నారు. అపుడు నేను ఈ జిల్లావాడిని. ఇక్కడ వుండుటకే వచ్చియున్నాను. కానీ మీరు కర్నాటకనుండి వచ్చినారు కదా. మీరే వెళ్లిపోయెడివారు. మీరెప్పుడు కావాలని కోరినా ఈ నెగెటివ్ ప్రింట్లు వేసియివ్వగలనని చెప్పినాను.

ఆకారపు నర్సింగమువాళ్లు పెద్దశ్రీమంతులు. వాళ్లవి వరంగల్‌లో కాక యితర పట్టణాలలో బ్రాంచీలున్నవి. రాజశేఖరంగారు వచ్చి ఫోటోలన్ని చూచి సంతోషించినారు. దాదాపు అన్నింటి కాపీలు తీసుకున్నాడు. తరువాత నన్ను వాళ్లయింటికి ఫోటోలు తీయుటకు ఆహ్వానించినాడు. మొదట వెళ్లగూడదనుకున్నాను. కానీ వెళ్లినాను. నాపై మరియు నా పనిపై అభిమానము కనబరుస్తున్న వారింటికి వెళ్లాలని వెళ్లినాను. అచట వారి కుటుంబ సభ్యుల ఫోటోలు నాకిష్టము వచ్చిన ఫోజులలో తీసినాను. వారు నా అభిప్రాయాన్ని మన్నించి ఫోజులిచ్చినారు. అట ఒక విశేషము జరిగినది. నేను తీసిన ఫోటోలను మరియు వేరేవాళ్లు తీసిన ఫోటోలను పరిశీలనా, తులనాత్మక దృష్టితో చూచి తమ గుమాస్తాలకు ఇచ్చి ఈ రెంటింటియందేది శ్రేష్టమైనవో తెలుపుమని కోరినాడు. అయితే వారందరు ముక్తకంఠంగ నాచే తీయబడిన ఫోటోలు బాగున్నాయని చెప్పినారట. అపుడు వేరేవాళ్లు బిల్లు యివ్వమని వచ్చినపుడు వారు తీసిన ఫోటోలు బాగారాలేదని బిల్లు తగ్గించినారట. అంతకుపూర్వం వేరేవాళ్లతో తీయించెడివారు. నేను వచ్చిన పిదప వారిచేత ఫోటొలు దిగుట తగ్గించి నాకు యివ్వడమైనది. అందువలననే తమ ఇంటికి పిలిపించుకొని నాచే యివ్వబడిన బిల్లులో ఒకరూపాయి తగ్గించకుండా ఇచ్చినారు. ఆ పిదప వైశ్య మహాసభ జరిగినది. దానియందు ఫోటొలు తీయుటకు నన్నే ఆహ్వానించినారు. మూడురోజులు జరిగిన సమావేశమునందు నేను చాలా ఫోటోలు తీసినాను. అవియన్ని మంచిగా వున్నవని ప్రశంసించినారు. మిగతా ఫోటోగ్రాఫర్స్ తమ లోపమేమో గుర్తించి సరిచేసుకొనుటకు బదులు నాపై కక్ష పెంచుకున్నారు. నా కారణం వలన వారి వ్యాపారము దెబ్బతినుచున్నదని నష్టాలు చవిచూడవలసి వస్తున్నదని దుష్ప్రచారం ప్రారంభించినారు. వారెంతగా రెచ్చిపోయి ప్రచారము చేసిన అది నా పనిని పెంచినదే కానీ తగ్గలేదు. పైగా వ్యాపారస్తులందరు నా పనిపై తృప్తిపడి తమతమ ఆర్డర్లు నాకు ఇవ్వటం ప్రారంభించినారు. రాజశేఖరంగారు అప్పుడప్పుడు స్వయంగా స్టూడియోకు వచ్చి అందుగల ఫోటొలను పేయింటింగ్‌లను చూస్తు నాతో కొంతతడవ గడిపివెళ్లెడివారు. వ్యాపారములో

ప్రముఖవ్యక్తి నాపనిని మెచ్చుకొని ప్రశంసించుటచే అది నాకొక వరమైంది. ఇది ఇతర ఫోటో గ్రాఫర్‌లకు సహించరానిదై నన్ను వరంగల్ నుండి తరిమివేయాలని ప్రయత్నాలు చేసినారు. తిట్లు నా పాలిట దీవెనలుగా పరిణమించినవి.

## బావగారు - బరువు బాధ్యతలు

స్టూడియోలో పని పెరిగిన పిదప ఇతర పనివారిని పెట్టుకుని సకాలమునకు ఫోటోలు అందించుట చేసెడివాడిని. చెప్పిన సమయము ఖచ్చితంగా పాటించెడివాడిని. రిజల్టు మంచిగా వచ్చేవరకు ప్రింట్లుతీయించి నాకు నచ్చిన పిదప ప్రింట్లను స్థిరపరిచెడివాడిని. ఈ మధ్య మా చిన బావగారు తమ స్వగ్రామమయిన వెలిదండ నుండి ఒకసారి వచ్చినారు. వారికి మొదటినుండి వైద్యం చేయడం వృత్తిగా వుండెడిది. ఈయనగారు కూడ చిన్ననాటి నుండి వైద్యం నేర్చుకుని చేస్తువుండెడివారు. తమ స్వగ్రామమందు సరిగా నడవని కారణంగా యిబ్బంది పడుచున్నట్లు తెలిపినారు. అప్పటికి ఆయనగారికి నలుగురు ఆడపిల్లలు. అతని పరిస్థితి విన్న పిదప వారికి తోడ్పడాలనియను భావంతో నా వద్దకువచ్చి పనినేర్చుకొని బాగుపడవచ్చునని సలహా యిచ్చినాను. వెంటనే బావగారు తను వైద్యం చేయుచున్న నాందెడ్ దగ్గరి గ్రామమునకు వెళ్లి తన సామాను సర్దుకుని తన గ్రామం చేరుకుని మొదట మా చెల్లెలిని పిల్లలను తన ఇంటియందుంచి ఒక్కడే ఇక్కడికి వచ్చినారు. నేను నెమ్మదిగా పనులు పురమాయించి పరిశీలించెడివాడిని. మొదట శ్రద్ధగనబరచినా ఆ వెంటనే మరచినట్లు వ్యవహరించెడివారు. స్వతంత్రముగా వ్యవహరించిన వ్యక్తి అయినందున ఆయన ఆత్మాభిమానం దెబ్బతినకుండా వుండేవిధంగా వ్యవహరించెడివాడిని. నెమ్మదిగా బరువుబాధ్యతలు అప్పగించి లెక్కడొక్కా అతనికే అప్పగించినాను. ఆయన వచ్చిన తరువాత మూడు నెలలకు మా చెల్లెలిని వారి పిల్లలను పిలిపించినాను. అయితే ప్రస్తుతము స్టూడియోలోనే వుంటిమి. కానీ మా చెల్లెమ్మ పిల్లలతో వచ్చినంక ఇంతమంది వుండుటకు వీలుపడదని వేరేచోట వుండుటకై ఒకే దగ్గర వుండేటట్లుగా వారికి మాకు అద్దెగదులు తీసుకున్నాను. ఇప్పుడు మేము ఐదుగురము. మా బావవాళ్లు ఆరుగురు. స్టూడియో అద్దె అట్లెవుండుటకై తీసుకొనిన ఇండ్లఅద్దెలు, ఖర్చులు పెరిగినవి. వ్యాపారం పెరిగినా ప్రారంభదశ కనుక స్టూడియోకు ఎన్నో అవసరమగు వస్తుసేకరణ చేయాల్సివచ్చెడిది. మా బావగారు వచ్చినప్పటి పరిస్థితిలో

మూర్పువచ్చినది. పనిలో శ్రద్ధ తగ్గించి పనిపిల్లలపై ఆధారపడటం ప్రారంభించినారు. తను డార్కురూంలో ప్రింట్లు తీయునపుడు చిన్న పేపరుపై ప్రింట్లుతీసి నాకు చూపించి అవసరమైన సైజులో ప్రింట్లువేయాల్సి వుంటుంది. కానీ తాను అట్లుకాక ప్రూఫులు చూపించక అవసరమైన సైజులో ప్రింట్లు ఎత్తుట ప్రారంభించినారు. దీనివలన కొన్ని అండర్ లేదా ఓవర్ కావటం సంభవించెడిది. చిన్నవాటిపై ప్రూఫులుతీసిన పేపర్ వేస్టు ఎక్కువగా వుండదు. అట్లుగాక ఏకంగా అవసర సైజులలో ప్రింట్లు తీసినపుడు అవి చెడిపోయిన వాటిని మూలకుపడవేసి మళ్లీమళ్లీ తీసెడివారు. దీనివలన సమయము మరియు పేపరు వృధా అయ్యేడిది. నాకు చూపకుండా తనే మంచిగా చేసి యివ్వాలని యోచించేవారు. ఆయనగారి అనుభవము ఏపాటిది? కానీ అట్టి విషయం ఆలోచించకపోయెడివారు. పైగా ఆయనగారికి వ్యక్తిగతంగా కొన్ని ఖర్చులు వుండెడివి. వాటిని భరించుట తప్పనిసరి అయినది.

ఆయనగారు ఎప్పుడు అంత బరువు భాధ్యతలు తనపైయున్నట్లు అవి పెనుభారంగా పరిణమించినట్లు అనుభూతిపొందెడివారు. నా ముందు చెప్పలేకపోయినా ముఖకవళికలను బట్టి నేను అంచనా వేసెడివాడిని. ఇంటివద్ద మా చెల్లెలితో స్టూడియో మొత్తం తానే నడుపుచున్నట్లు, బాగా ఆదాయం వస్తున్నట్లు అందుకు తానే కారణమైనట్లు బాగా సంపాదించి పెడుతున్నట్లు చెప్పేవారట. విషయం తెలువని మా చెల్లి ఆయన మాటలను విశ్వసించెడిది. ఏదేని మాటవరుసలో అటువంటి భావం ప్రకటించెడిది. బావగారు ఇక్కడ వున్నప్పుడు ఒకటిరెండు తడవలు తమ స్వగ్రామంవెళ్లి వచ్చినారు. ఒక తడవ వీరి బాబాయి వచ్చినపుడు గ్రామములో మా బావగారుపెట్టిన ఖర్చులు వివరించి ఎంతడబ్బు ఇచ్చిపంపినావని ప్రశ్నించినాడు. నేను పరిస్థితిని అర్థం చేసుకుని బయటపడలేదు. ఏదో సమాధానం చెప్పి మాట్లాడనివ్వలేదు. ఎందుకంటే ఆయనగారు చిన్ననాటినుండి నన్ను బాగా అభిమానించే వ్యక్తి. నా అభివృద్ధిని ఆకాంక్షించి నాకు ఎన్నో విషయాలలలో తోడ్పడ్డాడు. ఆయనగారికి అనుమానం రాకుండా మాట్లాడినాను. ఆయనగారు వెళ్లిన పిదప నేను పరిస్థితిని పర్యావలోకనం చేసినాను. లెక్కలన్నీ మా బావగారు వ్రాసేవారు. సాయంకాలం యింటికి వెళ్లునప్పుడు ఇంతమొత్తం వచ్చినదని యిచ్చెడివారు. అంతేకానీ నేను తరిచి పరిశీలించకపోయెడివాడిని. అందువలన ఈ అవకాశమును దుర్వినియోగపరచినారు. అందు ఆయన సంపాదించుకున్నది లేదు కానీ

స్వేచ్ఛగా ఖర్చులుపెట్టుకోవటం ప్రారంభించినారు. పరిస్థితి విషమిస్తున్నట్లుగా దోచినది. అప్పటికి వారిని పిలిపించి ఒక సంవత్సరమైపోయినది. ఈ సంవత్సరంలో ఆయనగారు పని నేర్చుకొనుట లేకపోగా ప్రతీది తనే చేస్తున్నట్లు తనులేని తీరుకు స్టూడియో నడువదను భావం మా చెల్లితో చెప్పెడివారట. వీనినన్నింటిని పరిశీలించి ఒక మంచి కెమెరా ఫోటో సామానులు కొని ఇచ్చి నీవు మంచి పనిమంతుడవైనావు కదా వెళ్లి మీ వూరిలో లేదా ఏదేని మంచి సెంటర్ చూచుకొని స్టూడియో నడుపుకొనుమని కొంతడబ్బు యిచ్చి మా చెల్లిని పిల్లలనిచ్చి పంపించినాను. కెమెరా తీసుకొని వెళ్లి అక్కడ గ్రామాలలో ఫోటోలుతీసే ప్రయత్నాలు చేసినారట. కానీ ఏ ఫోటో సరిగారాక ప్రింట్లు సరిగాలేక వృధా అయినవి. ఆయనగారు ఫోటోగ్రఫీ పని అంతనేర్చుకొని స్టూడియో తనే నడుపుచున్నానని చెప్పిన మాటలన్నీ అసత్యాలని తేలిపోయినవి. తర్వాత మళ్లీ వైద్యవృత్తి ప్రారంభించి గడుపుచున్నాడని తెలియవచ్చినది. మా చెల్లెలు అదువరలో నాపై తమను అనవసరముగా పంపించిచేయుచున్నామను భావన సరియైనది కాదని తెలుసుకున్నది. దీనితొ నా మనస్సు కుదుటపడినది.

వరంగల్‌లో లక్ష్మణ్ విజయా స్టూడియో పేరిట నడిపెడివాడు. నేను ఇచటికి రాకపూర్వము చెప్పుకోదగిన పనిమంతుడు. అప్పుడప్పుడు స్టూడియోకు వచ్చి పరిశీలిస్తుండెడివాడు. ఆయన విజయవాడ మద్రాసు మున్నగు ప్రాంతాలు తిరిగి ఫోటోగ్రఫీలో కొంత అనుభవము సంపాదించుకున్న వ్యక్తి. ఇంటియందు మా అమ్మ వ్యాపారమునందు నేను ఎదుర్కొనుచున్న విషయాలు విని మనము ఇక్కడ వుండి ఇటువంటి ఇబ్బందులెందుకు ఎదురుకోవాలి. తిరిగి సోలాపురం వెళ్లిపోదాము. మన బలగమంతా అక్కడనే వుంది. మన స్టూడియోకు అచట మంచిపేరు వుంది. నీకు అక్కడ పోటీవుండదు. అనునిత్యం పులినోట్లో తలపెట్టినట్లు ఎందుకు వ్యవహరించాలి. బ్రతుకుతెరువు లేక వచ్చినావా? స్థానికులు ఎంతోకాలము నుండి నివసించువారు. వారికి అన్ని హంగులు వుండును. ఏ సమయమెటువంటిదో చెప్పిరాదు. నా మాటవిని వెనక్కి తిరిగి వెళ్లిపోదామని పోరెడిది. నేను లెక్కించక నాకేమి భయము లేదు. మనం భయపడాల్సిన పనిలేదు. వ్యాపారమన్న పోటీ వుంటుంది. కొంతకాలంపోతే అవే సర్దుకుంటాయని సముదాయించెడివాడిని.

వరదరాజులుగారు స్టూడియో ఏర్పాటుచేయక ఒకగదియందు రాత్రిళ్ల పిల్మ్ డెవలప్ చేయుట ప్రింట్లుతీయుట చేసెడివాడు. ఆయన నాతో బాగా కలిసివుండెడివాడు. తన తీరికవేళలలో స్టూడియోకువచ్చి ఫోటోగ్రఫీయందలి మెళకువలు చూచెడివాడు. ఫోటోలు ఔట్‌డోర్‌వి మాత్రమే తీసెడివాడు. నేనతని పరిస్థితిని పరిశీలించి కుటుంబ భారము ఈ ఔట్‌డోర్‌లో వెళ్లదీయుట కష్టం నీవు చిన్నగా స్టూడియో ఏర్పాటుచేయమని సలహా ఇచ్చి నా చేతనైన సహాయం చేసినాను. ''జయ స్టూడియో'' అని నామకరణం చేసి ప్రారంభించినాడు. మెల్లిమెల్లిగా దానిని వృద్ధిచేయుచు కొన్నాళ్లవరకు అన్ని హంగులు ఏర్పరచుకున్నాడు. దీనిద్వారా అతని వ్యాపారాభివృద్ధి జరగటమే కాదు ఆర్థిక పరిస్థితి మెరుగుపడినది. అప్పటికే ఆయన బహుసంతానం కల్గిన వ్యక్తి. పిల్లలందరు చదివే వయస్సులో నున్నట్టివారు. సకాలమునకు తోడ్పాటు జరిగినది.

## బతుకమ్మ, దసరా, దీపావళి పండుగలు

నేను వచ్చిన క్రొత్తలో బతుకమ్మ పండగ, దసరా, దీపావళి వరంగల్‌లో చేసుకొనుట సంభవించినది. నేనంతకు పూర్వం బుద్ధి ఎరిగిన నుండి సోలాపురంలో చేసుకొనెడివారము. మహారాష్ట్రలో బతుకమ్మ పండుగ వుండదు. కానీ దేవీ నవరాత్రులని చేసెడివారు. దసరా, దీపావళి మాత్రం ఘనంగా జరుపుకొనుట వుండెడిది. అయితే తెలంగాణాలో బతుకమ్మ పండగ విశేషంగా జరుపుకుంటారు. నా చిన్నతనంలో మా ఊరియందు ఎంతో ఇదిగా జరిపెడివారము. భాద్రపద శుద్ధ పౌర్ణమి నుండి ''బొడ్డెమ్మల పున్నమని'' 9 రోజులు బాలికలు ఆడుకునెడివారు. భాద్రపద బహుళ అమావాస్య నుండి ''బతుకమ్మ పండగ'' యని ఆశ్వీజ శుద్ధ అష్టమి వరకు ఆడుకొనుట ఆచారము. బోడ్డెమ్మల పున్నం పూర్తిగా పెళ్లిగాని బాలికల ఆట అయితే బతుకమ్మ పండగ మా త్రం హిందుస్త్రీలకు గొప్ప పండగ. ఈ పండగకు ఆడబిడ్డలు తప్పనిసరిగా తల్లిగారి ఇండ్లకు వెళ్ళుట జరుగుతుంది. ఈ తొమ్మిది రోజులు తమ గ్రామమందు స్నేహితురాండ్రతో తమ తల్లిదండ్రులతో అన్నదమ్ములతో సరదాగా గడిపి (క్రొత్తబట్టలు) పండగకు తమ తాహతు ననుసరించి తెచ్చిన క్రొత్తబట్టలు కట్టుకుని సంతోషంగా గడిపెడివారు. ఈ పండగ అష్టమినాడు సద్దులపండగ యని గొప్పగా గడుపుతారు. ఈ పండగకు అల్లుండ్లను

పిలిపించుకుని దసరా వరకు అనగా శుద్ధ దశమి వరకు వుంచుకొని పండుగ తర్వాత తమతమ కూతుళ్లను సాగనంపెడి ఆచారమున్నది. దీనినే వరంగల్ పట్టణంలో చాలా గొప్పగా చేస్తారు. బహుశా తెలంగాణా అంతటికి తలమానికంగా చేస్తారు. తంగేటి పువ్వు ముఖ్యంగా ఇతర పూవులతో బతుకమ్మను పేర్చి ఊరిబయటకు తీసుకువెళ్లి బతుకమ్మలందరిని ఒక చోటపెట్టి ఆ బతుకమ్మల చుట్టు వలయంగా తిరుగుతు పాటలు పాడుతారు. ఇది ముఖ్యంగా స్త్రీల పండగ. ఉన్నవారు వారివారి గొప్పతనాలు ప్రదర్శించుటకు బతుకమ్మలను పెద్దపెద్దగా పూలతో పేర్పించి బాగా శ్రీమంతులు నలుగురు మనుష్యులతో మోపించి ఆడుకొను స్థలములకు భాజభజంత్రీలతో తీసుకువస్తారు.

## సోలాపురంలో ఆస్తి విభజన

మా నాన్నగారి సంవత్సరీకమునకు సోలాపురము మా అమ్మను మాత్రమే వెంటతీసుకుని వెళ్లినాను. నేను కొన్నిరోజులు ముందుగా వెళ్లి అచట పరిస్థితులు ఆకళింపుచేసుకున్నాను. హనీఫ్‌కు స్టూడియో ఇచ్చి రావటం మావారికెవరికి ఇష్టం లేదు. వ్యాపారం మంచిగా సాగుతోంది. కష్టపడి పనిచేస్తున్నాడు. తన ఉద్యోగమునకు సెలవుపెట్టి 12 గంటలు స్టూడియోలో పనిచేస్తున్నాడు. మా బంధువు గుండేటి సదాశివుడు ఈ స్టూడియో తనకు ఇచ్చివెళుతాడని మొదట అనుకున్నాడు. ఆతనికి పనిరాదు. పైగా ఎంతసేపు స్వలాభాపేక్ష. నేను హనీఫ్‌కు ఇచ్చిరావటం ఆతనికి ఆశాభంగమయింది. నేను వరంగల్ వచ్చిన పిదప అతడు ప్రతిదినం స్టూడియోకువెళ్లి ఎలా నడుస్తుంది ఎంత ఆదాయం వస్తుందో ఆరా తీసేవాడట. హనీఫ్ ఏ విషయం దాయకుండా ఉన్నదిఉన్నట్లు చెప్పెడివాడు. సదాశివుడు మా ఇంటికివెళ్లి మా అన్నలతో ఒకటికిరెండు కలిపించి హనీఫ్‌పై దురుద్దేశం కల్పించినాడు. మొదటినుండి మావారికి ఇష్టం లేని పనిఅయినందున అతను ఆదాయం అంతామ్రింగి మనకు వట్టిచేతులు చూపుతాడని అతనినుండి స్టూడియో స్వాధీనం చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. నేను వెళ్లిన పిదప రెండురోజులు హనీఫ్ స్టూడియో ఆదాయ వ్యయములు, జరిగిన పని పైసాపైసా లెక్క స్పష్టంగా వ్రాసివుంచినది చూపించినాడు. నేను ఇచ్చివెళ్లిన అయిదు నెలలలో ఖర్చులుపోను 500/- మిగులు చూపి అట్టి డబ్బును నాకు అందించినాడు. నేను అతనికి అట్టి డబ్బు తిరిగియిచ్చి ఇది నీవు కష్టపడి సంపాదించినది. ఇది నీ స్వంతం వుంచుకోమన్నాను. కానీ అతడు నాకు మిల్లులో నెలకు 40/-

వేతనము ఆ లెక్క-చొప్పున 5 నెలలకు రెండువందలు యిప్పించండి. మిగతా మీరు తీసుకొండని కోరినాడు. అతని నిజాయితీకి, నిస్వార్థ కృషికి చాలా ఆశ్చర్యం వేసినది. నీవు శాశ్వతంగా ఈ స్టూడియోను వుంచుకో కానీ ''బిట్ల ఫోటో స్టూడియో'' పేరు మాత్రము వుంచుము. అది నాకు తృప్తినిస్తుందని తెలిపినాను. కానీ అతడు మీ అన్నలు, తమ్ముడు ఇష్టపడడము లేదు. మీరు వారిలో ఎవరికైనా అప్పగించి మనస్పర్థలు రాకుండా చూచుకొండని తన అభిప్రాయాన్ని వెలువరించాడు. ఆతని మంచితనం నన్ను ఇంకా ఆకట్టుకుంది. నేను స్పష్టంగా చెప్పి డబ్బు అతనికే ఇచ్చివేసినాను.

ఆ సాయంకాలం మా ఇంటిలో స్టూడియో విషయమై మా వారంతా కట్టకట్టుకుని స్టూడియో నుండి హనీఫ్‌ను తొలగించమని ముక్తకంఠంతొ పేచీకి దిగినారు. కానీ నేను ససేమిరా ఒప్పుకొనలేదు. మొదట మా అన్న కుమారుడు జనార్ధన్‌కు పని నేర్పుతానంటే ఫోటోగ్రఫీ వద్దని పంపలేదు. పైగా మావారెవరికి ఇట్టిపనిపై ఉత్సుకతలేదు. కానీ దానిపై వచ్చే ఆదాయం మాత్రం కావాలని అది ఎవరొ కులం కానివాడికి ఇచ్చి వాన్ని బాగుచేస్తావా? మన బంధువైన గుండేటి సదాశివునికి ఇవ్వమని పేచీపెట్టినారు. కానీ నేను స్పష్టంగా నిరాకరించినాను. మా తమ్ముడు మాట తూలి మాట్లాడినాడు. వాన్ని మిగతా అన్నలు సమర్థించారు. నాకు చాలా కష్టమనిపించింది. వీరికి స్వార్థముతప్ప పనిలోని సాధకబాధకాలు అర్థంకావు. వీరితో తగువు అనవసరమనుకొని వెళ్లి స్టూడియోలో రెండుమూడురోజులు గడిపినాను. రేపు మా నాన్నగారి సంవత్సరీకము అనగా మా అన్నయ్య స్టూడియోకు వచ్చి ఇంటికి రమ్మన్నాడు. నేను రానని సంవత్సరీకం మీరే చేసుకొండని నా మనసు గాయపడినదని తెల్పి నిరాకరించినాను. తర్వాత మిగతా ఇద్దరు అన్నలను, అక్కగారిని, బావగారిని వెంటబెట్టుకుని తీసుకువెళుతానని వచ్చినాడు. వారికి అదే సమాధానం చెప్పినాను. కానీ మా పెద్దన్నయ్య కంటతడిపెట్టుకొని బ్రతిమిలాడినాడు. మా బావగారు కూడా బాగుండదని, ఏడూరు తెల్లవారి వేరుపరచుటకు పంపకాలు చేస్తున్నామని రమ్మన్నారు. ఇక నాకు వెళ్లకతప్పలేదు. వెళ్లినా ముభావంగానే వున్నాను. వేరుపడుట కార్యక్రమములు ప్రశాంతంగా సాగిపోయింది. మరుసటిదినం పంపకాలుపెట్టినారు. ఆనాటివరకు వున్న ఆస్తి ప్రతిఒక్కరికి అయిదువన్నరవేలు వచ్చినవి. నా సంపాదనపోను ఇంకావారికి 800/- యివ్వతేల్చినారు. బోళ్లు ఇతర సామానులు అయిదు భాగాలు చేసినారు. నాకు

వచ్చిన ఇత్తడి, రాగి యితరముల నుండి నాకు అవసరమనిపించినవి వుంచుకొని మిగతా అన్ని వారందరికి పంచినాను. ఇంకా అవసరమైన పాత్రలను ఖరీదుచేసుకుని వరంగల్ వచ్చేటప్పుడు తెచ్చుకున్నాను. అక్కకు చెల్లికి మా అమ్మ తదనంతరము ఆమెపై వున్న బంగారం, వెండి యిచ్చేటట్లు తేల్చినారు. మా కోడండ్రకు ఒక్కొక్కరికి 5 తులాల బంగారం వున్నట్లు తేల్చినారు. స్టూడియో విషయం మావారెవరు కల్పించుకోవలదని చెప్పి వారిని శాశ్వతంగా హనీఫ్‌కు అప్పగించి వరంగల్ పయనమైనాను. తన కారణంగా అన్నదమ్ములలో బేదాభిప్రాయాలు కలిగినవని హనీఫ్ చాలా భాదపడ్డాడు. సోలాపురంలో నా వారందరిని వదలి శాశ్వతంగా వేరుపడి వస్తున్నందుకు నాకు కంటతడి వచ్చినది. వేరు అనునది ఎన్నాళ్లకైనా తప్పనిసరి అని సరిపుచ్చుకుని మనసు కుదుటపర్చుకున్నాను.

నేను సోలాపురం నుండి మా అమ్మను వెంటబెట్టుకుని వచ్చినాను. శాశ్వతంగా జీవితాంతం నా వద్దే వుండమని. ఇష్టమైనపుడు సోలాపురంవెళ్లి మిగతా వారిని చూచుకోవచ్చునని ఒప్పించి తీసుకువచ్చినాను. నావద్ద మా అమ్మకు చనువు ఎక్కువ. దాని మాట కాదనకపోవటం మరియు అవసరాలు గుర్తించి తగు ఏర్పాట్లుచేయడం ఆమెకు మాయందు అభిమాన కారణము. ఆమెకు వృద్ధాప్యంలో సేవచేయుట కర్తవ్యంగా భావించి వ్యవహరించినాము. మా అమ్మ మరణ పర్యంతం నావద్దనే గడిపినది. ఆమె మిగతా కుమారులను చూడదలచినా ఏదేని శుభకార్యం కలిగి సోలాపురం వెళ్లినా ఒకనెలలో తిరిగి వచ్చెడిది. ఆమె సంతృప్తిగా జీవించినది, మరణించినది. మొదట స్టూడియోలో నివాసంచిన మా బావగారువచ్చి వున్నప్పుడొక అద్దెయింటికి మారినాము. అచట ఇరుగుపొరుగు మరియు ఇంటివాండ్రు నచ్చక ఆ ఇల్లు ఖాళీచేసి వేరొకచోటికి మారినాము. ఈ ఇల్లు పూర్వపు దానికన్నా కొంతమెరుగు. స్వంతయిల్లు ఏర్పరచుకొనే వరకు యిబ్బందిగా వున్నప్పటికీ గడుపాలికదా.

జనవరి 1958 సంవత్సరమున వరంగల్‌లో ప్రదర్శన (ఎగ్జిబిషన్) ఏర్పాటుచేయబడినది. దానిలో ఫోటోగ్రాఫర్‌ల స్టాల్స్ కూడా పెట్టబడినవి. అయితే నా స్టాలు ప్రత్యేకంగా వుండాలని ఖర్చును లెక్కచేయకుండ ఆకర్షణీయంగా తయారుచేయించినాను. అప్పటికే రవివర్మ ఫోటోస్టూడియో పేరుపడినది. అదే పేరిట పెట్టటముతో గిరాకీ బాగుగా జరిగినది. దీనిలో ప్రత్యేకత ఏమనగా హనోగ్రాఫ్ మిషన్‌పై ఫోటోలు తీయుట. ఇది హరివాళ్లు అప్పటివరకే ఉపయోగిస్తున్నారు. నేను మిత్రుడగు టి. వి. రెడ్డిగారిని సంప్రదించి

అలాంటివే చేయించినాను. ఇంకా ప్రత్యేకత ఏమనగా ఫిల్మ 4 x 4 సెం. మీ,. లో తీయగలుగుట. పైగా ఫోటో మంచిగా వచ్చుట. నాకు ఫిల్మ తక్కువపట్టి ఫోటోలు ఎక్కువగా వచ్చెడివి. కానీ ఇతరులవి 4 x 6 సెం. మీ. అగుటవలన ఎక్స్పోజులకు ఫిల్మ ఎక్కువ లాగెడిది. ఇది వ్యాపార కిటుకు. నేను సాయంకాలం వరకు స్టూడియోలో పనిచూచుకుని ఎగ్జిబిషన్‌కు వెళ్లి అక్కడ పని చూచెడివాడిని. అచట తగినంత మంది పనివాళ్లను ఏర్పాటుచేసి ఫోటోలు మంచిగా వచ్చేట్లు చూచేవాడిని. వచ్చె గ్రాహకులు ఇతరులచే తీయబడిన ఫోటోలను అట్లే మాచే తీయబడిన ఫోటోలను పోల్చి చూచెడివారు. ఇక్కడ అందరికన్నా నావద్ద ఎక్కువమంది ఫోటోలు దిగేవారు. ఇది తోటివారికి కంటగింపు అయి నన్ను శారీరకంగా బాధించాలని ప్రయత్నాలు చేసినారు. కానీ నేనెవరిని లెక్కించలేదు. నా ప్రయత్న లోపంలేకుండా ప్రతి అంశాన్ని పరిశీలించి ఎదుర్కొన్నాను. వారు దుష్ప్రచారం ఎంతచేసినా అది నాకు ప్రచారమునకే ఉపయోగపడినది.

## స్టూడియో దినదినాభివృద్ధి

వ్యాపారము మూడుపువ్వులు ఆరుకాయలుగా దినదినాభివృద్ధి జరిగినది. పని పెరిగినది. స్టూడియోలో వర్కర్స్ సంఖ్యను పెంచాను. కానీ స్టూడియో చిన్నదైనది. ఇంతకన్న పెద్దయిల్లు మేయిన్‌రోడ్డులో దొరుకునేమో యను ప్రయత్నములు ప్రారంభించినాను. పైగా స్థలం చాలని పరిస్థితి. అక్కడ కుటుంబం కొరకు తీసుకున్న అద్దెయింటివారితో కూడా సమస్యలు ఏర్పడేటివి. యజమానురాలు ఎదుటివారి పచ్చను సహించెడిది కాదు. మాతో పాటు ఆ యింటిలో ఒక గుజరాతి కుటుంబం కూడా వుండెడిది. ఇరుకు అయినా ఎట్లో గడిపినా ఇంటివారి ఆగడాలు ఓర్వలేనితనం బాగా బాధించినది. అయితే స్టూడియో యిల్లు ఒకటేచోట వుండేట్లు చూడాలని ప్రయత్నంలో వున్నాను. ఇంతలో స్టూడియో ఎదురు ఇల్లు ఠాకూరుగారిది ఖాళీ అయినది. తెలిసివెళ్లి సంప్రదించాను. ఆయన మనస్పూర్తిగా ఆహ్వానించడమే కాక అద్దె నెలకు 75 రూపాయలు మాత్రమే ఇస్తానన్నాడు. అయితే బిల్డింగ్ రెండవ అంతస్తులో అది స్టూడియోకు మరియు కుటుంబం వుండుటకు సరిపోయేంత పెద్దది. అనువగు రీతిలో మార్పుచేసుకొని వుండవచ్చు. ది. 27-7-1958 నాటు నా రెండో కూతురు జన్మించినది. పేరు ''సరోజ'' యని పెట్టుకున్నాను.

ఠాకూర్‌గారి బిల్డింగ్‌లో అవసరమైన ఏర్పాట్లు చేయించినాను. దానిలో అన్ని వసతులు వున్నవి. పైగా ఇంటివారి పోరులేదు. వంటకు వుండటకు సరిపోవునట్లుగా పార్టీషన్ చేయించి నవంబర్ 1958లో స్టూడియోను క్రొత్తబిల్డింగ్‌లోనికి మార్చినాను. వెంటనే కుటుంబాన్ని కూడ తీసుకువచ్చి దీనిలో ప్రవేశపెట్టినాను. అప్పటికి నాకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. చిన్న కుమార్తె నాలుగునెలలు. నేను క్రొత్తబిల్డింగ్‌లోనికి స్టూడియో మార్పుచేయించుచున్న విషయం తెలుసుకుని లక్ష్మీనారాయణగారు అద్దె తగ్గిస్తానన్నారు. ఖాళీ చేయవద్దని ప్రయత్నం చేసినాడు. కానీ అతని ఇంటికంటే ఇది పెద్దది. నాకు కుటుంబాన్ని వేరే వుంచినచోట అద్దె చెల్లించాల్సిన అవసరం వుండదు. ఈ విషయాలు తెలిపి అతని ప్రయత్నం విరమింపచేసాను. దీనిలోనికి ప్రవేశించిన పిదప స్టూడియోను బాగా ఆకర్షనీయంగా వుండేట్లు చేసినాను. అవసరమైన అలమారాలు చేయించి వివిధ భంగిమలలో దిగిన ఫోటోలు ప్రదర్శింపచేసినాను. వచ్చే గ్రాహకులకు మొదట మా నాన్నగారి పేయింటింగ్, తర్వాత పెద్దగా ఎన్‌లార్జ్‌చేసిపెట్టిన మారెండో అమ్మాయి ఫోటో. అట్లే మిత్రులు పాములపర్తి సదాశివరావుగారి ఫోటో వుండేడివి. ఆ పిదప వివిధ భంగిమలలో దిగిన ఇతర గ్రాహకుల ఫోటోలు వరుసగా చూచి నా కౌంటర్ వద్దకు వచ్చేటట్లు చేసినాను. వచ్చిన గ్రాహకులు తామె భంగిమలో ఏ సైజు ఫోటో కావాలని నిర్ణయించుకొని నాతో తెల్పి ఫోటో దిగెడివారు. స్టూడియో ముందు రోడ్డుపై చూచేవారికి కన్పించేటట్లుగా ''రవివర్మ ఫోటో స్టూడియో'' బోర్డుపై నా రెండవ కుమారుడైన రవివర్మ ఫోటో వుండెడిది. అది చూపరులను బాగా ఆకర్షించెడిది. ఇచట సరిపోవునంత స్థలమున్నందున ఖర్చులకు వెనుకాడక చక్కగా అలకరించాను. ఈ బిల్డింగ్‌లోనికి మారిన పిదప వ్యాపారము బాగా వృద్ధిచెందినది. ఆదాయము పెరిగినది. తగినంత మంది వర్కర్స్‌ను ఏర్పరచి ఎవరే పని చేయాలో నిర్దేశించి వానినన్నింటిని పర్యవేక్షించెడివాడిని. ప్రతి ప్రింటునకు నాకు చూపిప పిదప నిర్ణయించి కోరిన కాపీలు తీయించే ఏర్పాటుచేసినాను. ఎక్స్‌పోజులు దాదాపు నేను స్వయంగా తీసెడివాడిని. వారు కోరిన సైజులో నాకు నచ్చిన పోజు పెట్టించి లైటింగ్ మంచిగావుండేటట్లు చూచుకొని ఫోటోలు తీసెడివాడిని.

# స్వంత ఇల్లు

పనిపెరిగిన పిదప దానికనుగుణ్యమైన ఏర్పాట్లు స్టూడియోలో చేసేవరకు ఇది కూడా ఇరుకుగానే కనిపించినది. స్టూడియో అలంకరణకు ఎన్ని ఏర్పాట్లు చేసినప్పటికీ ఇంకా చేయాలని భావన కలిగెడిది. ఇప్పుడు ఆదాయము ఏర్పడి చేతిలో కొంతడబ్బు ప్రోగుఅయినది. ఠాకూర్‌గారి బిల్డింగ్‌లోకి వచ్చిననుండి స్వంతయిల్లు కావాలని కోంతవుంది పరిచయస్థులతో ఏజంట్లతో చెప్పియున్నాను. నాకు స్టూడియోకు దగ్గరగా వుండాలని ప్రయత్నం జె.పి. యన్. రోడ్డుకు దగ్గరగా దొరికిన బాగుండెడిదని చూచినాను. రెండుమూడు పాత యిండ్లు చూడటం జరిగినది. కానీ అవేవి నాకు నచ్చలేదు. తుదకు స్టూడియోకు కొంతదూరంలో చాకలివాడకు వున్నస్థలం అందుగల మూడుగదులతో వున్నట్టిది నచ్చినది. అది ఒక పద్మశాలి అతనిది. అతనికి పెండ్లి విషయమై అవసరమేర్పడి అమ్మకమునకు సిద్ధపడినాడు. స్థలము మొత్తం 300 చ॥లు కలదు. తూర్పు బజారు వున్నట్టిది. బేరము ఆరువేల రెండువందలకు సెట్‌అయినది,. నా వద్ద అప్పటికి అయిదువేలు మాత్రమే వున్నవి. బేరము సెటిల్‌అయి రిజిష్టర్ చేయించేనాటికి డబ్బు సర్దుబాటు చేసినాను. ఈ స్థలము ఏప్రిల్ 1960లో ఖరీదుచేసి రిజిష్టర్‌చేయించుకున్నాను. నేను సోలాపురం నుండి వచ్చిన నాలుగు సంవత్సరములకు స్వంత ఇంటివాడినైనాను. కొత్తగా ఇల్లు నిర్మాణంచేయాలని వున్న డబ్బు సమస్య. అందువలన ఏవో చిన్న మార్పులు చేసి గృహప్రవేశం చేసినాను. అప్పుడే నా మూడవ కుమార్తె సుజాత జన్మించినది. ఆమె తేదీ 29-3-1960లో జన్మించినది. పెద్దకుమార్తె పుట్టిన పిదప వరంగల్ వచ్చినాను. రెండవ కుమార్తె జననముతో ఠాకూర్ బిల్డింగ్‌లోనికి మారినాను. చిన్నకుమార్తె జననముతో స్వంతయింటి వాడినైనాను.

స్టూడియో అభివృద్ధి, స్వంత యిల్లు ఏర్పరచుకొనుట తోటి ఫోటోగ్రాఫర్‌లకు కంటగింపు అయినది. నన్ను యిబ్బందిపెట్టాలని సేల్స్ టాక్స్ ఆఫీసులో పనిచేసే వ్యక్తి నుండి నాకొక నోటీసు సేల్స్‌టాక్స్ ఆఫీసు నుండి లెక్కలు చూపించుమని వచ్చినది. ఫోటోగ్రాఫర్లకు సేల్స్‌టాక్స్ అప్పటివరకు లేదని నాకు తెలుసు. అందువలన నేను మిత్రుడు మల్లారెడ్డిగారిని వెంటపెట్టుకొని సేల్స్‌టాక్స్ ఆఫీసర్‌ను కలిసి నోటీసు చూపించినాను. ఆయన వెంటనే తత్సంబంధక్లర్కును పిలిపించి నోటీసు ఎందుకు ఇచ్చినావనగా జీ.వో. వచ్చినది

అని బొంకినాడు. అయితే నాకు తెచ్చిచూపమన్నాడు. అతడు ముఖం చాటువేసి తప్పుకున్నాడు. ఆఫీసర్ ఏదో పొరపాటున ఇచ్చివుంటారు. మీరు నిశ్చింతగా వెళ్లవచ్చునన్నారు. నేను ఫోటో వస్తువులను స్టూడియో ఉపయోగము వరకే వాడకం వున్నది. దీని ప్రస్తావన మిత్రులు పి. సదాశివరావుగారితో వచ్చినప్పుడు ఆయనగారొక సూచన చేసినారు. నేను హైద్రాబాద్ నుండి తెచ్చే ఫోటో సామాను పెద్దమొత్తాలు తెచ్చి అమ్మకము ప్రారంభించినాను. కానీ నేను ఒంటరిగాన్ని. కుమారులు చదువుచున్నారు చిన్నవాళ్ళు స్టూడియో పనికే సతమతమవుతోంది. ఇది తెచ్చిపెట్టి ఇబ్బందులలో పడవలసి వస్తుందని దానిని పట్టించుకోలేదు. కానీ సదాశివరావుగారు ఈ విషయమై ఇంకా ఆరాతీసి వరంగల్‌లో ఒక ఫోటో మెటీరియల్ అమ్మే షాపు అతనిని సంప్రదించినాడు. ''అలీ స్టోర్స్'' అని పేరు. దానిపేరు మొదట ''వరంగల్ జనరల్ స్టోర్స్'' పేరిట అలీ తండ్రిగారు నడిపేవారట. దానిలో అన్ని వస్తువులు లభించేడివట. అది రజాకార్ల సమయమున హిందువులచే ముస్లిం ఆస్తులు దోపిడి చేయబడినపుడు దోచుకున్నారట. తదనంతరము ఆయన కుమారుడైన అలీ అనునతను తన పేరిట నడుపుచున్నాడు. వారికి హెచ్.యం.వి. రికార్డ్స్ ఏజన్సీ గూడా వుండెను. అయితే వ్యాపారము నడిపే ఆర్థిక స్థోమత లేక స్టోర్స్ అమ్ముతానని అట్లే ఏజన్సీ కూడా మా పేరిట ట్రాన్స్‌ఫర్ చేస్తానని వేతనముపై మీ స్టోర్స్‌లో పనిచేస్తానని ఒప్పుకున్నాడు. ఇట్టి విషయం సదాశివరావుగారు నాతో తెలిపి రికార్డ్సు వ్యాపారము లాభసాటిగా వుంటుంది. పనిచేయుటకు అలీ వుంటాడు. కనుక పెద్దగా శ్రమపడవలసిన పని వుండదని ప్రోత్సాహమిచ్చినాడు.

## R.V. ఏజెన్సీస్ స్థాపన

ఆయనగారు ఒకటిరెండుసార్లు చెప్పినపుడు ఆలోచనలో పడినాను. నాకుకూడా ఏదో కొత్తదిచేయాలని సంపాదించాలను తపన వుండేది. అలీ వ్యాపార విషయమై మాట్లాడి అతని సామాను దాదాపు కొన్నాను. దానిలో ఒక బీరువా మరియొక మంచము చక్కని పనితనము కలిగినట్టివి. వానిని బాగుచేయించి వాడకములో పెట్టినాను. అలీ స్టోర్స్ పేరుమార్చి (R.V. ఏజన్సీస్) రవివర్మ ఏజన్సీస్ అను పేరట ప్రారంభించినాను. కానీ అలీతో ఎంతో కాలం నడువలేదు. స్వేచ్ఛప్రవృత్తి గల వ్యక్తి ఇతరుల అదుపుఆజ్ఞలలో యుండలేకపోయినాడు. పైగా బాగా ఖర్చులు పెట్టెడివాడు. అతని ప్రవర్తన నచ్చక

అతనిని తొలగించివేసినాను. మళ్లీ నాకు సమస్యగా మారినది. ''జాఫర్'' అను ఒక ముస్లిం ఏలూరునుండి వచ్చి హన్మకొండలో ''హీరా స్టూడియో'' అనిపెట్టి నడుపుచుండెడివాడు. అది సరిగా నడువక ఒకరోజు నావద్దకువచ్చి మీరిచ్చిన వేతనముపై స్టూడియో పనిచేస్తానని ప్రాధేయపడినాడు. నేను నెలకు రూ. 75/-లు మాత్రమే యివ్వగలనన్నాను. అతను సంతోషంగా ఒప్పుకొని పనిలో చేరినాడు. నేను ఇతడు మంచి ఫోటోగ్రాఫర్ అనుకున్నాను, కానీ నా అంచనా తలక్రిందులైనది. పనిచేయుట వేరు కళాత్మకంగా పనిచేయుట వేరు. వరంగల్‌లో బ్లాక్‌మేకింగ్ లేదు. అందుకొరకు హైద్రాబాద్ లేదా విజయవాడ వెళ్లి చేయించుకుని వచ్చెడివారు. నేను వరంగల్‌లొ పెట్టినచో మంచిగా నడువచ్చునని ఆశకలిగి ఏలూరు వెళ్లి బ్లాక్‌మేకింగ్ పరికరాలను కొనితెచ్చినాను. అయినా పనిలో నేర్పరి కావలయునని జాఫర్‌ను ఒక నెల ఖర్చులుయిచ్చి ట్రయినింగ్ కొరకు తెనాలి పంపించినాను. అక్కడ వాళ్ల బంధువుల ఇంట్లో గడిపివచ్చినాడు. పనిలో పెట్టి ప్రయత్నిస్తే ఫలితం శూన్యం. ఏమి నేర్చుకుని వచ్చినావని నిలదీస్తే తెల్లముఖం వేసినాడు. ఇది పనికాదని బ్లాక్‌మేకింగ్ పనులు మాన్పించి స్టోర్స్‌లో పెట్టినాను. అచట కొంతకాలం మంచిగా వున్నట్లు నటించినాడు. అమ్మకము లెక్కలు సరిగా వ్రాయక నష్టము కలిగించే పరిస్థితి కలిపించినాడు. ఖర్చులు ఎక్కువగా చూపెట్టినాడు. స్నేహితులు స్టోర్స్‌లో చేరి యిష్టారాజ్యంగా వ్యవహరించడము చేసినాడు. నేను దినమంత స్టూడియో పని చూచుకొని సాయంకాలం స్టోర్స్‌కు వెళ్లెడివాడిని. నా వుుందు అతివినయువుుతో నడిచేడివాడు. మెల్లగా అతని గత చరిత్ర ఆరాతీసినపుడు తెలిసినది ఏమనగా అతని ప్రవర్తన సరిగాలేదని. అప్పటికే నాకు కొంతబాకీపడి వున్నప్పటికి వెళ్లగొట్టినాను. తర్వాత స్టూడియోలొ పనిచేయుచున్న ఇంకొక వర్కరును స్టోర్స్‌యందు నియమించి పనిచేయించినాను. సమర్థుడైన వ్యక్తిలేనందున అది నేననుకున్నట్లుగా నడువలేదు. నేను ప్రతిదినం ఒకటిరెండు తడవలువెళ్లి వ్యాపారాన్ని గమనించేవాడిని. ఆ స్టోర్స్‌లో ఫోటో గూడ్స్ సంగీత పరికరాలు పేయింటింగ్‌కు ఉపయోగించు కలర్‌ట్యూబ్‌లు రకరకాల కళలకు సంబంధించిన వస్తువులను పెట్టినాను. వూ పెద్దకువూరున్ని పెట్టి నడిపించాలనుకున్నాను. కానీ అతనిని సినీ ఫీల్డులో మంచి ఫోటోగ్రాఫర్‌ను చేయాలను అభిప్రాయముతో పెట్టలేదు. 1961లో ప్రారంభించిన స్టోర్స్‌ను 1971 వరకు అనగా 10 సం॥లు నడిపించి సాధ్యం కాక నాకు ఉపయోగపడు వస్తువులను మాత్రము వుంచుకొని మిగతా వాటిని ఎట్లో తెగనమ్మి, అమ్మకము కాని వాటిని ఇంటిలో వేసుకొని స్టోర్స్‌ను తీసివేసినాను.

నేను సోలాపురం నుండి వచ్చేనాటికి పెద్దకుమారుడు మధుసూదన్ మరాఠీ నాలుగవ తరగతి చదువుచున్నాడు. అతనిని ఇక్కడికి వచ్చిన పిదప ఇక్కడ తెలుగునేర్పాలి. అంటే మళ్లీ మొదటితరగతిలో చేర్పాలి. అది వీలుపడదని ప్రయివేటుగా చదివించి అయిదవ తరగతిలో చేర్పించాలని సంకల్పించి మాస్టర్‌లను ఏర్పరచి చదువుచెప్పించినాను. కనీసము ఫోటోగ్రఫీలో మంచిపనివాన్ని చేయాలని ప్రయత్నాలు మొదలుపెట్టినాను. వరంగల్ వరకే పరిమితం కాకుండ ఇంకా ఉన్నతున్ని చేయాలనే ఉద్దేశంతో బాంబే పంపించి సినీ ఫీల్డులో ప్రవేశపెట్టాలని ప్రయత్నించి నాకు తెలిసిన స్నేహితుల ద్వారా ''సాంగ్రిల్లా'' స్టూడియోలో చేర్పించి ప్రతినెల ఖర్చులకు యిక్కడినుండి పంపించినాను. స్నేహితులకు అచటినుండి ఎప్పటికప్పుడు ఇతనిని గురించి తెలుపుతు వచ్చినారు. ఒక సంవత్సరం చూచి లాభం లేదనుకొని తిరిగి పిలిపించినాను.

నేను ఖరీదుచేసిన ఇల్లు మొదట దానియందున్న మూడుగదులను అనుకూలంగా మలుచుకొని ఆగస్టు 1960లో గృహప్రవేశం చేసినాను. అంతకుపూర్వం ఠాకూర్ బిల్డింగులో వున్నాం. ఇప్పుడు స్వంత యింటిలోనికి మారినాము. వెంటనే తగు నిర్మాణం చేయాలన్న డబ్బుకావాలి అప్పుడు నా వద్ద అంతడబ్బులేదు. ఇపుడే కాదు డబ్బు సరిపోవునంత పోగైన పిదప నిర్మాణం చేద్దామని వాయిదా వేసినాను. మరుసటి సంవత్సరం స్టోర్స్ పెట్టడము దానిని వృద్ధిచేయుటకు పెట్టుబడి అట్లే ఫోటో సామానులు కూడా తెప్పించి పెట్టడము దానిద్వారా కలిగిన ఇబ్బందులను తట్టుకొని నిలదొక్కుకోవటం కొంత సమయం గడిచిపోయినది. 1964లో అనగా ఖరీదుచేసిన నాలుగు సంవత్సరములకు నిర్మాణమునకు పూనుకున్నాను. మొదట నా ఆలోచన మద్రాసు టెర్రాసిడ్‌తో నిర్మాణం సాగించాలని కానీ R.C.C. నిర్మాణం బాగుంటుందని సలహా చెప్పుటచే అదే ప్రారంభించినాను. అంతకుపూర్వం తెప్పించిన కర్ర నిరుపయోగమైనది. మిత్రుడు రామారావుగారిని సూపర్‌వైజర్‌గా నియమించి అతని ఆధ్వర్యములో నిర్మాణం జరిగినది. పిల్లర్స్‌పోసి ఇటుకలతో గోడల నిర్మాణం గావించి గదులు నిర్మించడమైనది. నీటి ఇబ్బందిని తట్టుకొనుటకు ఇంటిస్థలమునందే బావిని త్రవ్వించి పనిసాగించినాను. ఆ బావి ఉభయతారకమైనది. ఆ నీళ్లు మా వాడకమునకు కూడా ఉపయోగపడినవి. గృహనిర్మాణం జరిగిన పిదప మధుసూదన్ పెండ్లిచేయాలని సంకల్పించుకున్నాను. అనుకున్నట్లుగానే నిర్మాణాంతరమే మధు పెండ్లిచేసినాను. అది ఏప్రిల్ 1966లో జరిగినది.

# మధుసూదన్ - వివాహం

నా శ్రీమతి సికింద్రాబాద్‌లో మా బంధువుల ఇంటికి వెళ్లినపుడు అచట ఒక అమ్మాయిని చూచినదట. అది మా దూరపు బంధుత్వములోనిది. అమ్మాయి అందంగా వున్నది. తండ్రి రైల్వేలో ఉద్యోగము చేస్తాడు. ఆ అమ్మాయిని చేసుకుంటే బాగుంటుందని చెప్పినది. ఇక్కడనే గుండేటి చిననారాయణగారి కూతురును నా పెద్దకుమారునకు చేసుకుంటానని మాట ఇచ్చియుంటిని. నేను ఈ సంబంధం చేస్తానన్నాను. సికింద్రాబాద్ అమ్మాయినే చేసుకుంటానని తల్లికొడుకులు ఏకమైనారు. ఈ మధ్య నా కుమారుడు సికింద్రాబాద్‌వెళ్లి ఆ అమ్మాయిని చూచినాడు. వారుకూడ మా వాన్ని చూచి ఇష్టపడ్డారట. తుదకు ఆ అమ్మాయితోనే లగ్నం నిశ్చయమైనది. మొదటి నుండి కట్నం తీసుకోవద్దని అంటుండేవాడిని. అదే విషయం వారితో అన్నప్పుడు సంతోషించినారు. పెండ్లి కూడా మా ఇంటియందే చేస్తానన్నాను. దానికి కూడా ఒప్పుకున్నారు. లగ్నం ఆడపిల్ల ఇంటియందుచేయుట ఇక్కడి సాంప్రదాయం. కానీ నా కోరిక మేరకు ఒప్పుకున్నారు. ఇది వారికి రెండువిధాల కలిసివచ్చినది. కట్నం ఇచ్చుటలేదు. పైగా పెండ్లిచేసి యిచ్చే ఖర్చు తప్పినది. ఇది మా వియ్యంకునికి లాభం చేకూరినది. అమ్మాయి తండ్రిపేరు ''గొట్టిముక్కుల పాండురంగం'' అమ్మాయి పేరు ''సుగుణ''. నేను వరంగల్ వచ్చిన పిదప చేయుచున్న మొదటి శుభకార్యం. ఘనంగా చేయాలని సంకల్పించు కున్నాను. 7-4-1966. సం॥న. పెండ్లి ఘనంగా నేను అనుకున్నట్లుగా చేసినాను. అమ్మాయికి 20.తులాల బంగారు నగలు చేయించినాను. మాకు తగిన రీతిగా బట్టలు తెచ్చినాను. ఏ అంశమునందు లోపం రానీయకుండా పదుగురు సంతోషించునట్లు జరిపించినాను. విందునాడు ముఖ్యమైన కొందరిని ఆహ్వానించి సంగీతగోష్టి నిర్వహించినాను. అట్లే కవులు తమ ఆశీస్సులతో పద్యాలు చదివినారు. ఈ గోష్టి శ్రీ కాలోజీ నారాయణరావు గారి ఆ ధ్వర్యంలో నిర్వహించబడినది. ముఖ్య అతిదిగా జనధర్మ ఆచారిగారు ఇంకా స్నేహితులు చుట్టాలు మొదలగువారు పాల్గొని ఉత్సాహంగా నిర్వహించనైనది. ఈ సమేమ్మళనము జనధర్మ పత్రికలో 14-4-1966నాడు వివరంగా ప్రచురించడమైనది.

పెళ్ళి తరువాత ఒక సంవత్సరమునకు తిరిగి మధుసూదన్‌ను మద్రాస్ సినీ డైరెక్టర్ గిడుతూరు సూర్యంగారి వద్దకు పంపించినాను. కొన్నాళ్ళక్రితం ఖమ్మంలో గిడుతూరి గారితో పరిచయమై స్నేహంగా మారినది. అపుడు ''పంచకళ్యాణి దొంగలరాణి'' అను పిక్చర్‌ను తీస్తున్నాడు. మావాన్ని అసిస్టెంట్ డైరెక్టరుగా పరిచయముచేసి పనులు తీసుకోవాలని ప్రయత్నించినాడు. కాని అతని ప్రయాస వృధా అయినది. అతనికి అవసరమైన ఖర్చులనిమిత్తం డబ్బు పంపించేవాడిని. అట్లే గిడుతూరి సూర్యంకూడా కొంత తోడ్పడ్డాడు. అప్పటికే ఇతనికి ఇద్దరు కుమారులు కలిగినారు. కొన్నాళ్లు అయిన పిదప వరంగల్‌లో ఎల్.బి. నగర్ నందు మూడు ప్లాట్లు అట్లే సికింద్రాబాద్ నామాలగుండు వద్ద మూడు ప్లాట్లు ఒక్కొక్కటి 300 చదరపు గజములవి ఖరీదు చేసినాను. సికింద్రాబాద్‌లో ఇల్లు కట్టించి అచట ఒక ఫోటో స్టూడియోపెట్టి కుటుంబ సహితంగా మధును పెట్టాలని సంకల్పించి ఇల్లు నిర్మాణమునకు హైదరాబాద్ మున్సిపాలిటీ నుండి పర్మిషన్ కూడా తీసుకున్నాను. సికింద్రాబాద్‌లోని ఇల్లు నిర్మాణం మానుకొని ఇంటియందే మౌంట్ల ఫ్యాక్టరీ ఏర్పాటు అదే డబ్బుతో చేసినాను. వయసుతో పాటు సంతానం పెరిగినప్పటికి ఎన్నడు భాధ్యతను మాత్రం గుర్తించలేదు. నాకు చేతనైనంత కాలం అతని కుటుంబమును పోషించుట మాత్రము తప్పలేదు. నలుగరు కుమారులలో ఒకడు మరణించినాడు ఒక కూతురు అతని సంతానం.

## రవివర్మ - వివాహం

ఇక రెండవ కుమారుడు రవివర్మ ఇతను చిన్ననాటి నుండి స్కూలు, కాలేజీలో శ్రద్ధగా చదివి B.Sc., పాసై LL.B., మొదటి సంవత్సరములో వుండగా పెళ్లిచేయటమైనది. ఇతను చదువుతొ పాటు ఫోటోగ్రఫీయందు శ్రద్ధవహించి మంచినేర్పరి అయినాడు. ఇప్పటివరకు పెద్దమ్మాయి విమల కూడా పెళ్లికి ఎదిగియున్నది. వీరి యిద్దరి పెళ్లి ఒకే తడవచేయాలని సంకల్పించుకుని అమ్మాయికి సంబంధం కొరకు యత్నాలు ప్రారంభించినాను. విమలతో పాటు ఇతనికి కూడా సంబంధాలు వెతకటం ప్రారంభమైంది. ఇంతలో కరీంనగర్‌లో మెతుకు పెంటప్పగారి సంబంధం వచ్చినది. ఆయనగారు కొండా లక్ష్మణ్‌గారికి మిత్రుడు. అదేరోజు కొండా లక్ష్మణ్‌గారు కూడా అచటికి వచ్చినారు. అమ్మాయిని అబ్బాయి నచ్చినాడు. వచ్చిన పెద్దలు సంభంధం స్థిరపరచుకోవటం

బాగుంటుంధని చెప్పినపుడు మా అమ్మాయి విషయం తేలిన తర్వాత అన్నాను. కానీ అక్కడివారి ఒత్తిడిని తట్టుకోలేక స్థిరపరచటమై ఎంగేజ్‌మెంట్ పూర్తిచేసినాము. ఇది అనుకోకుండా జరిగినది. అయితే పెళ్లికి ముహూర్తాలు చూచి దగ్గరలోనే లగ్నం నిశ్చయించటం జరిగినది. పెళ్లి కరీంనగర్‌లో అమ్మాయివాళ్లు చేయించుటచేత మేము అక్కడికి తరలివెళ్లి పెళ్లిచేసుకొని వచ్చినాము. నేను వరంగల్‌లో రిసెప్షన్ ఏర్పాటుచేసి ఘనంగా జరిపించినాను. విందునాడు మధు పెళ్లి మాదిరిగా ముఖ్యులను ఆహ్వానించి సంగీతకచేరి అట్లే చిన్నపాటి కవిసమ్మేళనము ఏర్పాటుచేసినాను. కవులు కొందరు దంపతులను ఆశీర్వదిస్తు పద్యాలు చదివినారు. 25-6-1973 నాడు లగ్నము జరిగినది. విందునాటి వివరాలను ''జనధర్మ'' పత్రికలో ప్రకటించడమైనది.

రవివర్మ పెళ్లి పిదప కొన్నాళ్లు ప్రశాంతంగా గడిచినది. వేరే స్టూడియోకు అవసరమైన కెమెరాలు ఇతర పరికరాలు అన్ని దాదాపు 12 వేల రూపాయల విలువగల వస్తువులనిచ్చినాను. లక్ష్మిటాకీస్ దగ్గర ''కిరణ్ ఫోటో స్టూడియో'' ఏర్పాటుచేసుకొని స్థిరపడినాడు. అద్దె ఇండ్లలో వుండి గడుపుచున్నాడు. అప్పటివరకు నేను ఇద్దరు కుమార్తెల పెళ్లిళ్లు చేసినాను.

## అమ్మాయిల వివాహం

మా పెద్దమ్మాయి విమలను శ్యాంసుందర్ అను మా దూరపు బంధువుల అబ్బాయికి ఇచ్చి పెళ్లిచేసినాను. అబ్బాయి B.Sc, LL.B., పాసై మున్సిపాలిటీలో ఆడిటర్‌గా పనిచేస్తున్నాడు. అమ్మాయి పెళ్లి 10-3-1974లో చేయడమైనది. మగపిల్లలకు చేసినట్లుగా పెళ్లి ఘనంగా జరిపించి కట్నకానుకలు లోటులేకుండా చేసినాను. పిదప అబ్బాయి వరంగల్ మున్సిపాలిటీ ట్రాన్స్‌ఫర్ చేయించుకొని వరంగల్‌లో స్వంతయిల్లు కట్టుకుని నివసిస్తున్నాడు. విమలకు ఇద్దరమ్మాయిలు ఒక అబ్బాయి కల్గినారు.

ఇక రెండవ అమ్మాయి సరోజ నా మిత్రుడైన గుండేటి పెదనారాయణ చిన్న కుమారుడైన విజయకు ఇచ్చి పెళ్ళి చేసినాను. మొదట వీరి కుటుంబం చితికియున్నదని అశ్రద్ధ చేసినాను. కాని అబ్బాయి డిగ్రి పాసై బ్యాంకులో పని చేయుచున్నారు. పైగా సాత్వికమైన వ్యక్తి చిన్ననాటి నుండి కష్ట సుఖాలను అనుభవించినారు. సరోజ కూడా డిగ్రీపాసైనది. ఇప్పుడు వారికి ముగ్గురు కూతుళ్ళు కలిగి స్వంతఇల్లు కట్టుకొని వరంగల్‌లోనే నివసిస్తున్నారు.

యిక మూడవ కుమార్తె సుజాతను ఏదేని వ్యాపారస్తునికి యివ్వాలని సంకల్పించుకున్నాను. పెద్దవారినిద్దరిని ఉద్యోగస్తులకు యిచ్చినాను. అందువలన వ్యాపారస్తుని గురించి ఆలోచించినాను. నాకు బాగా పరిచయమువుండి వ్యాపారములో ఆరితేరిన కుటుంబంగెంట్యాల నర్సప్పయని సోలాపురములో ప్రసిద్ధమైన వ్యాపారి. మా అన్నయ్య యత్నముపై వారి సంబంధం స్థిరపరచి 17-12-1980 నాడు సోలాపురం మా అన్న వైకుంఠం గారి యింటిలో పెండ్లిచేసి మా వియ్యంకుడి హోదాకు తగినట్లుగా నడుచుకొని ఘనంగా జరిపించినాను. అచట మా బంధువులు మరియు వియ్యంకుని బంధువులు చాలా సంతసించినారు. ఇపుడామెకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. సోలాపురములో మంచిస్థితిలో వున్నారు.

## స్వంత ఆలోచన

కొన్నాళ్ల క్రితం చిన్నపుండుపడి మానలేదు. డాక్టర్‌కు చూపించి మందులువాడినా ఫలితం కనిపించలేదు. పిదప రక్తపరీక్ష చేసినపుడు షుగర్‌వ్యాధి వున్నట్లు నిర్ధారణఅయినది. షుగర్ కంట్రోల్ కొరకు మందులువాడుట ఆహారములో మార్పులు చేయటం జరిగినది. ఈ జబ్బు ఒకతడవ వచ్చినదంటే పోదుగా. వెంటనే కొన్నాళ్లు స్థలమార్పిడికిగాను యాదగిరిగుట్టవద్ద వారం పదిరోజులు గడిపివచ్చినాను. కానీ నా మనసెపుడు స్టూడియోపైనే వుండెడిది. జీవితములో చిన్ననాడు అనుభవించుటకు లేక బాధపడినాను. ఇప్పుడు కలిగి అనుభవించుటకు ఆటంకాలు అయినా నేను పెద్దగా పట్టించుకోలేదు. అయినా కొంత ఆహార నియమమును పాటించిన స్నేహితులతొ, చుట్టాలతో తినుట, త్రాగుట తప్పెడికాదు. జీవితమున ఎంతో సాధించాలనుకొన్నాను. కానీ స్టూడియో విషయంలో తప్ప ఎదురుదెబ్బలు చవిచూడవలసి వచ్చింది. R.V. ఏజన్సీ పెట్టి శ్రమ పెంచుకున్నాను. H.M.V. రికార్డ్స్ ఏజన్సీ ఒక సమస్యగా వుండి తుదకు నష్టాలతో పూర్తిచేయడమైనది.

## నిస్పృహ - నిర్లిప్తతతో కుందారం వైపు

వీటిన్నంటిని చూచిన పిదప నాలో ఒక విధమైన నిస్పృహ ఆవరించినది. స్టూడియోలో వుండి చేయించే ఓపిక తగ్గినది. బరువుబాధ్యతలు తప్పటము లేదు. అగుచొ ఎటువెళ్లాలి? ఏమీ చేయాలి? ఇలా వుండగా మిత్రుడు టి.వి. రెడ్డి ప్రాజెక్టులు చేసి అమ్ముచున్నానని చెప్పినాడు. నాకు వెంటనే ఆలోచన కలిగి నా స్వగ్రామమైన కుందారంలో సినిమా హాలు ఏర్పరచిన బాగుంటుందని

యింటికి దూరంగా వుంటానని స్వతంత్రంగావుంటానని ఊహ కలిగినది. అప్పుడు రెడ్డిగారిని ఏఏ గ్రామాలవారు తీసుకువెళ్లినారో తెలుపమన్నప్పుడు కరీంనగర్ జిల్లాలో కొయ్యూడ గ్రామస్తులు తీసుకువెళ్లినట్లు తెలిపినాడు. నేనొక నిశ్చయానికి వచ్చి శ్రీమతిని వెంటబెట్టుకొని కొయ్యూడకు దగ్గరగా వున్న తంగళ్లపల్లియందు మా బంధువుల యింటికి వెళ్లినాను. మరుసటి రోజు బండి కట్టించుకొని కొయ్యూడవెళ్లి సినిమా హాలును పరిశీలించినాను. అది మంచిగానే నడుపబడుతోంది. దానిని చూచిన పిదప నేను యింతకన్న బాగా నడపగలననిపించింది. మా బంధువుకూడా అదే మాట అన్నాడు. వరంగల్ తిరిగివచ్చి టి.వి. రెడ్డిగారిని ఒక ప్రొజెక్టర్ చేయమని 5 వేల రూపాయలు అడ్వాన్సు యిచ్చినాను. దానిఖరీదు 30,000/-లు అయితే మిగతా డబ్బు వాయిదాల పద్ధతిలో చెల్లిస్తానంటే మంచిదని ఒప్పుకున్నాడు.

1981 ఫిబ్రవరి ఈలోగా కుందారం వెళ్లి స్థలం ఖరీదుచేసి తగిన హంగులు ఏర్పరచాలి. అపుడే మా చిన్న వియ్యంకుడు సోలాపురం నుండి కుటుంబంతో వచ్చినాడు. ఆయనగారిని వెంటతీసుకొని వారి కారుపైన వెళ్లి నవాబుపేటలో మకాం చేసినాము. మరుసటి దినము కుందారం వెళ్లి చిన్ననాటి సహపాఠి కమ్మరి నర్సయ్యను కలిసి నా ఆలోచన వివరించి స్థలము చూద్దామని ఇంకా కొందరితో కలసి గ్రామమునకు నాలుగుదిక్కులా చూడటం జరిగినది. అయితే గ్రామమునకు తూర్పుదిక్కు వున్న స్థలము బాగుంటుందని ఆలోచించి గ్రామ సర్పంచ్ అను నరేంద్రరెడ్డి లేనందున ఆయనగారిని తీసుకొని వరంగల్‌కు రమ్మని కమ్మరి నర్సయ్యకు తెలిపివచ్చినాము. నేను చెప్పినట్లే నర్సయ్య సర్పంచ్‌ను వెంటబెట్టుకొని వరంగల్‌కు వచ్చినాడు. నేను ఆయనగారితో విషయం తెలిపినపుడు తప్పక రాండి అవసరమైన సహాయం చేస్తానని మాట యిచ్చినాడు. తరువాత కొంతడబ్బు తీసుకొని నేను కుందారం వెళ్లి సర్పంచ్ సహాయముతో ఒక ఎకరము 12 వేల చొప్పున ఖరీదుచేయడమైనది. అట్టి స్థలము గుంటూరురెడ్డి అల్లం దాసిరెడ్డి కూతురుగారిది. స్థలము ఖరీదు పిదప డబ్బు చెల్లించి రిజిష్టర్ చేయించుకున్నాను. పిదప స్థలమును శుభ్రపరిపించి సినిమా హాలుకు అనుగుణంగా మ్యాప్ గీయించినాను. అయితే దీనితో పాటు ఇంకేదైనా ఏర్పాటుచేస్తే బాగుంటుందని ఆలోచిస్తే కట్టెకోత మిషన్ పెడితే మంచిగా నడువగలదని ఆ చుట్టుపక్కల లేదని సలహాలు యిచ్చినారు. నేను వరంగల్‌లో

ఆరాతీయగా ఒక పాత కట్టెకోత మిషన్ అమ్మకానికి ఉన్నట్లు 33 వేలకు అమ్ముతారని తెలిసినది. నేను ఏజంటును ఏర్పాటుచేసి బేరము సెటిల్ చేయించినాను. కానీ డబ్బులు కావాలి అందుకొరకు ఎల్.బి.నగర్‌లో నేను ఖరీదుచేసి వుంచిన 550 గజముల స్థలాన్ని అమ్మితే 75,000/-లు వచ్చినవి. కర్రకోత మిషన్‌కు డబ్బుచెల్లించి కుందారం తరలించినాను. మొదట కట్టెకోత మిషన్‌తో పాటు సినిమాహాలు నిర్మాణం ప్రారంభించినాను. మొదట చిన్నకాంపౌండు ఏర్పరచి సినిమా ప్రొజెక్టర్ కొరకు ఒకగది నిర్మించి హాలుకొరకు నిర్మించిన బేస్‌మెంట్‌కు తడికెలు కట్టేందుకు నిర్ణయించినాను.

ఇవేవి నడువాలన్నా కరెంటు కావాలి దానికొరకు ప్రయత్నాలు ప్రారంభించినాను. ఈ మధ్య అల్లం దాసిరెడ్డిగారు కట్టెకోత మిషన్‌తో భాగస్వామిగా వుంటానని నాతో కలిసి తిరిగినాడు. కానీ ఇంతలో గ్రామ పంచాయతీ ఎలక్షన్స్ వచ్చినవి. పూర్వపు సర్పంచ్ నరేంద్రరెడ్డికి మరియు అల్లం దాసిరెడ్డికి పోటీ ఏర్పడి దాసిరెడ్డి గెలుపొందినాడు. గెలుపొందిన దాసిరెడ్డి గ్రామమందలి సమస్యలను ముందుంచుకొని కలిసిరాలేదు. ఉభయుల తోడ్పాటు లేకుండా ఒంటరిగా పనులు నిర్వహించుట కష్టమైనది. కరెంటు పైరవీ చాలా ఇబ్బంది పెట్టింది. వ్యయప్రయాసాలలో ఆరునెలలకు మంజూరీ అయినది. ఈ పైరవీ కొరకు కుందారం, జనగామ, వరంగల్ తిరుగుట జరిగి శారీరకంగా బాగా దెబ్బతీసినది. థియేటర్ నిర్మాణానికి మరియు ఇతర నిర్మాణాలకు అవసరమైన రాయి తెప్పించుట, మేస్త్రీలను పెట్టి పనిచేయించుట మున్నగు పనులతోపాటు జనగామ, వరంగల్ తిరుగుడు ఆనారోగ్యమునకు దారితీసినది. నాకు సహాయపడుటకు వంగ మురళియను ఒక వ్యక్తిని ఏర్పాటుచేసినాను. అట్లే నా భోజనవసతి కూడా కొంతకాలం వారి యింటిలో చేసినాను. వేళకు భోజనము అనుకూలంగా వుండుట ఇబ్బంది అయినది. మొదట నేను ఒక్కన్నే వచ్చినాను. కానీ యిబ్బందుల కారణంగా శ్రీమతిని తీసుకువచ్చినాను. మురళి ఇంటియందే అవసర వసతులు సమకూర్చుకొని వున్నాము.

కరెంటు విషయమై ఇంతగా శ్రమపడినా భాగస్వామిగా వుంటానన్న దాసిరెడ్డి పట్టించుకోలేదు. ఆయన గ్రామపంచాయతి కార్యక్రమములలో కూరుకుపోయాడు. నేను ఇంత కష్టపడి ఏర్పాటుచేసి ఏమాత్రము తోడ్పని వ్యక్తిని భాగస్వామిగా వుంచుకోవటం మంచిగా అనిపించలేదు. తుదకు

ఒంటరిగానే మిగిలినాను. నేను ఫిబ్రవరి 1981లో కుందారం వచ్చి పని ప్రారంభించి మొదట కట్టెకోత మిషన్ 10-4-1982 నాడు ప్రారంభించడమైనది. అనగా దాదాపు 14 నెలలకు అది రూపము దాల్చినది. దీని ప్రారంభోత్సవము సర్పంచి అయిన దాసిరెడ్డిగారి చేతిమీదుగానే జరిపించినాను. పని ప్రారంభించినప్పటికి పనివారి సమస్య ఏర్పడినది. కోత పనిలో నేర్పరియగు వ్యక్తినితెచ్చి ఇచటనే వుంచి అతనికి అందుబాటులో ఇంకొక ఇద్దరు యువకులను ఏర్పాటుచేసినాను. మొదట నాకు కమ్మరి నర్సయ్య ఉపయోగపడుతాడని నమ్మకము వుండెడిది. కానీ అతనిచే కాదని తెలిసిన పిదప వడ్ల రాములును ఏర్పరచినాను. ఇతను యువకుడు. పనియందు శ్రద్ధకలిగి చేయు అలవాటు వున్న వ్యక్తి. దీనిద్వారా చుట్టుప్రక్కల గల గ్రామాలు కిష్టగూడెం, చీలూరు, కోలుకొండ, భానాజీపేట, నవాబుపేట, వడిచెర్ల, నేలపోగుల నుండి కట్టెకోయించుకొనుటకు బండ్లపై కర్ర తీసుకొనివచ్చెడివారు. దీనికి ఒకస్థిరత్వము ఏర్పడిన పిదప ఓపెన్ సినిమా హాలు యత్నములో పడినాను.

## కుందారంలో సినిమా హాలు - ఖర్చులు

నేను మొత్తం ఒక ఎకరముముప్పావు స్థలము తీసుకున్నాను. దాసిరెడ్డిగారి వద్ద ఎకరము ఇంకో వైశ్యుల వద్ద అర ఎకరము దీనిలో అర ఎకరము కట్టెకోత మిషన్ కొరకు 1/2 ఎకరము ఓపెన్ థియేటర్ దానికై ప్రయత్నించి సాధించినాను. ఈ ప్రయత్నం ఇంకో ఆరునెలలు అయినది. ఈలోగా ప్రొజెక్టర్ అమర్చి దాని కవసరమగు గదుల నిర్మాణం చేయించి చుట్టు బేస్‌మెంట్‌పై తడకలు ఏర్పాటుచేసి తగిన గేట్లు అనగా రెండువైపుల మూడుమూడు గేట్లను ఏర్పాటుచేసినాను. సినీ పరదా తూర్పు దిక్కు, ప్రొజెక్టర్ పడమర దిక్కు, ఉత్తరదక్షిణాలు గేట్లు అమర్చడమైనది. హాలులో మూడు స్టేజీలుగా పెట్టినేల, బేంచి, కుర్చి ఏర్పాటుచేసినాను. వీనియందు ప్రతి గేటు కాడ వుండుటకు మనుష్యులను ఏర్పాటుచేసినాను. అట్లే టి.వి. రెడ్డిగారి సలహాపై ప్రొజెక్టర్ నడుపుటకు తగిన అనుభవము కలిగిన వ్యక్తిని వరంగల్‌నుండి తెచ్చినాను. అతడు కుటుంబముతో పాటు ఇక్కడవుండే ఏర్పాటు గావించినాను. యిట్లన్ని ఏర్పాటుచేసి 3-11-1982 సాయంత్రం ''దక్షయజ్ఞం'' అనే సినిమాతో ప్రారంభం చేయించినాను. దీనిని నా మిత్రుడైన సుద్దాల హనుమంతుతో చేయించాలనుకున్నాను. కానీ ఆయన అప్పటికే పరమపదించి వుండటం వలన

దాసిరెడ్డిగారితో చేయించినాను. దీని ప్రారంభోత్సవము నాడు మా పిల్లలు, బంధువులు, స్నేహితులు వచ్చి ప్రారంభోత్సవములో పాల్గోన్నారు. కొన్నాళ్ల నుండి కన్న కల నిజమైనది. ఇది నాకెంతో ఆనందాన్నిచ్చింది. మా బంధువులు, స్నేహితులు నీవు అనుకున్నది సాధించావు యిక స్వతంత్రంగా నడిపించుకోమని సూచించినారు. అనగా నా కుమారుల ప్రమేయము లేకుండ ఎవరికి వారే స్వతంత్రంగా జీవించడము ఇప్పటివరకే ఖర్చులుతడిసి మోపెడైనవి. అయినా నా పట్టుదలతో దీనిని సాధించానన్న తృప్తి కలిగినది.

సినిమా ప్రారంభమైనది. కట్టైకోత మిషన్ మంచిగా నడుస్తోంది. యిక ఇల్లు విషయమై శ్రద్ధ తీసుకున్నాను. మొదట నేను వంగ మురళి యింటిలో వున్నాను. కానీ అక్కడ వసతి సరిగ కుదరక మా పాలివారైనా బిట్ల జానమ్మ యింటిలోకి మారినాము మా స్వంత యిల్లు ఉన్నది. కానీ దానిని ఇదివరకే మా పిన్నమ్మ మనుమనికి యిచ్చినాము. దానము యిచ్చి మళ్లీ దానిలోనికి వెళ్లటము నాకు యిష్టమనిపించక వేరే ఉన్నాము. కట్టైకోత మిషన్ సినిమా హాలు ఊరిబయట వున్నవి. మేము ఊరిలో వున్నాము. ప్రతిదినము యింటినుండి మిషన్ కడకు నాలుగైదు తడవలు తిరగవలసి వచ్చెడిది. అందువలన స్వంత ఇల్లు యిచటనే వుంటే ఈ శ్రమతప్పుతుందని సినిమా ప్రారంభమైన పిదప దాని పనిని వేగిరపరచినాను. ఇల్లు నివాసమునకే కాకుండా చిన్నపాటి స్టూడియో ఏర్పాటు చేయుటకు అవసరమగు రీతిలో నిర్మాణం చేయించినాను. దానిని కూడా నేను అనుకున్నట్లుగ కట్టించడమైనది. కానీ నీటి వసతి ఇబ్బంది తప్పలేదు. బావికి ముహూర్తం పెట్టించి త్రవ్వించినాను. 20 అడుగుల లోతులో రాయిపడినది. అది వృదా అయినదని రెండవచోట త్రవ్వించినాను. అదికూడా మొదటి దానిదశయే. ఇక లాభం లేదనుకొని నిర్మాణమునకు అవసరమగు నీటిని కొంతదూరం వున్న మోటబావి నుండి నీరు కాలువ ద్వారా వచ్చేట్లుచేసి నా స్థలమునందు చిన్నకుంటవలెచేసి నీరు నిలువవుంచి పనులు నిర్మాణం సాగించినాను. తరువాత అనగా సినిమా ప్రారంభమైన 13 నెలలకు అనగా ది. 10-12-1983నాడు గృహప్రవేశం చేసినాను. దీనితో నాకు ప్రతినిత్యం ఊరిలోనికి తిరుగుడు ప్రయాస తప్పినది. యిప్పటికి నేను వరంగల్ నుండి కుందారం వచ్చి రెండు సంవత్సరముల పదినెలలు. ఈనాటికి అయిన ఖర్చు బేరీజు వేసిచూసినాను. ఇప్పటివరకు ఖర్చులు :

| | | | |
|---|---|---|---|
| 1. | కట్టెకోత మిషన్ కొరకు మొత్తంగా | రూ. | 52,210-00 |
| 2. | ఓపెన్ థియేటర్ కొరకు మొత్తంగా | రూ. | 1,05,930-00 |
| 3. | గృహనిర్మాణం కొరకు మొత్తంగా | రూ. | 37,771-00 |
| 4. | స్టూడియో కొరకు మొత్తంగా | రూ. | 7,425-00 |
| | మొత్తం | రూ. | 2,03,336-00 |

ఈవిధంగా చేసిన ఖర్చులు, ప్రతిదానికికూడా నేను వెనుకాడక చేయుచున్నట్టి ఖర్చులు చూచేవారికి గొప్పధనవంతుడను భావం కలిగినది. వాస్తవమునకు నా వద్ద కుందారం వచ్చేనాడు పెద్దమొత్తాలు లేవు. స్థలము ఖరీదునకు కూడా సరిపోవు డబ్బులేదు. వరంగల్‌లో ఎల్.బి. నగర్‌లోని ఫ్లాటు అమ్మిన రూపాయలు 75,000/-లు మరియు సికింద్రాబాద్‌లోని నా భార్యపేరిట వున్న స్థలము అమ్మగా వచ్చిన డబ్బు 90,000/-లు కొంత మధుసూదన్ యిచ్చినట్టిది.

సినిమా హాలు ప్రారంభంలో మంచిగానే నడిచినది. కానీ రానురాను ఆకతాయిలు త్రాగివచ్చి అల్లరిచేయటం గేటుకాపలావాడిని బెదిరించి లేదా వంభ్యపెట్టి హాలులోకి ప్రవేశించటవము జరిగినది. అయితే దీనికి పరిష్కారమార్గము ఆలోచించి గేటువద్ద వుండేవారిని మార్చిచూచినాను. కొలదిరోజులు తగ్గిన స్థితి యదాతథము. అప్పుడొక వ్యక్తిని మేనేజర్‌గా నియమించినాను. ''బాసాని రాయపరెడ్డి'' యను ఒక ఆంధ్ర రెడ్డి, దాసిరెడ్డి వేంనవంరిది. ఈ గ్రావంవంులో భూవిం తీసుకొని వ్యవసాయం చేయించుచున్నాడు. ముగ్గురు కూతుళ్ళు, ఇద్దరు కుమారులు. కుమారుడు వ్యవసాయం చూచుకుంటాడు. ఈయునగారు ఊరిలో జరిగెడి ప్రతి కార్యక్రమమునకు ముందుండి నిర్వహించెడివాడు. గ్రామమందలి తగువులు ఇతని ప్రమేయము లేకుండా నాడు పరిష్కరింపబడకపోయెడివి. మంచి మాటకారి, సమయస్ఫూర్తి కలిగి ఎదుటి వ్యక్తిని ఆకట్టుకొనువాడు. అంతేకాదు అవసరమైతే పోట్లాటకు వెనుకాడేవాడు కాదు. వీటినన్నింటిని దృష్టియందుంచుకొని నేను ఇతనిని మేనేజర్‌గా నియమించినాను. వారం రోజులలో పరిస్థితిని చక్కబరిచినాడు. ఈ విషయమై నిశ్చింత ఏర్పడినది. ఫిల్ములు తెప్పించుట ప్రదర్శనానంతరము త్రిప్పి పంపించుట కూడా ఆయనే చేసెడివాడు. నేను ప్రతిదినం లెక్కచూచేకొనే వాన్ని.

ఇక కట్టెకోత మిషన్ వద్దవుండి డబ్బులు తీసుకొని కర్రకోసి యిచ్చెడి ఏర్పాటుచేసినాను. నేను 24 గంటలు వారి వెంట వుండకపోయెడివాన్ని. యిది వారికి అవకాశమిచ్చింది కక్కుర్తిపడి తక్కువకు కోసి యివ్వటం తమవారికి ఫ్రీగా కోసి యివ్వటం లేదా తక్కువ రాసి కొంతడబ్బు కాజేయటం జరిగినది. నేను వీలైనంతవరకు పరిశీలించే ప్రయత్నం చేసెడివాడిని. అయినా నా కంటిలో పొడిచెడివారు. ప్రతివాడు స్వార్థంగా ఆలోచించేవాడు. తాము కష్టపడి నాకు సంపాదించి పెట్టుచున్నామను భావనతో వుండెడివారు. ఎంతతగ్గిస్తే మాత్రము నష్టమేమి గొప్ప ధనవంతుడు తాము తీసుకునేది కొలదియను భావముతో చేసెడివారు.

నేను ఇక్కడ మకాంపెట్టిన పిదప కూతుళ్ళు, అల్లుండ్లు, వియ్యంకులు, చుట్టాలు, మనుమలు, మనుమరాండ్లు, కొంతమంది స్నేహితులు మా అన్నలు సోలాపురం నుండి వచ్చెడివారు. పల్లెటూరి వాతావరణము. ప్రశాంతత పరిస్థితి. నాతో ఏకాంతమునకు మంచి అవకాశము. నేను కాంపౌండులో కోళ్లను పెంచినాను. మాంసమునకు లోటులేదు. ఇక మదువు కూడా బాగా లభిస్తుంది. ఇదివరలో వీరందరు వరంగల్ వచ్చెడివారు. నేనిపుడు అచట లేకపోవుటచే ఇటు మరలినది. సోలాపురం నుండి వచ్చే బంధువులు కనీసము 15 రోజులు మకాం వేసుకుని వచ్చెడివారు. వారున్నన్ని రోజులు మధుమాంసాదులు తప్పవు. వరంగల్‌కన్న ఇచట తరుచుదనము ఎక్కువైనది. కొంతమంది చుట్టాలు తమవెంట ఇద్దరు, ముగ్గురు స్నేహితులను వెంటబెట్టుకొని దినాల తరబడి వుండివెళ్లెడివారు. ఇపుడు నా పరిస్థితి వచ్చే చుట్టానాహ్వానించి వారికి తగిన ఏర్పాట్లు చేసి వారితో గడిపి వారి యిష్టం వచ్చినపుడు పంపించుట అయినది. నా భార్యకు ఎపుడూ వంటింటి పని సరిపోయెడిది. వచ్చెవారు తమకు యిష్టము వచ్చినపుడు వచ్చేవారు. వారికి వండిపెట్టుట తగు ఏర్పాట్లుచేయుట సమస్యగా మారినది. ఇంతకాలం కుటుంబభారం మోసి పెంచిపెద్దచేసి పెండ్లిళ్ళుచేసి మనుమలమనురాండ్లను చూచి విశ్రాంతి తీసుకుందామని యిక్కడికి వస్తే ''పెనంలో నుండి పొయ్యిలో పడ్డట్టు'' అయినది. నేను ఖర్చులకు ప్రాధాన్యత యివ్వకపోయినా విరామమెరుగని పరిస్థితి ఏర్పడినది.

నేను కుందారం వచ్చిన కొత్తలో కరెంటు పైరవీ కొరకు ఇతర వస్తుసేకరణ కొరకు ఎండనీడా అనకుండా తిరుగువలసి వచ్చెడిది. కొంతకాలం వంటరిగా వుండి యితరుల యింటిలో భోజనముచేయటము సకాలమునకు అందిఅందక విశ్రాంతి దొరకక శరీరముఅలసి యిబ్బంది అయ్యెడిది. ఇదివరకే నాకు

మధుమేహం వచ్చినది. దానిని కంట్రోలు చేయుట సమస్య అయినది. నేను చిన్ననాటి నుండి చేసిన పనులన్నీ నీడపట్టున వుండిచేసినవే. వరంగల్ వచ్చిన పిదప పెద్దగ తిరగాల్సిన అవసరము వుండకపోయెడిది. దూరం వెళ్లాలన్న బస్సులోనో, ట్రయిన్‌లోనో పయనం సరియైన వేళకు భోజనం విశ్రాంతి దొరకెడిది. కానీ యిక్కడ అవి లోపించి శారీరకంగా దెబ్బతీసినవి. ఆరునెలల పిదప శ్రీమతిని పిలిపించుకొని వంట ఏర్పాటుచేయించుకున్న తిరుగుడు మాత్రము యథాతథము. పైగా పనులు మొదలుపెట్టి నెలలు గడుస్తున్నా ఒక కొలిక్కిరాని పరిస్థితి. ఎవరి తోడ్పాటు లేదు. ఒంటరిగా తిరుగాల్సివచ్చెడిది. వరంగల్ వస్తే మాత్రము స్నేహితులు తోడ్పాటు తీసుకొనేవాడిని. అదైనా గంటలవరకే. తిరిగి వెళ్లిపోయెడివాడిని. దీనితొ మధుమేహం పెరిగి కంట్రోల్ అదుపుతప్పి బాగా నీరసింపచేసినది.

ఈ సమయమున జనగామ నుండి ఒక ఆయుర్వేద వైద్యుడు తారసిల్లినాడు. అతడు **M.A.,** చేసి కాలేజీలొ లెక్చరర్‌గ చేస్తున్నాడని కొన్ని రచనలుకూడా చేసినాడని చెప్పుకున్నాడు. అతడు నాశారీరక పరిస్థితి గమనించి దీనికి తగిన మందు తను యిస్తానని వైద్యం ప్రారంభించినాడు. నేను అంతకుపూర్వం వాడే మందులు ఆపివేయించినాడు. కొన్నాళ్లు ఏవో మందులిచ్చి తరువాత చప్పిడి మందుఅని పోసినాడు. అది మూడుపూటలా పోస్తే ఇంకో ఆరుపూటలు చప్పిడితో పత్యము చప్పిడి అనగా కనీసము అన్నంలో ఉప్పు కూడా నిషిద్ధమే. అన్నములో నీళ్ళు పోసుకొని పిసికిత్రాగాల్సి వచ్చింది. ఇది నాకు చెప్పరాని చెఱుపు చేసింది. శారీరకముగా బాగా శుష్కించినాను. చెప్పరాని నీరసము ఏర్పడినది. కనీసము మాట్లాడాలన్న చేతగానీ పరిస్థితి ఏర్పడింది. వైద్యుడు తన స్వార్థానికి నన్ను వినియోగించుకున్నాడు. అతని మాటను నమ్మి అడిగినంత డబ్బు యిచ్చేవాడిని. అతను వచ్చి ఒకరోజు వుండి వెళ్లెడివాడు. భోజన సదుపాయాలు మధుమాంసముతో ఏర్పాటుచేసెడివాడిని. నమ్మపలుకుతూ నేను అలా చేసాను, ఇలా చేసాను అని కోతలు కోసేవాడు. నాకెప్పుడైతే పూర్తిగా చేతగాకుండా అయినదో నిలదీసినాను. నాకు తెలిసిన వైద్యము చేశాను. చప్పిడి పోసిన వెంటనే ఫలితము యిస్తుందా? యిక బలవర్ధకమైన ఔషధము చేయించాలి. అప్పుడు పూర్తి స్వస్థత చేకూరగలదని యింకా మందులు తేవాలి. డబ్బు కావాలను భావం ప్రకటించినాడు. నేనందుకు స్థిరపడక అతని వైద్యం ఆపువేసి పూర్వపు మందులు వాడుతూ డాక్టర్‌లను సంప్రదించి తగు స్వస్థతకు తగు మందులువాడినాను.

# స్వగ్రామం - కుందారం అభివృద్ధికై తపన

కుందారంలో నేను ఏర్పాటుచేసిన సినిమా హాలు, కర్రకోత మిషన్, శాంత స్టూడియో గురించి వివరంగా జనధర్మ పత్రికలో తేది 18-3-1985 నాడు ప్రచురింపబడినది. చిన్న కుమారుడు రవివర్మ వేరే స్టూడియో ఏర్పరుచుకొని స్వతంత్రంగా జీవిస్తున్నాడు. ఈ విధంగా కుమారులను స్వతంత్రులను చేసినాను.

యికరెండవ అంశము నేను పుట్టిన గ్రామమునందు నా పేరు చిరస్థాయిగా వుండునట్లు కొన్ని ప్రజోపయోగమగు పనులుచేసి నేను స్వతంత్రముగా గడపాలని అందు ఓపెన్ థియేటర్ ఏర్పరచి దీని ద్వారా ప్రజలకు వినోదముతొ పాటు విజ్ఞాన సముపార్జనకు తోడ్పడగలదని సంపాదనే ధ్యేయంగా కాక నా బ్రతుకుదెరువుకు సరిపోవు ఆదాయాన్ని మాత్రమే ఉద్దేశించినాను. అట్లే పారిశ్రామికంగా గ్రామాభివృద్ధిని చేయాలని ఆ ఉద్దేశంతోనే కట్టెకోత మిషన్ ఏర్పాటుచేయుట దీనిద్వారా చుట్టుపక్కల చాలా గ్రామాలవారు జనగాం వెళ్లి కోయించి తెచ్చుకోవలసిన అగత్యము తప్పుతుందని అట్లే గ్రామస్తులకు కొంతపని చూపించిన వాడినవుతానని.

ఇక మూడవ అంశము వయోజన విద్యకై రాత్రి పాఠశాల ఏర్పరుచుటకై ఒక షెడ్‌లాంటిది కట్టించినాను. కొన్ని పలకలు తెచ్చి పాఠశాల ఏర్పరచినాను. దీనిద్వారా ప్రజలను ముఖ్యంగా విద్యాగంధం లేని యువకులను హరిజన పిల్లలను ప్రోత్సాహపరచి విద్యతో పాటు చిన్నచిన్న కుటీర పరిశ్రమలు ఏర్పరచాలని వానియందు ముఖ్యంగా కర్రపని ( ఫర్నీచర్) కమ్మరి పని ( ఇనుప సామానులు) కోళ్లపరిశ్రమ, పట్టుపురుగుల పరిశ్రమ, చేపల పెంపకము మున్నగునవి ఏర్పరచి యువలోకమును ఒకదారిలోకి తేవాలని కలలుకన్నాను.

నేను సినిమా ప్రారంభించిన పిదప పైన పేర్కొనిన కొన్నింటికి రూపకల్పన చేయుటకు ప్రయత్నించినాను. ఇందు ప్రజల నుండి వారి అభిప్రాయ సేకరణ చేస్తూ వచ్చినాను. ఒక సంవత్సరం పిదప నేను తెలుసుకొనిన అంశము నన్ను నిరాశ పరిచినది. నేను గ్రామస్తులను దోచుకొనుటకై సినిమా

ప్రారంభించానని చేసిందంతా స్వార్థం కొరకేయను భావం కనిపించినది. ఇందుకు గిట్టనివారు, స్వార్థపరులు కొందరు దోహదపడినారు. నేను స్టూడియోపెట్టి గ్రామములో కొందరిని ఫోటోగ్రాపర్‌లను చేయాలనుకున్నాను. ఒకరిద్దరు శ్రద్ధ కనబరిచినా నిలువలేకపోయినారు.

గణపతి నవరాత్రి ఉత్సవమేర్పరచి అన్నికులాల వారిని రావించి దైవప్రసాదము అందరికీ అందునట్లు చూచినాను. దీనిద్వారా కులపట్టింపు తగ్గి ఐకమత్యమునకు దోహదపడగలదనుకున్నాను. కానీ కరుడుకట్టిన అంటరానితనమను భావన వీడలేకపోయినారు. నేను అన్నికులాల వారిని ఆదరించి గౌరవించటము కొందరికి నచ్చలేదు. దాని పర్యవాసనము మరుసటి సంవత్సరమే కనిపించినది. మరుసటేడు గణపతి ఉత్సవము ఒకచోట కాక కులాల వారిగా గణపతిని నిలిపి పూజలుచేయించినారు. ఇది వారిలో పాతుకొని యున్న పాత వాసన.

కట్టె కోయించుటకై వచ్చే చుట్టుప్రక్కల గ్రామస్తులలో కొందరు ఆయాగ్రామాల పెత్తందార్లు ఇక్కడేదో ప్రత్యేకత ప్రదర్శించి తమ కర్ర ఉచితముగా కోసిపెట్టాలని కోరెడివారు. ఇంకా కొందరు తగువులకే దిగెడివారు. నేను వారిని లెక్కించక ఎవరికి ప్రత్యేకత యివ్వకపోయెడివాడిని. అందరికి ఒకే రేటు. అందరికీ సమానగౌరవము అను పద్ధతిపై నడుచుకున్నాను. ఇది కొందరికి కంటగింపు అయినది.

వారెంత సేపు నేను ఇచటికి సంపాదించుకొనుటకు వచ్చినానని సోలాపురంలో అట్లే వరంగల్‌లో విపరీతంగా సంపాదించినానని ఇక్కడ కూడా సంపాదనకే పూనుకున్నాడను ఊహలు పెంచుకున్నట్లు కనిపించినది. ఇక సినిమా నడుపుటలో ఇబ్బందులు కలిగినా పెద్దగా ఆదాయం లేకున్నా దానిని నడపాలని నిశ్చయించుకున్నాను. యిక కట్టెకోత మిషన్‌తో ఎపుడు సమస్యాత్మకంగానే వుండెడిది. దానిపై పనిచేసెడివారు తావెంత సంపాదించగలమను ఆలోచనతో పనిచేసినారే-కానీ వారెవరు నన్నాలోచించినట్లు లేదు. చాలామందిని మార్చి చూశాను. క్రొత్తవారు వచ్చిన క్రొత్తలో మంచిగా లెక్కలు చూపి మసలుకున్నా కొన్నాళ్లకు మొదటికొచ్చెవారు. గొర్లను తినువాడు పోతే బర్లను తినువాడు వచ్చినాడను సామెతగా వుండెడిది.

ఇంతలో రాడికల్ సమస్య వచ్చిపడినది. గ్రామమందలి కొందరు యువకులు వారిచేత ఆకర్షితులయి అందు ప్రవేశమొనర్చి సంచరించుట ప్రారంభించినారు. నేను మొదట పెద్దధనవంతుడనను పేరువచ్చి యున్నందున నా వద్దకు వారి నాయకుడు చందాలకై మనుషులను పంపుట జరిగినది. అదే సమయమ్మున గ్రామంలో రాడికల్ వారిచే ఒక హత్య జరిగినది. దీనితో గ్రామమందలి రాజకీయ పరిస్థితులు మరియు సాంఘీక పరిస్థితులు మార్పుచెందినవి. నేను వీటినన్నిటిని బేరీజువేసుకుని పరిశీలించినాను.

నేను ఏ ఉద్దేశంతో ఇక్కడికి వచ్చినానో అది నెరవేరకపోగా ఆర్థికంగా, శారీరకంగా మానసికంగా చాలా నష్టపోయినాను. ఇటువంటి స్థితిలో ఇక్కడ వుండటం కష్టమనిపించింది. సినిమాను అట్లే కట్టెకోత మిషన్‌ను అద్దెలకు యిచ్చివెళ్లాలని సంకల్పించుకున్నాను. వర్షాకాలమగుటచే సినిమా ఆడుట ఆగిపోయినది. ఓపెన్ థియేటరగుటచే వర్షం వచ్చిన నడువదు. అప్పటివరకు దాదాపు ది. 11-1-1982 నుండి 9-6-1983 వరకు 35 సినిమాలు ప్రదర్శించడమైనది. ఈ ప్రదర్శనల ద్వారా 18 నెలలకు దాదాపు రూ. 30,500/-లు వచ్చినవి. ప్రస్తుతము దీనినాపివేసి సామిల్లును మాత్రమే అద్దెకివ్వాలని సంకల్పించుకున్నాను. ఖర్చులకు సరిపోయినవి. లాభము రాలేదు.

మధు ముగ్గురు కుమారులలో పెద్దవాడు రఘునందన్ వయసు 16 సం॥లు రెండవవానికి 14 సం॥లు చిన్నవానికి 11 సం॥లు ఇక అమ్మాయి 13 సం॥లు. వీరంతా చదువుచున్నారు. ఏమీచేయాలో పాలుపోలేదు. రఘు అప్పుడే S.S.C. పరీక్షలు వ్రాసినాడు. చెప్పిన విషయాన్ని అర్థం చేసుకోగలిగే వయస్సు. నేను ఒకరోజు రఘునందన్‌ను కూర్చోబెట్టుకొని పరిస్థితులు వివరించాను. అతని తండ్రి వలన నేను ఎలాంటి యిబ్బందులకు లోనైనది తెలిపినాను. నీవు ఇప్పటినుండి చదువు ఆపివేసి నాకు చేదోడుగా వుండాలి. స్టూడియోలో పని నేర్చుకోవాలి. బాధ్యత కలిగి నేను అప్పగించు పనులు నిర్వర్తించాలని చెప్పినపుడు ఒప్పుకున్నాడు. నేను మొదట కుందారం వెళ్లి అచట సామిల్లును తాత్కాలికంగా నడిపించే ఏర్పాటుచేసి ప్రొజెక్టర్ ఇంకా స్టూడియో పరికరాలు మున్నగు సామానంతా తీసుకునివచ్చినాము.

# కుందారం నుండి తిరిగి వరంగల్

మొదట స్టూడియోను పునః అలంకరించాను. అది గ్రాహకులను ఆకర్షించు రీతిగా తీర్చిదిద్దినాను. మంచిపనివారిని నియమించి నేను స్వయంగా ఫోటోలను పరిశీలిస్తు ఎక్స్‌పోజులుతీస్తు రఘునందన్‌కు అవసరమైన ట్రయినింగ్ యిస్తు రెండునెలలలో దానినొక దారికి తెచ్చినాను. మూలకు పడతదనుకున్న స్టూడియో పునః ప్రారంభమవడం నేను స్వయంగా వుండి పనిచేయుటచే గ్రాహకులు మళ్లీ పుంజుకున్నారు. వ్యాపారం క్రమేపి వృద్ధిపొందడం ప్రారంభించినది. రఘు శ్రద్ధగా పనినేర్చుకోవటమే కాదు మంచిపనివాడిగా తయారైనాడు.

# అనారోగ్యం, ఆవేదన, చరమదశ

ఇపుడు నా స్థితి మళ్లీ మొదటికి వచ్చింది. కుందారంలో వున్న సామిల్లును అమ్మివేసినాను. అట్లే అక్కడి యిల్లు మరియు స్థలాన్ని కూడా బేరం పెట్టినాను. వరంగల్‌లో ఇంటిముందున్న రెండు గదులలో చిన్న స్టూడియో ఏర్పరచి హానోగ్రాప్ మిషన్‌పై ఫోటోలు తీయుటకు అట్లే కొన్ని పేయింటింగ్‌లు చేయుట ప్రారంభించినాను. లోగా చాలామంది తమకు పేయింటింగ్‌లు చేసిపెట్టమని కోరినపుడు తీరికలేక చేయలేకపోయినాను. ఇపుడు తీరికగా వుండుటచే తిరిగి ప్రారంభించినాను. కొంతమంది తెచ్చి చేయించుకువెళుతున్నారు. నేను ఎవరిపై ఆధారపడకుండా ఖర్చులు వెళ్లదీసుకుంటూ గడిపినాను.

నేను 1981లో కుందారం వెళ్లిన పిదప రవివర్మ తానున్న అద్దె ఇంటినుండి వచ్చి స్వంతయింటిలో యుండినాడు. అప్పట్లో ఇది నాకు సంతృప్తి కలిగించింది. ఇద్దరన్నదమ్ములు ఒకే యింటిలో నివసిస్తున్నారని. అతనికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. మొదటి నుండి స్వతంత్ర భావాలు కలిగి స్వతంత్రముగనే జీవిస్తున్నాడు.

కుందారం నుండి వచ్చిన పిదప కుటుంబ సమస్యలు నానా రకాలుగా ఏర్పడి నన్ను మానసికంగా బాగా కృంగదీసినవి. నా సంపాదన ఆగిపోయినది. నాలో జవసత్వాలు ఉడిగి మునుపటివలె పనిచేయలేకపోయినాను. ఈ పరిస్థితులలో ఒకసారి పక్షవాతము వచ్చి ఎడమ పార్శ్వముపై ప్రభావము

చూపినది. సకాలమందు వైద్యం చేయించుటలో కొంత నయమైనది. కర్రసాయంతో నడువగలిగే స్థితి వచ్చినది. ఎడమపార్శ్వమునకు స్పర్శ యింకా పూర్తిగారాలేదు. దీనితోపాటు మధుమేహము మోకాళ్లనొప్పులు అదువరకే వున్న జబ్బులు. వానికి పక్షవాతమని తోడయి పూర్తిగా అశక్తున్ని చేసినవి. 1972 నుండి షుగర్ వున్నది.

జీవితమున నేను సాధించిన మరియు అనుభవము ద్వారా నేర్చుకున్న అంశములు ఆ స్మృతులు నన్ను ఆలోచింపచేస్తవి. వానిని మననం చేసుకుంటు కాలం వెళ్లబుచ్చుచున్నాను. నేను నా కుటుంబం, నా కుమారులు నా సంతతి వీరి ప్రగతికై పనిచేయాలని సంకల్పించుకొని పయనించినాను. శ్రమించినాను. ఎంతో సంపాదించినాను. ఎన్నో కలలు కన్నాను. నా సంపాదనలో సగభాగం కుటుంబం కొరకు, నాలుగవ వంతు దానధర్మాలకు, మిగతా నాలుగవ వంతు అభివృద్ధి కొరకు ఖర్చుచేయుచు కుటుంబమునకు ఏ విధమైన లోటురాకుండా నా సంతతికి చిన్ననాడు నేను పడిన కష్టాలు పడకుండా చూచుకున్నాను. వారి కోర్కెలు ఒక పరిమితి వరకు పూర్తిచేయుచు వచ్చినాను. భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుండగలదని భావించినాను. నా ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరుగా పరిణమించినది. స్వార్థదృష్టితో ఆలోచించక నా భవిష్య జీవితమునకు న్యాయం చేకూర్చలేకపోయినాను. ఒకటిరెండు తడవలు గొర్రెకుంట యందలి ఆనందాశ్రమములో చేరిపోదామని ప్రయత్నించినాను. తిరిగి కుటుంబముపై మమకారంతో విరమించుకున్నాను.

నేనం సికింద్రాబాద్‌లో 3 ప్లాట్లు దాదాపు వేయిగజాలు ఖరీదుచేసియుంటిని. అచట యిల్లు నిర్మించి ఒక కుమారున్ని స్థిరపరచాలని సంకల్పించియుంటిని. కానీ అది సాధ్యపడలేదు. అందుకు మధు ముఖ్య కారణము. కుందారంలో స్థిరపడుదామని వెళ్లినపుడు సికింద్రాబాద్‌లోని మూడు ప్లాట్లలో ఒక దానినమ్మివేసి అట్టి డబ్బు ఓపెన్ థియేటర్ కొరకు ఖర్చుపెట్టినాను. ఇంకా రెండు ప్లాట్లు మిగిలియుండినవి. ఆ మధ్య అవి ఖాళీగ వుండుటచేత స్థానికుడొకడు వాని నాక్రమించుకుని గ్యాస్ ఏజన్సీ పెట్టుకున్నాడు. అతనిని ఖాళీ చేయించుటకు నాకు సాధ్యపడక కోర్టుకు వెళ్లడమైనది. పది సంవత్సరములు కోర్టుల చుట్టు తిరిగి విసిగిపోయినాను. కేసుకు రెండు సంవత్సరాలు అయినది. లాయర్ ఫీజులేదు. కానీ స్టాంపుడ్యూటీ, తిరుగుడు

ఖర్చులు మున్నగునవి దాదాపు 70,000/- లు అయినవి. ఇది మూలిగే నక్క పై తాటికాయ పడినట్లు అయినది. తుదకు లాండ్‌గ్రాబింగ్ కోర్టులో కేసును కొట్టివేసినారు. అది నాకు అశని పాతమై మెదడు నరాలపై ప్రభావముచూపి చాలా ఇబ్బందులకు కారణమైనది. తుదకు హైకోర్టులో దావా వేయటమయినది. ఇది ఎంతవరకు విజయవంతమవుతుందో కాలమే చెప్పాలి.



## కృతజ్ఞతలు

నా జీవితములో ఎందరో స్నేహితులు ఏర్పడినారు. ప్రతి స్నేహితుడొక ప్రత్యేకత కలిగిన వారే. సోలాపురంలో, బాంబేలో, వరంగల్‌లో గుర్తుంచుకోదగినవారు చాలామంది వారిలో బాంబేలో సుద్దాల హన్మంతు, గోళ్ల నర్సింగరావు, వరంగల్ వచ్చిన పిదప పాములపర్తి సదాశివరావు, M.S. ఆచారి (జనధర్మ) కాళోజీ రామేశ్వరరావు, కాళోజీ నారాయణరావు, నేరెళ్ళ వేణు మాధవ్, వంగ నర్సయ్య, టి.వి. రెడ్డి, వరదరాజులు, నల్లా నర్సింహులు, గుండేటి నారాయణ, యం. మల్లయ్య మున్నగువారు వీరందరు నా అభివృద్ధిని కాంక్షించి వారి శక్తిసామర్థ్యాలను ఉపయోగించి తోడ్పడ్డారు. పాములపర్తి సదాశివరావుగారు తను తిరుగాడునంత కాలం నన్ను అంటిపెట్టుకొని నాకు అవసరమైన సలహా సహకారాలను అందించినారు. కాళోజీ సోదరులు నాతో కుటుంబ సభ్యులవలె కలిసి తోడ్పడ్డారు. జనధర్మ ఆచారిగారు అవసరమైన సలహాలు ఇచ్చి నా అభివృద్ధిని కాంక్షించి కృషిచేసినారు. వీరిలో ఇప్పటికే కొంతమంది ఇహము చాలించినారు. నేను వారిని అనుగమించుటకై ఎదురుచూస్తున్నాను.

---

''బ్రతుకు బరువైపోకముందే
పరువుపాడై పోకముందే
చేవజచ్చుట కన్నముందే - చేయిజాచుట కన్నముందే
కాలమా కడతేర్పరాదె - కాని కాలము రాకముందే''



- కాళోజీ రామేశ్వర్‌రావు.

Composed by ParameshwarA PRINT POINT, Wgl. © 24866